# ఆంధ్ర సాహిత్య విమర్శ-
# ఆంగ్ల ప్రభావం

డాక్టర్
జి.వి. సుబ్రహ్మణ్యం





# ఆంధ్ర సాహిత్య విమర్శ
# ఆంగ్ల ప్రభావం


రచన :

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

రీడర్, తెలుగుశాఖ

హైదరాబాద్ కేంద్ర విశ్వవిద్యాలయం

హైదరాబాదు.



ప్రచురణ



రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి

సాహితీ సాంస్కృతిక సంస్థ

5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

ANDHRA SAHITYA VIMARSA - ANGLA PRABHAVAMU
(Influence of English on Telugu literary criticism.)

By Dr. G. V. SUBRAHMANYAM.



యువభారతి

ప్రచురణ : 90

ప్రథమ ముద్రణ : దుందుభి సంక్రాంతి, 14-1-1983

ప్రతులు : 1,200

ముఖపత్ర రచన : శీలా వీర్రాజు

ముద్రణ :
అవేర్ ప్రింటింగ్ వర్క్స్,
కవాడిగూడ, హైదరాబాద్.

ముఖచిత్ర ముద్రణ :
బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్,
చిక్కడపల్లి, హైదరాబాద్.

ప్రతులకు :

యువభారతి
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 500003 లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు - 500001

వెల రూ. 30/-



# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా వున్న ప్రతిభాపరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సామర్థ్యం చేకూరుతుంది, సమాజంలో సౌందర్యం సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది, పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పందొమ్మిదేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె యితఃమైన సాత్విక సాధనం లేదనే విశ్వాసంతో యితోధిక కార్యక్రమాలను రూపొందించి కృషిచేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువమందికి ఉత్తమ సాహిత్యాన్ని అందజేస్తే సాహిత్యం పట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకు 80 ప్రచురణలను ప్రచురించి మూడు లక్షల ప్రతులకుపైగా సాధ్యమయినంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించ పూనుకున్నది.

భారతదేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకోగలిగేందుకు ప్రారంభించబడిన సాహితీమిత్ర పథకంలో 8000 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేశారు యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా 800 మంది, భారతీ భూషణులుగా 100 మంది చేరారు.

ఉదాత్త భక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు. వారి సౌహార్దం, భాషాప్రియత్వం యివే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయనశీలతా, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు
యువభారతి.

హైదరాబాదు,
14 జనవరి, 1983



# మా మాట

మానవాత్మ ఒక్కటే. రాజకీయంగా, భౌగోళికంగా, మానవజాతి విభిన్న రూపాలతో మనకు కనిపిస్తున్నా ఒక్క అంతస్సూత్రంతో అది ముడి పడిఉంది. విశ్వప్రజలు మాట్లాడుతున్న అనేకానేక భాషలు పరస్పర భిన్నంగా, స్వతంత్రంగా, స్థూలదృష్టికి కనిపిస్తాయి. కాని, ఏ భాషా స్వతంత్రమైనదికాదు. మానవుని సంస్కృతితోపాటు అది ఇతర జాతుల ప్రభావాలకు లోనవుతూ, ఇతరుల ఆలోచనలను కలబోసుకుంటూ, కళాత్మకంగా, ఏకోన్ముఖంగా, వసుధైక కుటుంబ భావ సముద్యోతకంగా ప్రసరిస్తున్నది. ఒక దేశంలోని ఆలోచన మరో దేశంలోనికి ప్రవేశించి, ఆ దేశంలోని ఆచార వ్యవహారాల ప్రవాహంలో కలసిపోయి తన పాతదన మేదో, తన కొత్తదనమేదో తెలుసుకోలేని స్థితికి చేరుకుంటున్నది. పరస్పర ప్రభావాన్ని భాషలు తప్పించుకోలేనట్లే, కళలకు విలువకట్టే అభిప్రాయాలు కూడా పరస్పర ప్రభావాలకు గురియైనవి.

దాదాపు 250 సంవత్సరాలనుంచీ ఇంగ్లీషు భాషా సంస్కృతులతో తెలుగువారికి సంబంధమేర్పడింది. రాజకీయ ప్రాబల్యం దీనికి ప్రధాన కారణమే అయినా సామాజికంగా, భాషాపరంగా, సాహిత్యాత్మకంగా ఇంగ్లీషు ప్రభావంతో తెలుగు భాషా సాహిత్యాలు కొత్త పుంతలు తొక్కగలిగినవి. ఇంగ్లీషు కిటికీనుండి విశ్వాన్ని, విశ్వసాహిత్యాన్ని, ముఖ్యంగా పాశ్చాత్య భావప్రపంచాన్ని తెలుగు ప్రతిభ చూడగలిగింది. కొన్ని వందల సంవత్సరాలనుంచి సంస్కృత సాహిత్య శాస్త్రజ్ఞులు చేసిన సమాలోచనలతో సంతృప్తిపడిన తెలుగు విమర్శకుడు కొత్త దారుల్లో పయనించడం నేర్చుకున్నాడు. కొత్త కొలమానాలతో, కొత్త విలువలతో, పాత కొత్త సాహిత్యాలను వింగడించడం నేర్చుకున్నాడు. విశ్వవ్యాప్తమయిన సాహితీ దృక్పథాన్ని తెలుగులో దర్శించడమో లేక చొప్పించడమో చేస్తున్నాడు

'యువభారతి' ఇప్పుడు మీ కందిస్తున్న ఈ గ్రంథం ఒక వినూత్న దృక్కోణానికి అద్దం పట్టుతున్నది. పాశ్చాత్య విమర్శకుల ఆలోచనా పద్ధతి, తెలుగు సాహితిని దర్శిస్తున్న, హర్షిస్తున్న తీరుతెన్నులు ఇందులో కనిపిస్తాయి.

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారు భారతీయ సాహిత్య శాస్త్ర తత్వాను శీలనం పట్ల అత్యంతమైన ఆశక్తిని పెంచుకొని వలసినంత అభినివేశాన్ని సంపాదించుకోగలిగినారు. వీరరసమనే సాహిత్యశాస్త్ర సమాలోచన గ్రంథాన్ని వ్రాసి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ బహుమతిని అందుకున్నారు. 'రసోల్లాసం'అనే ఒక గ్రంథాన్ని ప్రచురించి రససిద్ధాంత పర్యాలోచనలో తమ కున్న అరుదైన శక్తిసామర్థ్యాలను ప్రదర్శించినారు. తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు భాషలలోని అనేక సాహిత్య శాస్త్ర గ్రంథాలను మథించి 'ఆంధ్ర సాహిత్య విమర్శ - ఆంగ్ల ప్రభావం' అనే గ్రంథాన్ని వ్రాసి సాహిత్యశాస్త్ర విద్యార్థులకు, సహృదయులకు, భాషాభిమానులకు ప్రీతిపాత్రులైనారు. విమర్శాత్మక గ్రంథాలను ప్రచురించాలనే 'యువభారతి' ఆకాంక్షకు ఈ పుస్తకం పతాకప్రాయం. ఈ పుస్తకంలోని భావాలు సాహిత్య విమర్శకే కాక, భావ సమైక్యానికి కూడా దోహదం చేస్తాయి. సంకుచిత దృక్పథం, పరప్రత్యయబుద్ధి సాహితీస్రష్టల కెంత ప్రమాదకరమో ఈ పుస్తకం చదివితే తెలుస్తుంది.

ఆనోభద్రాః కృతవోయంతు విశ్వతః

[ఉత్తమములైన భావాలు అన్ని దిశలనుండి మనవైపుకు రావాలి] అన్న శ్రుతివాక్యంలోని సారాంశం విమర్శకునికి ప్రమాణం కావాలి. ఈ పుస్తకం సాహిత్యకులలో, అధ్యయనపరులలో, సదవగాహనను, అధ్యయన శీలతను వినిర్మిస్తుందనే మహత్వాకాంక్షతో ఈ పుస్తకాన్ని ప్రచురించాలని యువభారతి సమకట్టింది. ప్రచురించుకునే అవకాశాన్ని కల్పించిన డా॥ జి. వి. సుబ్రహ్మణ్యంగారి సాహిత్య ప్రణయానికి మా కైమోడ్పులు.

హైదరాబాద్-500 001.
14-1-1983

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షుడు
యువభారతి

# ప్రవేశిక

దాదాపు రెండు దశాబ్దాలుగా విద్యార్థులకు తెలుగు సాహిత్యాన్నీ, సాహిత్య విమర్శనూ బోధిస్తూ ఉన్నాను. అయినా, నేనూ ఒక విద్యార్థినే అన్న విషయాన్ని మరిచిపోలేదు. ఏ అంశంమీద మాట్లాడినా, వ్యాసం వ్రాసినా నా కళ్లల్లో నా విద్యార్థులు మసలుతుంటారు. విజ్ఞులనుండి నేర్చుకోవటం, విద్యార్థులకు బోధించటం నా వృత్తి; ప్రవృత్తి. అందువలన ఈ రచనకూడా ముఖ్యంగా విద్యార్థులనే ఉద్దేశించి రచింపబడింది.

సాహిత్యాంశాలను సమాలోచించేటప్పుడు నా మనస్సులో ఈ క్రింది టి.యస్. ఇలియట్ మాటలు ఎప్పుడూ మసలుతూ ఉంటాయి—"We must decide what is useful to us and what is not; and it is quite likely that we are not competent to decide. But, it is fairly certain that 'interpretation' is only legitimate when it is not interpretation at all, but merely putting the reader in possession of facts which he would otherwise have missed. I have had some experience of Extension lecturing, and I have found only two ways of leading any pupils to like anything with the right liking : to present them with a selection of the simple kind of facts about a work- its conditions, its setting, its genesis - or else to spring the work on them in such a way that they were not prepared to be prejudiced against it."[1] ఈ మాటలన్నా ఇలియట్‌లో నాకు ఉత్తమ అధ్యాపక విమర్శకుడు కనిపిస్తాడు.

1. Eliot, T. S., Selected Prose - P. 19.

సాహిత్య విమర్శ సులభమైన మార్గం కాదు. అందులోనూ ఆంధ్రసాహిత్య విమర్శను నిర్వహించాలంటే అటు సంస్కృతాంధ్రాలతోనూ, ఇటు పాశ్చాత్య భాషా సాహిత్యాలతోనూ,మరి భారతీయ సాహిత్యాలతోనూ గాఢమైన పరిచయంతో పాటు, పాండిత్యమూ, తులనాత్మక పరిశీలన పాటవమూ కూడా ఉండాలి. ఇన్ని ఉన్నా విశ్లేషణ, వివేచన, సమన్వయ శక్తులతోపాటు అనుశీలన సామర్థ్యం కూడా ఉండాలి. నాకు సాహిత్య విమర్శలో శక్తి తక్కువ; భక్తి ఎక్కువ. అందువలన చేపట్టిన ప్రక్రియకు న్యాయం చేయలేని పరిస్థితి యేర్పడుతుందేమోనని ఎప్పుడూ జంకుతూనే ఉంటాను. అయినా, ఏదో చెప్పాలన్న కోరిక, క్రొత్తవైన సమన్వయాలివ్వాలనే ఉత్సాహం, వినూత్న సిద్ధాంతాలను స్థాపించాలనే తపన నన్ను ఉక్కిరిబిక్కిరి చేసినప్పుడు రచన చేయలేక ఉండలేకపోతాను. శక్తి లేదని ఊరుకొన్న దానికంటె, చేతనైనంత చెప్పటం నా కర్తవ్యమని అనుకొని అడుగు ముందుకు వేస్తుంటాను.

గత సంవత్సరం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు 'తెలుగు సాహిత్య విమర్శ: పాశ్చాత్య ప్రభావం' అనే అంశంమీద బహుమతి రచనలను ఆహ్వానించారు. ఆ ప్రకటన చూచిన తరువాత ఆ అంశంమీద ఒక విపులమైన వ్యాసం వ్రాస్తే బాగుంటుందని అనిపించింది. అధ్యాపకునిగా నేను గడించిన అనుభవంతో విద్యార్థులకు బోధిస్తున్న కొన్ని అంశాలను ఈ రచన ద్వారా సహృదయ లోకానికి అందించ వచ్చుననే ప్రేరణ కలిగింది. దాని ఫలితం ఈ విమర్శ గ్రంథం.

ఈ రచన నేను చేపట్టటం నిజంగా సాహసమే. ఎందుకంటే, పాశ్చాత్య ప్రభావాన్ని పరిశీలించటానికి ప్రపంచ వ్యాప్తంగా సాగుతున్న సాహిత్య విమర్శోద్యమాల సమ్యక్పరిశీలనం కావాలి. తెలుగులో అంతో ఇంతో తెలుసునేమోకాని, ఆంగ్ల సాహిత్యాది విషయాలను లోతుగా అధ్యయనం చేయలేదు. అట్లని ఊరుకోలేదు. సొంతంగా ఆయా రంగాల్లో కావలసినంత వరకు కృషిచేసి పరిచయాన్ని సంపాదించుకొన్నాను. సంస్కృతాలంకార శాస్త్రాన్ని కొంత సొంతంగానే అధ్యయనం చేశాను. ఈపాటి వ్యుత్పత్తితో ఇంత గురుతరభారాన్ని ఎత్తుకోవటానికి పూనుకోవటం సాహసం కాక మరేమౌతుంది!

పాశ్చాత్య ప్రపంచాన్ని మనం ఆంగ్ల భాషద్వారానే చూస్తున్నాం. గ్రీక్, లాటిన్, ఫ్రెంచి, రష్యన్, మొదలైన భాషా సాహిత్యాలలో విమర్శ రంగాలలో జరిగిన కృషిని మనం ఆంగ్ల గ్రంథాల ద్వారానే తెలిసికొంటున్నాం. వాటన్నిటి ప్రభావం ఆంగ్ల సాహిత్య విమర్శ రంగంమీద కూడా బలంగా కనపడుతున్నది. అయినా, పాశ్చాత్య ప్రభావ పరిశీలనం సమగ్రంగా చేయాలంటే పరిధి కూడా చాల విస్తృతమౌతుంది. దానికితోడు ఆంధ్ర సాహిత్య విమర్శ మీద పడిన ప్రభావం ప్రధానంగా ఆంగ్ల విమర్శకే సంబంధించి ఉంది. అందువలన ఈ గ్రంథానికి 'ఆంధ్రసాహిత్య విమర్శ: ఆంగ్ల ప్రభావం' అని పేరు పెట్టటం జరిగింది. ఆంగ్ల ప్రభావం అనే మాటలో పాశ్చాత్య ప్రభావం గతార్థమౌతుందని భావించటం జరిగింది.

తెలుగు సాహిత్యంమీద పాశ్చాత్య ప్రభావాన్ని గురించి ఎందరో విమర్శకులు కృషిచేసి ఉన్నారు. అయితే, ఆంధ్రసాహిత్య విమర్శ మీద ఆంగ్ల ప్రభావాన్ని గురించి కృషి చెప్పుకోతగినంత జరుగలేదు. అసలు సాహిత్య విమర్శ చరిత్రను పాశ్చాత్య పద్ధతిని అవలంబించైనా, అవలంబించకుండానైనా శాస్త్రీయంగా నిర్మించే ప్రయత్నం విశేషంగా సాగలేదు. అయితే, ఆంధ్రసాహిత్య విమర్శ అవతరణ వికాసాలను గురించి సమీక్షాత్మకమైన గ్రంథాలు వచ్చాయి; వ్యాసాలు వచ్చాయి. కాని, ఒక నిర్దిష్ట ప్రణాళికతో విమర్శ చరిత్రను నిర్మించే విధానం ఇంకా ఏర్పడలేదు. దానికి కారణం, బహుశః ఆంధ్రసాహిత్య విమర్శకుల వ్యక్తిత్వాలను, వారిపై గల ప్రభావాలను, వారు సాహిత్య విమర్శ ప్రగతికి వేసిన బాటలను గురించి పరిశీలనం తెలుగులో గాఢంగా జరగక పోవటమే అని అనిపిస్తుంది. తెలుగులో వెలసిన విమర్శోద్యమాల వివేచనం విస్పష్టంగా ఇంకా వెలువడలేదు. ఈ పరిస్థితులలో ప్రభావ పరిశీలనానికి తెలుగులో ప్రాధాన్యం ఉన్నదని విజ్ఞులు గుర్తిస్తూనే ఉన్నారు. తెలుగులో ప్రభావ పరిశీలనానికి చక్కని బాటలు వేసిన వారిలో మొదట ఆచార్య కొత్తపల్లి వీరభద్రరావుగారిని పేర్కొనాలి. ఆకరాల సేకరణంలోనూ, విభిన్న విషయాల సమన్వయంలోనూ, చారిత్రక దృష్టితో విషయాన్ని ప్రతిపాదించటంలోనూ, ఉచిత నిర్ణయాలను తీసికొనే మెలకువను ప్రకటించటంలోనూ 'తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము' అనే వారి పరిశోధన గ్రంథం నాకు మార్గదర్శకమైంది. ఆ తరువాత డా॥ కె. సంపత్కుమారాచార్యగారి సిద్ధాంత గ్రంథం 'తెలుగులో సాహిత్య

విమర్శ: సాంప్రదాయిక రీతి' ఆంధ్ర సాహిత్య విమర్శమీది భారతీయ విమర్శ ప్రభావాన్ని పరిశీలించింది. విమర్శ అనే నాణానికి భారతీయ ప్రభావం ఒక ముఖమైతే, పాశ్చాత్య ప్రభావం మరొక ముఖం. ఈ రెండు ముఖాలు కనపడే తీరు వేరైనా ఆ రెండూ ఒకనాణానికి అమరిన ఇరుమొగాలే అన్నది మరువరాని సత్యం.

ఈ పూర్వ రంగంతో ఈ గ్రంథ రచన మొదలైంది. పాశ్చాత్య ప్రభావ పరిశీలనంలో నాకు ఎదురైన సమస్యలు ప్రధానంగా రెండు - ఒకటి : ఎలా మొదలు పెట్టాలి ? రెండు : ఎలా నిర్వహించాలి ? - అనేవి. ఇందులోనూ విద్యార్థుల నుద్దేశించి మొదలుపెట్టటం ఒక రకం; విద్వాంసుల నుద్దేశించి మొదలు పెట్టటం మరొక రకం. సామాన్యంగా నా దృష్టి విద్యార్థులవైపే మొగ్గు చూపుతుంది. అందువలన, ప్రభావ పరిశీలనాని కనువుగా విమర్శ వివేకాన్ని చేసి, నేటి విమర్శ స్థితిని పరిచయం చేశాను ప్రథమాధ్యాయంలో.

ఇంగ్లీషులో ప్రభావ పరిశీలన విధానాలను గురించి విమర్శకులు వివేచించి ఉన్నారు. ఆ పద్ధతులను విద్యార్థులకు పరిచయం చేస్తే ప్రభావ స్వరూప స్వభావాలు మొదట తెలిసివస్తాయి. ఆ సంస్కారంతో ఆంగ్ల ప్రభావం ఆంధ్ర విమర్శమీద ఎలా, ఎంతవరకు, ఏ పరిస్థితులలో, ఏ ప్రయోజనాన్ని సాధించే విధంగా ప్రసరించిందో వివేచించటానికి వీలుంటుంది. ఈ ఉద్దేశంతోనే 'ప్రభావ స్వభావం' అనే పేర రెండవ అధ్యాయాన్ని వ్రాశాను.

ఆ తరువాత సరాసరి ప్రభావ పరిశీలనం మొదలుపెట్టాలి. అలా చేస్తే, ఆంధ్రాంగ్ల సాహిత్య విమర్శల తులనాత్మక పరిజ్ఞానం ఉన్నవారికి సూటిగా సమస్యలో దిగి చర్చించినట్లు తృప్తి కలిగే అవకాశం ఉంది. కాని, నేడు విశ్వవిద్యాలయాలలో తెలుగు చదువుతున్న విద్యార్థుల కది కొంతవరకు అవగాహన కావటం జటిలమౌతుంది. నేను సాహసించి అంటున్నానేమో కాని, కొందరు అధ్యాపకులకు కూడ అది అంతగా కొరుకుడు పడకపోవచ్చును. దానికి కారణం లేకపోలేదు. ఏమిటంటే- తెలుగువిద్యార్థులకు పాశ్చాత్య కవితోద్యమాలను గురించి తెలిసినంతగా విమర్శోద్యమాలను గురించి తెలియదు. ప్రసిద్ధ పాశ్చాత్య విమర్శకులు కవిత్వాన్ని గురించీ, విమర్శను గురించీ, వివిధ ప్రక్రియలను గురించీ, సిద్ధాంతాలను గురించీ చెప్పిన అంశాలు కొన్ని సాహిత్య

విమర్శ సూత్రాలను అధ్యయనం చేస్తున్నప్పుడు విద్యార్థులు గ్రహిస్తున్నారు. కాని, ఆయా విమర్శకులు ఏయే ఉద్యమాలను నిర్వహించే ప్రవృత్తులతో అలాంటి అభిప్రాయాలను వ్యక్తం చేశారో చారిత్రక దృక్పథంతో తెలిసికోవటం కష్టం - ఇంగ్లీషు విమర్శను ప్రత్యేకంగా అధ్యయనం చేస్తే తప్ప. అందువలన ముందుగా తెలుగు విద్యార్థులకు ఆంగ్ల సాహిత్య విమర్శ వికాస చరిత్ర పరిచయం కావాలి. కావాలంటే ఆంగ్ల గ్రంథాలను చదువుకో వచ్చును. అలా వారిని వదిలితే పోల్చి చూచుకోవటం కొంత శ్రమతో కూడిన పని అవుతుంది. అందువలన ఆంగ్ల సాహిత్య విమర్శోద్యమాలను, యుగాలను విద్యార్థులకు తెలుగులో పరిచయం చేయటం అవసరమనిపించింది నాకు. అంతకు పూర్వం మన ఆంధ్ర విమర్శ చరిత్రను యుగ విభాగ పరిజ్ఞానంతో పరిచయం చేయటం మేలనిపించింది. ఈ ప్రణాళికలో రూపొందినదే తెలుగు విమర్శ చరిత్ర లోని 'యుగాలను, యోగాలను' వివేచించే మూడవ అధ్యాయం. ఆంగ్లసాహిత్య విమర్శలోని ఉద్యమాలను, వాటి ఉపశ్రుతులను సంగ్రహంగా పరిచయం చేసేది నాలుగవ అధ్యాయం.

బింబాన్ని చూచిన తర్వాత ప్రతిబింబాన్ని పోల్చుకోవటం సులభమైనట్లే ఆంగ్ల సాహిత్య విమర్శ వికాస పరిజ్ఞానంతో ఆంధ్రసాహిత్య విమర్శపైబడిన తత్ప్రభావాన్ని గుర్తించటం సుగమమౌతుంది. అయినా, ప్రభావమంతా ఒకే రీతిగా ఉండదు; ఒకే స్థాయిలో ఉండదు; ప్రభావితుల స్థితీ అంతే. ప్రభావాలు పడే వైఖరులలోనూ భేదాలున్నాయి; ప్రభావాలకు లోనయ్యేవారిలోనూ అంతరాలున్నాయి. ప్రభావాలు సాహిత్య ప్రక్రియల ఆకృతులమీద పడవచ్చును. రచయితల ఆలోచనలమీద పడవచ్చును; విమర్శకుల దార్శనిక శక్తిమీద; అనుభవాలమీద పడవచ్చును. ప్రభావాలకు లోనయ్యేవారిలో సృజనాత్మకవిమర్శ చైతన్యాన్ని కలిగింపగలిగే యుగకర్తలలాంటి విమర్శకు లుండవచ్చును; ఒక పాశ్చాత్య సిద్ధాంతానికో, దృక్పథానికో కట్టుబడి దానిని అనువర్తిత విమర్శలో అనుశీలించే నిపుణులైన విమర్శకు లుండవచ్చును; యథావకాశంగా పాశ్చాత్య విమర్శకుల అభిప్రాయాలను తమ కావ్యానుశీలనాల్లో ప్రమాణాలుగానో, సమన్వయ సూత్రాలుగానో గ్రహిస్తూ మిశ్ర రూపమైన విమర్శ సాగించే సాధకు లుండవచ్చును. వీరందరిమీద పడే పాశ్చాత్య విమర్శ ప్రభావాన్ని ఏకముఖంగా

ఎలా నిర్వహించాలి ? అన్నది ఈ ఘట్టంలో ఎదురయ్యే సమస్య. ఇటువంటి పరిస్థితులలో ఏ రచయితకైనా ఇటువంటి ప్రశ్న రాకమానదు.

'కాల్పనికవాద సిద్ధాంతం, విమర్శ సంప్రదాయం' అనే అంశం మీద "The Mirror and the Lamp" అనే పేరుతో విలువైన విమర్శ గ్రంథం వ్రాసిన M. H. Abrams కూడా ఇటువంటి సమస్యనే ఎదుర్కొని తానొక ప్రణాళిక సిద్ధం చేసికొన్నాడు. ఆ మాటలు వినండి— "The book deals, for the most part, with the original and enduring critics of the time, rather than with the run-of-the-mill reviewers who often had a more immediate, though short-lived influence on the general reading public"[2]. ఇటువంటి ప్రణాళిక ఏ విజ్ఞునికైనా నచ్చుతుంది. నేనూ ఆ మార్గాన్నే ఆశ్రయించి అయిదవ అధ్యాయాన్ని రూపొందించుకొన్నాను.

మానవప్రవృత్తి త్రిగుణాలమీద ఆధారపడి ఉన్నట్లే, సాహిత్య విమర్శ ప్రవృత్తి కూడా ఆకృతి, ఆలోచన, అనుభవం అనే మూడు అంశాలతో ముడి పడి ఉంటుంది. ఆకృతిలో రూపం, ప్రక్రియ, రచన మొదలైన అంశాలుంటాయి; ఆలోచనలో సిద్ధాంతం, దృక్పథం మొదలైనవి పరిగణింపబడతాయి; అనుభూతికి కళాతత్త్వ సౌందర్య దర్శనం ముఖ్యం. ఈ మూడింటిమీద ప్రభావం పడవచ్చును. ఆ మూడు రకాల ప్రభావాలలో ఆకృతి మీదపడే ప్రభావం కంటే ఆలోచనపై పడే ప్రభావం శ్రేష్ఠం; దానికంటే అనుభవం మీది ప్రభావం ఉత్తమం ఆంధ్రసాహిత్య విమర్శలో కట్టమంచికి ముందు ఆకృతిపై ప్రభావం, కట్టమంచి యుగంలో ఆలోచనపై ప్రభావం: విశ్వనాథయుగంలో అనుభూతిపై ప్రభావం పడ్డట్లు వివేచించటం జరిగింది. అంతేకాదు- ఆకృతితో ఆరంభమై అనుభవంతో ప్రభావం ఒక వర్తులాన్ని పూర్తి చేస్తుందనీ, ఆంధ్ర సాహిత్య విమర్శలో సమన్వయ యుగం నుండి మరొక వర్తులం ప్రారంభమై నేడు అనుభవ స్థాయిని చేరుకొనే పునః ప్రయత్నం చేస్తున్నదనీ, అనుభవంమీద పడే ప్రభావం నీర క్షీర న్యాయంగా అద్వైతస్థితిని భజిస్తుందనీ ఈ అధ్యాయంలో ప్రతిపాదించటం జరిగింది. ఒక విధంగా ఈ గ్రంథానికి ఈ అధ్యాయమే గుండెకాయ

2. Preface, 'The Mirror of the lamp'. P.1.

వంటిది. ఇందులో- కట్టమంచి, రాళ్లపల్లి, రామిరెడ్డి, విశ్వనాథ, పింగళి, జి.వి. కృష్ణరావు, సి. నారాయణరెడ్డి, ఆర్ ఎస్. సుదర్శనం, శ్రీశ్రీ, కొడవటిగంటి, కుందుర్తి, రమణారెడ్డి, గుంటూరు శేషేంద్రశర్మగారలు ఆంధ్రసాహిత్య విమర్శ యుగచైతన్యాన్ని ముందుకు నడిపించిన ప్రయోక్తలుగా ప్రతిపాదించటం, వారిపై బడిన పాశ్చాత్య విమర్శ ప్రభావ స్వభావాన్ని ప్రపంచించటం జరిగింది. ఈ దృష్టితో, ఈ విధంగా, ఆంధ్రసాహిత్య విమర్శ మీది ఆంగ్ల ప్రభావ స్వభావాన్ని వివేచించటం ఇదే మొద లనుకుంటాను.

ఏ సాహిత్యంలోనైనా అన్యసాహిత్య ప్రభావం ఒక్క విమర్శకుల మీదనే పడదు; ఇతర సాహిత్య ప్రక్రియలను నిర్వహించే రచయితలమీద కూడ పడుతుంది. వారిలో ఉత్తమ విమర్శకులుగా రాణింపదగిన శక్తిసామర్థ్యాలున్నా, సృజనాత్మక రచనా వ్యాసంగంలో కృషి సాగిస్తూ, ఆ రచనలలో తమ దార్శనిక శక్తినో, దృక్పథ విశేషాన్నో, ఆలోచనా వైఖరినో, విమర్శ వివేకాన్నో పొదిగి పెడుతూ ఉంటారు. వారి ఆలోచన ప్రభావం విమర్శక్షేత్రంలో వెలుగులు చల్లుతూ ఉండవచ్చును. అటువంటి రచయితలపైగల పాశ్చాత్య ప్రభావాన్ని పరిశీలించటం ఒక విధంగా విమర్శపై పరోక్షంగా పడ్డే ప్రభావ విశేషాలను వివేచించటం అవుతుంది. అయినా అటువంటి పరిశీలనం విమర్శ వ్యక్తిత్వంలోని పాశ్చాత్యాంశాన్నీ, రచయిత దాని కిచ్చిన వ్యాఖ్యానాన్నీ విడమరచి తెలిసికోవటానికి ఎంతైనా తోడుపడుతుంది. ఈ శాఖలో తెలుగు రచయితలను ఏడుగురిని ఎన్నుకొని 'వెలుగులు-ఓచికలు' అనే ఆరో అధ్యాయంలో వారిపై సమీక్ష చేయటం జరిగింది.

ప్రక్రియాపరంగా పాశ్చాత్య ప్రభావాన్ని పరిశీలించేది ఎనిమిదవ అధ్యాయం. సాహిత్య విమర్శకు సన్నిహిత సంబంధం ఉన్న కవుల చరిత్రలు, సాహిత్య చరిత్రలు, కవిత్వ చరిత్రలు, వ్యాసం మొదలైన ప్రక్రియాలలో ప్రతిఫలించిన పాశ్చాత్య స్వభావాన్ని సమీక్షించటం జరిగింది.

మొత్తానికి ఆంధ్ర సాహిత్య విమర్శను, ఆంగ్ల ప్రభావ పరిశీలన దృష్టితో ఒక సింహావలోకనం చేసి, తులనాత్మక సమన్వయ దృక్పథంతో పునఃపరిశీలించి, ఫలితాంశాలను వివేచించి, విద్యార్థుల కందుబాటులో ఉండేటట్లు రచించిన పవిమర్శక సమీక్షా గ్రంథ మిది.

"The method of literary criticism is to secure the maximum general agreement for evaluation by starting with something demonstrable - the surface of the work and through practical criticism to proceed inwards to a deeper and wider kind of criticism commanding assent (or giving an opening for disagreement and discretion) at every step." [3] ఇటువంటి విశ్వాసంతోనే యిందులోని సాహిత్య విమర్శను నిర్వహించాను. పై వాక్యంలోని 'maximum general agreement', 'evaluation', 'starting with something demonstrable' అనే మూడు key-notes ను నా అనుశీలనంలో అడుగడుగునా జ్ఞాపకముంచుకొనే ముందుకు సాగాను.

పుస్తకాన్ని ముగించాలని కలం పెట్టేసరికి, ఇంకా పెక్కు సాహిత్య శాఖలలో, విశేషించి సాహిత్య పరిశోధన శాఖలో, భాషా విమర్శ పరిశోధన శాఖలలో ఇటువంటి యత్నాలు ముందు ముందు జరగాలనీ, అటువంటి ప్రయత్నాలకు ఈ రచన ఒక ప్రేరణ అయితే, ఆ వరుసకు ఇది మొదలేకాని ముగింపు కాదని భావించి చివరి అధ్యాయానికి 'ముగింపు కాదు, మొదలు' అని పేరుంచాను.

ఈ ముందు మాట ముగించే ముందు మరొక విషయం చెప్పాలి. అదీ గ్రంథ రచనకు సంబంధిందే. ఈ రచనలో ఆంగ్ల విమర్శకుల విలువైన నిర్వచనాలను, అభిప్రాయాలను, సమీక్షలను, విమర్శలను ఇంగ్లీషులోనే ఉద్ధాహరించాను. బుచ్చిబాబు లాంటివారు ఇంగ్లీషు నిర్వచనాలకు తెలుగు అనువాదం చేసి మూలం లేకుండా వ్యాసాలలో పేర్కొన్నారు. ఈ విధానం తెలుగు వారు సరాసరి తమ మాతృభాషలో పాశ్చాత్యభావాలను గ్రహించి మననం చేసికొనటానికి తోడుపడుతుంది. కాని, ఒక్కొక్కసారి మూలంలోని బిగి, బిగి, గాంభీర్యం, అర్థశక్తి ఆంధ్రానువాదంలో రాకుండా పోయే ప్రమాదం కూడా ఉంది. అందువలన, నేను ఇంగ్లీషు కొటేషన్లను అలాగే గ్రహించాను. కొందరు ఆంధ్రానువాదాలుకూడా ఇస్తే బాగుంటుందని అంటారు. నిజమే. నా అనుభవ

3. చూడు : Integrity in criticism (Essay) by Seymour Betsky, F. R. Leavis - Some aspects of his work. Ed. C. D. Narasimhaiah, Mysore (1963).

మేమంటే-ఇలా రెండు భాషలలో సమాంతరంగాఇచ్చినప్పుడువిద్యార్థులు ఇంగ్లీషును వదలి తెలుగునే చదువుకొని ముందుకు పోవటం సామాన్యంగా చేస్తూ ఉంటారు. నీటిలో దూకితేనే ఈత వచ్చేది; తెప్పకాయ నడుముకు కట్టుకుంటే ఈదవలసిన అవసరం లేదు. అందువలన ఆంగ్ల మహాకవులు, విమర్శకులు వారి భాషలో వ్యక్తం చేసిన శక్తిమంతాలైన వాక్యాలను, రసవంతాలైన సూక్తులను చదివి అర్థం చేసికొనటమే కాకుండా, అటువంటి రచనను మాతృభాషలోకూడా చేయాలన్న ఉత్సాహాన్ని తెలుగు విద్యార్థులకు కలిగించాలి. ఈ రోజులలో చాలమంది తెలుగు రచయితలు ఇంగ్లీషు నర్థం చేసికోగలరేమోకాని, ఇంగ్లీషులో శక్తిమంతంగా వ్రాయలేరు. అది దోషమని నేననటంలేదు. కాని, భాషాశక్తి తెలిసినప్పుడే కవితాశక్తి వ్యక్తమౌతుంది; కవితాశక్తి అనుభవానికి వచ్చినపుడే శక్తిమంతమైన విమర్శ వెలువడుతుంది. తెలుగు విద్యార్థికి సంస్కృత శ్లోకం చదివే శక్తి రావాలి, ఇంగ్లీషు కవిత చదివే నేర్పు, ఆంగ్ల విమర్శను అర్థం చేసికొనే సామర్థ్యమూ రావాలి. అందుకనే ఇంగ్లీషు కొటేషన్లకు తెలుగుసేత లివ్వలేదు. ఇస్తే గ్రంథం పెరుగుతుందనే ఆర్థికమైన కారణం కూడా లేకపోలేదు. అయినా, అది ముఖ్యం కాదు.

ఆంగ్ల భాషా సాహిత్య విమర్శలలో తగినంత పాండిత్యం లేకపోయినా, ఈ ప్రయత్నానికి పూనుకొన్నందుకు సహృదయులు నన్ను మన్నిస్తారనీ, 'ప్రమాదో ధీమతామపి' కాబట్టి దోషాలేవైనా దొరలి ఉంటే నాకు తెలిపి నన్ను ప్రోత్సహిస్తారనీ, ఇందులో క్రొత్తగా సమన్వయించిన అంశాలను సౌజన్యంతో స్వీకరించి ఆమోదాన్ని తెలుపుతారనీ భావిస్తున్నాను. పండితులు పరవాలేదంటే అదే పదివేలు. విద్యార్థులు ఈ గ్రంథాన్ని చదివి తమ రచనలలో చర్చిస్తే నా కృషి ధన్యమైనట్లే.

వ్రాత ప్రతిని చదివి విలువైన సలహా లిచ్చి నన్ను వెన్నుతట్టి ప్రోత్సహించిన సహృదయులు, స్నేహ సింధువులు శ్రీ డి. రామలింగంగారికి, పిలిచి పుస్తకాన్ని ప్రచురిస్తామని చెప్పి, నా రచనకు అక్షర రూపాన్ని సంతరించిన స్నేహ మూర్తి, 'యువభారతి'కి నా కృతజ్ఞతలు.

14-1-1988
సంక్రాంతి.

జి. వి. సుబ్రహ్మణ్యం.

# విషయ సూచిక

# 1

# విమర్శ వివేకం

"Criticism is the last reward of consummate scholarship. It is harder **to be** a critic than to be a poet. At twenty one can afford **to** be a poet but it is only at forty one can achieve criti**cism**"[1]

—Abercromble

సుసంస్కృతమేధాశక్తి విశిష్టవ్యక్తిత్వంతో నిర్వహించే వివేచన ప్రవృత్తి సాహిత్యవిమర్శ.[2] ప్రతియుగంలోనూ సృజనాత్మక సాహిత్యానికి వినూత్న దర్శనాన్ని కానీ, అభినవానుశీలనవిధానాన్నికానీ అందించి ప్రయోగ ప్రస్థానాలకు ప్రగతిపథాలను చూపించేది సాహిత్యవిమర్శ. ఉత్తమ సాహిత్య విమర్శ ఉత్తమ కావ్యంలాగా అరుదుగానే ఆవిర్భవిస్తుంది. అయితే, విమర్శ కవితలాగా శుద్ధకళామూర్తి కాదు; శాస్త్రకళాధర్మ సంవాద మూర్తి. అది ఎంతశాస్త్రమో అంతకళ.[3] శాస్త్రంగా విమర్శ సాహిత్య ప్రమాణాలను సూత్రించి, కావ్యగుణదోష విచారాన్ని సాగిస్తుంది; కళగా సాహిత్యాభిరుచులను, వాటి విలువలను వివేచించి, వినూత్నప్రయోగాలకు భవిష్యద్దర్శనాన్ని ప్రసాదిస్తుంది. శాస్త్రంగా సాహిత్యజీవితాన్ని అనుశాసిస్తుంది; కళగా సాహిత్యసౌందర్యాన్ని అనుశీలిస్తుంది. సాహిత్యవిమర్శ కరుడు కట్టిన సిద్ధాంతాల రాద్ధాంతం కాదు; సృజనాత్మకతను పోషించే నవనీతం లాంటి అభినవ సాహిత్య దర్శనం.

ప్రకృతికి పరిణామం ఎలా సహజమో లోకప్రవృత్తికి పరిణామం అల
సైజం. ఒక కాలంలో ఒక అభిరుచి లోకాన్ని పాలిస్తే మరో కాలంలో మరో
అభిరుచి లోకంలో ఆదరింపబడవచ్చు. అభిరుచిలోని అభినవత్వాన్నే ఆధునికత
అంటారు. అభిరుచి ఆదర్శాలను రూపొందిస్తుంది; దృక్పథాలను ధ్రువీక
రిస్తుంది; నవ్యతను వరిస్తుంది; ఆధునికతను సూచిస్తుంది. ఆధునికతను
నిర్ణయించటానికి ప్రమాణంగా కాలంకంటె అభిరుచిభేదమే ఆమోద
యోగ్యం.[4] కాని, మారిన ప్రతి అభిరుచీ ఆధునికంగా పరిగణింపబడినా
ఆదర్శవంతమైనదని చెప్పటం సాధ్యం కాదు.[5] అభిరుచిమీద ఆ యా
కాలాల జీవన వ్యవస్థల, ప్రవృత్తుల ప్రభావాలు బలీయంగా ఉండవచ్చు.
ఆ యాదృక్పథాలతో సాహిత్య సత్యాన్వేషణం సాగవచ్చు. సత్యం సార్వ
కాలికంగానూ, ప్రత్యేకపరిస్థితుల్లో పరిచ్ఛిన్నంగానూ భాసిస్తుంటుంది.
సత్యానికి ఆంతరధర్మమూ, అభివ్యక్తి ధర్మమూ అని రెండు లక్షణా
లుంటాయి పరిణామం అభివ్యక్తిలో ప్రత్యక్షంగా కనపడుతున్నా, పరో
క్షంగా దాని సాతత్యధర్మం అంతర్వాహినిగా ప్రవహిస్తూనే ఉంటుంది.
సాహిత్య విమర్శ సాహిత్యసత్యాన్వేషణలో ఈ భేదాన్ని గుర్తించి ప్రవర్తి
స్తుంది. కాలాన్నిబట్టే కళాసత్యం మారుతుం దని అంగీకరిస్తే, దాన్నే
ప్రమాణంగా స్వీకరిస్తే, ప్రాచీనసాహిత్యాన్ని ఆధునికదృక్పథంతో అను
శీలించి, అనుశాసించటంలో, అవ్యవస్థ ఏర్పడుతుంది. అభినవప్రమాణాలలో
కూడా విశ్వజనీనత వివేచింపబడితే సర్వకాలసాహిత్యాల కది సమన్వయ
సాధనంగా ఉపయోగపడుతుంది.[6] అందువలన, సాహిత్యవిమర్శ
ఆధునికతను భజించినా పూర్వాపర సాహిత్య ప్రక్రియల కళాత్మక ప్రతి
పత్తులను, విలువలను నిర్ణయించే వినూత్న విశ్వజనీన ప్రమాణాలకోసం
ప్రయత్నిస్తుంది; అనుభవ ప్రమాణంగా అనుశీలిస్తుంది. సార్వకాలిక సత్యా
లను, ప్రమాణాలను, ప్రవృత్తులను గ్రహించకుండా ఒకానొకకాలంలో
ఆవేశంతో వచ్చిన అభినవప్రక్రియల దృక్పథాలను మాత్రమే ఆదర్శంగా
తీసికొని అన్నికాలలకూ వర్తింపచేసే తొందరపాటు సాహిత్య విమర్శ చేస్తే,
అది భావితరాలలో ప్రామాణికత్వాన్ని కోల్పోయి, అంతరించిపోతుంది.
కాలపరిధిలో కట్టుబడిపోయే దృక్పథం సాహిత్యవిమర్శలో కలకాలం
నిలవదు. సమకాలీన పరిస్థితుల సమ్యగనుశీలనంతోపాటు సార్వకాలీన

మైన సాహిత్యదర్శనం చేసే సంయమనం, సాహసం సాహిత్యవిమర్శ కుండాలి.[7] సాహిత్యచైతన్యంలోని సార్వకాలిక సృజనాత్మక శక్తులను, విలువలను విశ్లేషించి, వివేచించి అభినవలోచనాన్ని లోకాని కందించే దీశక్తియే సాహిత్యవిమర్శకు జీవలక్షణం.[8] అభివ్యక్తిలో ఆధునికతను వ్యక్తీకరించుకొంటూ, ప్రమాణాలలో నవ్యతతోపాటు నాణ్యతను సంతరించు కొంటూ, విలువలను నిర్ణయించటంలో వినూత్నాభిరుచులలోని విశ్వజనీనతను వివేచించుకొంటూ సాహిత్యవిమర్శ సృజనాత్మకశీలాన్ని అనవరతం పోషించుకోవాలి. కొత్తదనాన్ని సృష్టించలేని అనుశాసనాన్ని ధిక్కరించాలి; పాక్షికతను ప్రక్కకు త్రోసివేయాలి; సృజనాత్మకతను ఉన్మీలింపజేసే ఉపజ్ఞను పోషించాలి; కలకాలం కళకు జీవనతేజాన్ని సమర్పించే అనుశీలన విధానాన్ని సమకూర్చాలి; యుగధర్మం నుండి యుగయుగాల దర్శనాన్ని వెలికి తీసి వెలుగు నింపాలి.

అందుకనే, అప్పుడప్పుడూ, కనీసం శతాబ్ది కొకసారైనా, గతాన్ని సమీక్షించి, వర్తమానాన్ని వివేచించి, సాహిత్యభవిష్యత్తు కొక ఉజ్జ్వల దర్శనాన్ని అందించే మహావిమర్శకు డావిర్భవించటం అభిలషణీయ మనీ, ఆతని వ్యవసాయం నవ్యఫలసాయానికి నాంది నాలపించాలనీ టి. యస్. ఇలియట్ అన్నాడు.[9] తెలుగువారి కీమాట ఎంతఅనుభవసత్యమో అంత ఆదర్శశిఖరంలా భాసిస్తుం దనటంలో ఆశ్చర్యం లేదు. దానికి కారణం- మనకు కావ్యప్రయోగాలమీద ఉన్నమోజు సాహిత్యవిమర్శమీద లేదు; క్రొత్తను అరువు తెచ్చుకోవటంలో ఉన్న శ్రద్ధ భవిష్యత్తుకు తగిన పునాదులు వేసికొనటంలో లేదు; ప్రయోగాన్ని ప్రచారం చేసికొనటంలో కనపడే నిష్ఠ ప్రయోగమూలమైన భవిష్యదర్శనాన్ని సాధించటంలో లేదు. అందువలన, తెలుగులో అన్నియుగాలలోనూ కవిత్వంవెంట విమర్శ అనుసరించటమే గమనిస్తాం గాని, సాహిత్యానికి విమర్శ మార్గం చూపినజాడలు చూడలేం. కల కాలంగా ఆంధ్రసాహిత్య విమర్శ సృజనాత్మకతను సాధింపలేకపోవటానికి ఈ బలహీనత బలంగా మన సాహిత్యక్షేత్రంలో పాదుకొని పోవటమే కారణం.

సాహిత్యజగత్తులో విమర్శ పురుషప్రవృత్తిని ప్రకటిస్తుంది; తదితర సాహిత్యప్రక్రియలు స్త్రైణమైన ప్రవృత్తిని ఫలిస్తాయి. స్త్రీ పురుషుని చూచి ప్రేమించి, అతని చేత వరింపబడటం వీరసంప్రదాయం; పురుషుడు స్త్రీని అనుసరించి, అనునయించి రమించటం విటసంప్రదాయం; స్త్రీని ధర్మబద్ధంగా గ్రహించి, స్నేహబద్ధంగా రమించటం రసికసంప్రదాయం. పురుషుడు స్త్రీవలన కలిగిన సంతానంలో తన ప్రతిబింబాన్ని చూచుకొన్నట్లు, విమర్శచైతన్యం సాహిత్యప్రక్రియలలో ప్రతిబింబించి నూత్నసృష్టికి శ్రీకారం చుట్టి తన అస్తిత్వాన్ని అమరంగా నిలుపుకొంటుంది. విమర్శలో విటసంప్రదాయం అధమం; రసికసంప్రదాయం మధ్యమం; వీరసంప్రదాయం ఉత్తమం. ఈ మూడూ ఉత్తరోత్తరగుణసోపానాలు. సోపానాలన్నీ ఎక్కిన విమర్శ వెలయటం సాహిత్యం చేసికొన్న సుకృతం!

సాహిత్యం సమగ్ర మానవ జీవిత దర్శనం. భౌతికంగానూ, మానసికంగానూ, ఆధ్యాత్మికంగానూ మానవులు అనుభవించే జీవితం సమగ్రం. సమాజ చైతన్యం ఏ యుగంలోనైనా ఈ మూడుమెట్ల నిచ్చెన ఎక్కుతూనే ఉంటుంది. సాహిత్యంకూడా ఆయాయుగాల్లో సమాజం ఈ మూడు మెట్లనూ ఎలా ఎక్కుతోందో చిత్రిస్తూనే, ఎలా ఎక్కాలో ప్రబోధిస్తూ ఉంటుంది. విమర్శకుడు ముందుచూపు సారించి నడక సాగిస్తే రచయిత అతణ్ణి రమణీయంగా అనుసరిస్తాడు. ఇతరులకంటె తనచేతిగడియారం అయిదునిమిషాలు ముందునడిచేటట్లు అమర్చుకున్నవాడే అసలైన సిసలైన విమర్శకుడని సైంట్‌బవే చమత్కరించాడు.[10] తనతరంకంటె తలపైకెత్తి ముందుతరాన్ని చూచేవాడు విమర్శకుడు. అతనిదర్శనం అక్షరరూపంగా మారితే విమర్శ. సాహిత్య విమర్శకు భౌతికదర్శనం ప్రాతిపదిక; మానసికదర్శనం హృదయదీపిక; తాత్త్వికదర్శనం ప్రగతిప్రకాశిక. విమర్శ ఆ మూడోమెట్టు ఎక్కగలిగితే భవిష్యద్దర్శనం ఏర్పడుతుంది; విమర్శ యుగచైతన్యప్రేరకమైన సృజనాత్మకశక్తిని సంతరించుకొంటుంది. ఆధ్యాత్మిక-తత్త్వ-దృష్టితో విశ్వమానవశ్రేయాన్ని దర్శించి, సాహిత్య ప్రక్రియాజగత్తుకు పరిణామతత్త్వంతోపాటు, పరమార్థసత్యాన్ని బోధించి, పురోగతిని చూపించే మహావిమర్శకునికోసం అనుక్షణం సాహిత్యవిమర్శ

ఎదురు చూస్తూంటుంది. మహాకవులు నాయకులుగా సాహిత్యచరిత్రలో యుగాలు వెలుస్తాయి; మహావిమర్శకులు నేతలుగా సాహితీవిమర్శ యుగాలు సాగుతాయి.

తెలుగులో కవిత్వాన్ని పట్టించుకొన్నంతగా సాహితీవేత్తలు విమర్శను పట్టించుకోరు. అందువలన, కవిత్వప్రయోగాలలో మహాకవులు తెచ్చిన మార్పులను దృష్టిలో పెట్టుకొని యుగవిభాగాలను ఏర్పరచుకొని సాహిత్య చరిత్రను వ్రాయటం, అధ్యయనం చేయటం ఆంధ్రులకు అలవాటై పోయింది కాని, వివిధప్రక్రియలలో కూడా, విశేషించి సాహిత్య విమర్శలో కూడా, అటువంటి ప్రయోగాలూ, పరిణామాలూ, ప్రమాణాలూ మహావిమర్శకుల ప్రయత్నంతో ఏర్పడుతున్నట్లూ, వాటిని కూడా గమనించి యుగవిభాగం చేసి వివేచించవచ్చునని పరిశీలించే ప్రవృత్తి ప్రచారంలోకి రాలేదు. అందువలన, సాహిత్యవిమర్శ ఒకసాహిత్యప్రక్రియ అనీ, అందులోనూ శతాబ్దాల తరబడి ప్రయోగాలు సాగాయనీ సాహితీవేత్తలు సంభావించటంలేదు. దానితో సాహితీ విమర్శ యుగాల వింగడింపుగానీ, విమర్శకుల వ్యక్తిత్వాల వివేచనం గానీ, వారి ప్రస్థానాల ప్రవృత్తులుగానీ, ప్రభావాలుగానీ ఫలితాలుగానీ విశ్లేషింపబడలేదు. ఆంధ్ర సాహిత్య విమర్శ చరిత్ర నిర్మాణానికి శాస్త్రీయమైన ప్రాతిపదికలు బలంగా పడలేదు.

ఈనాడు తెలుగులో ప్రాచీన సాహిత్యం, ఆధునిక సాహిత్యం అని కావ్యజగత్తును వివేచించి విమర్శిస్తున్నట్లుగానే ప్రాచీన విమర్శ, ఆధునిక విమర్శ అనే విభాగాన్ని విశేషంగా మన్నించకపోయినా, అటువంటిది ఉండా లన్న ఉబలాటం, ఉన్నదన్న ఊహ చాలమంది ఆధునికుల్లో కనబడుతోంది. కాని, స్పష్టమైన తెలివిడితో కూడుకొన్న తీర్పులు వినపడటంలేదు. ప్రాచీన కావ్యాలనుగానీ, ఆధునికయుగంలోని సంప్రదాయ సాహితినిగాని, ప్రాచీన ప్రమాణాలతో పరిశీలిస్తే ప్రాచీనవిమర్శ అవుతుందనీ, ఆధునిక కావ్య ప్రయోగాలను ఆధునిక దృక్పథంతో సమీక్షిస్తే ఆధునిక విమర్శ అవుతుందనీ సాహితీలోకంలో సర్వసాధారణంగా నేడు భావింపబడుతున్నది. అసలు తెలుగులో సాహిత్య విమర్శయే ఆధునికం కాబట్టి ఎటువంటి విమర్శఅయినా ఆధునిక ప్రక్రియగానే పరిగణింపబడాలని కొందరూ, సంప్రదాయభిన్నమైన

మార్గమే ఆధునికమని మరికొందరూ వివేచించటం కూడా ప్రచారంలో ఉంది. ఈ వాదాల వెనుకనున్న నిజమైన పరిస్థితి యేమిటంటే-విమర్శ ప్రమాణాన్ని మాత్రమే ఆశ్రయించి బ్రతికేదికాదనీ, కవితకులాగానే దానికీ ఒక ప్రయోజనముందనీ సాహితీలోకం సమగ్రంగా గుర్తించటంలేదు. దానివలన తెలుగులో సాహిత్యవిమర్శ పరమార్థంలేని పరిశ్రమకు తరతరాలుగా అలవాటు పడింది. ఈ మాట వినటానికి విడ్డూరంగా ఉన్నా నిష్ఠురమైన నిజం!

అయితే- ఇక్కడ విమర్శ సాధించే ప్రయోజనమేమిటన్న ప్రశ్న ఉదయించవచ్చు. విమర్శ అనుశాసనాన్నిగానీ, అనుశీలవాన్నిగానీ, రెండింటినిగానీ చేస్తుంది.[11] అది దాని స్వభావం గాని ప్రయోజనం కాదు. ఈ విమర్శ స్వభావంవల్ల సాహిత్యాస్వాదనశక్తి సమాజానికి కలుగుతుంది. అది ప్రయోజనమే. కాని, అది దాని లక్ష్యంకాదు. దానిగమ్యం సాహితీజగత్తులో నూత్న సృజన వ్యాపార చైతన్యాన్ని కలిగించే ఒక అభినవ దర్శనాన్ని లోకానికి అందించటం. ఆస్వాదనశక్తి దానికి భిత్తిక; దర్శనం రేఖాచిత్రం. కావ్యం వంటి సాహితీప్రక్రియలు రేఖాచిత్రాలకు వర్ణ సంయోజనం చేసి రూప వైభవాన్నీ, వైవిధ్యాన్నీ సంతరిస్తాయి. అభినవదర్శనాన్ని సమాజానికీయడమే సాహిత్యవిమర్శకు పరమప్రయోజనం.[12] దాన్నే విమర్శకున్న సృజనాత్మకగుణంగా విజ్ఞులు వివేచిస్తారు. విమర్శకుడు పరిశీలకుడుగా, పరిశోధకుడుగా మాత్రమేకాకుండా పరమార్థదర్శకుడుగా, అభ్యుదయ ప్రవక్తగా ఎదిగినప్పుడు మాత్రమే అతని విమర్శ సృజనాత్మక విమర్శగా సార్థకమౌతుంది. ప్రయోజనానికి ప్రమాణం ఎప్పుడూ సాపేక్షమేకాని నియతం కాదు. అట్లని ప్రయోజనం ప్రమాణదూరం కాదు. ప్రయోజనం వెంట పరుగెత్తేదే నిజమైన ప్రమాణం! స్వతంత్రంగా పురోగమించే విమర్శకు ఈ లక్షణం అభ్యుదయ చిహ్నం!

నేటి తెలుగుసాహిత్యవిమర్శను ఈ దృష్టితో పరిశీలిస్తే ఎక్కడ నిలుస్తుంది? నేటిసాహిత్యవిమర్శ ప్రధానంగా సమన్వయాన్ని సాధించటానికి యత్నించే సమీక్షగా సాగుతోంది. ఈ సమన్వయం సాధారణంగా ప్రయోగ ప్రమాణాలకూ, ప్రయోగ ప్రయోజనాలకూమధ్య సాధింపబడుతోంది. తెలుగులో వెలసిన ఒక ప్రయోగాన్ని విలువకట్టటానికీ, దాని స్వభావాలను నిగ్గు తేల్చ

టానికీ శాశ్వత ప్రమాణాలనుగానీ, సాపేక్ష ప్రమాణాలనుగానీ ప్రాతిపదిక లుగా తీసికొని పరిశీలించే పద్ధతి మొదటి రకం సమన్వయానికి వర్తిస్తుంది. సాహిత్యం సాంఘికంగా, సాహిత్యపరంగా సాధింపదలచుకొన్న ప్రయోజనాన్ని ఎలా సాధిస్తున్నదో మార్క్సిస్టు దృక్పథంతోనూ, మానవతావాద, హేతువాద దృక్పథాలతోనూ సమీక్షించే పద్ధతి రెండోరకం సమన్వయానికి వర్తిస్తుంది. ఈ రెండూ విమర్శ చేసే అనుశీలనకు ఉపలక్షకాలే. వీటి ప్రచారం వలన ప్రచురిత ప్రయోగాల స్వరూప స్వభావ ప్రయోజనాలను వివేచించి లోకానికి తెలియచెప్పటమే విమర్శగా నేడు సంభావింపబడుతోంది. దీన్ని ఉత్తమ విమర్శగా ఉల్లేఖించటం ఉచితం గాదు. తెలుగులో నాటికీ, నేటికీ కవి దార్శనికుడై మార్గం చూపిస్తున్నాడు; విమర్శకుడామార్గంలో ఓపినంత స్నేహం నింపి దివ్వెలు వెలిగిస్తున్నాడు.

ఇలా కావటానికి చారిత్రకంగా కొన్ని కారణాలు లేకపోలేదు. నన్నయకు ముందు ప్రమాణా లున్నాయి కాని, ప్రయోగాలు లేవు. ఆ తరువాత ఎందరో మహానుభావులు ఎన్నో ప్రయోగాలు చేశారు. వారందరూ ప్రయోగాలనూ, ప్రక్రియలనూ పెంచుకొంటూ పోయారేకాని, వాటికి తగిన ప్రమాణాలను పేర్కొంటూ రాలేదు. అందులోనూ, దేశిపద్ధతుల్లో సాగిన ప్రయోగ ప్రమాణాలు విమర్శ క్షేత్రంలో వెలుగులోకి రాలేదు ఆంధ్ర లక్షణ గ్రంథాల్లో సంస్కృతలక్షణానుసరణం మితిమీరిపోవటంవల్ల అనువర్తిత విమర్శప్రమాణాలుగానీ, విధానాలుగానీ, ప్రక్రియాపరమైన ప్రమాణ వివేచనంగానీ తెలుగులో తగినంతగా రూపొందలేదు. వీరేశలింగం పంతులుగారి కాలానికి తెలుగులో ప్రక్రియలూ, ప్రమాణాలూ సృజనాత్మకతను 'కోల్పోయి, జడత్వాన్ని భజించి స్తంభించిపోయాయి. ఈనాటికీ ఆనాటి కావ్యాలను అన్వయించాలంటే సంస్కృత లక్షణగ్రంథాలే శరణ్యమౌతున్నాయి.

నవ్యసాహిత్యయుగోదయ కాలంనుంచీ తెలుగువారికి పాశ్చాత్య ప్రక్రియలూ, ప్రమాణాలూ క్రొత్తగా లభించాయి మరోప్రపంచంవెలుగు వారికి కనపడింది. పశ్చిమాన్నుంచి వినూత్న ప్రయోగాలను తెలుగులోకి దిగుమతి చేసికొన్నారు. సృజనాత్మకరంగంలో ప్రపంచంలోని ఆయాదేశాలలో కళాసాహిత్య రంగాలలో వెలసిన ప్రయోగాలకు మూలమైన సాంఘిక,

రాజకీయ, సాంస్కృతిక ఉద్యమాలూ, వాటి సిద్ధాంతకర్తలు ప్రపంచించిన ప్రమాణాలూ తెలుగునాట వెలసిన నవ్య, అభ్యుదయ, ఆధునిక సాహిత్య ప్రయోగాలపై ప్రచండ వేగంతో పరుగులు తీశాయికాని, ప్రయోగవిజ్ఞానం తెలుగులో మందగమనంతో సాగింది. ఆధునికయుగంలో సాహిత్య విమర్శకుడు ప్రాచీనప్రయోగాల కొకవైపూ, నవ్యప్రయోగాలకు మరొకవైపూ సమన్వయ పరిజ్ఞానాన్ని సమాజానికి అందింపవలసి వచ్చింది. అనువర్తిత విమర్శ తెలుగులో ఆదినుంచీ ప్రచురంగా లేకపోవటంవలన విమర్శకుడు పదిశతాబ్దాల సాహిత్యంలో పరిశీలించి, విశ్లేషించి, వివేచించి, సమన్వయించి సాధింపవలసిన అంశాలు ఎన్నో మిగిలిపోయాయి. కొన్నాళ్ళు ప్రాచీన గ్రంథాలకు ప్రామాణిక ప్రతులను సిద్ధంచేసి, వ్యాఖ్యలువ్రాసి ప్రచురించటానికీ, కవులచరిత్రలనూ, సాహిత్యచరిత్రలనూ, జాతిచరిత్రనూ, భాషాచరిత్రలనూ నిర్మించటానికీ, తదనుబంధంగా ఉద్భవిల్లిన వివాదాలలో సత్యాన్వేషణ చేయటానికీ, శాస్త్రప్రమాణాలతో కావ్యప్రవృత్తులను పరిచయం చేయటానికీ విమర్శకలోకం అంకితమైపోయింది.

ఆపైన కట్టమంచివారు ప్రాచీనకావ్యాలపై నవ్యాలోకం ప్రసరించే పద్ధతిని ప్రవేశపెట్టారు. వారి పాశ్చాత్య దృక్పథబలంతో ప్రాచ్యదృక్పథాలకు పట్టుతప్పింది. అయినా, ప్రమాణవిచారంలో వాదోపవాదాలు చెలరేగి వాఙ్మయ యుద్ధాలు జరిగాయి. వాటి ప్రభావం ఊరక పోలేదు. ఆధునికమైన మిశ్రమార్గ మొకటి, 'కొత్తపాతలమేలుకలయికగా' నేర్పడి క్రమంగా విస్తృతి పొంద సాగింది. ప్రాచ్యపాశ్చాత్య లక్షణసంస్కారంతో సంప్రదాయ పద్ధతికంటె విలక్షణంగా విమర్శచేసే పద్ధతిని విశ్వనాథవారు చూపించారు. విశ్వవిద్యాలయాలు పరిశోధనను విమర్శమార్గంలో సంగమింపజేశాయి. విమర్శ గతాన్నీ, వర్తమానాన్నీ సమన్వయించుకోవటానికి సాముగరిడీలు సాగిస్తున్నది. ఆధునికులలో కొందరు కవులు తమప్రయోగాలకు తామే వ్యాఖ్యానం చెప్పారు. విమర్శకుడు కవిదగ్గరకు వచ్చేసరికి ఒక్కొకసారి యిద్దరూ చరిత్రలో వెనుకబడి పోతున్నారు. ఈ పరిస్థితి విమర్శకు సంధియుగంగా కనపడుతున్నది. విమర్శ తనశక్తినంతా సాహిత్యప్రక్రియావగాహన కనుమైన సమన్వయానికే నేడు వెచ్చిస్తున్నది. దీనికితోడు దేశంలో

నేడు ప్రాచ్యపాశ్చాత్య సాహిత్యలక్షణ పరిజ్ఞానాన్ని తులనాత్మకంగా సాధించి, సంపాదింపగలిగిన సాహిత్యవిమర్శకులు తక్కువై పోవటంచేత గ్రుడ్డివారు తాము తడివిన భాగమే యేనుగని నిర్ణయించేస్థితి యేర్పడుతున్నది. సమన్వయాలలో వినూత్నాంశా లెన్నో బయటపడుతున్నా, సమగ్రతతో కూడిన సాధన యింకా సాహిత్యవిమర్శలో అవసరమని తోస్తున్నది.

ఒక ప్రయోగంలోని అనేకాంశాలను విశ్లేషించటానికి వివిధ శాస్త్ర మర్యాదలను గ్రహించి సమన్వయించే యత్నం పరిశోధనరంగంలో సాగుతున్నది. ఇది విమర్శ ప్రక్రియలను ఆధునికీకరించటానికి తోడ్పడుతున్నది. ఆధునిక విమర్శకు పరిశోధన పూర్వరంగంగా నిలిచింది. విశ్లేషణ ప్రధానంగా సాహిత్యాన్ని సమీక్షించే వివిధ దృక్పథాలనూ, మార్గాంతరాలనూ నేడు విమర్శ అన్వేషిస్తున్నది. విశ్లేషణ పెరిగినకొద్దీ విషయపరిజ్ఞానం పెరుగుతున్నదేకాని, తత్త్వజ్ఞానం ప్రసన్నం కావటంలేదు. కంటివైద్యుడు కాలికి పనికిరానట్లు, సాహిత్యంలో స్పెషలైజేషను ఎక్కువై సాహిత్య సర్వాంగ పరిజ్ఞానం కుంటుపడుతోంది. ఆయా ప్రత్యేక శాఖలలో తరఫీదు పొందిన డాక్టర్లు ఆయా అంగాలను ఆపరేషను చేసి రోగులకు ఆయా ప్రత్యేక జాడ్యాలను తొలగిస్తున్నట్లే విమర్శకులు తమ తమ ప్రత్యేక శాఖల్లో విశ్లేషణాత్మక విమర్శలు వెలియించి ఆయా ప్రక్రియల పరిజ్ఞానాన్ని లోకానికి అందిస్తున్నారు.[13] ఎన్ని ఆపరేషన్లు చేసినా ఆత్మను అవలోకించలేని వైద్య శాస్త్ర వేత్తలాగా విమర్శకుడు సాహిత్యాత్మదర్శనాన్ని ఈనాడు చేయలేక పోతున్నాడు. భౌతికంగా బ్రతకటం ఆధునిక యుగలక్షణం. బ్రతకటానికి బాటలు వెదకటమే నేటి సమాజచైతన్యం. బ్రతకటానికి కూడా విలువలున్నాయని గుర్తించటం మానవతాలక్షణం. ఆ విలువలనూ, ఆ విలువలకు విలువనిచ్చే చైతన్యాన్నీ గుర్తించి, ప్రపంచించినప్పుడే సాహిత్యానికి సార్థక్యం! సాహిత్య విమర్శకు ప్రామాణ్యం!!

దాదాపు నాలుగు దశాబ్దాల నుంచి ఆధునికాంధ్ర కవిత్వాన్ని మార్క్సిస్టు దృక్పథం నడిపిస్తోంది. వివిధ ప్రయోగాలు అందులో వెలువడినాయి. అయినా, తెలుగులో ఆ దృక్పథంతో కవిత యెంత ముందుకు సాగుతున్నదో విమర్శ అంత వెనుకబడి పోతున్నది. మహాప్రస్థానంగా సాగే మహా విమర్శ

రావలసిన రోజులలో కూడా మహాభారత కవితాచర్చలే సాగుతున్నవి; విప్లవ విస్ఫూర్తిని వివేచింపవలసిన నేటి విమర్శ ఇంకా వీరశైవకవుల దేశికవిత ల్లోని 'జానపదబాణీ'లకు దరువు వేస్తోంది; ఇది తెలుగు సాహిత్య విమర్శ వెనుకబడిన తనమని అభ్యుదయవాదు లంటారు. అయితే-మరోవైపు-అభ్యుదయవాదులు కవిత్వంపేరిట సాంఘిక రాజకీయ విమర్శ వ్రాస్తున్నారు. ఆ విమర్శకు పార్టీమానిఫెస్టో ప్రమాణంగా పరిగణింపబడుతున్నది. ఆ రెండూ కలిపి చదువుకొంటే ప్రమాణ ప్రయోగ విచారమౌతుంది; ఇంకవేరే సాహిత్య విమర్శ కవితకెందుకని తిరిగి కొందరు ప్రశ్నిస్తున్నారు. ఈ మధ్య 'కవిసేన' నేటి కవిత్వానికి కావలిసింది సాహిత్య స్పృహకాని, సామాజిక స్పృహ మాత్రమేకాదని నినాదం లేవదీసింది. అకవిత్వయుగంలోంచి కవిత్వయుగం లోకి అడుగుపెట్టండని యువతరాన్ని హెచ్చరిస్తున్నది. విశ్వజనీనమైన సాహితీ ప్రమాణాలతో కవిత్వాన్ని కొలవాలని పిలుపునిస్తోంది; 'కవిసేన మేనిఫెస్టో'ను ఆధునిక కావ్యశాస్త్రంగా ప్రచురించింది. క్రొత్త రకం కవిత్వోద్యమానికి విమర్శను వివేకచూడామణిగా వాడుకొనే యత్నం కవిసేన చేస్తోంది. కవిత్వం ఏమి చెపుతున్నదో చూడమంటారు విప్లవవాదులు; అది ఎలా చెపుతున్నదో ముఖ్యంగా గమనించమంటారు కవిసేనవారు. సాహిత్య విమర్శ ఈ రెండింటిని చూస్తుంది. అంతేకాదు; ఈ రెండు చూపులకంటె ఉన్నతమైన దృక్పథంతో జీవితపరమార్థాన్ని దర్శించి సాహిత్య జీవితానికి భవిష్యద్దర్శనంగా నమర్పించి తన శక్తిని సార్థకం చేసికోవాలి సాహిత్య విమర్శ!

సమకాలీన సాహిత్య లోకానికి ఈ క్రింది సోమర్‌సెట్‌మామ్ మాటలు సంస్మరణీయాలు:-

"There can seldom have been a greater need than now of a critic of authority for the arts are at sixes and sevens ..... The great critic should have a sympathy as wide as his knowledge is universal"[14]

# 2

# ప్రభావ స్వభావం

"As for critics, they feel more at ease if influence- studies can be conducted in a positive spirit in the hope of assessing the borrower's originality in 'diverging' from his source"[1]

— K. K. Ruthven

ఇంగ్లీషులో 'ఇన్ఫ్లుయన్స్' అనే మాటకు సమాంతరంగా తెలుగులో 'ప్రభావం' అనే శబ్దాన్ని వాడుతున్నాం. ఒకరి వ్యక్తిత్వం మరొకరి వ్యక్తిత్వంతో ఆకర్షింపబడి, క్రమంగా అవ్యక్తంగా ఆంతర్యమైన పరిణామానికి లోగి, తత్ప్రవృత్తితో తాదాత్మ్యాన్ని భజించి, ప్రకటించే మానసికవ్యాపారం ప్రభావం. ఒకరి ప్రభావం మరొకరి స్వభావం మీద పనిచేసే తీరు విచిత్రంగా, వివిధంగా ఉంటుంది. ప్రతి వ్యక్తికీ ఒక జీవలక్షణం ఉండటం సహజం. అది భావరూపంగా వ్యక్తమైతే స్వభావమౌతుంది. స్వభావం గుణ వ్యంజకం. గుణాలు జీవలక్షణంనుంచి పుట్టే శీలధాతువులు. శీలం వ్యక్తిత్వాన్ని శిల్పీకరిస్తుంది. అది యొక రీతిగా, ఫణితిగా, వైఖరిగా ప్రవృత్తిని భజిస్తుంది. అప్పుడది జీవలక్షణాన్ని అభివ్యక్తీకరిస్తుంది. అభివ్యక్తి అభినయ సుందరంగా ఆకృతినుంచి వెలునడి అనుభావవిస్ఫూర్తిని వెలారుస్తుంది. అనుభావం వ్యక్తియొక్క భావభావనానికి ఆలంబనం. తద్భావ భావనం ఎదుటివారికి అనుభూతి నందిస్తుంది. ఇది లోకస్వభావం. కావ్య జగత్తులోకూడా ఇదే అలౌకికంగా ఆవిష్కృత మౌతుంది. అప్పుడు లోక

జీవితం కళామయజీవిత మౌతుంది ఆ జీవితాన్ని విమర్శించి, అంశంగా, అపూర్వంగా, ఆనందకందంగా సత్యశివసుందరంగా అభివ్యక్తీకరించేదే కవిత్వం.2 ఆ జీవితాన్ని అనుశీలించేదే సాహిత్య విమర్శ. అనుశీలనంలో విమర్శ ఆ కావ్య జీవితం అందించే అనుభవాల అంతరాలను అన్వేషిస్తుంది, వివేచిస్తుంది; వాటి విలువలకు విలువకట్టుతుంది.3

ప్రభావాన్ని గురించి పర్యాలోచించేటప్పుడు మనముందు ప్రధానంగా అయిదు అంశాలు మీమాంసకు నిలుస్తాయి అవి:- 1. ప్రభావం వేసే వ్యక్తి, 2. ప్రభావితుడయ్యే వ్యక్తి, 3. ప్రభావ స్వభావం, 4. ప్రభావం పడటానికి దారి తీసే పరిస్థితులు. 5. ప్రభావ ఫలితం. ఈ పంచదశా మీమాంస ప్రభావ పరిశీలనానికి ప్రాణసంపుటి.

ప్రభావ శబ్దం శక్తిమంతమైనది. దీనికి ప్రకృష్టమైన భావమనీ, ప్రధానమైన భావమనీ వ్యుత్పత్తులు చెప్పుకోవచ్చు. ఒక వ్యక్తికి వ్యక్తిత్వాన్నిచ్చేది శీలం గదా! ఆ శీలం వ్యక్తియొక్క స్వభావాన్ని వ్యంజింపచేస్తుంది. స్వభావంలో నిత్యనైమిత్తిక భావ ప్రపంచం ప్రతీయమానమౌతుంది. నిత్యభావం అతని మానసిక వ్యవస్థను వ్యక్తం చేస్తుంది; నైమిత్తిక భావం అతని అవస్థను అభివ్యంజింపచేస్తుంది. నైమిత్తిక భావాలు నిత్యంకాకపోయినా- సంచారిభావాలు స్థాయిని పోషించినట్లు- నిత్యభావానికి పుష్టిని కలిగించి లయిస్తూ ఉంటాయి. లయంకానిదీ, పుట్టుకతోవచ్చి పుడకలతోగాని పోనిదీ నిత్యభావం.ఇదే ప్రతివ్యక్తిలో ప్రధానభావం—లేదా—ప్రకృష్టమైనభావం; ప్రధాన ప్రవృత్తిని పరిరక్షించే మానసికవ్యాపారం. ఒకవ్యక్తిలోని ఇటువంటిభావం మరోవ్యక్తిని ఆకర్షింపగలిగితే- అప్పుడే ప్రభావం ప్రభావ మనిపించుకొంటుంది. అట్టి ప్రభావానికి లోగినవాడే ప్రభావితుడనిపించుకొంటాడు.

ఉదాహరణకు—రామాయణంలో రాముడున్నాడు. 'రామో విగ్రహవాన్ ధర్మః.' ధర్మోత్సాహం అతనిలోని ప్రధానభావం. అతని బ్రతుకు అతడు బ్రతికాడు. అతనికథలో ఎన్నో సన్నివేశాలు, ఎన్నో అవస్థలు కనపడతాయి. ఆయాఘట్టాలలో శోకహర్షరత్యాదిభావాలు వ్యక్తమౌతాయి. కాని, రామ

ప్రభావం మహాకవిమీద పడిందంటే అతని ప్రధానభావమైన ధర్మోత్సాహమే ఇతరుల నాకర్షించి వశంచేసికొన్నదని చెప్పాలి కాని, అతని అవస్థలు ప్రభావం వేశాయని అనరాదు. అవస్థలు అనుకరింపబడతాయి; వ్యవస్థలు అనుసరింపబడతాయి. అనుకరిస్తే అభినయ మౌతుంది; అనుసరిస్తే అను జీవనమౌతుంది. అనుకరించేవాడు అనుకర్త; అనుసరించేవాడు అనుభోక్త. పరాత్మభావాన్ని స్వీయస్వభావాని కనుగుణంగా సంవదించుకోవటం అనుభోగం. అనుభుక్తి ప్రభావస్వభావం.

లోకంలో ఒక మనిషి మరోమనిషివలన ఎందుకు ప్రభావితుడౌతాడు? ఒకడు- తనకు నచ్చిన ఒకమహాగుణం ఎదుటివానిలో ఉజ్జ్వలంగా ఉన్నందువలన దాన్ని అనుసరిద్దామని అనుకొంటాడు.[4] అంటే- అతనిలో అసలు గుణంలేదని కాదు. బీజప్రాయంగా ఉంటుంది. అది అభిరుచిగా అంతర్నిగూఢంగా ఉంటుంది. ఎదుటివానిలో అది ఫలరూపంగా ప్రత్యక్షమైనప్పుడు, తద్భావభావనలో బీజప్రాయమైన అతని అభిరుచి అంకురించి, కుట్మలించి, ఫలించి, పరిణతి చెందుతుంది. అసలు అభిరుచియే లేకపోతే ఎదుటివాని గుణంలో రుచి కలగటం సాధ్యంకాదు. ప్రభావితునిలో ప్రసుప్తంగా ఉన్న ప్రవృత్తిని ప్రబోధించి, ప్రజ్వలింపచేయటమే ప్రభావ స్వభావం.[5] దానికి కాలం దోహదం చేస్తుంది.

ప్రభావఫలం ప్రక్రియ. అన్యోన్యదంపతుల అనురాగఫలమైన అల్లారుముద్దుబిడ్డలాంటిది ప్రక్రియ. తెలుగులో వచ్చిన భావకవితోద్యమం లోని ఖండకావ్య ప్రక్రియను తీసికొందాం. దానిమీద పాశ్చాత్య సాహిత్యం లోని కాల్పనికోద్యమ ప్రభావం ఉందని అందరికీ తెలిసిన విషయమే. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారిలో అది ఒక సుందర కవితాభివ్యక్తిగా వెలువడింది. ఆ కవి కావ్యఖండిక బిడ్డలాంటిది. ఆ కవి సంస్కారం ఆ బిడ్డకు తల్లి; కాల్పనికోద్యమ కవులకవితోద్యమం తండ్రి. తండ్రిప్రభావం తల్లిమీద ఉంది. అంతేకాదు. తల్లిప్రభావం కూడా తండ్రిమీద ఉంది. పాశ్చాత్యప్రక్రియను ఉన్నది ఉన్నట్లుగా కృష్ణశాస్త్రిగా రనుకరించలేదు. అతత్త్వాన్ని తన స్వభావాని కనుగుణంగా దర్శించి, దరికి తీశారు, అభినవంగా కవిత అల్లారు. స్వీయాభిరుచి కనుగుణంగా సంవదించుకొనే ప్రతిభాశక్తి ప్రభావమే తండ్రిమీది

తల్లిప్రభావం. తండ్రిప్రభావితుడైనా తల్లినే రమించాడు. ఆ యిద్దరి వలపుల పంటగా ప్రక్రియ ప్రభవించింది. ప్రభావఫలాలైన ప్రక్రియలు బింబాలకు ప్రతిబింబాలుకావు; కాకూడదు కూడా. అవి సామాన్యంగా మిశ్రమమూర్తులై ఉంటాయి. లోకంలో—తండ్రిపోలికా, తల్లిగుణం ఉన్న ఆడపిల్లలు అదృష్ట వతులంటారు; అలాగే తల్లిపోలికా, తండ్రిగుణం ఉన్న మగపిల్లలు భాగ్యవంతులౌతారంటారు. సాహిత్యజగత్తులో కవిత్వం మొదలైన ప్రక్రియ లన్నీ ఆడపిల్లలవంటివి; విమర్శ ఒకటి మగపిల్లవానివంటిది. అంటే—తెలుగు సాహిత్యంలో కవితమొదలైన వాటిమీద, ప్రభావంవేసిన ప్రక్రియయొక్క పోలిక కొట్టవచ్చినట్లు కనపడుతుంది; తెలుగుదనం ఆత్మగుణంగా శోభిస్తుంది. తెలుగు సాహిత్యవిమర్శకు తెలుగుదనం తేటపడే రూపవైభవ ముండి, ప్రభావంవేసిన ప్రక్రియయొక్క గుణవిభూతిని ప్రకటించే ఆత్మ లక్షణముంటుంది-అలా ఉంటే కవిత అదృష్టవంతురాలవుతుందనీ, విమర్శ భాగ్యరేఖను సాధిస్తుందనీ భావించటానికి వీలుంది. దీనినిబట్టి గమనిస్తే, కవిత్వంమీదపడే ప్రభావాన్ని పరిశీలించటానికీ, సాహిత్యవిమర్శమీద పడే ప్రభావాన్ని అనుశీలించటానికీ ఒకేవిధమైనపద్ధతి పనికిరాదని స్పష్ట మౌతున్నది.

పాశ్చాత్య విమర్శకులు కొందరు సాహిత్య ప్రభావస్వభావాన్ని వివిధ దృక్కోణాలతో వివేచించి,వివరించటానికి ప్రయత్నించారు.మచ్చుకు ఒకరిద్దరి అభిప్రాయాలను గమనిద్దాం.-ఒక కవియొక్క శక్తిమంతమైన వ్యక్తిత్వం అపరిణతుడైన మరోకవి వ్యక్తిత్వాన్ని ముంచెత్తినట్లుగా, బలవంతంగా ఆక్రమించినట్లుగా ప్రభావం భాసిస్తుందని టి. యస్. ఇలియట్ పేర్కొ న్నాడు.[6] ఇటువంటి ప్రభావం ఒక మహాకవి ఒక సామాన్య కవిమీద వేసేటటువంటిది. ఒక్కొకసారి ప్రభావం వేసేకవీ, ప్రభావితు డయ్యేకవీ-ఇద్దరూ విశిష్టవ్యక్తిత్వాలు కలిగి ఉండటమూ, సమకాలీనులో-లేదా-సన్నిహిత కాలంలో ఉన్నవారో అయి ఉండటమూ జరిగినప్పుడు వారిద్దరిమధ్యా ఉండే ప్రభావం ఇచ్చిపుచ్చుకొనే వైఖరిలో సాగవచ్చు. ఇటువంటప్పుడు-రెండు ప్రభు త్వాలుపరస్పరం వాణిజ్యంలో ఇచ్చిపుచ్చుకొనే ప్రభావానికి లోనై తమఆర్థిక వ్యవస్థలను పటిష్ఠం చేసికొన్నట్లుగా, కవులుకూడా పరస్పర భావవినిమయంతో సాహిత్యాన్ని సుసంపన్నం చేయవచ్చు నని జాన్ డ్రైడెన్ వివేచించాడు.[7]

'ఇన్‌ఫ్లుయన్స్' అనేపదం మొదట జ్యోతిశ్శాస్త్రానికి సంబంధించిందిగా ఉండేది; గ్రహాలు మానవులమీద వేసే శుభప్రభావాన్ని సూచించే అర్థంతో పుట్టింది. గ్రహాలశక్తులు ప్రవాహాల్లా ప్రసరించి లోకంలోని జీవుల భవితవ్యాలను నిర్దేశిస్తాయనీ, అట్టి ప్రవాహాల ప్రసారమే ఇన్‌ఫ్లుయన్సనీ ప్రాచీనకాలంలో పారిభాషిక పదంగా వాడుతూ ఉండేవారు.[8] కాని, క్రమంగా ఆ పదం అర్థపరిణామాన్ని చెంది, సాహితీవ్యక్తుల పరస్పర ప్రభావంగా సాహిత్యక్షేత్రంలో రూఢికెక్కింది. ఆ శబ్దానికున్న ప్రాచీనార్థాన్ని దృష్టిలో పెట్టుకొని రిచర్డ్ ఎల్‌మన్—రచయితలు పరస్పరం ఒకరిలోకి మరొకరు అలల్లా ప్రవహిస్తారు; అయితే పోటులో వచ్చే సముద్ర తరంగాలవలెకాదు, మందంగా ముందుకు సాగే మందాకినీతరంగాల్లాగా[9] అని ఆలంకారికంగా ప్రభావ స్వభావాన్ని వర్ణించాడు. ఒక్కొక్కసారి ఒక రచయిత తాను భావించిన భావాలకు గానీ, వస్తువులకు గానీ సమగ్రమైన ఆకృతినీ, అలంకృతినీ, అభివ్యక్తినీ ఈయలేనప్పుడు అతని ప్రయత్నం వల్ల ప్రభావితుడైన మరో రచయిత వాటికి సమగ్రమైన ఆకృతినీ, సుందరమైన అలంకృతినీ, సుస్పష్టమైన అభివ్యక్తినీ కల్పింపవచ్చును. ఇదీ ఒక రకమైన ప్రభావమే అయినా దీనిలో ప్రభావితుని రచనలోనే నిగ్గు తేలిన కళాభివ్యక్తి రూపుకట్టుతుంది. అసమర్థుడైన రచయితమీది ప్రభావంకంటె సమర్థుడైన రచయిత మీద పడిన ప్రభావం పరిణతకళారూపసిద్ధికి దోహదకారి యౌతుంది. దీన్నే భంగ్యంతరంగా టి. యస్. ఇలియట్ ఇలా పేర్కొన్నాడు— ఒకకవి మరొకవి నుండి భావాన్ని సంగ్రహించే విధానంలోనే ప్రభావబలం బయటపడుతుంది. అపరిణతులైన కవులు అన్యుల భావాలను అనుకరిస్తారు; పరిణతకవులు సంగ్రహిస్తారు. కుకవులు తాము అనుకరించే అంశాలకు తమ అసమర్థతతో ఆకృతిని చెడగొట్టి, వికృతిని కల్పిస్తారు; సత్కవులు తాము సంగ్రహించిన అంశాలకు ఉత్తమ రూపాన్నిచ్చి, వాటిని ఉజ్జ్వలం చేస్తారు; లేదా కనీసం అన్యథాకరించి ప్రతిభను ప్రకటిస్తారు. సత్కవు లెప్పుడూ తమ కాలానికి సుదూరంగా మారుమూలనున్న కవినిగానీ, సజాతీయ భాషా కవుల భావాలను గానీ గ్రహిస్తారు. లేదా వైవిధ్యంతో కూడిన అభిరుచులను సంగ్రహించ అనుసరిస్తారు.[10]

ప్రభావాన్ని గూర్చి అలంకారికంగా ప్రపంచించిన వివిధ రచయితల అభిప్రాయాలను సమీక్షించి కె. కె. రూతవెన్ యిలా వివేచించాడు- ప్రభావం ప్రవాహంలా పొంగి ప్రభావితుణ్ణి ముంచెత్తుతుందనే అభిప్రాయమూ, ప్రభావం ప్రభావితుని ప్రతిభకు నికషోపలం వంటిదనే అభిప్రాయమూ పరస్పరం విరుద్ధమైనవి. ఒకటి శక్తిమంతుని ప్రభావానికి లోగిన కవి నిస్సహాయతనూ, నిర్లిప్తతనూ వ్యక్తం చేస్తుంది. మరొకటి స్నేహప్రభావం కలిగించే ఉత్తేజశక్తిని అవజ్ఞచేస్తుంది.[11] సామాన్యంగా, ప్రతిభనూ సృజనాత్మకతనూ గౌరవించి ఆదరించే రచయితలు తమమీదపడిన పూర్వరచయితల ప్రభావాన్ని పరిశీలించే ప్రవృత్తులపట్ల సౌముఖ్యాన్ని ప్రకటింపరు సరికదా, ఆ విధానాలవలన తమ వ్యక్తిత్వాలకు తీరని అపకారం జరుగుతుందని ఆందోళనపడతారు. అందువలన సాహిత్య విమర్శకులు కూడ ప్రభావితుల ప్రతిభా శక్తులను, నవ్యతను సృష్టించే ప్రజ్ఞాప్రాభవాలను దృష్టిలో ఉంచుకొని ఇతర ప్రభావాలు ఎంతవరకు వారి సృజనాత్మకతకు తోడ్పడినాయో, వారి ప్రయోగాలకు ప్రాణాలు పోశాయో విజ్ఞతతో వివేచించి నిరూపించవలసి ఉంటుంది. ఇది ఒక విధంగా నీరక్షీర వివేకాన్ని ప్రకటించే పరమహంస ప్రవృత్తివంటిదనే చెప్పాలి.

ప్రభావ పరిశీలనంలో ప్రభావితుల అనుకరణ ప్రవృత్తినీ, అనుసృజశక్తినీ అనుశీలించటం విమర్శధర్మమని విజ్ఞులు సాధారణంగా భావిస్తారు. కాని, అనుకరణలో అనుకర్త ప్రతిభారాహిత్యం ప్రదర్శితం కావటంచేత దాన్ని ప్రభావంగా భావించటంలో ప్రయోజనం కనపడదు. ఒకవేళ గ్రహించినా దాన్ని ఉత్తమ ప్రభావంగా పరిగణింపకపోవటమే ఉచితం. అందులో అనురణన రూపమైన ఆవృత్తి గోచరించటంచేత దాన్ని దాస్యంగా వివేచించటం మంచిది. ఇది సృజనాత్మక ప్రక్రియలలో గౌరవాన్ని పొందే గుణంకాదు. అందువలన దానికి ప్రభావ పరిశీలన పరిధిలో ప్రామాణిక ప్రతిపత్తిని కల్పించటం ప్రతిభాదారిద్ర్యానికి తార్కాణంగా భావించాలి.

అనుకరణ అవస్థకు సంబంధించిందని భావించటం జరిగింది. ఒక వ్యవస్థకు పతినిధిగా నిలిచిన కవి ఒక అవస్థలో ఒక విధమైన రచనం చేస్తాడు. దాన్ని యథాతథంగా అనుకరిస్తే అనుకార్యుని శక్తి సామర్థ్యాలే

తెలుస్తాయి కాని అనుకర్త ప్రతిభ ప్రత్యక్షం కాదు. ప్రభావం ప్రధానంగా వ్యవస్థకు సంబంధించింది కాబట్టి తత్ప్రభావానికి లోగిన రచయిత ఆలోచనా విధానంలో వ్యవస్థాధర్మాన్ని అనుసరించినా, అభివ్యక్తిలో తన వ్యక్తిత్వాన్ని ప్రత్యేకప్రతిపత్తితో పోషించుకొంటాడు. వ్యవస్థకు సంబంధించిన ఆలోచనం సమాంతర దర్శనాన్ని రచయితకు అందిస్తుంది కాని అంధానుకరణాన్ని అలవరచదు. అంధానుకరణం అన్ని వ్యవస్థలలోనూ ఆదరణీయం కాదు కాబట్టి అనుశీలనంలో దానికి ఆదరగౌరవాలు సాహిత్య లోకంలో లభించవు.

అనుకరణ, అనుసృజన వ్యాపారాలు సాహితీప్రక్రియ అన్నిటిలో లాగానే సాహిత్యవిమర్శలో కూడా ప్రత్యక్షమౌతూ ఉంటాయి. అనుకరణ కొక ఉదాహరణం-రాళ్ళపల్లివారి 'రాయల నాటి రసికత' [12] వ్యాసాన్ని పుట్టపర్తి నారాయణాచార్యులుగారు 'రాయలనాటి రసికతా జీవనము' [13] అనే వ్యాసంలో అనుకరించారు. రాళ్ళపల్లివారి భావాలతీరునూ, ఫణుతులనూ, ప్రక్రియనూ, ప్రతిపాదన విధానాన్నీ బింబప్రతిబింబ భావంతో పుట్టపర్తి వారు గ్రహించి ప్రదర్శించారు. ఇది ప్రభావమని పరిగణించినా ప్రభావితుని ప్రతిభకు పరువు తెచ్చేది కాదు. ఇటువంటిది అనుకరణవ్యాపార మని విమర్శలో నిర్దేశించవచ్చు. అనుసృజన వ్యాపారం దీనికంటె భిన్నమైనదీ, ఉత్తమమైనదీ. ఉదాహరణకు-విశ్వనాథవారు 'ఒకడు నాచన సోమన్న' [14] అనే గ్రంథాన్ని వ్రాశారు. అందులో ఆమహాకవి యొక్క సాహితీవ్యక్తిత్వం కావ్యార్థాలలో ప్రతీకాత్మక ప్రవృత్తిని సంతరించటంలో ప్రధానంగా ప్రస్ఫుటమౌతుందని ప్రతీకాత్మక విమర్శ విధానాన్ని అనుసరించి అనుశీలించారు. ప్రతీకాత్మ విమర్శక విధానం ఒక ప్రక్రియగా జాలువారిన వ్యవస్థ లాంటిది. దానిని నిర్వహించటంలో విశ్వనాథ తనవ్యక్తిత్వాన్ని ప్రతిపాద్యాంశాలలో ప్రదర్శించారు. ఈ గ్రంథ రచయిత డా॥ జీ. వి. సుబ్రహ్మణ్యం కూడా అదే విమర్శవిధానంలో హంసడిభకోపాఖ్యానంలోని ప్రతీకాత్మక వ్యక్తిత్వాన్ని అనుశీలించటం జరిగింది [15] కాని, అది అనుకరణం కాదు; ప్రక్రియలో ప్రత్యేక వ్యక్తిత్వాన్ని సాధించిన అనుసృజనం,

ఇక్కడ ఒక వ్యవస్థయొక్క ప్రభావం ఇద్దరివిమర్శకులమీద ఉన్నా వారి అనుశీలన విధానాల్లో వారి వారి వ్యక్తిత్వాలకు సంబంధించిన వైశిష్ట్యం స్పష్టంగా కనపడుతున్నది. అనుకరణంలో విమర్శకుడు అనుకార్యుని ప్రభావంలో మునిగిపోయి తన అస్తిత్వాన్ని కోల్పోతాడు. అనుసృజనలో ప్రక్రియాప్రవృత్తిని అనుసరించినా ప్రతిపాదనవిధానంలో తన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించుకొంటాడు. ఒక ప్రవాహంలో పూర్తిగా మునిగి పోవటం కాదు ప్రభావం; ఒకబాటలో తలయెత్తుకొని నడవటం ప్రభావం. ప్రభావ పరిశీలనంలో ఈ వివేచనం ప్రమాణసూత్రం.

సాహిత్యరంగంలో ఒక రచయితప్రభావం ఒకరచయితమీదనే పడుతుందని చెప్పలేం. ఒక్కొక్కసారి అనేకమంది రచయితల ప్రభావం ఒకని మీద పడవచ్చు; ఒకని ప్రభావం పెక్కుమందిమీద కూడా పడవచ్చు. అంతేకాక ఒక యుగంలో ఒక దృక్పథంగానీ, ఒక సిద్ధాంతంగానీ, ఒక దర్శనం గానీ, ఒకప్రక్రియకానీ బలంగా రచయితలమీద ప్రభావం వేస్తూ ఉండవచ్చు -లేదా -పరస్పరవిరుద్ధాలైనవీ రచయితలలో కానబడవచ్చు. అప్పుడు ప్రభావ పరిశీలనం సంశ్లిష్ట మౌతుంది. విమర్శకుడు ప్రభావితుని రచనలను వివేచించేటప్పుడు సామూహిక ప్రభావాన్నీ, యుగప్రభావాన్నీ గుర్తించి వివేకంతో విశ్లేషించుకోవాలి. అవి రచయితకు తన సాహితీ వ్యక్తి త్వాన్నీ, ప్రయోగాన్నీ రూపొందించుకోవటంలో ఎటువంటి ఉత్తేజాన్ని కలిగించాయో సమీక్షించాలి. ప్రభావం కవిప్రతిభాభివ్యక్తికీ, నూత్నసృష్టికీ ఎలా దోహదాన్ని కల్పించిందో నిరూపించాలి. పైరెండురకాల ప్రభావా లలోనూ ప్రభావ ప్రభావిత రచనలు రెండింటిలోనూ సామ్యాలు కొన్ని గోచ రించవచ్చు. యుగచైతన్యం వివిధరూపాలలో వివిధరచయితలలో వెలుగొంద వచ్చు. వాటిని నిపుణంగా నిరూపించి రచయితల సృజనాత్మక శక్తులకు విలువ కట్టే విజ్ఞతను విస్మరించకుండా ప్రభావపరిశీలనాన్ని విమర్శ సాగింప వలసి వస్తుంది.

ఒక్కొక్కకాలంలో ఒక్కొక్క రకమైన ఉద్యమం సాహిత్య జగత్తును ఊపివేస్తూండవచ్చు. అదే సాహితీయుగ ధర్మంగా భావింపబడుతూ ఉండవచ్చు. రచయిత లాయుగంలో భిన్నప్రక్రియలలో ప్రయోగాలు

సాగిస్తున్నా. వాటిలో ఆ ఉద్యమ ప్రభావం బలంగా కనపడుతూఉండవచ్చు. ఆ ఉద్యమశీలం ఆయా రచనలలో అలవోకగా ప్రతిబింబిస్తూ ఉండవచ్చు. అలా ఉద్యమశీలాన్ని ఊపిరిగా పీల్చేరచనలలో-భావాలలోనూ, పదాలలోనూ, పదబంధాలలోను, సూక్తులలోనూ, అభివ్యక్తులలోనూ సామ్యాలు గోచరించవచ్చు. ఇటువంటి సామూహికోద్యమ ప్రభావపరిశీలనం చేసేటప్పుడు, ఉద్యమ వ్యవస్థాగతమైన తత్త్వానికి ఆకర్షితులై రచయిత లెంతవరకు, ఏయే ప్రమాణాలలో ఏయేవిధంగా ప్రభావితులైనారో సమీక్షించవలసి వస్తుంది.[16] రచయితలలోనూ మహాప్రతిభావంతులైనవారు ఉంటారు. ఉద్యమప్రస్థానంలో వారు సాధించిన ఉజ్జ్వల ప్రయోగాలూ, రచనల్లో వాడిన పదబంధాలూ, శైలీ విశేషాలూ, రచనాప్రక్రియలూ, చమత్కారాలూ తదితరులమీద ప్రభావాన్ని వేయవచ్చు. వాటిని సమీక్షించటంలో అనుకరణ లేవో, అనుసృజనలేవో నిపుణంగా నిరూపింపవలసి వస్తుంది విమర్శకులకు. ఒక్కొక్కసారి ఒకయుగంలోని కవులు ఒక దృక్పథంతో కొన్నిప్రక్రియలను కొత్తగా రూపొందించేయత్నం, యుగచైతన్యానికి లొంగి, సాగిస్తూఉండవచ్చు. ఆ మహాయత్నంలో ఒక్కొక్కసారి ఆరంభించిన వారికంటె, అందుకొన్నవారే అపూర్వకళాఖండాలను నిర్మించవచ్చు. అంటే, ఒకయుగ ప్రభవంలో రచయితలు, ఒక్కొక్కసారి అయత్నకృతమైన అంతఃప్రేరితప్రవృత్తితోనూ, మరొకసారి సంఘటిత ప్రయత్నప్రవృత్తితోనూ ఆ యుగచైతన్యానికి తగిన ప్రక్రియనూ, కావ్యశైలినీ, విమర్శవిధానాన్నీ పరిణతసుందరంగా రూపొందించటానికి సామూహికయత్నం సాగించి, దాన్ని సాధించవచ్చు. అట్టిపరిస్థితులలో పరిణామవికాసదశలను విశ్లేషించుకొని రచయితల ప్రతిభాశక్తులపై యుగచైతన్యం ఎలా తనప్రభావాన్ని ప్రసరింపజేసిందో పరిశీలింపవలసి ఉంటుంది.

అయితే, ఇక్కడ ఒక విషయం మాత్రం మరచిపోకూడదు. ఏ యుగ చైతన్యమైనా ఆ కాలంలో ఆకాశం నుంచి అగస్మాత్తుగా ఊడిపడదు. గతంలోనుంచి పరిణామదశగా సముద్భవిస్తుంది. గతంలోని సాహిత్య ప్రవృత్తి సృజనాత్మకతను కోల్పోయినపుడు నవ్యతకోసం, ప్రగతి సాధనం కోసం నూత్నచైతన్యం మోసులెత్తుతుంది. సమకాలీనులు దాన్ని వర్తమానంగా భావించినా, దానికీ గతానికీ భవిష్యత్తుకూ ఉన్న నైజమైన సంబంధాన్నీ,

సాతత్యాన్ని చారిత్రాత్మకంగా సమీక్షించి విమర్శకుడు ప్రభావ పరిశీలనం చేయాలి.[17] ఒకవిధంగా ప్రభావపరిశీలనంలో చారిత్రకదృక్పథం వర్తమానం మీది ప్రభావాన్ని నిర్దేశించటానికి నిపుణమైన సాధనంగా పనికివస్తుంది.

ఒక్కొకసారి ఒక సిద్ధాంత ప్రభావానికి లోగిన రచయితలు దాన్ని అపార్థం చేసికొని, తమకు తోచిన విధంగా ప్రయోగాలు నిర్వహించవచ్చు. అటువంటిదాన్ని ఆంగ్లంలో 'క్రియేటివ్ మిసండర్‌స్టాండింగ్' (Creative misunderstanding) అంటారు. 1935 ప్రాంతంలో వెలెరీ (Valery) అనే విమర్శకుడు దీనికీ పేరు పెట్టాడు. ఆ తరువాత హెరాల్డ్ బ్లూమ్ దానికి ఆంగ్ల సాహిత్య విమర్శలో వ్యాప్తి కల్పించాడు. దాన్ని తెలుగులో చెప్పు కొంటే– 'అపూర్వ సృష్టికి మూలమైన అపార్థం' అనాలి. ప్రభావ పరిశీల నంలో ఇదియొక విచిత్ర విశేషం. ఒకసారి ఆన్ద్రేబ్రెటన్ (Andre Breton) ఫ్రాయిడ్(Freud)తో మాట్లాడుతూ అధివాస్తవిక వాదులందరూ ఫ్రాయిడ్ మానసికశాస్త్ర సిద్ధాంతాలలోని అవ్యక్త చైతన్య ప్రవృత్తి పరిశీలనాంశాల నుండియేతమ సాహిత్యోద్యమ సిద్ధాంతాన్నిరూపొందించుకొన్నారనిచెప్పాడట. ఆ మాటలకు ఫ్రాయిడ్ ఆశ్చర్యపడి తన సిద్ధాంతాన్ని పూర్తిగా అపార్థం చేసి కొన్న అవివేకు లెవరంటే- అధివాస్తవికవాదు లనే చెప్పాలి అని అన్నాడట. ఇది నిజమేనని గ్రహించినా, అపార్థంకూడా సాహిత్యానికి అనర్థం కలిగించ టానికి బదులు అపూర్వమైన మరొక సృష్టిని ప్రసాదించిందని తెలుస్తుంది. పొరపాటులోనుంచి కళాజగత్తున మరొక పొద్దు పొడిచింది.[18] అందువలన నవ్యసృష్టికి మూలమైన అపార్థం ప్రభావ పరిశీలనలో ఒక అంశంగా పరిగణింపబడుతుంది.

సాహిత్య విమర్శకులు మాత్రం ఈ అంశాన్ని కడుజాగరూకతతో అనుశీలించాలి. మనోవిశ్లేషణ సిద్ధాంత సదవగాహన అధివాస్తవికవాదులకు లేకపోవచ్చు. దానివలన అధికవాస్తవికవాదమనే అభినవవాదం అపార్థంలో నుంచి నవార్థంగా ఉదయించియుండవచ్చు. వాటివాటిస్వరూపస్వభావాలు వేరైభాసించవచ్చు.కాని, విమర్శకులు మాత్రం ఆ రెండింటినీ అపార్థం చేసికో రాదు. విమర్శ అపార్థమూలమైతే దాని పరమార్థం చెడి ప్రహసనతుల్యమై పోతుంది. ఉభయ సిద్ధాంతాల సదవగాహనతోపాటు, ఎటువంటి అపార్థం

వలన ఎటువంటి నవసిద్ధాంతం పుట్టిందో తెలిసికొని, అపార్థం చేసికొన్న వైఖరినే ప్రభావంగా నిరూపించి, తద్విబుధుల ప్రహసనంలోని తత్త్వంచెప్పి, అద్భుతపాటు కలిగించే అనుశీలనాన్ని విమర్శకులు నిర్వహించాలి.

ఒక్కొక్కసారి అపార్థం నవార్థంగా పరిణమించటానికి బదులు సాహితీలోకానికి అనర్థంగానే మిగిలిపోవచ్చు. ఇలా జరగటం పాశ్చాత్య ప్రభావం పడిన ప్రాంతీయ సాహిత్యాలలో సామాన్యం. మూలం చదవక పారిభాషికపదాల ప్రతిపదార్థాన్నిబట్టి వాటి లక్షణాలను ఊహించి, ఉల్లేఖించటం దేశభాషాకవులు, పండితులు, విమర్శకులు సాధారణంగా చేసేపని. నేటి తెలుగు రచయితలలో కొందరు 'సామాజిక స్పృహ' అంటే సరైన లాక్షణిక నిర్వచనం తెలియక సమాజంలోని జీవన పరిస్థితులను, వ్యక్తుల స్వభావాలను సుందరంగా వర్ణించటంలో కూడా సామాజిక స్పృహ రచయితల కున్నట్లు లెక్కకడుతున్నారు; ఉపన్యాసాలిస్తున్నారు; విమర్శలలో పేర్కొంటున్నారు. దీన్ని 'అపూర్వ సృష్టికి మూలమైన అపార్థంగా' పేర్కొనటానికి వీల్లేదు. 'అనర్థానికి మూలమైన అపార్థమని నిర్మొగమాటంగా చెప్పాలి. అపార్థాన్ని కూడా నవార్థవ్యంజకంగా సృజనవ్యాపారంలో సంపదింపగలిగినవాడే ప్రతిభావంతుడైన కవి; పరమార్థాన్ని తెలిసి ప్రయోగాలలోని అర్థాన్నీ, అపార్థాన్నీ, నవార్థాన్నీ నానార్థవిజ్ఞానవేత్తగా వివేచింపగలిగినవాడే విజ్ఞుడైన విమర్శకుడు.

ఒక్కొక్కసారి ఆంధ్ర సాహిత్య జగత్తులో రచయితలు ప్రవర్తింపజేసే వినూత్న ప్రయోగాల మీద పాశ్చాత్యప్రభావం పాక్షికంగానే ఉండవచ్చు. తెలుగు రచయిత సమకాలీన సాహిత్య పరిస్థితుల కనుగుణంగా సాహిత్యంలో వినూత్న సిద్ధాంతాన్ని దర్శించి, దానిలో తాను ప్రయోగాన్ని సాగింపదలచుకొన్నప్పుడు పాశ్చాత్య భావాల సంస్కారాన్ని కూడా అందులో తాను సంపదించుకోవచ్చు. అలా వెలువడినవే రాయప్రోలువారి అమలిన శృంగార సిద్ధాంతం, దాని నాధారంగా చేసికొని వారు చేసిన ప్రయోగాలు. రాయప్రోలు మీద పూర్తిగా పాశ్చాత్య ప్రభావమే ఉన్నదని చెప్పలేము. ఉన్నది పాక్షిక ప్రభావమని ఘంటాపథంగా చెప్పవచ్చు.[19] ఇటువంటి సందర్భాలలో ప్రభావితుడౌతున్న రచయిత యొక్క విశిష్టవ్యక్తిత్వం గణనకు వస్తుంది. రాయప్రోలు ఏ ప్రవాహంలోనూ తలమున్కలుగా కొట్టుకొని

పోయినవాడు కాడు. తన కెంతవరకు ప్రభావం ప్రయోజనకారిగా ఉంటుందో అంతవరకే గ్రహించి స్వీయ సాహితీ వ్యక్తిత్వాన్ని స్వయంగా నిర్మించుకొన్నవాడు. ఒక విధంగా చూస్తే తెలుగులో వెలుగునింపిన ఉత్తమ ఆధునిక కవులు, విమర్శకులు తా మొక వ్యక్తిత్వాన్ని ముందుగా సంతరించుకొని, పాశ్చాత్య ప్రభావంతో తమ సిద్ధాంతాలకూ, ప్రయోగాలకూ వినూత్న తేజాన్ని కల్పించుకొన్నవారే ఎక్కువగా కనపడతారు. నిజంగా ప్రభావితు లంటే అలాగే ఉండాలి. స్వీయవ్యక్తిత్వంతో ప్రయోగం చేయగలిగిన ప్రతిభావంతులమీద పడిన ప్రభావమే ప్రభావం! పాశ్చాత్య ప్రభావం తెలుగు రచనకు ప్రాణంకాదు; ప్రవృత్తిలో వచ్చిన ప్రకాశం; విమర్శలో అది తెలుగుదనాన్ని పోల్చుకోగలిగే పోలికలతోనే పొటమరించింది; ప్రవృత్తిని పరిమళింపజేసే పాశ్చాత్య ప్రక్రియా పరిజ్ఞానంతో పరిఢవిల్లింది. ఆంధ్ర సాహిత్య విమర్శ మీద పడిన పాశ్చాత్య ప్రభావంలోని ఈ స్వభావాన్ని తెలిసి అనుశీలించటం ఔచిత్యం, ప్రామాణికం!

తెలుగు సాహిత్యంపై ఇంగ్లీషు ప్రభావం- అన్న అంశం మీద పరిశోధన చేసిన డా॥ కొత్తపల్లి వీరభద్రరావుగా రన్న మాట లిక్కడ సంస్మరణీయాలు-

1. 'కాలగతి ననుసరించి, పాశ్చాత్యులతోడి సంపర్కము, దానివలన వారి భాషా సాహిత్యముల ప్రభావము కూడ మనపై పడినది.'[20]

2. 'ఆంగ్ల సాహిత్యము నందు విదేశ సాహిత్యముల ప్రభావము అనంతముగ కన్పట్టును. అంతమాత్రమున దాని విశిష్టతకు భంగములేనట్లే, మన సాహిత్యముపై ఆంగ్ల సాహిత్య ప్రభావము కన్పించినను, దాని వైశిష్ట్యమున కేమియు లోపము రాదు.'[21]

3. 'ఆంగ్లభాషయొక్క ప్రభావము ఆంధ్రభాషపై మొట్టమొదట పడి, నూతనపదజాలమును కల్పించెను. క్రమక్రమముగా ఆంగ్లసాహిత్య ప్రభావ మాంధ్రసాహిత్యముపై పడినది. ఇది పరిణామరూపమున వచ్చినదే కాని హఠాత్సంభవమైనదికాదు.'[22]

4. 'పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధములో, ప్రప్రథమమున, మన సాహిత్యము పరిణామదశలో నుండెను. అంతకుపూర్వము, సాహిత్యమున ప్రక్రియా వైవిధ్యము కొంత కొరవడి యుండుటచే, పాశ్చాత్యసాహిత్యముల లోని- ముఖ్యముగా ఆంగ్లసాహిత్యములోని- వివిధప్రక్రియలు మన రచయితల నాకర్షించెను. వివిధ రచయితలు, వివిధప్రక్రియలను చేపట్టి, ప్రయోగాత్మకములైన రచనలు సాగించుచు వచ్చిరి. కాని, ఇంచుమించుగా, అన్ని సాహిత్యప్రక్రియలను తెలుగులోనికి ప్రతిభావంతముగతెచ్చిన రచయిత నాటికి లేకుండుటచే; అట్టి ప్రతిభావంతులైన శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు (1848-1919) రంగమున అడుగు పెట్టినంతనే; మన సాహిత్యము పరిణామ దశనుండి ఒక్కసారి, వికాసదశకు వచ్చెను.'[23]

5. (పంతులుగారి సమకాలికులలో) 'ఆంగ్లసాహిత్యస్రవంతిలో దిగిన వారు కొందరు, జలకమాడినవారు కొందరు, తరియించినవారు కొందరు, తీరమున నడచినవారు కొందరు: ఎవ రేది చేసినను, ఆనదీ శీకరముల చలువ కొంతకు కొంత సోకనివారు అరుదే.'[24]

ఈ పరిశోధన ఫలితాంశాలను క్రోడీకరించుకొంటే పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్ధంనుంచీ పాశ్చాత్య ప్రభావం తెలుగు సాహిత్యం మీద ప్రస్ఫుటంగా కనపడుతున్నదనీ, అది సాహిత్య వ్యక్తిత్వానికి అభినవస్ఫూర్తిని సంతరించిందనీ, పాశ్చాత్య ప్రభావంవల్ల దాని వైశిష్ట్యానికి ఎటువంటి లోపమూ కలుగలేదనీ స్పష్టమౌతుంది.

ఇది యిలా ఉండగా 'తెలుగులో సాహిత్య విమర్శ' మీద పరిశోధన ప్రత్యేకంగా చేసి, దాని అవతరణ వికాసాలను సమీక్షించిన డా॥ ఎస్. వి. రామారావుగారి పరిశోధన ఫలితాంశాలు గమనింపతగినవి-'తెలుగు సాహిత్య విమర్శ వికాస మింకను పరిపూర్ణస్థితిని పొందలేదని అవగతమగుచున్నది. అంతేకాక ఇంతదనుక వెలువడిన విమర్శలన్నియు ఉత్కృష్టములు, ఉత్తమములు అని చెప్పుటకు వీలులేదు. ఈ నూరేండ్ల కాలములో వెలువడిన విమర్శనా సాహిత్యమంతయు పురోగతికే దారితీసిన దని చెప్పుటయు పాడి గాదు. వైయక్తిక రాగద్వేషములు, మూఢవిశ్వాసములు, దురభిమానములచే

ప్రేరితములైన విమర్శలు పెక్కు కలవు. పండితులైనవారు సైతము విస్పష్టమైన అవలోకనము లోపించుటచే సాహితీ రంగమున పెక్కు దురభిప్రాయములు వ్యాప్తియగుటకు తోడ్పడిరి. నన్నయ అనగానే వైదిక ధర్మ రక్షణ, సంస్కృతభూయిష్ఠ రచన గుర్తుకు వచ్చుటకు, తిక్కన పేరు చెప్పుట తోడనే తెలుగు పలుకుబడులు, నాటకీయత తలపునకు వచ్చుటకు చర్విత చర్వణములైన పై పండితుల అభిప్రాయములే కారణములు. వానిని మించి, వాని వెనుక దాగియున్న కవితాత్మను లోనారయుటకు ప్రయత్నించినవారు అరుదు. నాటకీయత అనగా నేమియో, ధారాశుద్ధి అనగా ఎట్టిదో స్పష్టమైన అవగాహన, నిర్దిష్టమైన అభిప్రాయము లేకయే ప్రతికావ్యమునందు నాటకీయతను, ప్రతి పద్యమునందు ధారాశుద్ధిని దర్శించుట పరిపాటియై పోయినది. ఇట్లు "ఈ దేశమున సాహిత్య విమర్శ నిరాధారములైన బహువిషయములతో నల్లుకొనిపోవుచున్నది. అప్రమాణములైన బహు సిద్ధాంతములు విమర్శ రూపమున చెప్పబడుచున్నవి. అది భాషకు, సాహిత్య వేత్తలు కాని సామాన్యులైన సాహిత్యాభిమానులకు అపకారము చేయుచున్నది."[25]

"ఇక కావ్యములోతుకు వెళ్లలేక పైపైన మాత్రము స్పృశించి వదలివేయుట కూడ పలువురు విమర్శకులయందు వాడుకగానున్నది.[26] అలంకారములు, వర్ణనలు, పాత్రపోషణము, శైలి మున్నగు అంశములను వేనికవి విభజించి చూపుదురు కాని కావ్యపరమార్థమున కవి యెట్లుపస్కారము లగుచున్నవో విస్మరింతురు. కావ్యసామాన్యమైన ఈ బహిర్లక్షణముల వెనుక వాని కతీతముగా అంతర్లీనమై ఉన్న ఆంతర్యమును వెల్లడించుట విమర్శకుని ప్రధాన కర్తవ్యము. ప్రాచీన - ఆధునిక సాహిత్య భేదములను, భిన్న ప్రక్రియా వైవిధ్యమును గుర్తించకుండ ప్రతికవిని, ప్రతికావ్యమును ఒకే త్రాసులో తూచుటకూడ గర్హణీయము;"

"అద్యతనాంధ్ర సాహిత్యమున తలెత్తుచున్న వివిధ వాదములును నేటి విమర్శనారంగమును కల్లోలమొనర్చుచున్నవి. భారతీయకమ్యూనిస్టు పార్టీలో ఎన్నిచీలికలు పుట్టినవో నేటిసాహితీలోకమునకూడ అన్ని పక్షము లుద్భవించినవి. వ్యక్తి పూజలు, వైయక్తికాభిప్రాయములు పెచ్చుపెరిగి సాహిత్య

విమర్శ స్థానమును దిగజార్చుచున్నవి. తాను మెచ్చినదే రంభ, తాను మునిగినదే గంగ అనుభావము సర్వత్ర గోచరించుచున్నది."[27]

పాశ్చాత్య ప్రభావం తెలుగు సాహిత్య విమర్శమీద పడిందని తెలిసి, దాని బాగోగులను పరిశీలించి చెప్పిన వీరి మాటలు సాహిత్యవిమర్శయొక్క దయనీయస్థితిని మనముందు పెడుతున్నాయి. తగినంత అవగాహన లేకుండా అనువర్తిత విమర్శను సాగిస్తున్న సాహితీవిమర్శకుల సాధారణ లక్షణాలను దృష్టిలో ఉంచుకొని చెప్పిన మాట లివి. వీటిని చదివిన తరువాత మనకు మరొక విషయం కూడా స్పష్టమౌతుంది. ఏమిటంటే- తెలుగుసాహిత్యవిమర్శను మరొక దృక్పథంతో అనుశీలించే అవసరం, అవకాశం ఇంకా ఉన్నదని. తెలుగు విమర్శ అంతా దారీతెన్నూ లేకుండా నడిచింది కాదు. అది నడిచిన విధానాన్ని నవ్యాలోకంతో సమీక్షించాలి; వెలుగుబాటలను వివేచించాలి. ఎదగ వలసి నంతగా సాహిత్య విమర్శ తెలుగులో ఎదగకపోయినా ఎదిగిన వైఖరిని ఎన్నికచేసికొని దానిలోని మన్నికను మననం చేసికోవాలి. ఆంధ్ర సాహిత్య విమర్శను గూర్చిన పునరాలోచనం, దాని వ్యక్తిత్వ వికాసాల పర్యాలోచనం వినూత్న పద్ధతులలో సాగాలి. ఆ ప్రయత్నంలో కూడా పాశ్చాత్య సాహిత్య విమర్శ పద్ధతులలోని ప్రమాణాలను, పరిశీలన విధానాలను గ్రహించి, తగినవిధంగా తెలుగు ప్రక్రియలకు అన్వయించి విలువలను వివేచించాలి.

సాహిత్య విమర్శ స్వరూప స్వభావ వివేచనంలో పాశ్చాత్య ప్రభావ పరిశీలనం పాక్షికమే అవుతుంది. ఏ సాహిత్యంలోనైనా విమర్శగ్రంథాలు ఆయా మనీషులు సాహిత్య తత్త్వాన్ని మథించి వెలికితీసే అమృతభాండాలు. వాటిమీద వివిధ సాహిత్య దర్శనాల ప్రభావం ఉండవచ్చు. అయినా, ప్రభావం వేసిన గ్రంథాల కంటె విశిష్టంగా ఆ గ్రంథాలు స్వీయ వ్యక్తిత్వంతో నిలవాలి. ఆ వ్యక్తిత్వమే వాటిని ఉత్తమ గ్రంథాలుగా సాహితీ క్షేత్రంలో నిలుపుతాయి. ప్రభావం వేసిన గ్రంథాలకంటె ఒకానొక విమర్శ గ్రంథం ఎంత ఉన్నతంగా పెరిగి ఉపజ్ఞను ప్రకటించిం దన్నదే దాని ఉత్తమత్వాన్ని నిర్ణయించే ప్రమాణం।

విమర్శవ్యక్తిత్వానికి పోషకద్రవ్యమే ప్రభావం. పోషకద్రవ్య స్వభావాన్ని బట్టి, పోష్యద్రవ్యస్వభావాన్ని నిర్ణయించవచ్చు. కొన్ని పోషక ద్రవ్యాలు శరీరధాతువులను పోషిస్తాయి; కొన్ని గుణాలను పోషిస్తాయి; కొన్ని ప్రవృత్తులను పోషిస్తాయి; మరికొన్ని ప్రక్రియలనూ, ప్రవర్తనలనూ పోషిస్తాయి. వాటిని శరీరతత్త్వాన్ని బట్టీ, గుణ సంయోజనాన్ని బట్టీ, ప్రవృత్తుల ప్రయోజనాన్ని బట్టీ, ప్రక్రియిల స్వభావాన్ని బట్టీ, ప్రవర్తనల పరమార్థాన్ని బట్టీ ఆరోగ్యదాయకంగా గ్రహించటమే శ్రేయోదాయకం. వాటిని విపరీతంగా వాడితే విషమఫలితా లివ్వవచ్చు. ప్రభావంవలన సాహిత్య విమర్శ ఏపుగా పెరిగినప్పుడు పరమార్థం సాధింపబడుతుంది; వాపుగా పరిణమించినప్పుడు బ్రతుకే భారంగా తోస్తుంది.

రక్తం క్షీణించిన వాడికి సజాతీయగుణాలున్న మరొకరి రక్తం ఎక్కిస్తే బ్రతికి బట్టకట్టి తనపేరుతోనే, తనసౌరుతోనే జీవితాన్ని సాగించగలుగుతాడు. అలాగే ఆంధ్రసాహిత్యవిమర్శకు కూడా పాశ్చాత్యప్రభావమనే రక్తదానం జరిగి, దాని కొక క్రొత్తబ్రతుకు లభించింది. అయితే, ఇక్కడ మరొకవిషయం కూడా గమనించాలి. దానం చేసిన వాడిరక్తం ఎక్కించిన వాడికి సత్తువ నిచ్చినా, ఆ రక్తంలో ఏవైనా అనారోగ్య బీజాలుంటే వాటిని కూడా గ్రహీతకు సంక్రమింపచేస్తుంది. అందువలన ప్రభావంలోని గుణస్వభావం ప్రభావితమైన విమర్శ జీవితానికి కూడా సంక్రమిస్తుంది. కాబట్టి, ప్రభావపరిశీలనమంటే ప్రభావితునిమీద ప్రభావం తెచ్చే మార్పుల అనుశీలనం. మార్పు మనిషినే మారిస్తే అతని మనుగడ నశిస్తుంది; మార్పు జీవితానికి చింతామణిగా రహిస్తే బ్రతుకు బంగారంగా పరిఢవిల్లుతుంది. సాహిత్య విమర్శ జీవితం కూడా అంతే!

ప్రభావ పరిశీలనం రక్తపరీక్షలాంటిది. ఉన్నరక్తం ఎటువంటిదో చూడాలి; ఎక్కించిన రక్తం ఎటువంటిదో పరీక్షించాలి; రెండురక్తాలూ ఒక వ్యక్తిలో ఎలాసంపుటీకరింపబడి ఎటువంటి పరిణామాలను తెచ్చాయో సమీక్షించాలి. అరువు తెచ్చుకొన్న రక్తంతో అనుభోక్త ఎలా శక్తిమంతుడయ్యాడో, ఆశక్తి అతని వ్యక్తిత్వానికి ఎలా వికాసవిస్ఫూర్తిని ప్రసాదించిందో వివేచించాలి. ఒక రక్తం మరోరక్తంలో ప్రవహిస్తుంది; అను

బంధాన్ని పెంచుకొని, తన అస్తిత్వాన్ని అంతర్హితం చేసికొని, క్రొత్త జీవితం సాగిస్తుంది. అయినా, ఎవడూ క్రొత్త రక్తంతోనే కలకాలం జీవించడు; కోలుకోవటానికి క్రొత్తరక్తం కావాలి కాని క్రొత్తజీవితానికి క్రొత్తరక్తం ఒక్కటే చాలదు. 'కొత్తపాతల మేలుకలయికయే' భావికి శ్రీరామరక్ష! అందువలన సాహిత్య విమర్శ ప్రభావంతో ఎంత ప్రాభవాన్ని సాధించిందో పరిశీలించినప్పుడే ప్రభావ పరిశీలనం నిజస్వభావాన్ని నిండుగా ప్రదర్శించేది!

"A critic must not only begin but actually stay 'in medias res' if he is convinced that what books are made into is more important than what they are made out of and the good books are those which outgrow the works they grow out of".[28]

—Harold chernis.

# 3

# యుగాలు - యోగాలు

"Any history of any subject has to begin somewhere- a matter perhaps of some embarrassment. Where it begins will be determined not only by the availability of certain documents but the views of the author concerning the real nature of his subject."[1]

—William K. Wimsatt Jr. and cleanth Brooks.

సాహిత్య చరిత్ర నిర్మాణంలో కాలక్రమాన్ని అనుసరించి యుగాలను విభజించుకొని వివేచించే విధానం ప్రాథమికం. దానివలన చరిత్రగతిలో సాహిత్యం సాధించిన వికాసవిస్తృతులు వ్యక్తమౌతాయి. సాహిత్య ప్రగతిని పరిశీలించటానికి అటువంటి చరిత్రలు ప్రాతిపదికలుగా పనికి వస్తాయి. అయితే, అంతటితో చాలదు. సాహిత్యప్రక్రియల ఉత్పత్తి వికాసాభ్యుదయాలను ప్రమాణబద్ధంగా నిర్మించేయత్నం కూడా సాగాలి. దానివలన సాహిత్యంలో ఏయే ప్రభావాలవలన రచయితలు వివిధ ప్రక్రియలలో ప్రయోగాలను ఏయే విధంగా ఆరంభించి, అభినవదీప్తితో వాటిని నిర్వహించి సాహిత్యవైభవానికీ, వైలక్షణ్యానికీ తోడ్పడ్డారో విలక్షణంగా, విశ్లేషణాత్మకంగా అవగాహనం చేసికోవటానికి వీలౌతుంది.[2] సాహిత్య చరిత్రరచనలోనే ఇది యొక వికాసదశగా విజ్ఞులు పరిగణిస్తారు. అయినా, అంతటితోనే అటువంటి అధ్యయనం ఆగిపోగూడదు. సాహిత్య ప్రయోగాలవెనుక రచయితల సామాజిక, సాహిత్య దర్శనాల, దృక్పథాల, సిద్ధాంతాల

స్వరూపస్వభావాలను వివేచించి విలువలుకట్టే ప్రయత్నం గూడా జరగాలి. దానివలన సాహిత్యంలో ప్రవర్తిల్లిన కళాదర్శనాల కమనీయ పరిణామ వికాసాలు కనులకు కట్టినట్లు స్ఫురింపగలవు. సాహిత్యచరిత్రనిర్మాణంలో దర్శనవివేచనం సాహిత్య జీవలక్షణాన్ని సాక్షాత్కరింపచేసేది. దానివలన సృజనాత్మక ప్రవృత్తియొక్క స్వభావం స్పష్టమౌతుంది. అట్టి ప్రవృత్తి ప్రయోగాలలో జీవితాన్ని నిర్వహిస్తుంది. ప్రయోగవిచారం సాహిత్య జీవితం లోని సృజనాత్మక చైతన్యపు విలువలను వివేచించటానికి వీలుకలిగిస్తుంది. కాలక్రమగతి నాశ్రయించి రచింపబడే చరిత్రలలో ఆ విలువలకు ఆయా కాలాలలో కలిగిన ఆదరగౌరవాలనూ, పరిణామపరిష్కారాలనూ, తిరస్కార పురస్కారాలనూ, తర్జనభర్జలనూ, సోపపత్తికంగా నిరూపించటం జరుగు తుంది. ఇది ఒక విధంగా, సాహిత్యంలోని వాస్తవాల వాస్తవస్థితిగతుల యధార్థకథనం. దీనివలన సాహిత్యపు సాధనస్వభావం తేటపడుతుందికాని, ప్రవృత్తిశీలం ద్యోతమానం కాదు. ప్రవృత్తిశీల వివేచనానికి తోడ్పడేది ప్రక్రియావికాస పర్యాలోచనం.[3] ప్రక్రియలోని సృజనాత్మకశక్తికి ప్రేరకం సాహిత్యదర్శనం. దర్శన విచారం సాహిత్యజీవచైతన్యాన్ని వ్యక్తీకరిస్తుంది. ఈ మూడుదశలలోనూ సాహిత్యచరిత్ర నిర్మాణం జరిగితే సాహిత్యసమగ్ర వ్యక్తిత్వం సహృదయలోకానికి సాక్షాత్కరమిస్తుంది.

పాశ్చాత్య సాహిత్యాలలో చరిత్రనిర్మాణం ఈ మూడంచెల ప్రస్థానాన్ని అనుసరించి ఘంటాపథంగా సాగింది. ఇంగ్లీషు మొదలైన భాష లలో సాహిత్య మెంత వచ్చిందో, సాహిత్య సమాలోచనం అంతకంటె అధికంగా వెలువడింది. కాలక్రమ చరిత్రల రచనం పాశ్చాత్యుల దృష్టిలో సాహిత్యసమాలోచనంలోని కనీసధర్మంగా భావింపబడింది. ప్రక్రియా పరిణామ పరిశీలనం ప్రసిద్ధ మార్గంగా సాగింది; సాహిత్యరంగంలో వెలువడిన కవితాకళాసిద్ధాంతాల విలువలను వివేచించేవిచారం చరిత్రరచనకే చరితార్థంగా సంభావింపబడింది. చరిత్రనిర్మాణంలోని సమగ్రతను సాధించ టానికి పాశ్చాత్యులకు సాహిత్యవిమర్శ ఒక సమర్థవంతమైనసాధ నంగా సహాయపడింది.[4]

పాశ్చాత్య ప్రభావంతోనే తెలుగులో కవులచరిత్రలూ, కవిజీవిత చరిత్రలూ, సాహిత్య - వాఙ్మయ-చరిత్రలూ, ప్రక్రియాపర్యాలోచనలూ మొదలైనవి అడుగుపెట్టాయి; ముందడుగు వేస్తున్నవి. అయితే, అందులోనూ, సాహిత్యచరిత్రలు ముందువచ్చి ప్రక్రియావిచారం పరిశోధనశాఖలో వెలువడుతూ వచ్చాయి. కాని, సాహిత్యవిమర్శశాఖ ఇంకా ప్రాథమికావస్థలోనే ఉంది. అందులోనూ, పాశ్చాత్య ప్రభావం కవిత్వంమీదపడిన వైఖరిని వివేచించినంతగా, సాహిత్యవిమర్శను ప్రభావితం చేసిన పద్ధతినిగూర్చి పరిశీలనంగానీ, పరిశోధనంగానీ చెప్పుకోతగినంతగా సాగలేదు. తెలుగు సాహిత్యవిమర్శ- ఉత్పత్తివికాసాలమీద జరిగిన పరిశోధనం,[5] ఆధునిక సాహిత్య విమర్శలోని సాంప్రదాయికరీతిమీద జరిగిన పరిశోధనం[6] ఈ మార్గంలో కొన్ని త్రోవలు చూపించినా, పాశ్చాత్యప్రభావ పరిశీలనం ఇంకా నిర్దిష్టంగా, నిర్మాణాత్మకంగా తెలుగులో సాగలేదనే చెప్పాలి. అక్కడక్కడా చిన్నచిన్న ప్రయత్నాలు సాగినా, ఆ విధమైన అధ్యయనం ఇంకా ఒక తీరును, తెన్నునూ సంతరించుకోవలసి ఉన్నది. అందువలన సాహిత్యవిమర్శ చరిత్ర శాస్త్రీయపద్ధతులలో నిర్మింపబడవలసిన అవసరాన్ని ఆంధ్రసాహితీలోకం కొంతకాలంగా గుర్తిస్తున్నది.

స్వభావాన్నిబట్టి సాహిత్యవిమర్శ మూడు విధాలుగా ఉంటుందని జార్జి వాట్‌సన్ విభజించాడు. అవి-1. Legislative criticism 2. Theoretical criticism 3. Descriptive criticism. ఈ మూడింటినీ తెలుగులో క్రమంగా 1. కావ్యలక్షణం, 2. కావ్యమీమాంస 3. కావ్యానుశీలనం అని పేర్కొనవచ్చు. ఇక్కడ కావ్యశబ్దం సాహిత్యానికి పర్యాయంగా వాడిందే. కావ్యలక్షణం ప్రధానంగా లక్షణగ్రంథరచనకు సంబంధించింది. అది పఠితలకంటె కవులనే ముఖ్యంగా ఉద్దేశించి రచింపబడే సాహిత్యప్రమాణ ప్రవచనం. అది అనువర్తిత విమర్శకు ఆదర్శసూత్రాల నందించగలదే కాని, అనుశీలన ప్రవృత్తిని ప్రపంచింపదు. కావ్యమీమాంస- లక్షణగ్రంథా లందించే శాశ్వతప్రమాణాలకంటె- ప్రక్రియ కనువైన సాపేక్ష ప్రమాణాలను కావ్యతత్త్వ సమాలోచనంలో సృష్టించుకొనే స్వాతంత్ర్యాన్ని భజిస్తుంది. ఈ రెండిటికంటె ఆధునికమైనదీ, ఆదరణీయమైనదీ కావ్యాను

శీలనం. ఇందులో కావ్యార్థాల సంవిధాన శిల్పౌచిత్య విచారం, కావ్యాంగాల సార్థక్యవివేచనం, కావ్యతత్త్వ సౌందర్యాల సందర్శనం-అనే అంశాలు ప్రధానపాత్ర నిర్వహిస్తాయి. కావ్యానుశీలనంలో ఒక్కొక్క గ్రంథాన్నే ప్రత్యేకంగా గ్రహించి వివేచించటం సామాన్యం. విమర్శకు డీ విమర్శ విధానంలో కావ్యలక్షణాలను రూపొందించటం గాని సిద్ధాంతీకరించటంగాని లక్ష్యంగా పెట్టుకోకుండా కావ్యార్థాలను విశ్లేషించి, వాటిమీద పడిన ప్రభావాలను పసికట్టి, ప్రత్యంశ పరిశీలనాత్మకమైన అనుశీలన విధానాన్ని కొనసాగిస్తాడు.[7] కావ్యలక్షణం సూత్రసంహిత; కావ్యమీమాంస ప్రక్రియాతత్త్వవివేచన ప్రస్థానం; కావ్యానుశీలనం కావ్యకళాసౌందర్య సమాలోచనం.

ఈ మూడు భేదాల సాహిత్య విమర్శ సర్వభాషాసాహిత్యాలలో సామాన్యంగా కనపడుతుంది. తెలుగులో కావ్యలక్షణం కంటె కావ్యమీమాంస ప్రాచీన సాహిత్యయుగాలలో విశేషించి కనపడుతుంది. కావ్యానుశీలనం ముఖ్యంగా అనువర్తిత విమర్శను ఆశ్రయించి సాగేది. తెలుగులో అనువర్తిత సాహిత్య విమర్శకు వీరేశలింగంపంతులుగారి కాలంలోనే పునాదులు వేయటం జరిగింది. ప్రపంచ సాహిత్యాలలోలాగానే తెలుగులో కూడా అనుశాసనప్రవృత్తిప్రధానమైన విమర్శ ప్రాచీనయుగాలలోనూ, అనుశీలనప్రవృత్తిప్రధానమైన విమర్శ ఆధునిక యుగాలలోనూ, ప్రాచుర్యం వహించటం గమనార్హం. తెలుగులో అనువర్తిత విమర్శా విర్భావం (Emergence of applied criticism) పాశ్చాత్య ప్రభావ ఫలితమే.

ప్రాచీనాంధ్ర సాహిత్యంలో అనువర్తిత విమర్శ అసలు లేదని చెప్పటానికి వీలుందా? అని అనుమానం రావచ్చు. ఆయాయుగాల్లో ఎన్నో ప్రక్రియలు వెలిశాయి, అనేక కావ్యాలు వచ్చాయి. వాటిని గూర్చిన పర్యాలోచనం పండిత పరిషత్తులలోగానీ, రాజసభలలోకానీ, గురుకులాలలో గానీ జరుగకుండా ఉంటుందా? సాహిత్యోపాసనం సాగే యే సభ్యసమాజంలోనైనా సాహిత్యానుశీలనం తప్పకుండా ఉంటుంది. కాబట్టి ప్రాచీనసాహిత్య యుగాలలో కూడా అనువర్తిత విమర్శ ఉండియుండవచ్చు ననే విశ్వాసానికి తావున్నది. ఉంటే, అది ప్రధానంగా వాగ్రూపంగా వ్యాపించి ఉండాలి.

ఇప్పటిలాగా ముద్రణయంత్రా లప్పుడు లేవు కాబట్టి అది లిఖితరూపాన్ని ధరించ లేదని చెప్పాలి. అయినా, ఏ ఒక్క కావ్యంలోని ఏ యొక్క అంశాన్నైనా ప్రామాణికంగా సమన్వయించి ప్రపంచించిన విమర్శ ఉంటే, అనువాదరూపాలైన లక్షణగ్రంథాలనుసైతం తాళపత్రప్రతుల్లో భద్రపరుచు కొన్న తెలుగుజాతి దాన్ని తనకడుపులో పదిలంగా దాచుకోలేదా? క్రీ. శ. 1750 ప్రాంతంలో సోమకవి వసుచరిత్రకు వ్రాసిన విద్వజ్జన రంజనీ వ్యాఖ్యవంటి వ్యాఖ్యలు మనకు లభించాయి కాని విద్వద్వరేణ్యుల కావ్య విమర్శలు లభింపకపోవటంలో తాత్పర్యమేమి? వ్యాఖ్యకంటె మరొక సాహిత్య విమర్శ ప్రక్రియ ప్రాచీనులకు తెలియదని భావించటం తొందరపాటేమో? కాని, మరెన్ని ప్రక్రియలలో వారు సాహిత్య విమర్శను సాగించారో చెప్ప టానికి ఆధారాలు లేవు. అందువలన నన్నయనుంచి వీరేశలింగం పంతులు గారి దాకా ఆంధ్రసాహిత్య విమర్శ చరిత్రలో అంధకారయుగ మని చెప్పాలి. అంటే, ఆ యుగంలో విమర్శ లేదని కాదు. వెలుగులోకి రాలేదు; కాలగర్భంలో కలిసిపోయింది. అయితే, విమర్శకు కావలసిన వివేకబీజాలు కావ్యనిక్షిప్తం చేసి పెట్టారు ప్రాచీనాంధ్రకవులు. నన్నయాదులు తమ తమ కృతులలో ఏ లాక్షణిక వేత్తలనూ స్మరించ లేదు. అంతమాత్రాన వారికి కావ్యలక్షణం మీద ప్రమాణబుద్ధి లేదనీ, వారి వారి సాహిత్య ప్రస్థానాలు వారికి లేవనీ చెప్పలేము. సాహిత్య జగత్తులో ఆయాకాలాలలో ఆయా నూత్న కావ్యరచనా ప్రయోగాలు చేస్తూవచ్చిన ప్రాచీనకవులు తమ ప్రయోగాలను అనుశీలించటానికి అనువైన సాపేక్ష ప్రమాణసూత్రాలను అవతారికలలో పొందుపరుస్తూ వచ్చారు.[8] అంటే, మొదటి నుంచీ తెలుగుకవులకు కావ్య లక్షణ విమర్శ కంటె, కావ్యమీమాంసయే మనసుకు నచ్చిన మార్గమన్న మాట! ఈ కావ్యమీమాంసా ప్రవృత్తియే మన ప్రాచీనులు మన కిచ్చిన సాహిత్య విమర్శ దృక్పథం.

ఈ కావ్యమీమాంసాప్రస్థానంలో కవిత్రయయుగం- విమర్శకు సంబంధించినంతవరకు- 'సూత్రయుగంగా' పేర్కొనవచ్చు. నన్నయాదుల కృతులలోని అవతారికలలో కానవచ్చే సాపేక్షప్రమాణాల ప్రసక్తియే ఈ యుగంలో చెప్పుకో తగిన విమర్శ. కావ్య ప్రబంధయుగాలలో కవులు

తమ రచనలలో సాపేక్షసూత్రాలతోపాటు వాటికి వృత్తులవంటి వాక్యాలను కూడా ప్రస్తావించటం కనపడుతుంది. కవులు స్వయంగానో, పాత్రల ముఖం గానో ఈ వృత్తులను కావ్యస్థం చేశారు. అందువలన కావ్యప్రబంధ యుగ కాలం సాహిత్య విమర్శచరిత్రలో వృత్తియుగ మని చెప్పవచ్చును.

కావ్య ప్రబంధయుగాలలోనే తెలుగులో లక్షణగ్రంథ రచనం సాగింది. ఆంధ్రలక్షణ గ్రంథాలలో వినూత్న సాహిత్య సిద్ధాంతాలు ప్రతిపాదించేవి అసలు లేవనే చెప్పాలి. అనువాదాలు బహుళం. తెలుగులో వెలసిన నూత్న ప్రయోగాల లక్షణవివేచనం చేసేప్రవృత్తి వాటిలో మృగ్యం; తెలుగు కవుల సాపేక్ష ప్రమాణాల విమర్శ అందులో మందుకైనా కానరాదు. దేశి ప్రక్రియలలో కొన్నింటి స్వరూపస్వభావాలను నిర్దేశించటానికి ఎడనెడ ప్రయత్నం జరిగినా, అనువర్తిత విమర్శ కది అన్వయాల నందించలేదు. అందువలన కావ్యలక్షణానికి సంబంధించినంతవరకు తెలుగుకు సంస్కృత లక్షణ గ్రంథాలే శరణ్యాలైపోయాయి. ఆంధ్రలక్షణగ్రంథాల ప్రభావం తెలుగు విమర్శమీద గగనకుసుమమైపోయింది. ఆంధ్రకవుల ప్రయోగ వైవిధ్యంలో ప్రపంచింపబడిన ప్రత్యేకత ప్రదర్శితం కాకుండా మిగిలిపోయింది. ప్రయోగాల ప్రవృత్తి తెలిసికొనే ప్రాథమిక సూత్ర పరిజ్ఞానం ప్రాచీన కవులు మన కందించినా వాటిని ప్రస్తరించుకొనే సాహిత్యవిమర్శ అవతరించకపోవటంచేత వీరేశలింగంపంతులుగారికి ముందున్న యుగం అంధకారయుగ మని పేర్కొనటం జరుగుతున్నది. ఆయుగంలోని సాహిత్య విమర్శమీద పాశ్చాత్యప్రభావం లేదు; ఉండటానికి వీల్లేదు కూడా.

పాశ్చాత్య ప్రభావమే తెలుగు సాహిత్య విమర్శకు వెలుగుబాటను చూపించింది. ఆంగ్లభాషా సాహిత్యాధ్యయనాలు భారతీయమేధావులకు క్రొత్త ప్రయోగాలు చేసే తెగువను కల్పించాయి. తెలుగు రచయితలు కూడా ఆంగ్ల సాహిత్య ప్రభావంతో ఉత్తేజితులై నూత్నప్రయోగాలను తెలుగుసాహితికుపాయనాలుగా సమర్పింప సాగారు. ఈ ఉద్యమానికి పితామహకల్పుడు కందుకూరి వీరేశలింగం పంతులుగారు.[9] వారి యుగాన్ని వికాసయుగమని పిలుస్తున్నాను.[10] ఆ వికాసం బహుముఖంగా సాగింది. దానికి కారణం

తెలుగు సాహిత్య విమర్శ ఆ నాటికి సంస్కృతలక్షణ సూత్రాలను అనుసరిస్తూ నిలిచి, కావ్యమీమాంసాపద్ధతిలో సృజనాత్మకతను సాధించలేక పోవటం. ప్రక్రియలూ, ప్రమాణాలూ, అనువర్తిత విమర్శ తెలుగులో లేక పోవటం చేత ప్రగతిశీలాన్ని సాధించలేక స్తంభించి పోవటం. పంతులుగారీ పరిస్థితిని గమనించి పాశ్చాత్యసాహిత్యంలోని ప్రక్రియలను తెలుగులోకి తీసికొని వచ్చి ప్రయోగద్వారాలను తెరచారు.[11] ప్రయోగాల వెంట వాటి ప్రవృత్తినిగూర్చిన పరిజ్ఞానం తెలుగు సాహిత్యంలో ప్రవహింప సాగింది. పాశ్చాత్య సాహిత్య స్వరూప స్వభావ పరిశీలనం ప్రగతికి సాధనంగా మేధావివర్గం గమనించేటట్లు పంతులుగారు చేశారు. సాంఘిక సంస్కరణంలో పంతులుగారు బుద్ధిప్రామాణ్యవాదాన్ని ఎలా ప్రపంచించారో, అలాగే సాహిత్య పునర్వికాసమార్గంలో పాశ్చాత్యులనుంచి అవసరమున్న దానిని అనువుగా గ్రహించటం, ప్రగతిని ప్రసాదించే దాన్ని ప్రయోజనాత్మకంగా పరిగ్రహించటం అవసరమని ఆచరించి చూపించారు. వ్యాసం, ఉపన్యాసం, కవుల చరిత్ర, జీవిత చరిత్ర, స్వీయ చరిత్ర మొదలైన ప్రక్రియలను తెలుగు వాణికి తొలివెలుగు రేకలతో తేటతెల్ల మయ్యేటట్లు ప్రయోగించి, ప్రదర్శించారు. అయితే, ఆయన తెలుగు వారికి అనుకరణం నేర్పలేదు, అనుసరణం నేర్పారు. వ్యక్తి ప్రభావం కంటె సమష్టి ప్రభావాన్ని గ్రహించే మెలకువను చూపించారు. కవిత్రయంవారు అనువాదాన్ని చేపట్టినా కావ్యకళాదీప్తితో అనుసృజనగా భారతాన్ని తీర్చిదిద్దినట్లు పంతులుగారు పాశ్చాత్యప్రక్రియలను నిర్వహించినా తెలుగు స్వభావాన్ని దీపింప జేశారు. పాశ్చాత్యుల ఉద్యమాలను గమనించి ఉత్తేజితులై ఉపజ్ఞతో తెలుగువారి అవసరాల కనుగుణంగా వాటిని అనుశీలించి సృజనాత్మక చైతన్యంతో వాటిని మన సాహిత్యంలోనికి తీసికొని రాగల రాణను ప్రకటించారు. వారి జీవితకాలంలో వారు సాధించిన ఉద్యమశీలం తెలుగువారికి భావిభాగ్యోదయహేతువై నిలిచింది. అందువలననే పంతులుగారు అన్ని సాహిత్యప్రక్రియలతో పాటు సాహిత్య విమర్శకు కూడా పితామహులుగా భావించబడుతున్నారు.

సాహిత్య విమర్శ చరిత్రలో వీరేశలింగం పంతులుగారి యుగాన్ని ప్రకాశయుగ మనీ, ప్రయోగయుగ మనీ పిలువవచ్చును. ఆ కాలంలోనే ముద్రణయంత్రసౌకర్యం ఏర్పడటం, క్రమంగా సాహిత్యపత్రికలు

వెలువడటం, గ్రంథప్రచురణ సాగటం జరిగింది. ఈ యుగచైతన్యానికి అవి ప్రోత్సాహశక్తులుగా నిలిచాయి. వీటికి తోడు సి. పి. బ్రౌన్ వంటి పాశ్చాత్య పండితులు[12] కావించిన భాషాసాహిత్యసేవలు ఈ యుగానికి శాస్త్రీయ పరిజ్ఞాన పటిమనూ, ప్రయోగసాహసాన్నీ అందించాయి. జూలూరి అప్పయ్య, గరిమెళ్ళ వెంకయ్య, పైడిపాటి వెంకటనరుసు, ములుపాక బుచ్చయ్య శాస్త్రి, కావలి సోదరులు, పుల్లంపల్లి మల్లికార్జునశాస్త్రి గారల వంటివారు కావ్యవాఖ్యలకు అక్షరరూపాలను కల్పించారు.

నవ్య సాహిత్య యుగోదయంలో రూపొందిన కొన్ని విమర్శోద్యమాలను గమనిస్తే ఆధునిక సాహిత్య విమర్శ యుగానికి పంతులుగారి యుగంలోనే బలమైన ప్రాతిపదికలు ఎలా పడ్డాయో అవగత మౌతుంది. ఏ సాహిత్య విమర్శకైనా భూమికగా నిలిచేది పరిష్కృత కావ్యపాఠం. దాన్ని సిద్ధంచేసే విమర్శవిధానాన్ని ఇంగ్లీషులో Textual criticism అంటారు. తెలుగులో దీన్ని పాఠపరిష్కార విమర్శ అనవచ్చు. దీనికి రూపం దిద్దిన మనీషి సి. పి. బ్రౌన్. ఆ తరువాత ఆంధ్ర పండితు లెందరో ఆ మార్గాన్ని ఘంటాపథం చేశారు. దీనికి పోషకంగా నిలిచేది కవులచరిత్రనిర్మాణం. దానికి వీరేశలింగం పంతులుగారు ప్రాణప్రతిష్ఠ చేశారు. జయంతి రామయ్య పంతులు వంటివారు ఆ బాటలో నడిచారు. కవిజీవితానికీ, కావ్యరచనకూ ఉన్న సంబంధాన్ని పరిశీలించేది కవిజీవిత సాహిత్య సమన్వయ విమర్శ, (Biographical criticism). ఇందులో కవియొక్క భౌతిక, మానసిక తాత్త్విక విశేషాలను విశ్లేషించి, అవి కావ్యరచన కెలా దోహదాలై నిలిచాయో పరిశీలించే ప్రవృత్తి ప్రధానంగా ఉంటుంది. దీనికి బాసటగా నిలిచేది చారిత్రక విమర్శ (Historical method of criticism). కవికాల నిర్ణయాలు, గ్రంథపౌర్వాపర్య చర్చలు, కవిజన్మస్థల చర్చలు, పూర్వకవుల ప్రభావ పరిశీలనలూ, అనంతర కవుల అనుసరణ వివేచనలూ మొదలైనవి ఈ శాఖకు పందేఫలాలు. దీనికి అనుబంధంగా సాగేది తులనాత్మక విమర్శ (Comparative criticism). ఒక్కొక్క ప్రక్రియలో వెలువడుతున్న కావ్యాల సాహిత్య ప్రమాణాలను నిరూపించటానికి ఈ విమర్శ నికషోపలంగా పనికివస్తుంది. దీనికి సమాంతరంగా సాగేది లాక్షణికవిమర్శ (Judicial criticism). లక్షణగ్రంథాలలో నిర్దేశింపబడిన ప్రమాణాలకు

అనుగుణంగా కావ్యార్థాలను లక్ష్య లక్షణ సమన్వయమార్గంతో విమర్శించే పద్ధతి యిది. దీనివెంట ఖండన మండనలు, శబ్దార్థసాధుత్వ చర్చలూ, తర్క మీమాంసలూ, అలంకార చర్చలూ, మొదలైనవి బయలుదేరి సాహిత్య విమర్శను సిద్ధాంత రాద్ధాంత రంగంగా మార్చివేస్తాయి. ఇవన్నీ కందుకూరి వీరేశలింగం పంతులు యుగంలో పాశ్చాత్య విమర్శోన్యమాల ప్రభావ బలంతో తెలుగుసాహిత్యవిమర్శ ప్రదర్శించిన అభినవక్రీడలు. ఈ యుగ చైతన్యం సాహిత్యవిమర్శ కిచ్చిన వరాలు అయిదు:- 1 పరిశోధన ప్రవృత్తి, 2. చారిత్రకస్పృహ, 3. సాహిత్యచరిత్రనిర్మాణనిష్ఠ, 4. లాక్షణిక విమర్శ దృక్పథం, 5. తులనాత్మక విమర్శ వివేకం. ఇవి సాహిత్య విమర్శకు చేవను కల్పించగలవే కాని, చైతన్యాన్ని ప్రసాదించ లేవు. విమర్శకు చేవ మాత్రమే ఉంటే చాలదు; స్వేచ్ఛతో కూడిన చైతన్యం కూడా కావాలి. అట్టి చైతన్యాన్ని ఆంధ్రసాహిత్య విమర్శకు కల్పించినవాడు కట్టమంచి రామలింగారెడ్డి.

'కళనుగురించి చెప్పేకళ సాహిత్య విమర్శ'[13] అన్నాడు వాల్టర్ పేటర్. ఈ అనుభూతిని సాహితీజగత్తుకు అందించిన ఆధునిక సాహిత్య విమర్శకుడు డా॥ కట్టమంచి. ఆయన సాహిత్య విమర్శలోని అనుశీలన లక్షణాన్ని అభివ్యక్తీకరించాడు. అది ఆనాటికి క్రొత్తప్రయోగం కాబట్టి, కట్టమంచివారు కావ్యానుశీలన యుగాన్ని (Era of evaluative criticism) ప్రవర్తింపచేశారనవచ్చు.

కట్టమంచివారి కవిత్వతత్త్వ విచారం ఆంధ్రవిమర్శలోకానికి ఒక కనువిప్పును కలిగించింది. అంతకుపూర్వం కావ్యాలను విశ్లేషించే విధానం ప్రచారంలో ఉండగా, వారు తమ విమర్శద్వారా కావ్యార్థాలకు విలువలు కట్టే విధానాన్ని తెలుగులో ప్రవేశపెట్టారు. చారిత్రక స్పృహకంటె సాహిత్యమీమాంస స్పృహను విమర్శకు కల్పించారు; పాశ్చాత్య ప్రమాణా లను ప్రాచీనాంధ్ర కావ్యానుశీలనంలో ప్రయోగించి విమర్శ ప్రస్తారాన్ని సాగించారు. ఆ అభినవ దర్శనంలో సజీవ విమర్శ ఆవిర్భవించింది. కావ్యంలో ఆత్మభూతమైన కవితాతత్త్వం కేంద్రంగా కావ్య నిర్మాణాన్ని వివేచించాలన్న వివేకం కట్టమంచివారు తెలుగువిమర్శకు నేర్పారు. అను

శాసనం కంటె అనుశీలనం ఆధునిక విమర్శకు అనువైన పద్ధతియని ఆయన ప్రయోగం స్పష్టం చేసింది.

కట్టమంచివారు తెలుగుకు సృజనాత్మక విమర్శను చవి చూపించారు. తెలుగులో కవిత్వతత్త్వాన్ని గురించి ఆలోచించే అలవాటు చేశారు. ఆయన ఎంతటి ఆంగ్లభాషాపండితుడో అంతటి ఆంధ్రభాషాభిమాని. తెలుగులో మాట్లాడితే పొల్లుకైనా ఇంగ్లీషుపదం దొర్లేది కాదు. ఆయనవిమర్శకూడా ఆ లక్షణాన్ని అలవరుచుకొన్నది. ఆయన తన విమర్శకు ప్రమాణాలన్నీ చాలవరకు ఆంగ్లంనుంచి తెచ్చుకొన్నవే. కాని, అవి అరువు తెచ్చుకున్న ట్లుండవు; విజాతీయాలుగా తోచవు. వారు కావ్యానుశీలనంలో ప్రమాణాలుగా ఉపయోగించే భావనాశక్తి (Imagination), వస్త్వైక్యం (unity of plot) మొదలైనవి విదేశీయాలైనా విశ్వజనీనాలుగా వారివిమర్శలో వెలుగొందాయి. పాశ్చాత్య ప్రమాణాలను విపరించవలసి వచ్చినప్పుడు ఆయన రచనలో లక్షణవాక్యాలు సూక్తుల్లా దొరలుతాయి. కాని, అవి అనువాదాలుగా అని పించవు; లక్షణం కోసమే చెప్పినట్లుండవు. అనుశీలనంలో ఉపకరించే వివేకవీచికల్లా భాసిస్తాయి. అందువలన విమర్శకు శాస్త్రరూపంకంటె కళా రూపం అధికంగా అలవడింది. కళాగౌరవాన్ని పొందిన విమర్శయే సజీవ సాహిత్య విమర్శ.

అనుశీలనంలో ఆత్మాశ్రయధోరణిని సంపాదించటం కట్టమంచి వారి ప్రత్యేకత. ఒక మహాకవి రచనను ఒక విమర్శకుడు చదివినప్పుడు అతనిపై ఆ కావ్యం వేసే ప్రభావాన్ని, అతనిలో కలగించే అనుస్పందనను ఆశ్ర యించుకొని అతడు చేసే కావ్యానుశీలాన్ని ఇంగ్లీషులో Impressionistic criticism అంటారు. తెలుగులో దీన్ని 'అభిరుచి విమర్శ' అనవచ్చును. ఆంగ్లంలో ఆ విమర్శశాఖకు ప్రవర్తకుడైన వాల్టర్ పేటర్ దాని స్వరూప స్వభావాలను వివేచిస్తూ విమర్శకునికి కావ్యానుశీలనంలో నిర్దుష్టమైన సాహిత్య సౌందర్య సిద్ధాంతా లున్నా లేకపోయినా, అతనిదైన ఒకప్రత్యేక స్వభావం, ఒక మనస్తత్వం కొట్టవచ్చినట్లు కనపడుతూఉండాలనీ, అయితే అతడు స్వభావతః సౌందర్య దర్శనంలో తన్మయుడయ్యే సాత్త్విక సహృదయుడై ఉండాలనీ పేర్కొన్నాడు.[14] ఈశాఖలో కవి యెంతటివాడో

విమర్శకుడూ అంతటివాడు కావచ్చు; ఇరువురికీ వారి వారి దృక్పథాలు ఉండవచ్చును. కవియొక్క అభిరుచి విమర్శకుని అభిరుచితో సంవదించకపోతే ఈ విమర్శలో కవి, విమర్శకు గురికావచ్చు. ఎమైనా, విమర్శకుని దృక్పథమే యిందులో పరిమ ప్రమాణం.[15] అందువలన అనుశీలనంలో ఆత్మాశ్రయధోరణి ప్రసరించి అభిరుచివిమర్శ రూపుదిద్దుకోవచ్చును కట్టమంచివారిపట్ల అచ్చంగా జరిగింది కూడా ఇదే.

కట్టమంచి వారిది పాశ్చాత్య దృక్పథం. ఆయన ప్రధానంగా పరిశీలించింది పాశ్చాత్యదృక్పథం లేని ప్రాచీనాంధ్రసాహిత్యం. అయితే, ప్రాచ్య పాశ్చాత్యకావ్యలక్షణాలలో కూడ విశ్వజనీనాలైనవి కొన్ని ఉంటాయి. ప్రక్రియలను బట్టి సాపేక్ష ప్రమాణాలు కొన్ని మారవచ్చు. పురాణాన్నీ, ఇతిహాసాన్నీ, కావ్యాన్నీ, ప్రబంధాన్నీ, భావకవిత్వాన్నీ—అన్నిటినీ ఒకే దృక్పథంతో విమర్శించలేం. కట్టమంచి తనదైన సాహిత్యసంస్కారంతో ప్రాచీనకావ్యాలను, ప్రబంధాలను, అనుశీలించి విలువలు కట్టే ప్రయత్నం చేశాడు. ఆయనకు ప్రమాణాలు పట్టినంతగా ప్రక్రియలు పట్టలేదు. పాశ్చాత్య కావ్యలక్షణ ప్రమాణంతో ప్రాచీనాంధ్రకృతులను ప్రక్రియా వివక్ష లేకుండా అనుశీలించి, గుణదోష విచారం చేశా రాయన. అందువలన కవిత్వ తత్వ విచారం కావ్యానుశీలనంలో అంతర్దృష్టిని ప్రవేశపెట్టినా, ప్రక్రియల ప్రత్యేకప్రతిపత్తిని వివేచించలేక కావ్యతత్త్వానుశీలనంలో విచక్షణత్వాన్ని కోల్పోయింది. అభిరుచివిమర్శస్పర్శవలన కలిగిన ప్రభావమే యిది. అభిరుచి విమర్శ ఆత్మాశ్రయధోరణితో సంవదించటంచేత వినేవారికి వింత రుచులను కలిగిస్తుంది. కాని, విశ్వజనీనతను సర్వత్రా సాధించలేదు.

అనటోల్ ఫ్రాన్స్ (Anatole France) ఈ అభిరుచి విమర్శను 'మహాకావ్యాలమధ్య మానవాత్మ చేసే మహాసాహసయాత్ర' (The adventures of a soul among masterpieces)గా అభివర్ణించాడు.[16] కట్టమంచివారు చేసింది కూడా అదే.

పాశ్చాత్య విమర్శోద్యమాలలో అభిరుచివిమర్శ కున్న ఆత్మాశ్రయ ధోరణులవలన కలిగే అనర్థాలను తొలగించటానికి ఐ. ఏ. రిచర్డ్స్ మొదలగు

విశ్వవిద్యాలయాచార్యులు ప్రస్తరించిన విమర్శపద్ధతి 'Practical criticism'. ఇందులో కావ్యానుశీలనం వస్త్వాశ్రయరీతి (Objective method) ని అనుసరించి వర్తిల్లుతుంది. అందువలన అది విశ్వజనీనతను పొందే వీలుంది. Cox and Dysen మాటలలో[17] —"(Practical criticism) is an opening up of the poem for what it can really be for us: a unique and fascinating experience, carefully wrought by its maker, and fully available only to those with the patience, as well as the sensibility, to recreate. It makes our pleasure more articulate and therefore more meaningful. Emotion is enriched and extended by the exercise of thought." విశ్వనాథ సాహిత్యవిమర్శ యీ లక్ష్యంతో సాగింది; కట్టమంచివారి ఆత్మాశ్రయ ధోరణికి అడ్డుకట్ట వేసింది; వస్త్వాశ్రయపద్ధతి ననుసరించి విశ్వజనీనత కోసం శిల్పమార్గాన్ని ప్రస్తరించింది ఆంగ్లంలోని Practical criticism కు సన్నిహితమైన ధోరణిని తెలుగులో శిల్పానుశీలనంగా విశ్వనాథ మలచికొని, తనయుగాన్ని తాను సృష్టించుకొన్నాడు. ఆధునిక సాహిత్యవిమర్శలో విశ్వనాథవారిది సాహిత్య శిల్ప ప్రస్థానం

కవిచేత ప్రతిభామయంగా శిల్పీకరింపబడిన కావ్యార్థాలను వివేచించి, కావ్య పరమార్థ వ్యంజకాలుగా అవి ఎలా సంవదింపబడినవో నిరూపించే సంయమన సాహిత్య వ్యవసాయం శిల్పసమీక్ష. "కావ్యము శిల్పముతో కూడినది. శిల్పశక్తి తగ్గని యేకావ్యమైనను బహుగ్రాహ్యమే యగును. పాశ్చాత్య మహాకావ్యములు శిల్పభూమ లగుటచేతనే యచ్చటి మత సంప్రదాయాది విషయములు మనవి కాకపోయినను వానిని బహుగ్రహించు చున్నాము. రచయితల కా శిల్పదృష్టి తగ్గనిచో కావ్యము కావ్యమగును. శిల్ప మక్షరమునొద్దనుండి కావ్యమహార్థాంత మనుస్యూత మైన విషయము. ప్రపంచ మెంత యనంతమైనదో ఎంత వివిధమైనదో కవితావిద్య యంత యనంతమైనది; యంత వివిధమైన[18]" దని విశ్వనాథ తన శిల్ప దృష్టిని వివరించాడు.

ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాల కూడలిభూమి, సమన్వయ క్షేత్రం విశ్వనాథవారి శిల్పప్రస్థానం. ప్రాచ్యలాక్షణికుల రసాలంకారధ్వని సంప్రదాయాలను, పాశ్చాత్యుల కథానిర్మాణ, పాత్ర పోషణాది పద్ధతులను కావ్యమహార్థ వ్యంజకాలుగా రచనాంగాలను సమన్వయించేపట్ల విశ్వనాథవారు నిపుణంగా శిల్పప్రస్థావనంలో సార్థకంగా సంవదించి చెప్పారు. ఆధునాత నాంధ్ర సాహిత్య విమర్శక్షేత్రంలో కావ్యశిల్ప సమీక్ష ప్రాణభూతంగా ప్రవర్తిల్లుతున్నది. దానికి కారణం విశ్వనాథవారి శిల్పవిమర్శప్రస్థానం సాహిత్య జగత్తులో పొందిన జనాదరణమే. అది పఠితను విమర్శకుని లాగానే ఆలోచింపచేస్తూ కావ్యానందాన్ని ఆలోచనామృతంగా అనుభవింప జేస్తుంది. కట్టమంచివారి తంబె విశ్వనాథ సాధించిన ముందడుగు ఇది.

సాహిత్యవిమర్శకు సౌందర్యం, తత్త్వం అనేవి రెండు కన్నులు. ఆ నేత్రద్వయంతో అనుశీలనం చేస్తున్నప్పుడు సమీక్షకు నిలిచేవి సౌందర్య తత్త్వం, తత్త్వసౌందర్యం. ఈ రెండూ కావ్యపరమార్థంలో అద్వైతంగా భాసించి, ఏకవాక్యతను భజిస్తాయి. విశ్వనాథ శిల్పప్రస్థానంలో ఈ దర్శనం భాసిస్తుంది. "విమర్శనంలో దర్శనం అంతర్భవిస్తుంది. ఇది తాత్త్వికసత్యం కూడా. విమర్శనం పెద్దవృత్తమైతే దర్శనం దాని కడుపులోని చిన్నవృత్తం. విమర్శకుడు దాన్ని మరింత పెద్దది చేసి చూపుతాడు. అదియే కవియొక్క విరాట్స్వరూపదర్శనం. దానికి పాఠకుడు సంసిద్ధుడై ఉండాలి. అంటే 'అధికారం' సంపాదించి ఉండాలి. పిండితార్థ మేమంటే - విమర్శనం కూడా దర్శనమే".[19] దర్శనం ఉత్తమ విమర్శలక్షణం; వివేచనం మధ్యమ విమర్శ లక్షణం; విశ్లేషణం సామాన్య విమర్శ లక్షణం. గమ్యం తెలిసి చేసిన ప్రస్థానం విశ్వనాథ విమర్శవిధానం.

తెలుగు సాహిత్య విమర్శ ప్రస్థానంలో తన యుగాన్ని కట్టమంచి తరువాత నిర్మించుకొన్న మనీషి విశ్వనాథ. ప్రతికవికి ప్రత్యేక వ్యక్తిత్వం ఉన్నదని ప్రతిపాదించిన ప్రతిభా పక్షపాతి; ఒక్కొక్క ప్రయోగానికి ఒక్కొక్క అనుశీలన విధానం ఉన్నదని వివేచించిన వివేకమూర్తి; శిల్పాను శీలన ప్రక్రియకు ప్రతీకాత్మక విమర్శనూ, తులనాత్మకవృత్తినీ, మానసిక స్వభావ విమర్శనూ, రసవ్యాఖ్యాప్రవృత్తినీ, వర్ణనాత్మక లక్షణ గ్రంథ

నిర్మాణ కౌశలాన్నీ అలవరచి, చేపట్టిన ప్రక్రియకు పరిణత రూపాన్ని కల్పించిన విద్వద్విమర్శకుడు విశ్వనాథ.

తెలుగు సాహిత్య విమర్శమీద పాశ్చాత్యప్రభావం పడిన వైఖరిని సమీక్షించేటప్పు డిక్కడ ఒక విషయాన్ని మాత్రం మరచిపోకూడదు. యుగ కర్తలుగా వెలసిన కట్టమంచి, విశ్వనాథ మొదలైనవారు ప్రత్యక్షంగా ఏ యొక పాశ్చాత్య విమర్శకుని ప్రభావ ప్రవాహంలోనో తలమున్కలుగా మునిగి కొట్టుకొని పోయినవారు కారు. వారి దృక్పథాలమీద పాశ్చాత్య విమర్శకుల సామూహిక ప్రభావం మాత్రమే కనబడుతున్నది. ఆంగ్లవిమర్శ లోని అనువర్తిత ప్రక్రియలో కానవచ్చే అనుశీలన విధానాలను తెలుగు కావ్య విమర్శలో ప్రవేశపెట్టి తమ తమ ప్రయోగాలను నిర్వహించారు. తెలుగు సాహితీ వ్యక్తిత్వానికి వెలుగునిచ్చే విమర్శపద్ధతుల నెన్నుకొనటంలో వారి వ్యక్తిత్వం స్పష్టమౌతున్నది. వారి విమర్శలు తెలుగుదనాన్ని ముమ్మూర్తులా ప్రదర్శిస్తాయి; ప్రవృత్తిలోని పాశ్చాత్య ప్రభావలక్షణాన్ని కూడా దేశీయంగా కనపడేటట్లు ప్రపంచించాయి. వీరి రచనలు తెలుగు విమర్శకుల కొక విలక్షణమైన మార్గాన్ని చూపాయి. పాశ్చాత్య ప్రభావాన్ని ప్రత్యక్షంగా కాక పరోక్షంగా గ్రహిస్తే విమర్శలో తెలుగుదనం వెల్లివిరుస్తుం దన్న సత్యం వ్యక్తమైంది. దీనితో చాలామంది తెలుగు విమర్శకులకు కట్ట మంచి మార్గం, విశ్వనాథమార్గం మార్గదర్శకాలైనాయి. వారిద్దరూ తెలుగు విమర్శకు తెలుగులో ఆలోచించటం నేర్పారు, అది తరువాతి విమర్శకుల జీవనాడిని పట్టుకొన్నది. అందువలన వీరి తరువాత తెలుగు సాహిత్యవిమర్శ ఆంగ్లసాహిత్య విమర్శకుల దృక్పథాలజోలికి అమితంగా పోకుండా, ఆంధ్ర విమర్శకుల అనువర్తిత విమర్శ పద్ధతులనే అనుసరించటం సాగించింది. ఉత్తమప్రభావ లక్షణాన్ని ఉపదేశించిన గౌరవం కట్టమంచికీ, విశ్వనాథకూ దక్కింది.

ఇక్కడ మరొకవిషయం గూడా గమనించాలి. కట్టమంచివారి అనుశీలన విధానంలో ఉన్న ఆత్మాశ్రయధోరణుల మీద తెలుగు విమర్శకులు కొందరు ప్రకటించిన అసంతృప్తిని విశ్వనాథ శిల్పప్రస్థానం తొలగించి సమన్వయ

మార్గాన్ని చూపటంతో తెలుగువిమర్శ ప్రాచీనసాహిత్యాన్ని విమర్శించేటప్పుడు శిల్పమార్గాన్ని ప్రధానంగా అనుసరించింది. కట్టమంచివారి విమర్శ ప్రవృత్తి ఆధునికాంధ్రసాహిత్య ప్రక్రియలను వివేచించటంలో సాపేక్ష ప్రమాణాలను కల్పించుకోవటానికి, సమన్వయాలను సాధించుకోవటానికి అభినవలోచనాన్ని సమర్పించింది.

కావ్యానుశీలన, కావ్యశిల్పానుశీలన ప్రవృత్తుల ప్రభావానికి లొంగని తెలుగు విమర్శకులు, మార్క్సిస్టులను మినహాయిస్తే, తెలుగులో లేరనే చెప్పాలి. అయితే వారు చేసిన ప్రయోగాలలో విశేషమేమిటంటే- తమ తమ సాహిత్యవిమర్శశాఖలలో ఆ ప్రవృత్తులను సంవదించుకొని తమ విమర్శకు వికాసస్ఫూర్తిని కల్పించుకొన్నారు. ఇటువంటి సమన్వయ మార్గానికి రాళ్ళపల్లివారు రాచబాట వేశారు. భావకవిత్వయుగంలోని ప్రయోగాల సమీక్షలో ఈ విధానం వివిధ విమర్శకుల కృషికి వెన్నెముకగా నిలిచింది. నవ్య ప్రక్రియలు వేళ్లూని విస్తరించటానికి కొంతకాలం పట్టినట్లే అభినవప్రక్రియలపై సంపూర్ణావగాహనతో, సహృదయభావంతో వెలువడే విమర్శలు రావటానికీ మరికొంతకాలం పట్టవచ్చును. ఆలోగా కొన్ని విరుపు విమర్శలు, అధిక్షేపాలూ, అవహేళనలూ రావచ్చును. తెలుగులో అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులా విరుపు విమర్శకు నాయకులుగా నిలుస్తారు. అట్టి విమర్శల వలన నవ్యప్రక్రియాపరిజ్ఞానం తెలుగువారికి అందించవలసిన ఆవశ్యకత విమర్శకలోకం గుర్తించి, ఆంగ్లసాహిత్యోద్యమాల స్వరూపస్వభావాలను అధ్యయనం చేసి వాటిని ఆంధ్ర సాహిత్య ప్రక్రియలకు అన్వయించే ప్రయత్నం సాగించింది.వ్యాసాలుగా, గ్రంథ విమర్శలుగా, ప్రక్రియాలక్షణ వివేచనలుగా, సమీక్షలుగా, వాదోపవాదాలుగా, సమన్వయాలుగా-అనేక శాఖల్లో సాగిన యీ విమర్శవివేకం డా॥ సి. నారాయణరెడ్డిగారి 'ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయము-ప్రయోగములు' అనే సిద్ధాంతగ్రంథంలో నాగార్జున సాగరంలా రూపుకట్టింది. ఈ ఉద్యమశీలాన్ని భావిస్తే దీన్ని మన సాహిత్యవిమర్శయుగాలలో సమన్వయయుగంగా సంభావింపవచ్చును.

దీని తరువాత గణింపదగింది పరిశోధనయుగం. శాస్త్రీయదృక్పథంతో సత్యాన్వేషణ చేయటం, సప్రమాణంగా సత్యప్రతిపాదనం చేయటం

పరిశోధనం. పరిశోధనకు అన్వేషణం జీవితం. శాస్త్రపరిశోధనకు ప్రత్యక్ష ప్రమాణం మూలం. కళారంగాలలో జరిగే పరిశోధనకు దర్శన ప్రమాణం మూలం. ప్రత్యక్ష దర్శన ప్రమాణాలురెండూ సత్యనిరూపకాలే. ప్రతిపాదిత సత్యానికి ఆమోదయోగ్యతనూ, అస్తిత్వశక్తినీ కల్పించేవి ప్రమాణాలు. ప్రమాణస్థిరీకరణం పరిశోధనలో ప్రాణభూతమైన అంశం. ఒకరిచేత ఒకసారి ప్రతిపాదింపబడిన సత్యం మరొకరిచేత పునఃపరిశీలింప బడి పరిష్కరింపబడవచ్చును. అట్టి పునఃపరిష్కారంలో ఫలితార్థంగా ప్రతిపాదింప బడే సత్యానికి కూడా శాస్త్రీయప్రమాణాలే ప్రాతిపదికలుగా నిలుస్తాయి. పరిశోధనఫలితం ఒక్కొక్కసారి సార్వకాలికసత్యం కాక పోవచ్చును కాని, ఒక శాస్త్రీయపద్ధతి అన్వేషించిన సత్యం కాక తప్పదు. ఒక పరిశోధన ఫలితాంశం మరొక పరిశోధనవలన పరాస్తమైనా పరిశోధనం నిందాభాజనం కాదు. నిరంతర సత్యాన్వేషణావకాశమే ప్రగతికి లక్షణం. నూత్న పరిష్కృత సత్యప్రతిపాదనానికి పరిశోధనలో గౌరవం ఉంటుంది. గతాన్ని పరిశోధించకుండా గౌరవించి శిరసావహించటం హేతుమూలమైన, తర్కనైజమైనమేధకు సహజలక్షణం గాదు ఎన్నిసార్లు శోధించినా, ఎన్ని విధాల పరిష్కరించినా, ఎన్ని వినూత్న సత్యాలను వెలికితీసినా పరిశోధకులు ప్రతిపాదించేది అభూతకల్పన కాదు; కారాదు. సంగుప్తమై యున్న సత్యానికి పరిశుద్ధతత్త్వమే.[20]

విమర్శ వేదంవంటిదైతే, పరిశోధన వేదాంతమైన ఉపనిషత్తు వంటిది. వేదవిజ్ఞానం లేనిది ఉపనిషద్రహస్యం ఉన్మీలించదు. సాహిత్యపరిశోధనం సాహిత్య సిద్ధాంతదర్శన ప్రతిపాదనరూపంగా ఫలిస్తుంది. దానికి సాధన మైన సాహిత్య విమర్శ దాని సమగ్ర ఫలసిద్ధికి తోడ్పడుతుంది. సాహిత్య విమర్శకు వర్ణనం లేదా వివరణం, విశ్లేషణం, వివేచనం, సమన్వయం, అనుశీలనం-అనేవి సహజధర్మాలు; వీటిలో ఉత్తరోత్తరాలు ఉత్తమాలు. ఇట్టి సాహిత్యవిమర్శను ఆలంబనంగా చేసికొని రూపొందే పరిశోధనం ఆయా విమర్శ లక్షణాలను అన్వయించుకొని అభివ్యక్తం కావచ్చు. ఆ స్వరూపాన్ని ఈ క్రిందిచిత్రంద్వారా తెలిసికొనటం సులభమౌతుంది.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | | | | | సాహిత్య సిద్ధాంత దర్శనం = పరిశోధనం |
| 1/2 | 1/2 | | | | | అనుశీలనాత్మక విమర్శ = పరిశోధనం |
| 1/3 | 1/3 | 1/3 | | | | సమన్వయాత్మక విమర్శ = పరిశోధనం |
| 1/4 | 1/4 | 1/4 | 1/4 | | | వివేచనాత్మక విమర్శ = పరిశోధనం |
| 1/5 | 1/5 | 1/5 | 1/5 | 1/5 | | విశ్లేషణాత్మక విమర్శ = పరిశోధనం |
| 1/6 | 1/6 | 1/6 | 1/6 | 1/6 | 1/6 | వర్ణణాత్మక విమర్శ = పరిశోధనం |

ఒక వినూత్న సాహిత్య సిద్ధాంతదర్శన ప్రతిపాదనం చేస్తేనే అది సాహిత్యపరిశోధన మనబడుతుంది. సిద్ధాంతదర్శన స్పృహతో సాహిత్యపు విలువలను నిగ్గుతేల్చే ప్రవృత్తిని ప్రదర్శిస్తే నిజానికి అనుశీలనాత్మకవిమర్శ అని పిలువవలసియున్నా నేడు విశ్వవిద్యాలయాలలో అనుశీలనాత్మకపరిశోధనగా పరిగణించటం పరిపాటిగా ఉంది. ఇలాగే మిగిలినవికూడా. సిద్ధాంతదర్శన–అనుశీలన ప్రవృత్తులతో సాహిత్యంలో లక్ష్యలక్షణ, అంగాంగ, బహిరంతరాంశ సమన్వయాన్ని విమర్శ సాధిస్తే పరిశోధనగానూ, కావ్యాదులలోని వివిధాంశాలను ఒక క్రమావిష్కరణ పద్ధతితో కార్యకారణ సంబద్ధమైన శిల్పాన్ని అనుసరించి వివేచిస్తే వివేచనాత్మక విమర్శగానూ, విషయాంశవిశ్లేషణ దృష్టి ప్రధానంగా సాగిస్తే విశ్లేషణాంశ పరిశోధనంగానూ, విషయవివరణ ప్రధానంగా నడిపిస్తే వర్ణనాత్మక పరిశోధనంగానూ పేర్కొనవచ్చును. పై చిత్రంలో సూచించినట్లు వర్ణనాత్మక పరిశోధనంలో కూడా సిద్ధాంతదర్శనం కనీసం ఆరవపాలైనా ఉండాలి. మిగిలిన అంశాలతోపాటు వర్ణనప్రవృత్తి దాని స్వభావాన్ని నిర్దేశిస్తుంది. అయితే, వర్ణనమే ప్రధానమై సిద్ధాంత దర్శనాదులు ఉండవలసిన పాళ్లకన్న లోపిస్తే అది పరిశోధన కాదు, విమర్శ కాదు; ఒట్టి సమీక్షయై పోతుంది. ఇలాగే ఈ అంశాన్ని ఆరు విధాలైన పరిశోధనలకూ అన్వయించుకోవాలి.

సాహిత్యంలో నిజమైన పరిశోధనమంటే సాహిత్య సిద్ధాంత దర్శనమే. దానిని ప్రతిపాదించే సిద్ధాంతవ్యాసం సంగ్రహంగా, సారవంతంగా, సూత్రప్రాయంగా, శాస్త్రదర్శనంగా, తత్త్వసుందరంగా ఉంటుంది. అయితే, ఆధునిక సాహిత్య విమర్శకులు పరిశోధనలో అనుశీలనానికికూడా సమస్థానాన్నివ్వాలని భావిస్తున్నారు. ఇది ప్రపంచవ్యాప్తంగా ఉన్న ఆమోదముద్ర. అందువలన విశ్వవిద్యాలయాలలో అనుశీలనాత్మక (విమర్శ) పరిశోధనలే నేడు (అంటే 20వ శతాబ్దంలో) ఉత్తమశ్రేణికి సంబంధించినవిగా పరిగణింపబడుతున్నవి. అనుశీలనంలో సిద్ధాంతదర్శనాన్ని సంపదించటం, కావ్యకళకు విలువకట్టటం జరుగుతున్నది. దీనినే తెలుగువారు పరిశోధనలో శిల్పమార్గమని వివేచిస్తున్నారు.

సాహిత్యపరిశోధనలలో ఉత్తమ మధ్యమాధమ భేదాలను పరిగణింపవలసివస్తే పైన పేర్కొన్న ఆరువిధాలలో క్రమంగా మూడు జంటలను ఎన్నుకోవచ్చును. మొదటి రెండూ ఉత్తమశ్రేణికి చెందినవి; సమన్వయ వివేచనాత్మకాలు మధ్యమాలు; విశ్లేషణ వర్ణనాత్మకాలు అధమశ్రేణికి చెందినవి.

సాహిత్య విమర్శతో సాహిత్యపరిశోధన కున్న అవినాభావసంబంధాన్ని భావిస్తే - పరిశోధనలోకూడా సృజనాత్మక పరిశోధన అనేది ఉన్నదని స్పష్టమౌతుంది. ఏ పరిశోధన ఒక వినూత్న సాహిత్య సిద్ధాంతదర్శనాన్ని ప్రసాదించి, సాహిత్యానుశీలనానికి క్రొత్తబాటలు చూపించి, తన ప్రభావాన్ని సృజనవ్యాపారం మీదకూడా ప్రసరింపచేయగలుగుతుందో దానిని సృజనాత్మక పరిశోధన అని పేర్కొనవచ్చును. తెలుగులో సృజనాత్మక విమర్శయే పరిమితం; సృజనాత్మక పరిశోధన స్వల్పం. ఈ కోవకు చెందిన సిద్ధాంత వ్యాసాలను వేళ్ళమీద లెక్కపెట్టవచ్చునేమో!

సాహిత్య పరిశోధనలలో ప్రధానంగా రెండు శాఖలు కనబడుతున్నాయి. అవి; సాహిత్యపరిశోధన, భాషాపరిశోధన ఈ రెండింటిలో ఒకటి దర్శన ప్రధానమైనది; మరొకటి శాస్త్రప్రధానమైనది. అందువలన గ్రంథ-కావ్యపాఠ-పరిష్కరణ విధానం, నిఘంటు నిర్మాణం, శబ్దార్థ శాస్త్రార్థ చర్చలు, భాషోత్పత్తి వికాస పరిణామ పరిశీలనం, నవీన భాషాశాస్త్ర (Linguistics) ప్రయోగ ప్రక్రియలూ,—మొదలైనవి భాషాసంబంధులైన

పరిశోధనలు. సాహిత్య సిద్ధాంత దర్శనం వీటికి ధ్యేయం కాదు. అందు వలన విశ్వవిద్యాలయాలలో కానీ, పరిశోధనసంస్థలలోగానీ జరిగే భాషావిషయక పరిశోధనలన్నీ సాహిత్యపరిశోధనలకంటె స్వరూపస్వభావాలచేత భిన్నము లుం కావటంచేత ప్రత్యేకంగా పరిగణింపదగినవి.

తెలుగు సాహిత్యంలో వెలువడుతున్న సిద్ధాంతవ్యాసాలు పరిమాణంలో బండ్లకెత్తేటట్లుంటా యని ఒక అపప్రథ ఉంది. దానికి కారణం ఎక్కువ మంది ఎన్నుకొంటున్న పరిశోధనాంశాలు విశ్లేషణాత్మక, వర్ణనాత్మక పరి శోధనశాఖకు సంబంధించినవి కావటం వల్లనే. ఇవి ప్రధానంగా విషయ సేకరణకు పనికివచ్చినంతగా తత్త్వానుశీలనానికి దోహదాలు కావు. అట్లని వాటి ఉపయోగాన్ని కాదనటానికి వీలులేదు. సాహిత్యంలో పరిశోధనకు విమర్శ పూర్వరంగాన్ని సిద్ధంచేయాలి. మనదేశంలో విమర్శాంగాలే పరిశోధన భేదాలుగా పరిగణింప బడటంతో ఏది పరిశోధనయో, ఏది విమర్శయో వివేచింప లేకపోతున్నాము. అందువలన సిద్ధాంతవ్యాస స్వరూప స్వభావాలను విశ్వవిద్యాలయాలు గాఢంగా వివేచించి పరిశోధనలు సాగిస్తే ఈ ప్రమాదం దూరం కావటానికి వీలుంది. దీనికి ముందుగా- ఇంతవరకూ వచ్చిన సిద్ధాంత వ్యాసాలను ఒకపరిశోధకసంఘం సమీక్షించి, ప్రమాణాలను పరిశీలించి, సాహిత్య భాషారంగాలలో ప్రామాణిక పరిశోధనలను రూపొందించే మార్గాలనూ, ప్రణాళికలనూ, ఆదర్శసూత్రాలనూ, ఆచరణవిధానాలనూ నిర్ణయించ వలసిన అవసరం ఉంది.

పాశ్చాత్య పరిశోధనకు సంబంధించిన విధాయక సూత్రాల (Methodology) ప్రభావం తెలుగు పరిశోధనలమీద స్థూలంగా కనపడు తున్నా, అది ఉండవలసినంతగా లేదని విమర్శకులు భావిస్తున్నారు. దానికి కారణం విశ్వవిద్యాలయాలలో పాశ్చాత్య పరిశోధన విధాయక సూత్రాల అధ్యయనాధ్యాపనాలు గాఢంగా చిత్తశుద్ధితో జరగకపోవటమే. సిద్ధాంత గ్రంథ నిర్మాణానికి సంబంధించిన నియమాలు కొన్ని పరిశోధకులు పాటిస్తున్నా, సాహిత్య సిద్ధాంతాల ప్రతిపాదనానికి సంబంధించిన శాస్త్రీయ విజ్ఞానం విశ్వవిద్యాలయాలలో తెలుగు పరిశోధకుల కింకా బాగా ఒంటపట్టలేదు. ఇది ఇలా ఉండగా, పాశ్చాత్యదేశాలలో ఒక్కొక్క ప్రక్రియకూ ఒక్కొక్క

విధాయక సూత్రపద్ధతి ఉంటుందనీ, పరిశోధన కెన్నుకొన్న సమస్యనుబట్టి దాన్ని సాపేక్షప్రమాణాలతో రూపొందించుకోవాలనీ భావించి పరిశోధన విజ్ఞానంలో అత్యంత ఆధునిక మార్గాలను అన్వేషించేయత్నం అవిచ్ఛిన్నంగా సాగుతున్నది. తెలుగువా రింకా ఆ పరుగును అందుకోవటానికి మరోదశాబ్దం పట్టినా ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు.

సాహిత్య పరిశోధనలో - వివిధశాస్త్రాలలో అనుసరింపబడుతున్న విధానాలను చొప్పించి ప్రయోగాలు నిర్వహించాలనీ, సామాజిక, ఆర్థిక, తాత్త్విక శాస్త్ర సిద్ధాంతాలనూ, దర్శనాలనూ సాహిత్యానుశీలనానికి సాధనాలుగా అనుసంధించుకోవాలనీ ప్రయత్నాలు ఆధునికంగా సాగుతున్నాయి. ఇవికూడా పాశ్చాత్య ప్రభావంవలన తెలుగు పరిశోధన అలవరచుకొన్న లక్షణాలే. ఇవి పరిశోధన విధానాల విస్తృతికి తోడ్పడుతున్నాయి. కాని. ఆ విధానాలను విశ్లేషణకు ఉపయోగించుకొన్నంతగా పరిశోధకులు సిద్ధాంతదర్శనానికి ఊతగా గ్రహించటం లేదు. పైన పేర్కొన్న సిద్ధాంతాలు కానీ, దర్శనాలుకానీ, సాహిత్య సంబంధులు కావు. వాటిలో కొన్ని సాహిత్యాన్ని ఒక దృక్పథంతో అనుశీలించటానికి తోడుపడేవే. ఉదాహరణకు మార్క్సిస్టు దృక్పథం ప్రధానంగా సామాజిక దర్శనం. దాన్ని సాహిత్యానికి అనువర్తింపచేస్తే సాహిత్యంలో ప్రతిబింబించిన మార్క్సిస్టు దృక్పథాన్ని సమీక్షించటమే అవుతుంది. కాని, సాహిత్య సిద్ధాంత దర్శనం కాదు. అలాగే ఇతర దర్శనాలు కూడా.

రచయితలకు సామాజిక దృక్పథం ఉండవచ్చును. కాని, దానిని వారు సాహిత్య ప్రయోగాలలో నిర్వహిస్తున్నప్పుడు సాహిత్యదర్శనంగా సంసృష్టి చేయగలిగిన సామర్థ్యం కలిగియుండాలి. మార్క్సిస్టు దృక్పథం కల రచయితలు కూడా తాము సృష్టించే రచనలలో తమ దృక్పథాన్ని సాహిత్యవ్యక్తిత్వంగల దర్శనంగా ఆవిష్కరించాలి. అలా చేయలేనినాడు ఆ రచయితల రచనలపై పరిశోధనచేసేవారు వారి రచనలలో సిద్ధాంత దర్శనం చేయలేరు. మార్క్సిస్టు సాహిత్యంలో పరిశోధనవలన తేలవలసింది ఆ సామాజిక సిద్ధాంతాన్ని ఎలా రచనలో రచయిత చిత్రించాడనే కాదు; ఆ సిద్ధాంతాన్ని జీర్ణించుకొని రచయిత ఎటువంటి వినూత్న సాహిత్య దర్శనాన్ని లోకానికి ఇస్తున్నాడన్నదే. ప్రపంచ

ప్రఖ్యాత విమర్శకు లీవిషయంలో ఎన్నోమధనలు పడ్డారు. సాహిత్యేతరమైన దర్శనం సాహిత్యంలో ప్రతిబింబిస్తున్నప్పుడు దానికి సాహిత్యతత్త్వరూప మైన సిద్ధాంత కల్పనం జరుగకపోతే అది సాహిత్యానికి ఆకృతిని కలుస్తుందే కాని, ఆత్మనుప్రసాదింపలేదని విజ్ఞులు వివేచిస్తున్నారు. నేటిసాహిత్యంలో ఏది తత్త్వం,ఏది ప్రకృతి, ఏది ఆకృతి, ఏది అనుకృతి- అన్న అంశాలపై స్పష్టమైన తెలివిడి ఏర్పడినప్పుడే పరిశోధనప్రవృత్తి పరిశుద్ధంగా ప్రకటిత మౌతుంది.

విశ్వవిద్యాలయ పరిశోధనలలో 'స్పెషలైజేషన్' ఆధునిక ప్రవృత్తిగా గణింపబడుతున్నది. అది సూక్ష్మాంశకేంద్రీకరణ దృష్టికి దారి తీస్తున్నది. ఈ మార్గంలో పరిశోధనలు నిర్వహిస్తున్నవారికి సమగ్రసాహిత్య స్పృహ కొరవడుతున్నది. సాహిత్యపరిశోధకుడు సర్వజ్ఞుడు కాకపోయినా సాహిత్య తత్త్వాన్ని అవగాహనం చేసికొన్న సమన్వయవ్యక్తిత్వం కలవాడుగా ఉండాలి. అంగాంగ పరిజ్ఞానం అంగిని విస్మరించరాదు. తాను చేపట్టినదే సర్వస్వం, తనకు తెలిసిందే పరమార్థం అనే పరిచ్ఛిన్నధోరణి పరిశోధనలో వర్ధిల్లటం మంచిదికాదు. పరిశోధనపరమార్థం తెలియకుండా పరిశోధనచేయటం ఎంత లోపమో, సాహిత్య వ్యక్తిత్వం అవగాహన కాకుండా అంగాంగ పరిశోధనం చేయటం కూడా అంతదోషమే. అట్టిది ప్రయత్నపూర్వకంగానైనా పరిహ రించుకోవలసిన జాడ్యం.

భాషాసాహిత్య పరిశోధనలలో – భాషాపరిశోధనం శాస్త్రప్రకృతి కాబట్టి, భౌతికప్రమాణమూలం కాబట్టి, శాస్త్రీయంగా సత్యాన్వేషణం చేస్తున్న విధానాన్ని స్పష్టంగా వెలారుస్తున్నది. దానితో పోల్చిచూస్తే సాహిత్య పరి శోధనం-దర్శనమూలం కావటంచేత–శాస్త్రీయమని కొందరికి అనిపించటం లేదు. ఇటువంటి దృక్పథం ప్రాచీనకాలంలో కూడా ఉండేది. వ్యాకరణ తర్క మీమాంసాది శాస్త్రవేత్తలు సాహిత్యదర్శనాన్ని శాస్త్రంగా చాలకాలం అంగీక రించలేదు. దానికి కారణం సాహిత్యదర్శనాని కున్న ప్రత్యేకప్రతిపత్తిని గుర్తించలేకపోవటమే. ప్రతిభాషాశాస్త్రవేత్తా, వ్యాకరణశాస్త్రవేత్తా, సాంఘిక శాస్త్రవేత్తా, తత్త్వశాస్త్రవేత్తా, రాజకీయ వేత్తా సాహిత్య పరిశోధకుడు కాలేడు. వారి ప్రమాణాలను సాహిత్య విమర్శకు కొలబద్దలుగా ప్రయోగింపరాదు.

దర్శనదృక్పథం లేకపోతే సాహిత్యవిమర్శ ప్రశంసాపత్రంగానో, ఆత్మాశ్రయ విమర్శగానో, లేక లోకాభిరామాయణంగానో, హరికథా కాలక్షేపం లాగానో, కలగూర గంపల సంకలనం లాగానో భాసించే ప్రమాదం ఉంది. సాహిత్యాన్ని నిర్మించటానికి ఎంతటి సృజనాత్మక శక్తి ఉండాలనో సాహిత్య దర్శనం చేయటానికీ అంతటి విమర్శశక్తి ఉండాలి; సిద్ధాంత ప్రతిపాదనానికీ అంతటి పరిశోధనపాటవం ఉండాలి.

సాహిత్య పరిశోధనం ఆధునిక సాహిత్యోద్యమాలలో ఒకటి. దానిని నిర్వహించే సంస్థలలో విశ్వవిద్యాలయాలు ముందంజ వేస్తున్నవి. కాని, ప్రయోజనంకోసం ప్రమాణాలను కోల్పోకుండా, విస్తృతి కోసం వివేకాన్ని వదలకుండా, పరుగులో పరమార్థాన్ని విస్మరించకుండా, ప్రగతిలో ప్రామాణికత్వాన్ని పరిరక్షించుకొనే బాధ్యత వాటిమీద ఎల్లప్పుడూ ఉంది.

సాహిత్య పరిశోధనం పాశ్చాత్య విశ్వవిద్యాలయాలలోనూ జరుగుతున్నది. పరిశోధకులకు 'డాక్టరాఫ్ ఫిలాసఫీ' Ph.D., డిగ్రీలు వస్తున్నాయి. కానీ, అన్నీ ఉండవలసినంత ప్రమాణాల్లో ఉండటంలేదని పాశ్చాత్యుల సమీక్షలే చెపుతున్నవి-ఈ క్రింది అభిప్రాయాలను[21] గమనిస్తే ఆ యథార్థం బయటపడుతుంది.

"I am thinking of unfortunate scholars in foreign universities who cannot hold down their jobs unless they repeatedly publish articles, each of which must say, seem to say, something new about some literary work".

—C. S. Lewis

"Very many of scores of theses produced each year at the various universities of the world are totally pointless"

—Aldus Huxley

"Most of these are written for the sake of the degree to which they lead and not because the author has something new he wants to say".

—The Times

"True scholarship is incommunicable, true scholars rare"

—E.M. Forster

"And this is one reason why, though the universities be full of men, they are often empty of learning"

—Sir Thomas Browne

"It is an evil that these futi'e exercises should be published. The real evil is that they should be written at all".

—J. D. Baird

"A thesis written to satify an academic requirement, not to instruct the world of letters. The investigation need not be published, of course, normally it should not be"

—Bateson

"Ph. D., is one of the most conspicuous evils of American universities"

—Francis M. Kelly

"Ph. D., means casting idiotic thoughts into ugly sentences, acquiring bad-habits of writing and thinking, mastering a certain atrocious style characterized by insincerity, formalism and Prolixity in which the desiccated and pretentious Ph.D., thesis written"

—Forely Clinton

"Most modern scholarship is Index-scholarship based on a study of prefaces, indices, and reviews; superficiality is its synonym"

E. C. C. P. P. 638.

ఈ వ్యాఖ్యలను చదివి, ఎవరో కొంతమంది కలిసి గూడుపుఠాణి చేసి మేక పిల్లను కుక్క పిల్లగా నమ్మించేటట్లు ప్రయత్నిస్తున్నా రని మనం

భ్రమపడవలసిన అవసరముండదనుకుంటాను. గంపెడు పూసల్లో దోసెడు రత్నాలు ఉండవని ఈ వ్యాఖ్యలు చెప్పటంలేదు. అయితే, డిగ్రీలకోసం పుంఖానుపుంఖంగా వస్తున్న సిద్ధాంతవ్యాసాలన్నిట్లో ప్రమాణాలుండటం కష్టమన్న విషయాన్ని పై వ్యాఖ్యలు స్పష్టంచేస్తున్నాయి. మంచి యెక్కువైతే మజ్జిగ పల్చబడే పైఖరి పాశ్చాత్య విశ్వవిద్యాలయాలలోనే కనపడు తుంటే - ఇక భారతీయ విశ్వవిద్యాలయాల సంగతి వేరే చెప్పాలనా? "In matters of aesthetics England is said to adopt what France discards : America adopts what England discards; and India adopts what even America discards and never discards."[22] అన్న ఆచార్య కె. విశ్వనాథం గారి మాటలు గమనించాలి. వా రిచ్చిన ఈ క్రింది సలహాను పాటించాలి. "We are a mature nation and the descendants of Panini and Anandavardhana need not borrow criteria of scholarship from nations of yesterday. Scholarship is slow-maturing and is not the magic mango sapling that bears fruit in a few minutes."[23] పాశ్చాత్య సాహిత్య పరిశోధన పతనావస్థ ప్రభావమా నేటి మన పరిశోధన స్థితి?

విశ్వవిద్యాలయాలలలో పరిశోధన ప్రచారంలో ఉంటే, బయటి సాహితీ లోకంలో సమీక్ష సర్వసాధారణ విమర్శ ప్రక్రియగా చెలామణి అవుతున్నది. దాదా పొక దశాబ్దంపైబడి వస్తున్న సాహిత్య విమర్శనంతా స్థూలంగా 'సమీక్ష' అని చెప్పవచ్చును. అందువలన సమకాలీన సాహిత్య విమర్శయుగాన్ని సమీక్షాయుగ మని అనటం న్యాయం.

ఇంగ్లీషులో 'రెవ్యూ' అనే మాటకు సమానార్థకంగా తెలుగులో 'సమీక్ష' అని అంటున్నాం. 'వ్యూ' అంటే దృక్పథం. 'రెవ్యూ' అంటే ఒక రచయిత దృక్పథాన్ని ఒక విమర్శకుడు తన దృక్పథంతో అనుశీలించటం. రచయిత ఒక దృక్పథంతో ఒక రచన చేస్తాడు; విమర్శకుడు రచయిత దృక్పథాన్నే గ్రహించి ఆ దృక్పథంతో ఆ రచన ఎంతవరకు ప్రామాణికంగా సాగిందని వివేచించటం రెవ్యూలో ఒక అంశం. రచయిత దృక్పథాన్నే గ్రహించి అందులోని బాగోగులను చర్చించి గుణదోష నిరూపణ చేయటం మరొక అంశం. రచయితదృక్పథాన్ని- ప్రామాణికమని తాను విశ్వసిస్తున్న

దృక్పథంతో విమర్శకుడు విమర్శించి ఖండన మండనాలను నిర్వహించటం మరొక అంశం. ఒక దృక్పథంలోని లోటుపాట్లు తెలిసిన తరువాత దానిని పునరాలోచించి, పునర్నిర్మాణం చేయటం కూడా మరొక అంశమౌతుంది. రెవ్యూ ఇన్ని విధాలుగా చేయటానికి వీలున్నా. ఆ చేయటం విమర్శకుని కౌశలంపైననే, సామర్థ్యం మీదనే ఆధారపడిఉంటుంది. విమర్శకుడో-లేదా-సమీక్షకుడో స్వతంత్ర దృక్పథం ఏర్పరచుకోలేనివాడైతే రచయిత దృక్పథం వెంటనే పయనిస్తాడు; దృక్పథమే లేనివాడైతే రచయితదృక్పథాన్ని గమనించకుండానే తిట్లకో, దీవనలకో పూనుకొంటాడు. అసలు రచయితకే నిశ్చితమైన దృక్పథం లేకపోతే అతని రచన విదూషకుని వినోద ప్రహసనంలా ఉండక తప్పదు. సమీక్ష అప్పుడు చమత్కారాలకు చప్పట్లుకొట్టే వినోదమైనా అవుతుంది; నిలవదీసి నిజం చెప్పే మంపలింపైనా అవుతుంది. ఈ రకమైన ప్రవృత్తులు విమర్శ విలాసాలుగా నేడు పరిగణింపబడుతున్నాయి.

ఒక్కొక్క భాషలో పుట్టే పారిభాషికపదాల వెనుక ఆ భాషా సాహిత్య ప్రవృత్తుల ప్రభావం బలంగా ఉంటుంది. ఆ పారిభాషికపదాలు మరొక భాషలోకి తర్జుమా అయి ప్రవర్తిల్లేటప్పుడు ఆ భాషాసాహిత్య సంస్కారం కూడా దానిమీద పనిచేస్తుంది. 'రెవ్యూ' అనే పదం తెలుగులో 'సమీక్ష'గా వ్యవహరించబడుతున్నప్పుడు చాలమంది తెలుగువిమర్శకులు పాశ్చాత్య లక్షణాన్ని గాక దేశీయంగా దాని స్వరూప స్వభావాన్ని సంభావించటం పరిపాటి అయిపోయింది. 'సమ్యక్ ఈక్ష సమీక్ష' అని అంటారు దేశీయ పండితులు. దానివలన రచనలో రచయిత వర్ణించే వివిధాంశాల సమన్వయాన్ని సహృదయబుద్ధితో వివరించిచెప్పటమే సమీక్ష అని చాలమంది భావించి దానికనుగుణంగా సమీక్షలు చేస్తున్నారు. వాటిలో ముఖ్యంగా కనబడేది 'అప్రీసియేషన్'నో లేదా 'డిప్రీసియేషన్'నో—తెలుగులో చెప్పుకొంటే ప్రశంసనమో, అభిశంసనమో. ఒక్కమాటలో చెప్పాలంటే—పాశ్చాత్యప్రక్రియా విజ్ఞానం గల సమీక్షకుడు నేడు చేస్తున్నది రెవ్యూను స్మరింపచేసే సమీక్ష; దేశీయ సంస్కారంతో చేస్తున్నది సమీక్షపేరుతో సాగుతున్న ప్రశంస. సమీక్షకు లక్షణం చెప్పి తెలుగులో అనువర్తన విధానాన్ని వివరించే వి..ర్శ లేదు. అందువలన తెలుగువారి సంస్కారబలంతోనే తన తీరుతెన్నులను దిద్దితీర్చుకొంటూ సమీక్ష ముందుకు సాగుతున్నది.

తెలుగు సాహిత్య విమర్శలో సమీక్షాయుగం ప్రవర్తిల్లటానికి బలమైన కారణం సాహిత్యం సామాన్యుల కందుబాటులో ఉండాలన్న ప్రజాస్వామ్య యుగ చైతన్యం. ప్రతి పౌరుడూ అక్షరాస్యుడై ఉండేటట్లు యత్నించటం నాగరక ప్రభుత్వాల విద్యావిషయక లక్ష్యం. భారత ప్రభుత్వంకూడా స్వతంత్రం వచ్చినతరువాత ఈ లక్ష్యాన్ని ప్రణాళికాముఖంగా సాధించటానికి యత్నిస్తూనే ఉంది. అనేక కారణాలవల్ల అది మందంగానే ముందుకు సాగుతున్నది. అయినా, అక్షరాస్యులైనంతమాత్రాన అందరూ సాహిత్య రసికులౌతారని చెప్పలేము; సాహిత్యమే సమాజాన్ని ఉద్ధరిస్తుందనీ ప్రభుత్వం భావించటమూ లేదు. అయితే, ప్రభుత్వ ప్రణాళికలు ప్రజలలో ప్రచారం కావటానికి సాహిత్యంకూడా ఒక సాధనంగా పనికిరావాలనీ ప్రజలూ, ప్రభుత్వమూ భావిస్తున్నారు. ప్రచారానికి కళాప్రయోగాలూ, ప్రచార వాహికలూ పనికివచ్చినా, అందులో సాహిత్యవిమర్శ నిర్వహించే పాత్ర అత్యంత స్వల్పమని అందరికీ తెలుసు. ఆట, పాట, మాట ప్రచారంలో ప్రధానపాత్రలు నిర్వహిస్తాయి. ఆటలో నాటకాలూ, నృత్యాలూ, చలనచిత్రాలూ, రూపక ప్రక్రియలూ తోడ్పడతాయి; పాటలో సంగీత, గేయ, కవిత్వాలు సహకరిస్తాయి. మాటలో పత్రికలూ, ప్రకటనలూ, ఉపన్యాసాలూ, విమర్శలూ, వివిధ వాఙ్మయప్రక్రియలూ ఉపయోగిస్తాయి మాట ప్రసరించే ప్రక్రియలలో పత్రికలకు అగ్రతాంబూలం అందుతుంది. పౌరులకూ, ప్రపంచానికీ మధ్య వారధులు పత్రికలే. లోకవార్తాకథనం పత్రికల ప్రథమ ధర్మమైనా, సమాజప్రవృత్తిని సవ్యమైన మార్గంలో నడపించే విమర్శవివేకాన్ని లోకాని కందించే విశిష్టధర్మంకూడా పత్రికాప్రపంచాని కుంది. తెలుగుపత్రికలు తమ ధర్మాన్ని మొదటినుంచీ బాధ్యతతో నిర్వహిస్తూనే ఉన్నాయి. దిన వార పక్ష పత్రికలు సారస్వతానుబంధాలద్వారా సాహిత్యవిమర్శకు దోహదం చేస్తున్నాయి. సాహిత్యపత్రికలు తెలుగు విమర్శోద్యమాలకు బాసటగా నిలిచి, వాటికి ప్రజలలో ఆదరగౌరవాలు కలిగించాయి. తెలుగుదేశంలో సాహిత్య విమర్శకు ప్రాధాన్యమిచ్చే పత్రికలకు ప్రచారప్రోత్సాహాలు, స్థిరజీవితంతో కలకాలం కొనసాగే స్థితిగతులు లభించకపోవటం విచారం. సాహిత్య విమర్శపట్ల నేటి సమాజం చూపిస్తున్న శ్రద్ధాసక్తుల కిది తార్కాణం. తెలుగునాట తరిగిపోతున్న విలువలలో ఇది యొకటని గమనించాలి.

ఇక ఉపన్యాసాలూ, సభలూ, సమావేశాలూ, గోష్ఠులూ, సదస్సులూ-కొంతమందిని మాత్రమే కదిలించగలుగుతాయి. ప్రకటింపబడితే చదివే వాళ్ళకు మాత్రమే ఉపయోగపడతాయి. ఈనాడు సాహిత్యం వినోదాన్ని కలిగించే కళగా మాత్రమే సామాజికులచేత సంభావింపబడుతున్నది. అందులోనూ వచనానికి వ్యాప్తి ఉంది; గేయానికి ప్రజాశక్తి ఉంది; కవితకు సాధారణ గౌరవం ఉంది; విమర్శకు విద్యావేత్తలలోమాత్రమే కొంత గుర్తింపు ఉంది. నేడు నవలకూ, కథకూ ఉన్న ప్రజాదరణం మరే ప్రక్రియకూ లేదు. అయితే, నవల తన ప్రాపకాన్ని వీలైనంతవరకు వ్యాపారంలో పెట్టి లాభాలుకూడా తీస్తున్నది. వ్యాపార ప్రభావం పడని ప్రక్రియలలో ముఖ్యమైనవి కవిత, విమర్శ. కవిత ఉద్యమాల నాశ్రయించి ప్రయోగాలు చేస్తూ ప్రజల నాకట్టుకోవటానికి యత్నిస్తుంటే, విమర్శ ఉద్యమాలను ఉపలాలిస్తూ ఊపిరిపోసుకొంటున్నది. చిత్రమేమిటంటే— పరిశోధన చేస్తే ప్రచారం రాకపోయినా పట్టాఅన్నా పరిశోధకుడికి దక్కుతుంది; విమర్శ వ్రాస్తే పట్టాలు రాకపోగా ప్రత్యర్థుల ఖండన మండనల నెదుర్కోవలసి వస్తుంది. నేటి పరిశోధనలకు పండితులలోనే మాన్యత, ఆదరణ, ప్రచారం కనబడటంలేదు. విమర్శలకు విలువలుకట్టే సహనం నేటి విద్యావేత్తల లోనే లేదు. అందువలన విమర్శ సామాన్యుల నడుమకు పోవాలంటే సమీక్షగా సాగటంకంటె గత్యంతరం లేదు. పదిమందిని చదివించగలిగేటట్లు ప్రవర్తించటమే నేటి సమీక్షకు లక్ష్యం.

సమీక్షాయుగంలోనూ సాహిత్యవిమర్శ కొన్ని సాహసాలు చేయక పోలేదు. మార్క్సిస్టు దృక్పథంతో, మానవతావాద దృక్పథంతో, హేతువాద దృక్పథంతో, మనోవిశ్లేషణ దృక్పథంతో, అస్తిత్వవాద దృక్పథంతో, ప్రాగ్రూపవాద దృక్పథంతో, ప్రతీకాత్మక దృక్పథంతో, సాంఘిక దృక్పథంతో, సమన్వయ దృక్పథంతో కొన్ని సాహిత్య సమీక్షలు వచ్చాయి. ఇవన్నీ పాశ్చాత్య ప్రభావముద్రితాలే. వాటిలో కొన్ని సాహిత్య విమర్శ స్థాయిని సంతరించుకొన్నాయి. కొన్ని పరిశోధన ప్రక్రియక్రింద పట్టాలను సంపాదించాయి.

ఈ సాహిత్య విమర్శ పైఖరులను గురించి "ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ- సాంప్రదాయిక రీతి" అన్న సిద్ధాంతగ్రంథాన్ని రచించిన డా॥ కోవెల సంపత్కుమారాచార్య గారి పరిశోధన ఫలితాంశాలను కొన్నింటి నిక్కడ పొందుపరచటం సందర్భోచిత్యం.[24]

1. 'మనస్తత్వ శాస్త్రము, ఫ్రాయిడ్ వాదము, మానవతా వాదము, అస్తిత్వవాదము, ప్రాగ్రూప (archetype) వాదము, మార్క్సువాదము, నవ్యమానవతా వాదము (రాడికల్ హ్యూమనిజము), అరవింద దర్శనము, గాంధీ వాదము, మొదలగునవి ఆధునికముగా విస్తరించినవి నిజమునకీ శాస్త్రవాద-దర్శనములు మౌలికముగా సాహిత్య సంబంధముతో ఉద్గమించినవి గాని, విస్తరించినవి గాని కావు. వాటి ఉద్గమ విస్తరణములకు సాహిత్యము హేతువు కూడ కాదనుటయు ప్రసిద్ధమే." (పుట. 301)

2 "మానవతావాదము, అస్తిత్వవాదము మొదలగునవి తెలుగు సాహిత్య విమర్శలో ప్రత్యేకప్రమాణములుగా నెలకొని అంతగా ప్రభావము నెరపినట్లు కన్పించదు ఈ వాదధోరణుల ప్రసారమును కొన్ని కొన్ని రచనలయందు పాక్షికముగా పరిశీలించు వ్యాసములు చెదురుమదురుగా మాత్రము కన్పించును. [24](a) ప్రాగ్రూప ప్రమాణములతో సాహిత్య విమర్శయు ఇప్పుడిప్పుడే ఆరంభమగుచున్నది [24](b) గమనింపవలసిన ప్రధానాంశమేమనగా, ఈ వాదములు దాదాపుగా అన్నియు సర్వకావ్య స్వరూపములకుగాని, సమగ్రముగాగాని అనువర్తించుటగా కాక, కొన్ని కొన్నింట కొంత కొంతవరకు మాత్రమే అనువర్తించు లక్షణము గలవి కావ్యములం దధికముగా పాత్ర చిత్రణమా నాశ్రయించి మాత్రమే సాగుటతప్ప సర్వతోముఖ విస్తృతి పొందగల శక్తి వీటియందు మిక్కిలిగా తక్కువ. ఈ విధమైన శక్తియుక్తులు అధికముగా కలది మార్క్సువాదము". (పు. 305)

3. "-- 'గతితార్కిక భౌతికవాదం: దీనిని మార్క్సిస్టు దృక్పథ మంటారు (Dialectical Materialistic Criticism) ఈ కోణంనుంచి చూచినప్పుడు కావ్యవస్తువుకూ ఆనాటి ఆర్థిక రాజకీయ సామాజికవ్యవస్థకూ వున్న సంబంధాలను గ్రహించి వాటివల్ల కవి విపృతంచేసిన విషయాలు సంఘ పురోగమనానికి ఎంతవరకు తోడ్పడగలవో, ఎంత సజీవమైన శక్తి

చిత్రణ ద్వారా కావ్యనిర్మాణం చేశాడో విలువ కట్టడం'—[24](c)శ్రీశ్రీ మార్క్సీయ సాహిత్యవిమర్శను స్థూలముగాను, క్లుప్తముగాను తెలుగ సాహిత్య విమర్శ మార్గమున నిర్వచించిన విధ మిది" (పుట 306

"మార్క్సీయ ధోరణిలో సాహిత్యవిమర్శను తెలుగులో ఆరంభించి వారు నిజమునకు మార్క్సిస్టులు కారు. మరి, రాయిస్టులు కావచ్చునని చేకూ రామారావుగారు అభిప్రాయపడినారు. [24](d) అయితే, రాయిస్టుల అచ్చముగా మార్క్సీయ దృక్పథము కాదని ఖండన పూర్వకముగా ఈ విమర్శను సాగించుటకు యత్నించినవారు మార్క్సీయ రాజకీయనాయ కులు.[24](e) ఏది ఏమైనను-స్థూలముగానే కావచ్చును గాని, ఈ విమర మౌలికరీతిని సూత్రీకరించి, ప్రస్తుతీకరించినది శ్రీశ్రీగారు. తొలినాళ్ళల మార్క్సువాదాంశములను సాహిత్యమునకు మొరటుగా పట్టించుచు మం చెడ్డలను యాంత్రికముగా, 'అమాయకముగా' అతివాద ప్రాయము నిర్ణయించుచు పోవుట సామాన్యము. ఈ నాళ్ళలో గూడ ఈ ధోర విరివిగానే యున్నది. సాహిత్యరంగమున మార్క్సీయ సాహిత్య విమర విధానమును స్పష్టమైన అవగాహనముతో, నిజాయితీతో ప్రయోగించు యన్న దెట్లున్నను, ఆ విధాన స్వరూపస్వభావములను స్పష్టప్రతిపత్తితో ప్రస్తుతీకరించు రీతి అంతగా వ్యాప్తికి వచ్చినట్లు అనిపించదు. కాగా, ఈ నాటికిని ఈ విమర్శ స్వరూపావగాహనమునకు ప్లెఖనోవ్, లూనాషార్స్కీ క్రిప్షెంకో, షెర్బినా, అవ్నర్‌జిస్ మొదలగు రష్యన్ విమర్శకుల మరియు క్రిస్టొఫర్ కాడ్వెల్, రాల్ఫ్ ఫాక్స్, లూకాచ్, హావర్ట్ ఫాస్ట్ షెరీఈగిల్టన్ మొదలగు రష్యనేతర వైదేశిక విమర్శకుల గ్రంథము ఆధారము లగుచున్నవి. మార్క్సు, ఎంగెల్సు, లెనిన్, ట్రాట్స్కీ, మావొ మొదలగు నాయకుల అభిప్రాయములు ప్రమాణీభూతము లగుచున్నవి నిజమునకు ఈ విధమైన విమర్శమార్గమున క్రొత్తగా, విడిగా సిద్ధాం ములను ప్రతిపాదించుటకు గాని, వ్యాఖ్యానము (ఇంటర్‌ప్రిటేషన్ చేయుటకు గాని అంతగా అవకాశ మున్నట్లు కన్పించదు. అన్నియు దాదాపుగా నిశ్చిత పూర్వ నిర్ణయములే యగుట దీనికి కారణము కావచ్చును కేవలముగా వాటివి ఆయావారి అభిప్రాయములు నుటంకించుకొనుచు, ఇక్క

రావ్యస్వరూపములను అనుసరించి అనువర్తింప జేసికొనుటయే ప్రధాన మెగుచున్నది." (పుట 306-307)

4. "ఈ విధాన వివేచనమునకు సంబంధించి విక్షిప్తముగానే రావచ్చును, సూత్రప్రాయముగా సూచనలు శ్రీశ్రీగారి విమర్శవ్యాసములలోనే కన్పించునుగాని, అత్యాధునికముగా దీనికి వ్యాప్తికలిగించుటలో ఉద్యమించినది కొడవటిగంటి కుటుంబరావుగారు, పాములపర్తి సదాశివరావుగారు, కె. వి. రమణారెడ్డిగారు, కేతవరపు రామకోటి శాస్త్రిగారు, త్రిపురనేని మధుసూదన రావుగారు, చేకూరి రామారావుగారు మొదలగు వారు. భారతీయేతర మార్క్సీయ సాహిత్యవిమర్శకులఅభిప్రాయాలను క్రోడీకరించి ప్రస్తరించిన ముదిగొండ వీరభద్రయ్యగారివ్యాసము 'నవ్యఅలంకారశాస్త్రం -- మార్క్సిస్టు దృక్పథం' ఈ సందర్భమున ప్రత్యేకించి పేర్కొనదగినది. మార్క్సీయ విధానమును అనువర్తింపజేసి తెలుగుసాహిత్యములోని పరిణామములను గమనించుటకు 'తెలుగులో కవితావిప్లవాల స్వరూపం' పరిశోధన గ్రంథంద్వారా వేల్చేరు నారాయణరావుగారు చేసిన ప్రయత్నము విశిష్టమైనది. మరియు, ఈమార్గముననే, 'సాపేక్ష విలువ' సిద్ధాంతము ననుసరించి భారతీయసాహిత్యవిమర్శసంప్రదాయమునం దుద్గమించిన ఔచిత్యవాదమును విచారించు కేతవరపు రామకోటిశాస్త్రి గారి 'కావ్యము యొక్క సాపేక్షవిలువసిద్ధాంతం' అన్న వ్యాసము పరిశీలింపదగినది. కాగా, తెలుగులో మార్క్సువాదము సాహిత్యవిమర్శయం దీయావిధముగా ప్రమాణీకృత మగుట అత్యాధునికముగా మరింతగా విశ్లేషణాత్మకముగా అనుశీలింపదగినది." (పుట: 311-312)

5. "సాహిత్యమునకు సంబంధించి, నిజమునకు, విశ్వవ్యాప్తముగా వివిధదృక్పథముల ననుసరించి సాగిన, సాగుచున్న విచార విమర్శనము లందు మౌలికముగా ఆనుకూల్యము సాధారణముగా భాసించుచునే యుండును. అయితే, ఈ విషయమును అవగాహనము చేసికొనుటకు దేశీయ-విదేశీయ సాహిత్య, సాహిత్య విమర్శ సంప్రదాయములు ప్రతిపాదించిన వివిధాంశముల సమన్వయ పూర్వక పరిశీలనము అవసరము. ఈ విధమైన సమన్వయ

మునకు వింజమూరి రంగాచార్యులు గారి ద్వారా ఈ శతాబ్దపు రెండవపదిలో ఆరంభమైన ప్రయత్నము ఆధునికముగా కొంత కొంత సాగినను, చాలవరకు సమగ్రతను సాధించినది అత్యాధునికముగనే యనవలెను. 'కవిసేన మేని ఫెస్టో'గా గుంటూరు శేషేంద్రశర్మగారు రచించిన 'ఆధునిక కావ్యశాస్త్రమ్' ఈ సమన్వయమును సాధించి ప్రదర్శించుటకు చేసిన విశిష్టప్రయత్నము ప్రత్యేకముగా అనుశీలింప దగినది ....... అత్యాధునికముగా 'కవిత్వం ఒక ఆత్మకళ' అను సిద్ధాంతమును ......... ఈ ఆధునికశాస్త్రము ప్రతిపాదించినది." (పుట 314-315)

ఈ సాహసాలన్నీ సామాన్యుల కర్థంకావు; వారికి అవసరం కూడా లేదు. అయితే, సాహిత్యం, సాహిత్యవిమర్శ ఎవరికోసం ఉద్దేశింపబడి సృష్టింపబడుతున్నట్లు?- అన్నప్రశ్న ఈ సందర్భంలో ఉదయించకపోదు. సాహిత్యానికి సంబంధించినంతవరకు సమాజంలో మూడుతరగతుల మనుషులు పరిగణనకు వస్తారు. వారు: సామాన్యులు, సహృదయులు, నిపుణులు. విద్యావంతులైనా, కాకపోయినా సాహిత్యంమీద అంతగా ఆసక్తిలేనివారూ, ఆసక్తి ఉన్నా సాహిత్యాన్ని వినోదానికో, కాలక్షేపానికో నిమిత్తంగా భావించేవారు సామాన్యులు. వీరికి బ్రతుకు ముఖ్యమైనంతగా సాహిత్యం ముఖ్యం కాదు. ఇక సహృదయులంటే కొద్దో గొప్పో లలిత కళాసంస్కారంతో కూడిన సాహిత్యరసికత్వాన్ని సంతరించుకొన్నవారు. వీరికి జీవితంలో రమణాభావ మెంత ఉంటుందో సాహిత్యంలోకూడా అంత రక్తిభావ మంటుంది. సామాన్యంగా జాతిలోని సాహిత్యాభిరుచికి ప్రాతినిధ్యం వహించేవారు సహృదయులే. నిపుణులు సాహితీవేత్త లనబడేవర్గంవారు. వీరిలో సాహితీస్రష్టలు, సాహిత్యవేత్తలు, శాస్త్రనిపుణులు, పండితులు ఉంటారు. సామాన్యులు కవిత్వం వింటారు. తెలిస్తే కరతాళధ్వనులు చేస్తారు. వారికి-చెప్పేతీరుకంటె చెప్పేవిషయం కావాలి. చిత్తశుద్ధితో చెపితే చెవులార చవులూర వింటారు. చెప్పింది జీవితానికి పనికివస్తే మనసులో నింపుకొంటారు. ఏ కళయైనా జీవితాని కెంతవరకు ఉపయోగపడుతుందో లెక్కించటమే వీరిదృష్టికి పరమప్రమాణం. అందువలన సామాన్యజనుల కోసం చేసేరచన వాస్తవజీవితవాస్తవప్రయోజనాలను దృష్టియందుంచుకొని సాగుతుంది. సహృదయులు వాస్తవాన్ని కళామయంగా చిత్రిస్తే దాన్ని

ఱమిస్తారు. అందువలన వారికోసం చేసే రచనలలో వాస్తవజీవిత విమర్శను వాఙ్మయశిల్పంగా వెలార్చే ప్రయత్నం జరుగుతుంది. నిపుణులు కావ్యకళా మర్మజ్ఞులు. వారి కందించే రచనలో కళ కావాలి, కల్పనం కావాలి, శిల్పం కావాలి, సిద్ధాంతం కావాలి. అంతే కాదు కళానుభవం కావాలి, కళానుశీలనం కావాలి, కళాతత్త్వవివేచనం కావాలి. ఈ మూడువర్గాలవారినీ ఒకేసారి మెప్పించటం కళాకారునికి ఓకేరకమైన ప్రక్రియవలనా, ఒకేవిధమైన ప్రయోగంవలనా సాధ్యం కాదు. సామాన్యులకొరకే వ్రాస్తానన్న రచయిత మిగతా రెండువర్గాలను గణించకపోవచ్చు. అట్టి రచయిత చేసే రచనలలో సహృదయ ప్రమాణాలను అనుశీలించటం అనవసరం. సహృదయుల కొరకు వ్రాసే రచనలలో శిల్పవిచారంచేయటం నిరుపయోగం. నిపుణులను కూడా మెప్పించేనేర్పును ప్రకటించేరచనలలో సాహిత్యప్రమాణాలచర్చ సార్థకమౌతుంది మొదటిరకంలో చెప్పేదే ముఖ్యం. రెండవరకంలో చెప్పేదీ, చెప్పేతీరూ, రెండూ ముఖ్యం. మూడవరకంలో అన్నీ ఉండి ఆదర్శమూ, దర్శనమూ, సిద్ధాంతమూ కూడా ఉండటంముఖ్యం. నేటికవిత్వం సామాన్యుల నుద్దేశించివ్రాసినా సహృదయలోకాన్ని మెప్పించాల యత్నిస్తున్నది. నిపుణుల నిర్ణయాలను నిరసిస్తున్నది. సాహిత్యసామాన్యలక్షణం ఇలా ఉండగా, సాహిత్య విమర్శ జీవితం మరీ శోచనీయంగా ఉంది.

సాహిత్యవిమర్శ సమీక్షగా సాగినా సహృదయలోకాన్ని మెప్పించ గలదు కాని సామాన్య జనాన్ని ఆకట్టుకోలేదు. నిపుణులచేతులలో నిగ్గు తేలకపోతే దాని నిజస్వరూపం బైటపడదు. అందువలన నేటి విమర్శ పదిమందిలో పరువుగా బ్రతకటానికి సమీక్షగా నిలిచింది; పండితుల ప్రాపకంలో విమర్శగా తలదాచుకొంటున్నది. పదికాలాలపాటు నిలిచే విమర్శ పండితులనే ఆశ్రయిస్తున్నది. బ్రతుకుతెరువులన్నీ భవిష్యత్తుకోసమే!

దాదాపు రెండుదశాబ్దాలక్రితమే సాహిత్యభవితవ్యాన్నిగురించి సాధి కారికంగా చెప్పిన డాక్టరు జి. వి. కృష్ణరావుగారిమాట లిక్కడ సంస్మర ణీయాలు.[25]

"నేటిప్రజలకు భౌతికభోగాలలో ఉన్న ఆసక్తి మరిదేనిలోనూ లేదు. ప్రభుత్వాలుగూడ తమప్రజలు నగటున తల ఒకటికి వాడుకొనగలుగుతున్న

విద్యుచ్ఛక్తి, వస్త్రాలు, ఆహారపదార్థాలు, మందులు, కార్లు, నివేశన ప్రదేశాలు, రేడియోలు మున్నగాగలవస్తువులపరిమాణాలనుబట్టి తాము సాధించిన అభ్యుదయాన్ని నిర్ణయిస్తున్నవి. బాధావిమోచన మేదైనా సేవ్యమేననీ, పరమౌషధమనీ రోగి భావిస్తున్నట్లే అధికారమో, ఐశ్వర్యమో, తత్సాధనమో అనుగ్రహించే దేదైనా అభిలషణీయ మని ఈనాడు సామాన్యప్రజానీకమంతా భావిస్తున్నది. ఇప్పటి జీవితవ్యవస్థకూడా ఐశ్వర్య, అధికారరూప సద్యఃఫల మివ్వనికర్మను పూర్తిగా త్రోసివేస్తున్నది. కావ్యంవల్లగాని తక్కిన లలితకళాఖండాలవల్లగాని లోకోత్తరానుభూతి కలుగుతున్నదే కాని లౌకికమైన సద్యఃఫలం మరొకటి కలగటం లేదు. కనుక భౌతికభోగలాలసమైన ప్రజానీకం కావ్యాస్వాదనకు దూరమౌతున్నది." (పుటలు: 484 ; 485)

"ఉత్తమకృతుల ఆవిర్భూతికి సమాజంలో కొంత నిలకడ అవసరం. కాని, జీవితం నిలకడ లేక త్వరితగతిని మారుతున్నప్పుడు తదనుగుణమైన మార్పులే సాహిత్యంలోనూ, తక్కిన లలితకళలలోను వస్తవి. సమాధ్యవస్థాపాదకాలైన కృతులకు అవకాశం తక్కువ. తదాస్వాదనశక్తిగూడ సన్నగిల్లక తప్పదు. వెనుకటివలె నవ్యకృతులు ఇకమీదట మూడుకాలాలపాటు నిలవటం అసంభవంగా కనిపిస్తున్నది.... క్రొత్తగా వెలువడే రచనలు స్వల్పకాలం నిలిచి ఆమీద విస్మృతిపథంలో లీనమౌతవి. ఈ రచనలయందలి వస్తుశిల్పాలుకూడ పత్రికావార్తలవలె ఉద్వేజకాలుగా ఉంటవి. అంటే పత్రికారచనమే (Journalism) సాహిత్యంలో చెలామణి అవుతుంది."
(పుట 487)

జి. వి. కృష్ణరావుగారిది జోస్యం కాదు; ఒకసాహితీవిమర్శకుని భవిష్యద్దర్శనం. అప్పటి ఊహాగానం ఇప్పటిసత్యం. పత్రికారచనా ప్రమాణాలతో వెలువడే సమీక్షయే యీ యుగంలోని సాహిత్యవిమర్శయొక్క సాధారణస్వభావం. అయితే, విమర్శకు లొకవిషయం గుర్తించాలి. సమీక్షయే సద్విమర్శ కాదు.[26] పాశ్చాత్యప్రభావంతోనే సమీక్ష నడుస్తున్న దని భావించినా- మన విమర్శ భవిష్యత్తంతా ఆ ప్రభావంతోనే ముడిపడి ఉండాలని తలంచటం పొరపాటు. ఒక్కొక్కప్రభావంతో ఒక్కొక్క క్రొత్త యుగం పుట్టవచ్చు; అ దెప్పుడూ పాశ్చాత్యమే కానక్కరలేదు. అయినా

తప్పులేదు. కాని, మనచూపుతో మనగలిగే మరొకయుగాన్ని మనం సృష్టించుకొనే యత్నం చేయాలి. అప్పుడే మరొక మంచి యోగం మనకు కలిగేది!

"We shall certainly continue to read the best of its kind, of what our time provides; but we must tirelessly criticize it according to our own Principles, and not merely according to the Principles admitted by the writers and by the critics who discuss it in the Public Press"[27]

-- T. S. Eliot.

# 4

# ఉద్యమాలు - ఉపశ్రుతులు

"A theory of art will not be able to get along without at least two key terms–to stand in partial opposition to each other and to keep the theory from collapsing into tautology or into literalism. At the same time it will hardly be a theory at all unless it tries to bring these two terms into a reconciled and necessary relation, or to see each in and through the other.[1]"

-- William K. Wimsatt, Jr. & Cleanth Brooks.

తెలుగుసాహిత్యవిమర్శపై పాశ్చాత్యప్రభావపరిశీలనంలో ప్రధానంగా రెండు మార్గాలను అనుసరింపవలసివస్తుంది. మొదటిది– పాశ్చాత్యవిమర్శలో ఆయాకాలాలలో వచ్చిన వివిధఉద్యమాల స్వరూప స్వభావాలను వివేచించి, వాటిసామూహికప్రభావం తెలుగు సాహిత్యోద్యమాలమీద ఏవిధంగా పడిందో పరిశీలించి తత్ఫలితాలను సమీక్షించటం. రెండవది – పాశ్చాత్యవిమర్శకులు వ్యక్తిగతంగా తెలుగు విమర్శకులను ప్రభావితం చేసిన వైఖరిని అనుశీలించటం. ఈ రెండుపద్ధతుల విమర్శను నిర్వహించటానికి, వాటివిలువలను నిర్ణయించటానికి ముందు పాశ్చాత్యవిమర్శరంగంలో ప్రవర్తిల్లిన ఉద్యమాలనూ వాటిఉపశ్రుతులనూ రేఖామాత్రంగానైనా దర్శించటం అవసరం.

ప్రాచ్య పాశ్చాత్య విమర్శ విధానాలను వివేచిస్తూ డా. యస్. వి. రామారావుగారన్న మాటలు ముందుగా పేర్కొనదగినవి. "పాశ్చాత్యుల విమర్శన సిద్ధాంతములు సంస్కృతాలంకారశాస్త్రమునందువలె ఒకచోట నిబద్ధము కాలేదు. ప్రత్యేకముగా రచింపబడిన ఆయాకావ్య విమర్శలయందే అంతర్గతములైనవి. కావ్యవిషయ విభాగములు కల సంగ్రహగ్రంథము లాంగ్లమున లేవు అరిస్టాటిల్ విరచితమైన De Poetica వంటి లక్షణ గ్రంథము లున్నను మిక్కిలి అరుదు. అంతేకాక భారతీయాలంకారికులు ప్రాయికముగా ఏదేని ఒకసిద్ధాంతమును స్థాపించుటకు లక్షణగ్రంథములను వెలువరించిరి. పాశ్చాత్యు లట్లుకాక తమ విమర్శగ్రంథములలో పలు విషయములు చర్చించిరి. వారి సాహిత్య విమర్శ కొన్నిసూత్రములకు, సిద్ధాంతములకు కట్టుబడి యుండలేదు. సంస్కృతాలంకారికులలో కొందరు కావ్యములు రచించినను కవులుగా ప్రసిద్ధి గడించినవా రరుదు. పాశ్చాత్య లాక్షణికులలో పలువురు కవులుగా, రచయితలుగా ప్రఖ్యాతులైనవారే. సిద్ధహస్తులైన వారిచేతులలో సాహిత్యవిమర్శ సృజనాత్మకకళగా రూపొందినది.".[2] ఈ సత్యాన్ని గమనిస్తే తేలేఅంశ ఒకటి. – సంస్కృతలక్షణ గ్రంథాలలో కనపడేది అనుశాసనాత్మకమైన లక్షణ సూత్ర రచనం. తెలుగులో కూడా లక్షణకర్త లనుసరించింది దానినే అయితే ప్రాచీనాంధ్రకవులలో కొందరు అనువర్తిత విమర్శ కుపకరించే సూత్రాలనూ, వృత్తులనూ మన కందించారు. అయినా, ఆ యుగాలలో అనువర్తితవిమర్శ ప్రకటితం కాలేదు. పాశ్చాత్యవిమర్శకు అనువర్తిత విమర్శయే జీవితం. కవితాతత్వ విచారం చేసే విమర్శకులు అనుశీలన ప్రవృత్తులలో ప్రకటించే సాహిత్య సిద్ధాంతాలే విమర్శకు వికాసవిస్ఫూర్తిని కలిగించటం సహజంగా కనపడుతుంది. వారిలో ప్రసిద్ధవిమర్శకులు ప్రపంచించిన విమర్శ విధానాలు విశిష్ట ఉద్యమాలుగా ఉన్మీలించి పాశ్చాత్యసాహితీవిమర్శ జీవితాన్ని ప్రభావితం చేశాయి. వాటి ప్రవృత్తుల ప్రభావమే తెలుగుమీదకూడా పడింది. అయితే ఆ ప్రభావాలన్నీ తరతమ సూక్ష్మభేదాలతో కనిపిస్తాయి. లోనారసి వాటిని వివేచించాలి.

పాశ్చాత్య విమర్శ ప్రపంచాన్ని భారతీయభాషాసాహిత్యవేత్త లందరిలాగానే తెలుగువారుకూడా ఆంగ్లభాషాకవాటాన్నుంచే చూచారు. తమకు నచ్చి

నవి, తమదేశీయప్రయోగాలకు అచ్చుబాటుగా నిలచినవి—అయిన వానినే గ్రహించి తమసాహిత్యదృక్పథాలకు సమన్వయించుకొన్నారు. ఆదిరూపం ముందు తెలిస్తే అన్వయరూపం ఆపైన అవగతమౌతుంది.

## ఆంగ్ల సాహిత్యవిమర్శ– యుగవిభాగం

ఆంగ్లసాహిత్య విమర్శావిర్భావం క్రీ. శ. 16వ శతాబ్ది మధ్యభాగంలో జరిగింది. ప్రాథమికదశలలో అంతకుపూర్వం ప్రవర్తిల్లిన గ్రీక్, లాటిన్, రోమన్, ఫ్రెంచి విమర్శ ప్రభావం దానిమీద బలంగా ఉంది. అయినా ఒక క్రొత్త మలుపుతో పునరుజ్జీవన యుగాన్ని(The period of Renaissance criticism) సాగించి విశాల దృక్పథాన్ని, నూత్నవిమర్శపద్ధతులను నిర్మించుకోవటం మొదలుపెట్టింది. ఈయుగంలో సర్ ఫిలిప్ సిడ్నీ, బెన్‌జాన్‌సన్ మొదలైన విమర్శకులు నాయకత్వం వహించారు. 17వ శతాబ్ది మధ్యకాలం వచ్చేసరికి ఆంగ్లవిమర్శకులలో తమ భాషాసాహిత్యాలకు సజాతీయాలుగా ఉండి, తమ కావ్యానుశీలనంలో సాపేక్షప్రమాణాలుగా ఉపయోగించే ప్రమాణాలను వినూత్నంగా సృష్టించుకొంటూ, సాధ్యమైనంత వరకు ప్రాచీనలక్షణాలను త్రోసిరాజనే ప్రవృత్తిని ప్రకటించారు ఈ ఉద్యమం ఒక శతాబ్దం సాగింది. అందులో జాన్‌డ్రైడెన్ ముఖ్యపాత్ర నిర్వహించాడు. ఈకాలాన్ని ఇంగ్లీషులో రెస్టొరేషన్‌యుగ మంటారు. (The Period of the literary criticism of the Restoration). దీనిని తెలుగులో పునరుద్ధరణయుగ మనవచ్చును. ఈ రెండుయుగాలలోనూ విమర్శకులు ప్రాచీనప్రభావాలనుంచి విముక్తి చెందటానికి తపనపడి, కవితాసిద్ధాంతాలను ప్రమాణాలను కల్పించటంలో అత్యంతస్వేచ్ఛను ప్రకటించారు. సహృదయులుగా వారు నిర్మించిన సాపేక్షసిద్ధాంతాలలో స్వీయాభిరుచులు ప్రవేశించి వాటిని సర్వజనామోదాన్నుంచి దూరం చేయటం మొదలుపెట్టాయి. దానికితోడు 1660లో ఇంగ్లండును పాలించటం ప్రారంభించిన రెండవచార్లెస్ ప్రభువు ఫ్రెంచిసంప్రదాయాన్ని సమాద రించటం మొదలుపెట్టాడు. ఫ్రెంచివిమర్శకులు అరిస్టాటిల్‌సాహిత్య సిద్ధాంతాలను ప్రమాణంగా నమ్మి సంప్రదాయవిధానాలను అనుసరిస్తూ ఉండేవారు. ఆంగ్లసాహిత్యంలో ప్రమాణాలు పడిపోతున్నవని భావిస్తున్న విమర్శకులు

ఫ్రెంచి విమర్శకుల పద్ధతి నాశ్రయించి, 7వ శతాబ్ది నడిమి కాలం నుంచి దాదాపు ఒక అర్ధ శతాబ్ది కాలం నియోక్లాసికల్ విమర్శ యుగాన్ని ప్రవర్తింప చేశారు. అందులో పేరెన్నికగన్నవారు జోసఫ్ అడిసన్, అలెగ్జాండర్ పోప్, సామ్యూల్ జాన్సన్. ఆ తరువాత ప్రవర్తిల్లింది కాల్పనిక విమర్శోద్యమం (The Period of the Romantic criticism). ఈ యుగంలో మరలా సాహిత్యవిమర్శ తన దేశీయతను నిలువ త్రొక్కుకోవటానికి ప్రయత్నం చేసింది. కవిత్వస్వభావం, శైలి, ఛందస్సు మొదలైన కావ్యాంశాలమీద కూలంకషమైన, దేశీయస్వభావసిద్ధమైన పునః పరిశీలనం జరిగింది. ఈ ఉద్యమంలో ప్రసిద్ధకవులే పాల్గొనటం గమనార్హమైన విశేషం. వారిలో – విలియం వర్డ్స్‌వర్త్, శామ్యూల్ టైలర్, కోల్‌రిడ్జి, షెల్లీ, కీట్స్, హాజ్‌లిట్, లాంబ్ మొదలైన వారు ముఖ్యులు. ఈ యుగం 1800-1825 మధ్య ఉజ్జ్వలంగా సాగింది.

విక్టోరియా రాణి 1837లో సింహాసనానికి వచ్చింది; 1901 దాకా పాలించి కన్నుమూసింది. ఈ కాలంలో వచ్చిన విమర్శను విక్టోరియన్ యుగ విమర్శ అని చారిత్రకులు పిలుస్తారు. ఈ యుగంలో తలయెత్తిన శక్తులు రెండు. (1) ప్రజాస్వామ్యపరిపాలనస్పృహ 2. విజ్ఞాన శాస్త్రతత్త్వ శాస్త్రాభ్యుదయం. ఇంగ్లండులో జారీ అయిన 1832 సం॥పు సంస్కరణ చట్టం ప్రకారం అధికారం ధనికవర్గం నుంచి మధ్యతరగతి ప్రజల చేతుల లోకి ప్రధానంగా వచ్చింది. విశ్వవిద్యాలయ విద్యావిధానం అమలులోకి రావటంతో ప్రజలలో విద్యావంతు లెక్కువయ్యారు. రచయితలసంఖ్య పెరిగింది. విజ్ఞానశాస్త్ర ప్రగతివలన పారిశ్రామిక విప్లవం వలన పరిశ్రమలు వెలిశాయి. ప్రజలకు సౌకర్యాలు పెరుగుతున్నా పారిశ్రామిక నాగరకత సహజంగా తెచ్చే వడి, అలజడి అశాంతిని జీవితంలో రేకెత్తించాయి. పారిశ్రామికవ్యవస్థవలన సంఘంలో ధనికులు, మధ్య తరగతి వారు, కార్మికులు అనే వర్గాలు ఏర్పడ్డాయి. ఆర్థికఅసమానత్వాలవలన అలజడి మొదలైంది. మత గ్రంథాలు చెప్పే నియమాలమీదా, బోధలమీదా, అంత వరకు ప్రజలలో ఉన్న విశ్వాసం సడలటం మొదలైంది, ఇట్టి పరిస్థితుల మధ్య సాహిత్య విమర్శ ప్రజాచైతన్యాన్ని బట్టి ప్రవృత్తిని మార్చుకొన్నది.

ఆ కాలంలో మత విశ్వాసాలకూ విజ్ఞాన శాస్త్రం వలన ఏర్పడిన వాస్తవ దృక్పథాలకూ మధ్య సంఘర్షణ ఏర్పడింది. కాని, ఆనాటి ప్రజలా పరస్పర విరుద్ధ ప్రవృత్తులతో సంఘర్షణ పడకుండా సమాధానపడే వైఖరిని ప్రకటించారు. దానినే ఇంగ్లీషులో 'విక్టోరియన్ కాంప్రమైజ్' అంటారు. ప్రభుస్వామ్య విధానానికీ (Aristocracy) ప్రజాస్వామ్య విధానానికీ, మతానికీ, విజ్ఞానశాస్త్రానికీ కుదిరిన వింతపొత్తే ఆకాంప్రమైజ్. సాహిత్య విమర్శ ఈ యుగంలో నియోక్లాసిస్టుల మడికట్టుకొన్న ఛాందసానికీ, కాల్పనిక విమర్శకుల నిలకడలేనితనానికీ మధ్య ఒక మధ్యేమార్గాన్ని ప్రస్తరించింది. అది మూడు పాయలుగా సాగింది. ఒకటి: ఆదర్శ కాల్పనిక ధోరణి (Idealist Romantic approach). రెండు: వాస్తవ భౌతిక వాద ధోరణి (Positivist materialistic approach). మూడు కవి జీవిత కావ్యార్థ సమన్వయ ధోరణి (Biographical critical method). ఈ యుగంలో మెకాలే, జాన్‌స్టూవర్ట్‌మిల్, డార్విన్, హక్స్లే, ఫ్రెడరిక్ హారిసన్, జాన్‌మార్లే, హెర్బర్ట్ స్పెన్సర్ మొదలైన విమర్శకులు వాస్తవ భౌతికవాద ధోరణులను బలపరిస్తే, కార్లైల్, రస్కిన్, న్యూమన్, వాల్టర్ పేటర్, స్విన్‌బర్న్ మొదలైనవారు భౌతికవాద ధోరణులను ప్రతిఘటించారు. సెంట్‌బవే (Sainte-Beuve), మాథ్యూఆర్నాల్డ్ మొదలైన వారు కవిజీవిత కావ్యార్థసమన్వయ విమర్శను పరిపోషించారు.

20వ శతాబ్ది ఆధునిక విమర్శకు ఉషోదయంగా నిలిచింది. నిజానికీ యుగం 1890 ప్రాంతంలోనే ప్రారంభమైనదని చెప్పాలి. విక్టోరియన్ యుగ రచయితల ప్రవృత్తిలో ప్రధానంగా కనపడే సమాధానపడి బ్రతికే లక్షణం, సంధికొదబడే సౌజన్యం, వాస్తవం కాని విలువల కిచ్చే సంప్రదాయగౌరవం ప్రజలలో తిరుగుబాటును తీసికొని వచ్చాయి. ఆ యుగంలోని తిరుగుబాటు స్వభావాన్ని గూర్చి హెల్‌బ్రూక్ జాక్‌సన్ (Helbrook Jackson) అన్న మాటలు గమనింపదగినవి- "The age favoured experiment and adventure and it even looked unkindly upon the various whims of the inquisitive, on the assumption doubtless that discovery was often the result of accident of design. In this large tolerance the spirit of renaissance worked through mind and imagination, inspiring artists with a new

confidence in themselves and courage to take risks. The results were not always happy; but that does not make the spirit in which the risks were taken less admirable; for those who make great effort, contribute to life as well those who achieve."[3] ఈయుగానికి- తిరుగుబాటు స్వభావం; క్రొత్త క్రొత్త ప్రయోగాలు చేయటం ప్రవృత్తి; సాహిత్యేతర సాధనాలతో సాహిత్యాన్ని సమీక్షించటం సాహసం; వైవిధ్యం, వైరుధ్యం ఈ యుగ ధర్మం. ఇందులో వెలసిన విమర్శ శాఖలు మరే యుగంలోనూ కానబడవు. వివేచనాత్మక విమర్శ (Analytical criticism), మనస్తత్వ విమర్శ (Psychological criticism); అభివ్యక్తి విమర్శ (Expressionistic criticism); మార్క్సిస్టు విమర్శ (Marxist criticism); స్వభావవాద విమర్శ (Naturalists' criticism); ప్రతీకాత్మక విమర్శ (Symbolists' criticism); అభిరుచి విమర్శ (Impressionistic criticism); గ్రంథపరిష్కరణ విమర్శ ( Textual criticism); కవి జీవిత కావ్యార్థ సమన్వయ విమర్శ(Biographical criticism); చారిత్రక దృక్పథ విమర్శ లేదా, కాలక్రమ విమర్శ(Historical method of criticism); అభినవ విమర్శ (New-criticism); కావ్యశిల్ప విమర్శ (Practical criticism) మొదలైన విమర్శశాఖ లీయుగంలో ఉద్యమస్ఫూర్తిని గడించి సాహితీ లోకంలో ప్రయోగాలను నిర్వహిస్తున్నాయి. ఇరవైయో శతాబ్దం ఆధునిక సాహిత్యవిమర్శలో సాహసాత్మక ప్రయోగయుగంగా భావించవచ్చును.

ఈ సంగ్రహసమీక్ష ననుసరించి పాశ్చాత్యసాహిత్యవిమర్శయుగాల నీ క్రింది విధంగా ఏర్పరచటానికి వీలుంది:—

1. గ్రీక్, లాటిన్, రోమన్ విమర్శయుగం. (క్రీ. పూ. 4వ శతాబ్ది నుంచి 16వ శ. మధ్యభాగం వరకు)
2. పునరుజ్జీవన విమర్శయుగం - లేదా - ఎలిజబెతన్ విమర్శయుగం. (16వ శతాబ్ది మధ్యభాగం నుంచి 17వ శతాబ్ది మధ్యభాగం వరకు)
3 రెస్టొరేషన్ విమర్శ - లేదా - పునరుద్ధరణ విమర్శయుగం (17వ శతాబ్ది మధ్యభాగం నుంచి 18వ శతాబ్ది నడిమి వరకు)

4. నియో క్లాసికల్ విమర్శయుగం – (17వ శతాబ్ది చివరినుండి 18వ శతాబ్ది చివరిదాకా)

5. కాల్పనిక విమర్శయుగం - (19వ శతాబ్ది పూర్వపాదం : 1800-1825)

6. విక్టోరియన్ విమర్శయుగం – (19వ శతాబ్ది పూర్వార్ధంలో మొదలై దాదాపు ఆ శతాబ్ది చివరి దాకా)

7. ఆధునిక విమర్శయుగం – (20వ శతాబ్ది)

చారిత్రక దృష్టితో సమీక్షిస్తే 20వ శతాబ్ది ప్రథమపాదంలో ప్రారంభమైన తెలుగు సాహిత్యవిమర్శ వికాసంమీద పాశ్చాత్యవిమర్శలోని తొలి యుగాల ప్రభావం ఉండటానికి అవకాశం లేదు. అయితే విషాదాంత, మోదాంత రూపకాల లక్షణ వివేచనంలో అరిస్టాటిల్ వంటి విమర్శకుల అభిప్రాయాలను గురించి పునర్విచారణం చేయటం జరిగింది కొందరు విమర్శకులచేత. అయినా, ఆయా యుగాలలో ప్రవర్తిల్లిన ప్రధాన సాహిత్య విమర్శ ప్రవృత్తిని సమీక్షించి వాటి వాటి స్వరూప స్వభావాలను నిర్ధారణం చేయటం సమంజసం.

## గ్రీక్ సాహిత్య విమర్శ - ప్లేటో, అరిస్టాటిల్

గ్రీక్ సాహిత్య చరిత్రలో పెరికిల్స్‌యుగం (The age of Pericles) స్వర్ణయుగం. ఆ యుగంలో Phidias, Polygnotus వంటి కళాకారులూ, Aeschylus, Sophocles, Euripides, Aristophanes వంటి రచయితలూ సాహిత్య కళాసూత్రాలకు సంబంధించిన పర్యాలోచనం చేశారు. వారు తమ రచనలలో ప్రస్తావవశంగా అక్కడక్కడా చెదురు మదురుగా కొన్ని అభిప్రాయాలు చెప్పారు. ప్లేటోకు ముందున్న విమర్శలో కవిత్వ స్వభావాన్నిగూర్చి, ప్రయోజనాలనుగూర్చి వివిధ విమర్శకులు చేసిన లక్షణ సూక్తాలు కనపడతాయి. ఆ కాలంలో తత్త్వవేత్తలకూ, సాహితీవేత్తలకూ విరుద్ధ దృక్పథం ఉండేవి. వారి నడుమ వాదాలు చెలరేగుతూ ఉండేవి. ఉదాహరణకు Xenophanes, Heraclitus అనే తత్త్వవేత్తలు హోమరు

కవిత్వాన్ని నీతిసూత్రాలతో విమర్శించారు. కాని, Theagenes, Anaxagoras వంటివారు సమర్థించారు ప్లేటో తన 'రిపబ్లిక్' గ్రంథంలో ఇటువంటి సంఘర్షణ క్రీ. పూ. 6వ శతాబ్దినుంచే ఉన్నదని పేర్కొన్నాడు. ప్లేటో (క్రీ పూ. 427-347) గ్రీకు సాహిత్య విమర్శ పితామహుడు. సోక్రటీస్ శిష్యుడు. కళయొక్క ఆధ్యాత్మిక ప్రవృత్తిని విశేషంగా ప్రపంచించినవాడు. ఆయన రచించిన 'రిపబ్లిక్' అనే గ్రంథం ప్రధానంగా ఆదర్శరాజ్యవాదాన్ని వివరించేది. అందులో ఎడనెడ కళలనుగురించి, కవిత్వాన్ని గురించి వ్యక్తం చేసిన అభిప్రాయాలే అనేక యుగాల విమర్శకులకు ఆదర్శసూత్రాలుగా పనికివచ్చాయి.

కళ జీవితాని కుపయోగపడాలని (Art for life's sake) ఆయన వాదం. కళలు, కవిత్వం మానవాళిని అభివృద్ధిచేయటానికి కానీ, విజ్ఞానవంతంచేయటానికిగానీ తోడుపడవని భావించి వాటిపట్ల కొంత చిన్నచూపు చూచాడు ప్లేటో. ఆయన ప్రతిపాదించిన 'Theory of Ideas', 'Theory of Imitation' గ్రీకుతత్త్వశాస్త్రమూలాలు. భావాలన్నీ భగవచ్చైతన్యంలో భాసించే ప్రాగ్రూప సత్యాలే. ప్రకృతి అంతా వాటి అనుకరణమే. ఆ అనుకరణకు అనుకరణంగా భావాలను చిత్రించే కళలన్నీ సత్యానికి రెండంతరాల దూరంలో ఉండేవని ఆయనవాదం. ప్రాగ్రూపసత్యాన్ని అందుకోవాలని యత్నించటానికి బదులు దానిఅనుకరణను అనుకరించి కళాఖండాలు సృష్టిస్తారు కళాకారు లంటాడాయన అందువలన కళ అనుకరణకు అనుకరణ మని ఈసడించాడు.[4] ఆధ్యాత్మికదృష్టితో, ఆదర్శదృష్టితో కళను దర్శించిన ప్లేటో, కవిత్వం విషయ వ్యామోహాలను ఎండించడానికి బదులు పెంచి పోషిస్తుందనీ, మానవసమాజం సుఖంతో, సచ్ఛీలంతో అభ్యుదయం సాధించటానికి అనువుగా విషయప్రవృత్తి ప్రసారం కాకుండా, ప్రాతిభాసిక సత్యాలను కల్పించి లోకాన్ని లోభపెడుతుందనీ భావించాడు.[5] కవి ప్రవక్తకూ పిచ్చివానికీ మధ్యస్థంగా ఉంటాడని వచించాడు. దివ్యావేశం కలిగినప్పుడే కవి కవిత్వం చెప్పగలడన్నాడు. కవితకు ఆకృతికంటె ఆలోచన ముఖ్యమన్నాడు. సమాజంలోని వ్యక్తుల శీలాన్ని మలచేవాడే ఉత్తమ కళాకారుడని సంభావించాడు. నాటకంకంటె ఇతిహాసం ఉత్తమ ప్రక్రియ అని నిరూపించాడు. సమాజశ్రేయస్సును భంగంపచేసే కవిత్వాన్ని ఆయన తీవ్రంగా

నిరసించాడు. ప్లేటో తన గ్రంథంలో పేర్కొన్న నియమాలలోని (The Laws) ఈ మాటలు గమనింపతగినవి— "No Poet shall write any Poem that conflicts with what, in accordance with the public standard, is right and lawful, beautiful and good; nor show his compositions to any private individual until they have been submitted to the appointed Judges in these matters and to the guardians of the law, and been officially approved".[6] నైతిక ప్రమాణాలతో కవిత్వాన్ని అనుశాసించటం ఆయన విమర్శలక్షణం. అయినా ఆయన ఇదమిత్థంగా ఒకకావ్యాన్ని తనప్రమాణాలతో విమర్శించి చూపలేదు.

గ్రీకువిమర్శలో ప్లేటో తరువాత ఆయనశిష్యుడు అరిస్టాటిల్ మరొక మహాశిఖరంలాంటివాడు. క్రీ. పూ. 384 నుండి 322 వరకు జీవించాడు. ప్లేటో స్థాపించిన అకాడమీ ఆఫ్ ఏథెన్సులో చదివి ఉత్తీర్ణుడై, ఆయనతో దాదాపు రెండు దశాబ్దాలు కలిసి జీవించి, అలెగ్జాండరుకు గురువై ప్రసిద్ధ సాహిత్య ప్రవక్తగా ప్రఖ్యాతిగాంచాడు. అతడు వ్రాసిన గ్రంథం 'The Poetics'. అది అసమగ్రమైనా అందులో విషాదాంత, మోదాంత రూపకాలను గురించీ, ఇతిహాస కవిత్వాన్ని గురించీ ప్రపంచించిన సూక్తాలు సాహితీలోకానికి ప్రామాణిక సూత్రాలుగా నిలిచాయి. కవిత్వాన్ని అసత్యంగా, అనిత్యంగా, హానికరంగా భావించిన ప్లేటో అభిప్రాయాలను ఖండించి సాహిత్యతత్త్వాన్ని నిరూపించే దృక్పథంతోనే అరిస్టాటిల్ తన పొయెటిక్స్ వ్రాసినట్లు స్పష్టమౌతుంది.[7] ప్లేటో అనుకరణవాదంలోవి అనుకరణశబ్దాన్ని అరిస్టాటిల్ అభినవంగా వ్యాఖ్యానించాడు. అనుకరణమంటే ప్లేటోమతంలో అనుసృజన మన్నాడు. వాస్తవజగత్తులో సాక్షికంగా ప్రత్యక్షమయ్యే ఆదర్శసత్యాన్ని కళాకారుడు దర్శించి దానికి సమగ్రాభివ్యక్తిని సంతరించటానికి తన సృజనవ్యాపారంద్వారా ప్రయత్నించి, శక్తికొలది నిర్మించి కృతకృత్యుడౌతాడని పేర్కొన్నాడు. ఈతని అనుకరణ సిద్ధాంత వ్యాఖ్యానం యూరపు విమర్శకుల మన్ననలను విస్తారంగా పొందింది,[8] అనేకులకు శిరోధార్యమైంది. అరిస్టాటిల్ - కవిత్వానికీ, చరిత్రకూ గల భేదాన్ని నిరూపించిన అంశాలూ, విషాదాంత మోదాంత నాటకాల నిర్వచన స్వరూపనిరూపణలూ, పాశ్చాత్య సాహిత్య విమర్శలో అనేక సమన్వయాలకూ, సంఘర్ష

ఇలకూ దారితీశాయి. అతడు ప్రతిపాదించిన 'కెథారిసిస్'ను గురించి తరువాతి విమర్శకులు వివేచించి, వివిధ వ్యాఖ్యానాలు చేశారు. కరుణ(pity), భయం (fear) అనే భావాలనుగూర్చి వితర్కించారు; విషాదాంతనాయక లక్షణాలూ, విషాదాంత వస్తులక్షణాలూ, షడ్విధ స్వభావాలూ, ఐక్యత్రయ స్వరూప స్వభావాలూ, ఐతిహాసిక కవిత్వ లక్షణాలూ, మొదలైన అంశాలు తరువాతి విమర్శలలో చర్చావేదిక లయ్యాయి. సమగ్రగుణ సమన్వితం కాక పోయినా అరిస్టాటిల్ పొయెటిక్స్ గ్రంథం కొన్ని యుగాలవరకు సాహిత్య విమర్శ చైతన్యాన్ని పోషిస్తూ ప్రభావయుతంగా ముందుకు సాగించిన ప్రామాణిక లక్షణగ్రంథం. భారతీయులకు భరతనాట్య శాస్త్రంలాగా, పాశ్చాత్యులకు అరిస్టాటిల్ పొయెటిక్స్ అపర్వ విమర్శ లక్షణశాస్త్రం. జె. డబ్ల్యు. హెచ్. ఆట్కిన్స (J.W.H Atkins) ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని ఇలా ప్రశంసించాడు.

"Aristotle's POETICS is a comprehensive treatment of Poetry, it's nature and art, revealing many of the first principles of literary theory and the canons of the dramatic art and constituting, besides a valuable study of critical method, a mine of suggestive ideas and one of the few pieces of systematic criticism that have come down from the ancient world"[9]

## లాటిన్ సాహిత్య విమర్శ - హోరేస్, క్వింటిలియన్

లాటిన్ సాహిత్య విమర్శలో అగస్టన్ యుగం (Augustan Era) (క్రీ. పూ. 31 నుండి 14 వరకు) ఉజ్జ్వల కాలం. అందులో హోరేస్ అద్వితీయ స్థానాన్ని ఆక్రమించాడు విమర్శలో. ఆతడు రచించిన 'Epistles' రెండు భాగాలుగా ఉంది. మొదటి భాగంలో ఛందస్సు, కవితా పాకం మొదలైన అంశాలపై కొన్ని ప్రశంసలున్నా, రెండవ భాగంలో సాహిత్య విమర్శ మీద రెండు దీర్ఘలేఖ లున్నాయి Epistles కు Art Poetica అనే పేరుండేది. అంటే విమర్శను కవితా రూపంలో వెలువరించిన గ్రంథం అన్నమాట. అందులో అరిస్టాటిల్ కవితా సిద్ధాంతాలను ఆధారంగా చేసికొని అతడు సంప్రదాయ పద్ధతిని ప్రబోధించాడు. కవిత్వం ఉపరంజింపచేయటంతోపాటు, ఉపదేశించాలని ప్రవచించాడు. "By at

once delighting and teaching the reader. the poet who mixes the sweet with the useful has everybody's approval" అని కవులకు హితవు చెప్పాడు. సాహిత్యానికి ఉత్తమ రుచి అవసరమని చెప్పిన ఆయన వాక్యాలూ, కవితాపాకాన్ని గురించి చేసిన వివేచనం విలువైనవి. కావ్యకళకు సంబంధించిన అరిస్టాటిల్ భావబీజాలను యూరపు ఖండ సాహితీ క్షేత్రాలలో వెదజల్లిన గౌరవం హోరేస్‌కు దక్కింది.

హొరేస్ తరువాత లాటిన్ విమర్శలో ప్రసిద్ధ వ్యక్తి క్వింటిలియన్ (Quintilian) (క్రీ.శ. 35-95) ఈయన వ్రాసిన మూడు గ్రంథాలలో INSTITUTIO ORATORIA ప్రఖ్యాతి గాంచింది. శైంట్స్‌బరీ ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని గురించి యిలా అన్నాడు-"It may indeed be said that a man's competence in criticism itself may almost be measured by the estimate he holds of his remarkable book. It is not precisely a work of genius : its intentions were too strictly practical for that. But it is the work of a master of his own craft, who to professional knowledge and practical experience added unusual common sense, a sufficient dose of originality, a saving sense of humour, acuteness, freedom from any blinding or paralysing partiality, with at the same time a sensible though not extravagant patriotism in regard to the literature of his own Country".[10] ఈతడు గ్రీకు రోమన్ సాహిత్యాల, గ్రీక్ లాటిన్ భాషల తులనాత్మక పరిశీలనం చేశాడు. లాటిన్ భాష పరిణతి చెందవలసిన విలువైన మార్గాలను సూచించాడు. విమర్శలో పారిభాషిక పదాలను వ్యవస్థీకరించాడు. వచనరచనం కూడా ఒక కళ అని ప్రతిపాదించాడు. విశిష్టపదరచనా రూపమైన రీతిలాంటి కావ్యశైలి సిద్ధాంతాన్ని ఈయన విమర్శలో వెలయించాడు. శైలిలో పదాల ఎన్నికకు, కూర్పుకు, స్పష్టతకు, ఆలంకారిక సౌందర్యానికి, నిర్మాణ శిల్పానికి, లయబద్ధమైన ప్రవాహ లక్షణానికీ ఉన్న ప్రాధాన్యాన్ని ప్రపంచించాడు. మొత్తానికి ఈతడు రీతివాదిలా కనపడతాడు.

# రోమన్ సాహిత్య విమర్శ - లాంగినస్, డాంటే

రోమన్ సాహిత్య విమర్శలో లాంగినస్ మేరు శిఖరం లాంటివాడు. "On the Sublime" అన్న గ్రంథాన్ని ప్లేటో ప్రభావంతో రచించినా కవితాశైలి, సాహిత్య విమర్శ ప్రమాణాలు మొదలైన అంశాలను ఆయన విశేష ప్రతిభతో ప్రతిపాదించాడు. ఆక్స్‌ఫర్డ్ క్లాసికల్ డిక్షనరీ ఈ గ్రంథ ప్రాశస్త్యాన్ని ఇలా ఉగ్గడించింది- "The work (despite gaps) is one of the greatest of all critical acheivements. An illuminating dissertation on style, accompanied by many penetrating Judgements, as well as suggestive pronouncements on critical standards and principles, the treatise is unique in its interpretation of classical spirit, its compelling enthusiasms, its sanity, its freshness, and its unerring insight into the essentials of art"

లాంగినస్ పాశ్చాత్య సాహిత్యాని కిచ్చిన ఉపాయనం సబ్లిమిటీ సిద్ధాంతం. అతనికి పూర్వమున్న విమర్శకులు- కవిత్వం ఉపరంజనాన్నీ, ఉపదేశాన్నీ అందించాలనీ, వచనరచన పఠితను అనునయించేటట్లుండాలనీ నిర్దేశిస్తే, ఈయన రచనవలన పఠితకు అతీంద్రియమైన అనుభవస్థితి యేర్పడాలని ప్రతిపాదించాడు. ఉదాత్తరచన ఆహ్లాదాన్ని కలిగించి ఊరుకోరాదు; భావోత్కటస్థితిని (Ecstasy) కలిగించాలి. రచయిత ఉక్తిశక్తిలోని ఉజ్జ్వలత్వంవలననే భావోత్కటస్థితి ఏర్పడుతుంది. భావోత్కటస్థితిలో పఠిత పొందే అతీంద్రియానుభవస్థితియే సబ్లిమిటీ. ప్రతిభావంతుని ఆత్మప్రతిస్పందనమే సబ్లిమిటీ అనీ, అది రచనలోని రీతి వలననే కలుగుతుందనీ, అది మహాకవుల లక్షణమనీ, సాంద్రత దాని స్వభావమనీ ఆయన సబ్లిమిటీని నిర్వచించి విశదీకరించాడు.[11] ఉదాత్త భావనం, ప్రకృష్ట భావాభివ్యక్తి, సార్థకాలంకార ప్రయోగం, పరిపక్వపాకం, విశిష్టపదరచన అనే అంగపంచకంతో సబ్లిమిటీ రూపు కట్టుతుందని ప్రతిపాదించాడు. ఇతడు రీతివాదిగా, ఉత్తమ భావుక విమర్శకునిగా ప్రశస్తిగాంచాడు.

ప్లేటో కంటె, అరిస్టాటిల్ కంటె ఈతనియందు కనబడే వైశిష్ట్యాన్ని వివరిస్తూ బసవరాజు వేంకట అప్పారావు గారు ఇలా అన్నారు. "కావ్య ప్రపంచమునకును బాహ్య ప్రపంచమునకును, సూత్రాత్మ లనదగు ప్రధాన విషయముల నెక్కువభేద ముండదనియు, నప్రధానములగు తక్కుంగల నియమముల విషయముననే భేదము కలుగుననియు. బాహ్య ప్రపంచము నకును జన్మ స్థానమగు భగవంతుడే ఈ రెండు ప్రపంచములకును సూత్రాత్మల విషయముననగల యైక్యభావమునకు గారణమనియు దెల్పెను. అట్లు తెల్పి కావ్య ప్రపంచ మభూతకల్పితము గాదనియు ప్రకృతి పరిణామ భేదములన్నియు సూక్ష్మముగను, గొన్నియెడల స్థూలముగను గూడ గావ్య ప్రపంచమునకు వర్తించుననియు, నందుచే గావ్యపరమావధి ప్రహసన ప్రలాపాదిశుష్కనీరసవాక్యరచన గాదనియు, రసోద్దీపకమగు స్వతంత్ర కావ్య రచనమే యనియు, నందుచే గవి యసత్యప్రలాపి కాడనియు. నతీత సామ్రాజ్యమున వేదాంతులకన్నను, మతస్థాపకులకన్నను, శాస్త్రకర్తలకన్నను నెక్కుడుగ గౌరవింపబడి వారి యందఱికన్న మిన్నయై పరమేశ్వరునితోడ నర్ధసింహాసనాసీనుడగుననియు, నగారామోయించినటుల వాక్రుచ్చి గురు శిష్యులిరువుర సిద్ధాంతములను గాలికెగురగొట్టి లాంజీనీసు రస సిద్ధాంతము నకు బాశ్చాత్యులలోనెల్ల మార్గదర్శి యయ్యెను."[12]

అప్పారావుగారివన్నట్లు లాంగినస్ రసవాది అని నిర్దేశించటం కష్టం. "Style, for Longinus, is the life and blood, the very spirit of a work and of the personality of its author. He was the first to assert that style is the man"[13] అన్న విమర్శకుల అభిప్రాయాన్ని గమనిస్తే ఆయన 'రీతిరాత్మాకావ్యస్య' అని ప్రతి పాదించిన వామనుని కోవకు చెందినవాడని భావించటం సమంజసం!

లాంగినస్ క్లాసికల్ విమర్శకులలో మొదటి రొమాంటిక్ విమర్శకు డనీ, క్లాసిసిజమునూ, రొమాంటిసిజమునూ మేళవించిన సమన్వయ విమర్శకుడనీ, ప్రాచీన విమర్శకులలో ఆధునికుడనీ పలురకాలుగా విమర్శకులు అభివర్ణించారు. "For him classicism was touched with romance, but not darkened. His romanticism was sane

and bright by dint of contact with the classical order"[14] అన్న స్కాట్ జేమ్స్ మాట లావిమర్శకుని సమన్వయ సాహితీవ్యక్తిత్వానికి సరసనీరాజనాలు. కాల్పనికయుగోదయ ఉషఃకాంతులు ఈతని విమర్శలో చర్చనమిస్తాయి.

ఈ యుగంలో పేర్కొనదగిన మరొక మహాకవి, విమర్శకుడు డాంటే. (Dante Alighieri 1265—1321). గ్రీకు సాహిత్యంలో హోమర్ రచించిన ఇలియడ్, లాటిన్‌లో వర్జిల్ రచించిన Aeneid, మహాకావ్యాలుగా ఎంత ప్రసిద్ధి చెందాయో ఇటాలియన్ భాషలో డాంటే రచించిన డివైన్‌కామెడీ అంత ప్రశస్తిపొందింది. మహాకవియైన డాంటే దేశభాషాభిమాని. గ్రీక్ లాటిన్ భాషలలాగనే ఇటాలియన్ భాషకు గౌరవప్రపత్తులు కలిగించేకృషి విమర్శద్వారా సాగించిన మనీషి. అతని ప్రసిద్ధరచన—De Vulgari Eloquio. దీనికి ఇంగ్లీషులో సమానార్థకమైన పేర్లు - "of the Vulgar Tongue— 'లేదా - of writing in the Vernacular.' సంస్కృతంతో సమానప్రతిపత్తిని తెలుగుభాషకు కల్పించే ప్రయత్నంచేసిన దేశకవులలాగా, వ్యావహారికాంధ్రం మహాకావ్యరచనకుగూడా శక్తిమంతమైనదనే తెలుగు వ్యావహారిక భాషావాదులలాగా డాంటే తన మాతృభాషాభివృద్ధికి కృషిచేశాడు విమర్శద్వారా. దేశభాషలలో ఉదాత్తకావ్యరచనారీతిని ప్రచారంచేశాడు. దానికి ఉపబలకంగా యూరపుభాషల తులనాత్మక అధ్యయనాన్ని ఆరంభించి నిర్వహించాడు. Saintsbury అతని యత్నాన్ని యిలా ప్రశంసించాడు- "No ancient eritic could have made such a survey as he makes of the different languages of Europe; no ancient critic did make such survey of the dialects of Greek as he makes of the dialects of Italian."[15] ఇటలీలో పుట్టిన 'గిడుగు పిడుగు' లాంటివాడు విమర్శలో డాంటే. వీరిద్దరి మాతృభాషాభిమానం ఆ భాషా సాహిత్యాలు వృద్ధిచెందటానికి రాచబాటలు వేసింది.

పాశ్చాత్య సాహిత్యాలలో పునరుజ్జీవన యుగోదయనికి ఇటలీ దేశంలో సాహిత్య విమర్శలో కలిగిన పరిణామాలు బలమైన కారణాలుగా నిలిచాయి. Laurentius Valla, Politian, Vergerius, Vittorino da Feltre, Guarino da Verona, Leonardo Bruni మొదలైన మానవతావాద

విద్వాంసులు ప్రాచీనకావ్యాలను, గ్రంథాలను సేకరించి, వాటిని అనుశీలించి విద్యావిధానంలో ఒకభాగంగా ప్రసరింపచేసే విశిష్టప్రయత్నాలు చేశారు. దానితో సాహిత్యాధ్యయనంలో వినూత్న మార్గాలూ, ధోరణులూ, విమర్శలో వినూత్నఫణుతులూ వెలుగులోనికి వచ్చాయి. వాటి ప్రభావం క్రీ. శ. 16వ శతాబ్దంలో ఆంగ్లసాహిత్యంమీద పడింది. Colet, Erasmus, Vives మొదలైన విమర్శకులు ఇంగ్లీషులో ఈ ధోరణులను బలపరిచారు. వక్తృత్వం, కవిత్వం, చరిత్ర, తత్త్వశాస్త్రం–వాటి పరస్పర సంబంధాలను, వాటి వాటి వ్యక్తిత్వలక్షణాలనూ వివేచించారు. ప్రమాణాలు ప్రాచీనాలైనా ఆంగ్లభాషా శైలికి వాటిని వర్తింపచేసి, ఆంగ్లసాహిత్యంలో రీతివాదాన్ని పెంపొందించారు.

ఇంగ్లీషు సాహిత్యవిమర్శలోని పునరుజ్జీవన యుగానికి పునాదులు వేసిన విమర్శకత్రయం Thomas Wilson, Sir John Cheke, Roger Ascham. వీరు 16వ శతాబ్ది మధ్యభాగంలో ఉన్నారు. వీరు ముగ్గురూ ప్రధానంగా ఆంగ్లభాషాశైలి దేశీయంగా, జాతీయంగా ఉండాలని ఉద్బోధించారు. విల్సన్ రచించిన 'Art of Rhetoric' గ్రంథంలో రచన ప్రసన్నంగా ఉండాలనీ, రచయిత యెన్నుకొనే శబ్దాలు సరళమైనవీ, దేశీయమైనవీ, సర్వజనసులభంగా ఉండేవీ కావాలనీ, అన్యభాషాపదాలతో శైలిని మిశ్రమంచేయకుండా ఆంగ్లభాషాస్వభావం అచ్చుపడేటట్లుండాలనీ అనుశాసింపబడింది. సర్ జాన్ చెక్ ఆంగ్లరచనలలో కనపడే కృత్రిమత్వాన్నీ, అశ్లీలత్వాన్నీ, గ్రీక్ జాతీయాలతో కూడుకొన్న మిశ్రమత్వాన్నీ గర్హించాడు. రోజర్ ఆస్చమ్ ఇంగ్లీషు రచనలలో లాటిన్, ఫ్రెంచి, ఇటాలియన్ భాషా పదాల ప్రయోగ బాహుళ్యం వలన ఏర్పడుతున్న శైలిలోని సాంకర్యాన్ని విమర్శించాడు, శ్రవణసుభగంగా లేని రచనలోని లయను గర్హించి, మాధుర్యం రచనకు జీవితమని ప్రవచించాడు. ఈ విమర్శకత్రయాన్ని Tudor critics అంటారు. వీరు సాహిత్య ప్రమాణాలను ప్రాచీనుల నుంచి గ్రహించినా ఆంగ్లభాషాశైలి అన్యభాషా సంపర్కంనుంచి దూరమై, దేశీయమైన సారళ్యాన్ని సంతరించుకోవాలని యేకగ్రీవంగా ప్రతిపాదించారు. ప్రసన్నశైలీప్రస్థానానికి ప్రాతిపదికలు వేశారు.[16]

ఈ యుగంలోనే కవులనూ, కవిత్వాన్నీ, సాహిత్యపువిలువలనూ ఈసడించి చిన్నచూపుచూచే విమర్శకులు కొందరు వెలిశారు. వారందరిలో ఎన్నదగినవాడు స్టెఫెన్ గాసన్ (Stephen Gosson). అతని గ్రంథం 'The School of Abuse' ఆ వర్గంవారి అభిప్రాయాలకు ప్రాతినిధ్యం వహిస్తుంది. గాసన్ దృష్టిలో కవులు వినోదవాద్యకారులు, విదూషకులు. కవిత్వం అబద్ధాల తల్లి, అనర్థాల దాది. కవిత్వంతో కాలంగడపటం నిరుపయోగమైన జీవన వ్యాపారం. అందువలననే ప్లాటో కవులను తన ఆదర్శలోకాన్నుంచి దూరంచేశా డని అతనివాదం [17] ఇటువంటి అరసికవాదాన్ని అభిశంసించి కవిత్వస్వభావాన్నీ, ప్రయోజనాలనూ ప్రపంచించటానికి యత్నించిన విమర్శకుడు ఫిలిప్ సిడ్నీ.

## పునరుజ్జీవన విమర్శయుగం- ఫిలిప్ సిడ్నీ, బెన్ జాన్సన్

ఫిలిప్ సిడ్నీ (1554–86) ముప్పైరెండేళ్ళే బ్రతికినా వీరుడుగా జీవించాడు; వీరోచితంగా గాసన్‌వాదాన్ని ఎదిరించాడు. 'Apology for Poetry' ఆయన ఉద్యమానికి ఉజ్జ్వల ప్రతీకగా నిలిచిన గ్రంథం. దీనిలో రెండుభాగా లున్నాయి. 1. Appologie for Poetrie 2. The Defence of Poesie. మొదటి భాగంలో కవిత్వాన్ని ఎందుకు విలువకట్టాలో, దాని స్వభావాన్నీ ప్రయోజనాలనూ ఏ ప్రమాణాలతో పరిగణించాలో సిడ్నీ వివరించాడు; రెండోభాగంలో గాసన్ వంటి విమర్శకుల అభిప్రాయాలను ఖండించి, అప్పటి ఆంగ్లకవిత్వ స్వరూపస్వభావాలను అనుశీలించాడు.

కవి శబ్దవ్యుత్పత్తిని చర్చిస్తూ కవి ఋషివంటి వాడనీ, స్రష్ట అనీ నిరూపించాడు. రోమన్ భాషలో కవిని Vates అంటారు అంటే 'Prophet లేదా seer' అని అర్థం; గ్రీకుభాషలో Poiein అంటారు; అంటే– 'maker' or 'creator' అని అర్థం. ఇది కవి విదూషకుడన్న వితండవాదానికి విఖండనం.

అజ్ఞానాంధకారాన్ని పారద్రోలే విజ్ఞానజ్యోతిగా కవిత్వాన్ని ఫిలిప్‌సిడ్నీ అభివర్ణించాడు; అఖండజ్ఞానాన్ని మానవు డార్జించటానికి తగిన అర్హతలను తంచెలంచెలుగా అందించటానికి కవితాక్షీరాల నందించే మాతృమూర్తిగా

కవితను దర్శించాడు.[18] ప్లేటో అభిప్రాయంలో రచనకు తాత్త్వికదర్శనం ఆత్మశక్తియనీ, కవిత సౌందర్యమనీ వ్యాఖ్యానించాడు. అనుకరణశబ్దానికి అరిస్టాటిల్ ఇచ్చిన అన్వయాన్ని ఆలంబనంగా చేసికొని సరికొంత ముందుకు సాగి 'ఉదాత్తీకరించటం; 'నూత్నసృష్టి చేయటం' అనే అర్థాలను చెప్పాడు. అతని మతంలో 'The Poet, lifted up with his vigour of his own invention, doth grow, in effect, into another nature, in making things either better than nature bringeth forth or quite anew, forms such as never were in nature."[19] అరిస్టాటిల్ దృష్టిలో- కవి తాత్త్వికదృక్పథంతో లోకసత్యాలను ఆదర్శసత్యాలుగా దర్శించి, వ్యష్టినుండి విశ్వజనీనతను వ్యక్తీకరిస్తాడు. సిడ్నీదృష్టిలో— కవి ప్రతిభానేత్రంతోనే ఆదర్శసత్యాలను దర్శించి విశ్వజనీనతను కళలో ప్రపంచిస్తాడు. సిడ్నీ కవిత్వాన్ని, దాని ప్రవృత్తులనుబట్టి మూడువిధాలుగా విభజించాడు. 1. మతకవిత్వం. 2. తాత్త్విక కవిత్వం. 3. మానవ జీవితాన్ని భావనావిషయం చేసే కవిత్వం—అని. ఆ తరువాత ప్రక్రియలను బట్టి అంతర్విభాగం చేశాడు. వాటిలో ముఖ్యమైనవి— వీరగాథాకవిత్వం (Heroic Poetry), గేయకవిత్వం (Lyrical Poetry). విషాదకవిత్వం (Tragic, Poetry) వినోద కవిత (Comic Poetry), అధిక్షేప కవిత (Satiric Poetry), పల్లీయ కవిత్వం (Pastoral Poetry), ఇయాంబిక్ గణాలతోకూడిన స్వరక్లిష్టతలేని కవిత్వం(Iambic Poetry), స్మృతికావ్యం (Elegiac Poetry). వీటి స్వరూప స్వభావాలను వివేచించాడు. తత్త్వశాస్త్రంకంటె, చరిత్రకంటె కవిత్వం గొప్పదని వక్కాణించాడు. 'The Poetry is the food for the tenderest stomachs; the poet is indeed the right popular Philosopher"[20] అన్నాడు. కవిత్వాన్ని నిరసిస్తూ గానన్ మొదలైనవారు చెప్పిన అంశాల కన్నింటికీ పేరుచెప్పకుండా ప్రతిఖండనలు చేసి చూపించాడు. తత్త్వశాస్త్రాదులు వివేకాన్ని, విజ్ఞానాన్ని మానవాళికిస్తే, కవిత్వం జ్ఞానానికి ఫలమైన అనుభూతి నందజేస్తుంది. శాస్త్రవేత్తల ప్రకటనలలో అబద్ధా లుంటాయి కాని కవితలలో అబద్ధా లుండటానికి వీల్లేదు. సత్యాసత్య నిరూపణం కాదు సాహిత్యధర్మం; ఉండతగిన వాటిని ఉండకూడనివాటిని నిర్దేశించటం దాని లక్షణం. కవిత్వంలోని భావ సత్యాలు అబద్ధాలు కావు—అని పేర్కొన్నాడు. సమకాలీన ఆంగ్లకవులకు

హితవు చెపుతూ—వారికి తామేమి చేయాలో తెలిసిఉండటంతోపాటు ఎలా చేయాలోకూడా ఎరుక ఉండాలన్నాడు. విషాదాంత రూపకాలనుగురించి చర్చించి –"A tragedy is tied to the laws of Poesy, and not of history; not bound to follow the story, but having liberty either to feign a quite new matter, or to frame the history to the most tragical conveniency"[21] అని రచయిత స్వేచ్ఛను సమర్థించాడు. సమకాలీన నాటక రచనావిధానాలను విమర్శించాడు. నాటి ప్రేమకవిత్వంలో నిజాయితీతోకూడిన నిండైన అనుభవ సాంద్రత లేదని వాపోయాడు; రచనలలో మారుమూలపదాలను వాడటాన్నీ, అర్థరహితమైన లడంబరత్వాన్నీ గర్హించాడు; అలంకారాలను అవసరమున్నప్పుడే ఔచిత్యంతో అత్యంత స్వాభావికంగా, జీవితానుభవాన్ని అందించేలాగా రచనలో వాడాలని నిర్దేశించాడు; ఛందస్సునుగురించి చర్చిస్తూ- "The ancient marked the quantity of each syllable, and according to that framed his verse; the modern observing only number with some regard of the accent, the chief life of it standeth in that like sounding of the word, which we call rhyme"[22] అని పేర్కొని ఆంగ్లచ్ఛందం రెండు పద్ధతులలోనూ రాణిస్తుందని నిర్ధరించాడు. సిడ్నీకాలంనాటికి ఆంగ్లసాహిత్యం అంతగా విస్తృతి పొందక పోవటంచేత అతని విమర్శ ప్రధానంగా కవిత్వపు విలువలను, ప్రయోజనాలను గురించి సిద్ధాంతీకరించే ప్రవృత్తినే ఎక్కువగా ప్రకటించింది. ఆంగ్ల సాహిత్యచరిత్రలో మొదటి ఉత్తమలక్షణ విమర్శగ్రంథంగా ఇతని 'అపాలజీ అఫ్ పొయెట్రీ' పరిగణింపబడటమే కాకుండా భావితరాలమీద ప్రభావంచేసిన విమర్శగ్రంథంగా కూడా లెక్కింపబడుతున్నది.

ఆంగ్లసాహిత్య చరిత్రలో పునర్వికాస యుగం సాహిత్యశాఖా విస్తృతికి ప్రసిద్ధం. పద్య గద్య నాటక ప్రక్రియలు ఈకాలంలో మూడుపూవులారు కాయలుగా విస్తరిల్లాయి. అందులోనూ నాటకప్రక్రియ అన్నింటికంటె ముందు నడిచింది. షేక్స్పియర్ (1564-1616) వంటి మహా నాటకకర్త ఈ యుగంలో వెలిశాడు. విమర్శకూడా స్వతంత్ర ప్రతిపత్తితో విస్తరిల్లింది. సిద్ధాంత కల్పనలకంటె, లక్షణ విమర్శకంటె అనుశీలనాత్మకమైన విమర్శ తలయెత్తింది. వివిధ ప్రక్రియలు అభివృద్ధి చెందు

తున్న ఈ యుగంలో పరచయితలకు ప్రమాణాలపట్ల ప్రామాణికభావం సడలి కాల్పనిక ప్రవృత్తియందలి అభిమానంతో విశృంఖలత్వం ప్రబలింది. దాన్ని అపరోధించి అనుశాసించే బాధ్యతకూడా సాహిత్య విమర్శ తీసికొన్నది. ఇటువంటి విమర్శప్రవృత్తికి బెన్‌జాన్‌సన్ (1573-1637) ప్రతినిధిగా నిలబడతాడు. అతడా యా సమయాల్లో వ్రాసిన గ్రంథపీఠికలలోనూ, సమీక్షలలోనూ అతని విమర్శదృక్పథం వ్యక్తీకరింపబడింది. 'Conversations with 'Drummond', Discoveries' లేక 'Timber' అనేవి యితని ప్రసిద్ధరచనలు విమర్శలో. సాహిత్యవిమర్శకునిగా బెన్‌జాన్‌సన్ కృషినీ, వ్యక్తిత్వాన్నీ వివేచిస్తూ David Daiches ఇలా తీర్మానించాడు. "A critic who endeavours to develop his theory and practice on the basis of the achievements of the great Greek and Latin writers and who tries to systematize classical practice and classical critical ideas into a set of rules for the guidence of modern writers".[23] ప్రాచీననియమాలకు కట్టుబడనట్టి ప్రతిభావంతుడైన షేక్స్‌పియర్ నాటకాలను విమర్శించేవిధంలో బెన్‌జాన్సన్ ప్రాచీన ప్రమాణ సంస్కారాన్ని ఎంత ప్రపంచించాడో, ప్రయోగవిజ్ఞానంతో కూడి కొన్న సాపేక్ష ప్రమాణాల వినిమయ వివేకాన్ని అంత వెలార్చాడు. ఇతడు అనుశాసన మెంత నిశితంగా చేయగలడో అనుశీలనం అంత నిపుణంగా సాధింపగలడు. అయితే, అనుశీలనంలో అప్పుడప్పుడు స్వీయాభిరుచుల రంగరింపు నధికంగా చేసే స్వభావం ఇతనికున్నది. అది అతని విమర్శకు మచ్చకాని మచ్చ. 'ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతి....'

## రెస్టొరేషన్‌యుగ విమర్శ—జాన్ డ్రైడెన్

క్రీ. శ. 17వ శతాబ్ది మధ్యభాగకాలంలో ఆంగ్ల సాహిత్య విమర్శ మీద ఇటలీ, ఫ్రాన్స్ మొదలైన దేశాలలో ప్రచురంగా ఉన్న నియోక్లాసికల్ విమర్శసూత్రాల, విశ్వాసాల ప్రభావం అధికం కాజొచ్చింది. దాన్ని నిలువరించి, ఆంగ్ల సాహిత్య విమర్శవ్యక్తిత్వాన్ని వెలువరించటానికి విశిష్ట కృషి చేసిన విమర్శకులలో జాన్‌డ్రైడెన్ (John Dryden) (1631-1700) శిఖర ప్రాయుడు; ఇతడు రెస్టొరేషన్ విమర్శయుగ నాయకుడు. డాక్టర్

జాన్సన్- డ్రైడెన్‌ను 'Father of English criticism'గా అభివర్ణించాడు. ఆతరువాతి విమర్శకులుకూడా ఆ భావాన్ని గౌరవించారు. ప్రాచీన సమకాలీన సాహిత్యాన్ని ఒక సమగ్ర దృక్పథంతో సమీక్షించి విమర్శలో వినూత్న మార్గాలను చూపిన గౌరవం డ్రైడెన్‌కు దక్కింది.

జాన్ డ్రైడెన్ (1631-1700) వస్తుతః మహావిమర్శకలక్షణా లున్న మనీషి. ఆయన చేసిన విమర్శవ్యవసాయమంతా తానే స్వయంగా తన కృతులకు వ్రాసికొన్న పీఠికల రూపంగానూ, ఇతరుల కృతులకు వ్రాసిన పీఠికలరూపంగానూ, వెలువడింది. ఆయన పీఠికల్లో 'Essay of Dramatic Poesy' (1668) అత్యంత గణనీయమైనది. నలుగురు విమర్శ పాత్రల మధ్య జరిగిన చర్చారూపంగా, రూపక మర్యాదతో రూపొందిన విచిత్ర విమర్శ యిది. అందులోని విమర్శమిత్ర చతుష్టయం -Crites (డ్రైడెన్ బావమరది సర్ రాబర్ట్ హోవర్డుకు ప్రతినిధి). Lisideius (సర్ చార్లెస్ సెడ్లేకి ప్రతినిధి). Eugenius (లార్డ్ బుచర్‌స్ట్‌కు ప్రతినిధి). Neandar (స్వయంగా డ్రైడెన్‌కే ప్రతినిధి). నలుగురు పాత్రలూ నాలుగు భిన్న దృక్పథాలతో విమర్శ సాగించినట్లు డ్రైడెన్ చిత్రించాడు. నాటకోచితంగా సాగిన సాహిత్య మీమాంస అది. Crites ప్రాచీనులను పూర్తిగా సమర్థించే వాడు; Eugenius డ్రైడెన్ లాగానే అభ్యుదయ భావాలను ప్రకటించినా ఎలిజబెత్ కాలంలోని ఇంగ్లీషు నాటకాల ఉత్తమత్వాన్ని ఉల్లేఖించేవాడు; Lisideius ఫ్రెంచి నాటకాల ప్రాభవాన్ని ప్రశంసించేవాడు; Neandar ఫ్రెంచికంటె ఇంగ్లీషు ప్రయోగాల ప్రయోజకత్వాన్ని ప్రతిపాదించటంలో ప్రత్యేకాభినివేశాన్ని ప్రకటించేవాడు; వీరు పాత్రలైనా సమకాలీన విమర్శ దృక్పథాలకు సాహిత్యప్రతీకలు. రచయితకు ప్రతినిధిగా నిలిచే Neandar జాన్సన్, బీమాంట్, ఫ్లెచర్, షేక్స్పియర్ లాంటి నాటకకర్తల సాహిత్ వ్యక్తిత్వాలను ఉజ్జ్వలంగా చిత్రించాడు. గతాన్ని గుడ్డిగా అనుసరించే బానిసత్వాన్ని డ్రైడెన్ తీవ్రంగా గర్హించాడు, ఆధునిక రచనల అసలైన విలువలను నిగ్గుతేల్చే సముచిత సాంప్రదాయికప్రమాణాలను మాత్రమే గౌరవించాడు. స్వతంత్ర ప్రతిభను సమ్మానించాడు.

విమర్శకుడుగా జాన్ డ్రైడెన్ ప్రదర్శించిన విశిష్ట వ్యక్తిత్వాన్ని వివరిస్తూ అట్‌కిన్స్ పేర్కొన్న మాటలు స్మరణీయాలు. "The secret of Dryden's greatness as a critic lay after all in himself, in that native sensibility which made him keenly alive to artistic values, capable also of a dispassionate psychological analysis of those values. What he found to admire in Shakespeare or Chaucer was based on no formal rules, but on his own instinctive reactions submitted to the test of Nature of reason, a test, it should be added, which to him represented something more than mere common sense or the prose understanding. The truth was that his judgement, at its best, both in theorizing and appreciating, was of supra-rational kind. It sprang from an imaginative sympathy which soared beyond anything that the pure unaided intellect could discern. Firmly based on his own impressions, his appreciations were something more than the result of acute analysis and sound reasoning, that these two played their part in confirming the faith that was in him. They were rather the result of a synthetic process which viewed the effects observed with a critical insight akin to the creative vision, that detected in the multiplicity of those effects meaning and coherence, thus penetrating to the heart of things".[24]

జాన్ డ్రైడెన్ సమకాలీన సాహిత్యాంశాల నన్నింటినీ సమీక్షించి స్వతంత్ర సువిశాల దృక్పథాన్ని ప్రదర్శించాడు. కవిత్వ స్వభావాన్ని గురించీ, దాని ప్రయోజనాల గురించీ, నాటకకళను గురించీ, ఇతిహాసం, అధిక్షేప కావ్యం, అనువాదం, రైమ్ బ్లాంక్‌వర్సుల గుణగణాల గురించీ, వచనరచన లోని అంతెర్లయను గురించీ, విమర్శను గురించీ తన అభిప్రాయాలను నిస్సంశయంగా ప్రకటించాడు. ఆంగ్లసాహిత్యంలో మారుతున్న అభిరుచులను పర్తించి, వివిధప్రక్రియలలోని గుణాలను, ప్రత్యేకతలను, శిల్పాలను, విలువలను వివేచించి, అనుశాసనవిధానంలో కాక అనుప్రత్తిత విమర్శపద్ధతులలో వాటి స్వరూప స్వభావాలను సహృదయ వివేకంతో అనుశీలించాడు. నాటకాలలో పాత్రచిత్రీకరణ ప్రాముఖ్యాన్నీ, కోరస్, కాలైక్యాల నిరుపయోగత్వాన్నీ, కవిత్వానికీ యితర కళలకూ ఉన్న సంబంధాలనూ, విమర్శ

యొక్క ఉత్తమ ప్రయోజనాలనూ వివరించాడు. మానసిక శాస్త్రపద్ధతులనూ, తులనాత్మక విమర్శ పద్ధతులనూ, చారిత్రక విమర్శ విధానాలనూ సంవదించుకొని సాహిత్య సిద్ధాంతాలను ప్రవచించే వినూత్న విమర్శ మార్గాన్ని ఆవిష్కరించాడు. నాటకరచనలో పద్యరచన అవాస్తవంగానూ, కృత్రిమంగానూ ఉంటుందనే వాదాన్ని విమర్శించి నాటకశైలిలో లయకున్న ప్రాముఖ్యాన్ని ప్రయోజనాన్ని ప్రపంచించాడు. W. P. Ker డ్రైడెన్ విమర్శ వ్యక్తిత్వాని కిలా వాఙ్మయనీరాజన మిచ్చాడు- "His virtue is that at a time when literature was pestered and cramped with formulas he found it impossible to write otherwise than freely. He is sceptical, tentative, disengaged, where most of his contemporaries, and most of his successors for a hundred years, are pledged to certain dogmas and principles".[25]

## నియోక్లాసికల్ విమర్శయుగం – అడిసన్, పోప్, జాన్సన్

ఇంగ్లీషు సాహిత్య విమర్శలో నియోక్లాసికల్ ఉద్యమంలో ప్రధానంగా నాలుగు లక్షణాలు కనబడతాయి. "Follow the Nature" అన్న ప్రబోధం మొదటిది. అయితే అందులో 'Nature' అనేపదాన్ని అన్వయించటంలో భిన్నదృక్పథా లున్నాయి. ప్రకృతి అంటే బహిఃప్రకృతి; ఇంద్రియగోచరమైన వాస్తవ సత్యం. దాన్ని కవి నిజాయితీతో, విధేయతతో కావ్యంలో చిత్రించాలనేది మొదటివాదం. ప్రకృతి అంటే వ్యష్టిగా భాసించే వ్యక్తియొక్క ప్రకృతి కాదు; మానవస్వభావంలో సర్వసామాన్యంగా కనపడే మానవప్రకృతి. దాన్ని కవి కావ్యంలో చిత్రించాలనేది రెండవవాదం. ప్రకృతి అంటే ఉన్నది ఉన్నట్లుగా చూపేప్రకృతి కాదు; ఎలా ఉండాలో చెప్పే ఆదర్శప్రకృతి. కావ్యం ఉపదేశాన్నీ ఉపరంజనాన్నీ నిర్వహించాలి కాబట్టి కవి ప్రకృతిలోని సౌందర్యాన్నీ, ఆస్వాదగుణాన్నీ అధికరించి కవితలో అభివ్యక్తీకరించాలని చెప్పేది మూడవవాదం. ప్రకృతి అంటే కవియొక్క దివ్యభవ్య కవితావేశ శక్తి అని ప్రతిపాదించేది నాలుగవవాదం.

రెండవలక్షణం: ప్రాచీన కవుల సాహిత్య సమధికాధ్యయనం, ప్రాచీనప్రమాణాలను ప్రామాణిక దృష్టితో గ్రహించి విమర్శవిధానాలలో

పాలించటం. మూడవలక్షణం - కావ్యకళాశిల్పాలను నిర్దుష్టంగా నిర్వహించటం. నాల్గవలక్షణం-లోకవ్యవహార భాషాప్రయోగం కంటె విలక్షణంగా, విశిష్టంగా, ఉదాత్త గంభీరంగా ఉండే విశిష్టపదరచనను కావ్యశైలిగా పాటించటం. స్థూలంగా ఈ లక్షణాలు ఈ యుగ విమర్శకులలో కనపడినా వారు పూర్తిగా ప్రాచీనతకు బానిసలై పోయినవారు కారు. వారిలోనూ నూత్న దృక్పథాలూ, స్వతంత్రచింతనలూ స్పష్టంగా కనిపిస్తాయి. ఆ వెలుగురేకలు విరజిమ్మే విమర్శకు లీ యుగంలో ఉన్నారు. వారిలో ముఖ్యులు జోసెఫ్ అడిసన్, అలెగ్జాండర్ పోప్, శామ్యూల్ జాన్సన్.

జోసఫ్ అడిసన్ (1672—1719) 'స్పెక్టేటర్' పత్రికాసంపాదకుడుగా ప్రసిద్ధిచెందాడు. వ్యాసప్రక్రియలో విపులమైన విమర్శ వెలయించాడు. గ్రంథాలయాలకూ, పాఠశాలలకూ, కళాశాలలకూ పరిమితమైన సాహిత్య తత్త్వావగాహనను ప్రజలమధ్యకు తీసికొని రావలెనని పత్రికావ్యాసరచనను సాధనంగా ఎన్నుకొన్నాడు. విమర్శలో సాధారణంగా నియోక్లాసికల్ యుగ ప్రమాణాలను పాటించినా, విమర్శరంగాన్ని జీవితానికంతా విస్తరింపచేసి, ప్రజలలో ఉత్తమసాహిత్యాభిరుచిని, విలువలపట్ల ఆసక్తిని కలిగించే విధంగా రచనలు సాగించాడు. ఇతనికి పూర్వమున్న విమర్శకులు సాహిత్యలక్షణ వివేచనాన్ని ప్రధానంగా రచయితల నుద్దేశించి చేయగా, అడిసన్ సామాజికుల నుద్దేశించి సాగించాడు. సాహిత్యాన్ని వివేచించేటప్పుడు లక్షణాలకు ప్రాముఖ్యం ఇవ్వకుండా, దాని తత్త్వంలోకి ప్రవేశించి, ఆత్మను పట్టుకొని, శిల్పవిశేషాలను, కళాసౌందర్య స్వభావాలను దర్శించి, అనుభవించాలని సామాజికులను ప్రబోధించాడు. రచనలు సామాజికుల హృదయాలపై వేసే ప్రభావాలకే పరిశీలనలో ప్రాముఖ్యాన్నిచ్చాడు. అతనివ్యాసాలలో విమర్శ ఒక క్రమపద్ధతి నాశ్రయించి సాగకపోయినా, సాహిత్య ప్రమాణ సిద్ధాంతాలను గురించీ, కొంతమంది రచయితల రచనల గుణగణాలనుగురించీ, తదితర అనుబంధాంశాలగురించీ ఆయన చేసిన వివేచనం పత్రికావ్యాస విమర్శకు ప్రమాణాలను సంతరించింది. అతని వ్యాసాలలో 'True and False Wit' మీదా, ట్రాజడీమీదా, మిల్టన్ రచించిన Paradise Lost మీదా, The Pleasure of the Imagination మీదా రచించినవి ఆంగ్ల సాహిత్యవికాసానికి తోడుపడినవి. ఇతని విమర్శలో సహృదయ ప్రమాణానికి సార్వభౌమత్వం లభించింది. అది అప్పటికి అభినవమార్గం.

అడిసన్ విమర్శక వ్యక్తిత్వానికి విలువకట్టుతూ శైన్ట్స్‌బరీ ఇలా అన్నాడు:— 'Though by no means a very great critic, he (Addison) is a useful, an interesting, and a representative one. He represents the classical attitude tempered, not merely by good sense almost in quintessence, but by a large share of tolerance and positive good taste, by freedom from the more utterly rediculous pseudo–Aristotelianisms and by a wish to extend a concordat to everything good even if it be not 'faultless'.[26]"

అడిసన్ 'Wit'ను True Wit, False Wit, Mixed Wit అని మూడు విధాలుగా విభజించి వివరించాడు. డ్రైడెన్ ప్రతిపాద్యాంశాని కనుగుణంగా భావాలను పదాలను పొందుపరచటంలో ఉన్న ఔచిత్యాన్ని విట్‌గా నిర్వచించాడు. అడిసన్ అతని అభిప్రాయాన్ని అంగీకరించలేదు. కాని, లాకే అభిప్రాయాన్ని గ్రహించి దాన్ని కొంత విస్తరించాడు. అడిసన్ మాటల్లో—"As true wit generally consists in the resemblance and congruity of ideas, false Wit chiefly consists in the resemblance and congruity of single letters, as in anagrams, chronograms, lipograms, and acrostics : sometimes of syllables, as in achoes and doggerel rhymes ; sometimes of words, as in puffs and quibbles : and sometimes of whole sentences or poems cast into to the figures, of egges, axes, or alters : nay some carry the notion of wit so far, as to ascribe it even to external mimicry; and to look upon a man as ingenious person, that can resemble the tone, posture, or face of another". Mixed wit "consists partly in the resemblance of ideas and partly in the resemblance of words" [27]

సహృదయ సాహిత్యాభిరుచిని వివేచిస్తూ - Taste is "that faculty of the soul, which discerns the beauties of an author with pleasure, and the imperfections with dislike"[28] అని నిర్వచించాడు.

అడిసన్ భావనాశక్తి వలన కలిగే ఆహ్లాదాన్ని గురించి (on the pleasure of the Imagination) స్పెక్టేటర్‌లో పదకొండు

వ్యాసాలు వ్రాశాడు (నం. 411 నుండి 421 వరకు). ఆంగ్లవిమర్శను ఆలంకారిక లక్షణప్రవృత్తినుండి కావ్యసౌందర్య మీమాంసవైపు మరలించాయి ఆ వ్యాసాలు. కళలు, సాహిత్యం భావనాశక్తిని రేకెత్తింపచేస్తాయని వివరిస్తూ భావనాశక్తి నయనేంద్రియ దర్శనశక్తిమీద ఆధారపడి ఉంటుందని పేర్కొన్నాడు. ఆ విధంగా ఆడిసన్ భావనాశక్తిని కొంత పరిమితంగానే భావించాడనవలసివస్తుంది. అతని సిద్ధాంతంప్రకారం మనం నయనేంద్రియశక్తితో చూచిన భౌతికవస్తువులే, మనమీద ప్రభావంవేసి మన భావనాశక్తిని ప్రకోపింపచేస్తాయి. భావనాశక్తితో వాటిని భావించి అనుభవించే వ్యాపారాన్నే భావనాహ్లాద మనవచ్చు. ప్రకృతిలోని వస్తువులను ప్రత్యక్షంగా చూచినప్పుడు కానీ, చిత్రాలనూ, శిల్పాలనూ, వర్ణనలనూ మనం గమనించినప్పుడుకానీ మనలోని భావనాశక్తి మేల్కొని మానసిక చిత్రాలను రూపొందిస్తుంది. ఆ మానసిక చిత్రాలు ఏకరూపాలుగానే ఉండవలసిన పనిలేదు; బహురూపాలుగా ఉండవచ్చును, మనమనఃప్రవృత్తుల నాశ్రయించి మిశ్రరూపాలో, సమన్వయరూపాలో కావచ్చును. ఏవైనా మన భావనాశక్తిని సంవదించుకొనే ఉంటాయి. ఆడిసన్ 'Imagination' ను 'Fancy'ని ఒకటిగానే భావించాడు.[29] భావనాహ్లాదాన్ని రెండుగా విభజించాడు. మనం నయనేంద్రియగోచరాలైన వస్తువులనుండి ప్రత్యక్షంగా పొందే భావనాహ్లాదం మొదటిరకం. ప్రత్యక్షంగా లేని వస్తువులను మనోనేత్రంతో భావసత్యాలుగా దర్శించి, స్మరించి మనం పొందే ప్రాతిభాసిక భావనాహ్లాదం రెండవ రకం.[30] ఇందులో రెండవరకం సాహిత్య కళారంగాలకు సంబంధించింది. అయితే ఇక్కడ గమనింపవలసిన అంశం ఒకటి ఉన్నది. పైన చెప్పిన మొదటిరకం అనుభవంలోకూడా దృశ్యమానాలైన వస్తువులు ఉదాత్తంగానూ, అపూర్వంగానూ, సుందరంగానూ ఉన్నప్పుడే భావనాహ్లాదం కలుగుతుంది. మహోన్నత పర్వత శిఖరాల్లాంటి అపూర్వదృశ్యాలను చూచినప్పుడు అటువంటిది సంభవిస్తుంది. అలాగే కవిత్వంలో కవి ప్రయోగించే విశిష్టపదాల శక్తివలనకూడా భౌతిక వస్తుదర్శనంవలన కలిగే అద్భుతాహ్లాద చమత్కారాలకంటె అతీతమైన, సజీవమైన అనుభవాలు కలుగవచ్చును. ఏమైనా భావనాశక్తివలన ప్రభవించిన ప్రహ్లాదమే కళానుభవ స్వరూపమని ఆడిసన్

పేర్కొన్నాడు. ఈ విమర్శమార్గమే సౌందర్యతత్త్వాస్వాదన ప్రవృత్తిని ఆంగ్ల విమర్శలో ఆకాలంలో ఆవిష్కరించింది.[31]

నియోక్లాసికల్ యుగంలో ఉన్నా ఆడిసన్ అభిప్రాయాలు ప్రాచీన లక్షణాల అంధానుకరణాన్ని నిరసించాయి. లక్షణాతీతమైన పైలక్షణ్యం సాహిత్యాని కున్నదని అతడు ప్రపంచించాడు. వావి వరుసలు లేకుండా ప్రక్రియలన్నింటికీ ప్రాచీనలక్షణాలతో అన్వయించే ప్రవృత్తిని ఈసడించాడు. ఆతనివ్యక్తిత్వం ఈక్రింది వాక్యాలవలన మనకు వ్యక్తమౌతుంది.

1. 'I could wish there are authors who, besides the mechanical rules, which a man of very little taste may discourse upon, would enter into the very spirit and soul of the fine writing, and show us the several sources of that pleasure which rises in the mind upon the perusal of a noble work.'[32]

2. "There is sometimes a greater judgement shown in deviating from the rules of art than in adhering to them."[33]

3. There is more beauty in the works of a great genius who is ignorant of all the rules of art than in the works of a little genius who not only knows but scrupulously observes them."[34]

విమర్శలో అలెగ్జాండర్ పోప్ (1688-1744) మరొక ప్రజ్ఞాశాలి. అతడు నియోక్లాసికల్ యుగానికి చేసిన సేవనుగురించి సెయింట్స్‌బరీ చెప్పిన మాటలు గమనింపదగినవి. "All Pope seems to have done is to take the Arts of Horace, Vida, and Boileau, to adopt as many of their principles as he understood, and as would go into his sharp antithetic couplet, to drag their historical illustrations head and shoulders into his scheme without caring for the facts, and to fill in and embroider with criticisms, observations, and precepts, sometimes very shrewd, almost always perfectly expressed, but far too often arbitrary, conventional, and limited."[35] ఇతడు వ్రాసిన రచన లన్నింటిలోకీ "Essay on criticism" (1711) గణనీయమైంది. అది మూడు భాగాలుగా

విభక్తమైఉన్నది. మొదటి భాగంలో విమర్శకళను గురించి సాధారణ సమీక్ష, రెండవభాగంలో విమర్శకులు అపనిర్ణయాలు చేయటానికి మూలమయ్యే ప్రధాన కారణాల వివరణ, మూడవభాగంలో ఆదర్శ విమర్శక వ్యక్తిత్వ సమీక్ష, సంగ్రహసాహిత్యవిమర్శచరిత్రం చిత్రింపబడినాయి.

పోప్ తన వ్యాసంలో విమర్శసూత్రాలను కవితా సూక్తులుగా వెలయించాడు. "In Poets as true genius is but rare

True Taste as seldom is the critic's share"

అని విమర్శకులకు ఉత్తమాభిరుచు లుండాలని పేర్కొన్నాడు.

"First follow Nature, and your judgement frame

By her just standard, which is still the same"

అని ప్రకృతి ప్రామాణ్యవాదాన్ని సమర్థించాడు. కావ్యలక్షణాలు వ్యవస్థిత ప్రకృతి సూత్రాలనీ, వాటిని విమర్శకుడు నిర్లక్ష్యంచేయకుండా అధ్యయనం చేసి అనుసరించాలనీ, అటువంటి లక్షణాలు పూర్వకవుల ఆదర్శరచనలలో ఉంటాయనీ, అందువలన ప్రాచీన సాహిత్యం ప్రమాణమనీ ప్రబోధిస్తూ—

"Learn hence for ancient rules a just esteem;

To copy Nature is to copy them" అని నిర్దేశించాడు.

రచయితలే రచనలను విలువకట్టటంలో ప్రజ్ఞాలని పేర్కొన్నాడు; కావ్యవిమర్శలో కావ్యసమగ్రతను దర్శించి సమీక్షించాలనీ, పాక్షికవిమర్శలు ప్రమాదకరాలనీ, లోకంలో ప్రచారంలో ఉన్న అభిప్రాయాలను ఆధారంగా చేసికొని విమర్శ సాగించరాదనీ, కావ్యశైలినీ, ఛందస్సునూ మాత్రమే విమర్శించి కావ్యతాత్పర్యాన్ని విస్మరించరాదనీ, పఠితలహృదయాలను అనురంజింపచేసేటట్లు విమర్శరచన సాగాలనీ, ఉత్తమవిమర్శకుడు వేత్తయై ఉచితానుచిత వివేకంతో, పక్షపాతరహితమైన దృక్పథంతో, వినయ సౌజన్య గుణాలతో, గుణగ్రహణ పారీణత్వంతో విమర్శచేస్తాడనీ వివరించాడు.

"Be Homer's works your study and delight,

Read them by day, and meditate by night'

అని ప్రాచీన లక్షణసూత్రాన్ని పరవశత్వంతో ప్రవచించిన పోప్ "To judge Shakespeare by Aristotle's rules is like trying a

man by the laws of one country who acted under those of another"[36] అని చెప్పి సాహిత్య విమర్శలో సార్వకాలిక ప్రమాణా లతోపాటు సాపేక్షప్రమాణాలను ప్రయోగించవలసిన ఆవశ్యకతను వాక్కి-వక్కాణించాడు. సంప్రదాయపాలనంలో ఆయన చూపించిన స్వేచ్ఛ, దేశీయత అవే.

ఈ యుగ చరమదశలో నున్న గొప్ప విమర్శకుడు డాక్టర్ శామ్యూల్ జాన్సన్ (1709-1784). ఆయన కూర్చిన ఆంగ్లనిఘంటువు, ఆంగ్ల కవుల జీవితాలు, షేక్‌స్పియర్ రచనలకు పీఠిక, సాహిత్యవిమర్శకుడుగా ఆయనకు అఖండకీర్తిని తెచ్చిపెట్టాయి. డాక్టర్ జాన్‌సన్ స్వీయాభిమతము లతో నిండిన అనుశాసనాత్మక విమర్శ పద్ధతిని ప్రవర్తింపచేశాడు. ఆయన గొప్ప సంప్రదాయవాది. నియోక్లాసికల్ యుగధర్మాన్ని తనలో మూర్తీ భవింపచేసికొన్నాడు. ప్రధాన న్యాయమూర్తిగా తీర్పులిస్తున్నట్లుంటుంది అతని విమర్శధోరణి. "It is the task of criticism to establish principles; to improve opinion to knowledge; and to distinguish those means of pleasing which depend upon known causes and rational deduction, from the nameless and inexplicable elegances which appeal wholly to the fancy. Criticism reduces those regions of literature under domenions of science, which have hitherto known only the anarchy of ignorance, the caprices of fancy, and the tyranny of prescri-ption—[37] అని తన విమర్శకే ప్రమాణాన్ని చెప్పుకొన్నాడు. నిర్దిష్ట ప్రమా ణాలమీద నిలుపబడిందే నిజమైనవిమర్శ అని అతని తాత్పర్యం.

డాక్టర్ జాన్సన్ విమర్శలో ప్రయోగింపదగిన శాశ్వత ప్రమాణా లనూ, సాపేక్షప్రమాణాలనూ అంగీకరించాడు. మొదటివాటిని ప్రధాన ప్రాతిపదికలుగా, అవశ్యాచరణ యోగ్యాలు (fundamental and indispensable)గానూ, రెండవవాటిని సౌకర్యాన్ననుసరించి ఉపయోగపడేవిగానూ (useful and convenient) సంభావించాడు. మొదటివి రచయితలు తప్పక పాటించవలసినవి; రెండవవి కాలానుగుణంగా, అవసరాని కను వుగా చెప్పబడేవిమాత్రమే. మొదటివి ఆవశ్యకాలు, రెండవవి ఐచ్ఛికాలు.

నియమాలు అసలే పాటించకపోతే సాహిత్యరంగంలో అజ్ఞానం అరాచకం విలయతాండవం చేస్తాయనీ, ప్రతిభయొక్క విశృంఖల విహారం పెచ్చు పెరుగుతుందనీ డా॥ జాన్సన్ భావించాడు. 'It ought to be the first endeavour of a writer to distinguish Nature from custom, or that which is established because it is right from that which is right only because it is established; that he may neither violate essential principles by a desire of novelty, nor debar himself from attainment of beauties within his view by a needless fear of breaking rules which no literary dictator had authority to enact.[38] ఒక రచయిత అవశ్యనియమాలను పాటించినప్పుడే అతని రచన కాలప్రవాహపరీక్షలకు తట్టుకొని తరతరాల జీవితాన్ని ఉత్తమ గౌరవంతో నడపగలుగుతుందని జాన్సన్ ప్రవచించాడు.

చారిత్రకదృక్పథంతో సాహిత్యవిమర్శ సాగించే ఉద్యమానికి ప్రారంభకుడుగా జాన్సన్ ప్రసిద్ధి చెందాడు. ఒక రచనయొక్క విలువలను నిర్ధరించేటప్పుడు ఆ కృతి వెలసిన కాలం, అప్పటి పరిస్థితుల ప్రభావం మొదలైన అంశాలను అవశ్యం అనుశీలనంలో పరిగణించాలని అతని ఆశయం. "To judge rightly of an author we must transport ourselves to his time and examine what were the wants of contemporaries and what were the means of supplying them. That which is easy at one time was difficult at another" అన్న మాటలు చారిత్రక విమర్శ స్వరూప స్వభావాలను స్పష్టపరుస్తున్నాయి. జాన్సన్‌ను ఇంగ్లీషులో 'చారిత్రక విమర్శపిత'గా జార్జి వాట్సన్ అభివర్ణించాడు : "Johnson is an unambiguously historical critic, and the true father of historical criticism in English."[39]

కవిత్వాన్ని గురించి, దాని ప్రయోజనాన్ని గురించి అతడు చేసిన నిర్వచనాలు ప్రామాణికాలుగా పరిగణింపబడినాయి. మచ్చుకు కొన్ని:—

1. Poetry is 'the art of uniting pleasure with truth, by calling imagination to the help of reason.'[40]

2. 'The end of writing is to instruct; the end of poetry is to instruct by pleasing.'[41]

3. 'Poetry pleases by exhibiting an idea more graceful to the mind than things themselves afford.'

కవుల నుద్దేశించి అన్నమాటలు కొన్ని.—

1. "The business of the poet is to examine not the individual but the species, to remark general properties and large appearance."

2. The poet must "divest himself of the prejudices of the age and country; he must consider right and wrong in their abstracted and invariable state; he must disregard present laws and opinions and rise to general and transcendental truths, which will always be the same."[42]

కవితాశయ్యనుగురించి జాన్సన్ అభిప్రాయం—

1. "It is less difficult to write a volume of lines swelled with epithets, brightened with figures and stiffened with inversions than to produce a few couplets graced only by naked elegance .....which requires care and skill."

2. "Every language of a learned nation necessarily divides itself into diction scholastic and popular, grave and familiar, elegant and gross : and from a nice distinction of these different parts arises a great part of the beauty of the style."

నాటకాల విమర్శలో ఇతడు షేక్స్పియర్ ప్రయోగించిన ట్రాజీ-కామెడీని సమర్థించాడు. కాలస్థలైక్యాలను పాటించకపోయినను నాటకకర్తను ప్రశంసించాడు. తాత్త్వికకవుల రచనలలో రసానుభూతి ఉండదని పేర్కొన్నాడు.

డా॥ జాన్సన్ రచించిన కవుల చరిత్ర ఆంగ్లసాహిత్య చరిత్రకూ, విమర్శకూ ఆయన అందించిన విలువైన కానుక. అందులోని రచనా ప్రణాళికను మూడంచెలుగా విభజించవచ్చు. 1. జీవితచరిత్ర, 2. వ్యక్తిత్వ చిత్రణం. 3. విమర్శ. మొదట కవియొక్క వంశక్రమం, జన్మ విద్యాదిక విశేషాలూ, విపులంగా ఇవ్వటం, ఆ తరువాత కవియొక్క సాహిత్య వ్యక్తిత్వాన్ని సంగ్రహంగా చిత్రించటం, చివరకు రచనయొక్క విమర్శను నాతిదీర్ఘంగానూ, నాతిసంగ్రహంగానూ చేయటం జాన్సన్ కవిజీవిత చరిత్రలో పాటించిన సామాన్యప్రణాళిక. విషయప్రతిపాదనంలో కొన్ని లోపాలు దొరలినా అందులో ఆయన ఇచ్చిన తీర్పులు నేర్పరితనంతో కూడినవి. ఎందరో ప్రముఖులు ఆయన తీర్పులను శ్లాఘించారు.

"The lives of the poets shows Johnson's vigour of judgement, as critic of life and of letters, at its zenith. His power of putting into a single sentence all that can be said in a subject, whether by way of summary or of comment, was never more brilliantly displayed."[43]

డా॥ జాన్సన్ వ్యక్తిత్వానికి విలువైన వాఙ్మయనీరాజనా న్నిచ్చాడు శైన్ట్స్బరీ: "He has not merely flourished and vapoured critical abstraction, but has left us a solid reasoned hobby of critical judgement; he has judged literature in the exhausted receiver of mere art and yet neglected the artist criterion; he has kept in constant touch with life, and yet has never descended to mere gossips. We may freely disagree with the judgements but we can never justly disable his judgement; and this is the real criterion of a great critic"

నియోక్లాసికల్ యుగప్రవృత్తిని పాశ్చాత్య సాహిత్యాలలో పరిపోషించిన విమర్శకులు అనేకమంది ఉన్నారు. వారిలో లెస్సింగ్, గెథే, కాంట్, షిలర్ మొదలైనవారు ప్రసిద్ధులు. వారి అభిప్రాయాలనుకూడా కొన్నింటిని గమనించటం అవసరం.

కవిత్వాన్నిగురించి లెస్సింగ్ (Lessing) అభిప్రాయం :—

"Poetry must try to raise its arbitrary signs to natural signs;

that is how it differs from prose and becomes poetry. The means by which this is accomplished are the tone of words, the position of the words, measure, figures and tropes, similies etc., All these make arbitrary signs more like natural signs, but they do not actually change them into natural signs; consequently all genres that use only these means must be looked upon as lower kinds of poetry : and the higest kind of poetry will be that which tranforms the arbitrary signs completely into natural signs."[14]

గెథే (Goethe) - విమర్శలో విధ్వంసక విమర్శ (Destructive criticism), నిర్మాణాత్మకవిమర్శ (Productive criticism) అనే రెండు విధాలను వివేచిస్తూ ఇలా అన్నాడు : "The former is very easy : for one need only set up an imaginary standard, some model or other, however foolish it may be, and then boldly assert that the work of art under consideration does not measure up tothe standard, and therefore is of no value. That settles the matter and one can without further ado declare that the poet has not come up to one's requirements. In this way the critic frees himself of all obligations of gratitude towards the artist. Productive critisicism is much harder. It asks : What did the author set out to do? Was his plan reasonable and sensible ? and how far did he succeed in carrying it out ? If these questions are answered with discernment and sympathy, we may be of real assistance to the author in his later works."[15]

షిలర్ (Schiller) కళ ప్రజ్ఞాన చైతన్యంలోనుండి ఉద్భవిస్తుందని చెప్పిన మాటలు—"In experience the poet begins with the unconscious, and he must consider lucky if the clearest consciousness of his operations allows him to find again the first dark total idea of his work unweakened in the finished labour. Without such a dark but powerful total idea which precedes everything technical, no poetic work can arise, and poetry, it seems to me, consists just in this : to be able to express and commun cate that unconsciousness, i. e. to transfer into an object. The nonpoet can just as well as a poet be moved by a poetic idea, but he is unable to put it into an object; he cannot represent it with a claim to necessity A nonpoet

can just as well as a poet produce a work with consciousness and necessity but such a work will not begin with the unconscious and will not end with it. It remains only as a work of consciousness. But the unconscious united with the conscious makes the poetic artist."[46]

నియోక్లాసికల్ విమర్శాయుగం 18వ శతాబ్దితో ముగుస్తుంది. ఇంత వరకూ, అంటే దాదాపు మూడు శతాబ్దాల కాలంలో – పాశ్చాత్యవిమర్శ ధోరణి ప్రధానంగా ఎలా ప్రవర్తిల్లిందో వివేచిస్తూ రెనెవెలక్ (Reni-Wellek) చేసిన సమీక్ష గమనింప తగింది. "For three centuries people repeated the views held by Aristotle and Horace, debated these views, put them into text books, learned them by heart – and actual creation went on its way quite independently. Subsequently the same critical theory was embraced by such diverse men as the poets of the Italian Renaissance, Sidney and Ben Jonson in Elizabethan England, the French dramatists of the court of Louis XIV, and the middleclass Dr. Johnson. Literary styles have undergone profound revolutions during three centuries, but no or different theory of literature was ever formulated ......... One must never forget how strong the authority of classical antiquity was in those times; how strong was the craving to conform to it and to ignore the gulf that existed between one's own age and the centuries in which Aristotle or Horace wrote ."[47] దీనిని బట్టి స్థూల వివేచనకు తట్టేదేమిటంటే-పాశ్చాత్య విమర్శచరిత్రలో 18వ శతాబ్దాంతం వరకు అరిస్టాటిల్, హోరేస్ వంటివారల సిద్ధాంతాలను సంప్రదాయంగా పరిగణించి విమర్శ ప్రధానంగా సాగిందనీ, స్థూలంగా ఆ కాలాన్ని సంప్రదాయ పరిపాలన, పునరుద్ధరణ ప్రవృత్తులు ప్రవర్తిల్లిన శకంగా భావించవచ్చుననీ స్పష్టమవుతున్నది.

## కాల్పనికోద్యమ విమర్శ యుగం

19వ శతాబ్దపు మొదటిపాదంలో వెల్లివిరిసిన కాల్పనికోద్యమ విమర్శ సంప్రదాయ దాస్య శృంఖలాలను పటాపంచలు చేసింది; స్వతంత్ర ప్రతిభను సమ్మానించింది; సృజనాత్మక విమర్శను విశేషంగా సృష్టించింది.

నవ్యత, వ్యక్తిత్వవిస్ఫూర్తి ఈ యుగ ధర్మాలుగా సాగాయి. ఈ యుగ విమర్శకులు ప్రాచీన లక్షణాలను త్రోసిరాజని కవిభావనాశక్తిమీద ప్రామాణికత్వాన్ని ప్రకటించారు. 'Critics are apt to forget that rules are but means to an end; consequently, where the ends are different the rules must be likewise so" —[48] అన్న కోల్‌రిడ్జి ప్రతిపాదనం ఆ యుగ విమర్శ చైతన్యాన్ని సూత్రప్రాయంగా వ్యాఖ్యానిస్తున్నది. ఈ యుగంలో 'మేధావి' (Genius) అనే పదానికి ప్రాచుర్యం రావడం గమనార్హమైన విశేషం. మహాకవుల భావనాశక్తిలో నుంచీ, భావప్రకటన ప్రాభవంనుంచీ ఉన్మీలించే మేధాసంపత్తి ప్రకటించే కళాసూత్రాలే సాహిత్యవిమర్శకు సాపేక్షప్రమాణాలుగా వర్తించాలి కాని, పూర్వలక్షణాలను సాహిత్యవిమర్శలో పాటింపరాదనే తిరుగుబాటు స్వభావం విమర్శకులు ప్రకటించారు. కవివిమర్శకుల మేధాశక్తికి, సాహిత్యరంగంలో కనకాభిషేకం చేశారు. పూర్వయుగాలలో ప్రచురంగా సాగుతూ వచ్చిన కవిత్వబహిరాకృతి విచారాన్నీ, శైలీభాషావిశేషాల సమస్యల సమాలోచనాన్నీ ప్రక్కకు పెట్టి ఈ యుగ విమర్శకులు కవిత్వతత్త్వవిచారానికి ప్రాధాన్యమిచ్చారు. కవిత్వమంటే ఏమిటి? కవిత్వం ఎలా పుట్టుతుంది? కవిత్వావిర్భావానికి మూలమైన రసభావాలూ, మానసికావస్థలు ఎటువంటివి? అసలు కవులు కవిత్వం ఎందుకు వ్రాస్తారు? కావ్యాలెందుకు రచిస్తారు? కవిత్వతత్త్వమేమిటి? - మొదలైన మౌలికమైన అంశాలనుగూర్చి ఆలోచించారు. కాని, సాహితీప్రక్రియలను గురించి, వాటిలోని కవితా వైవిధ్యాలను గురించి, వీ రంతగా పట్టించుకోలేదు. అయితే, వారి కవిత్వతత్త్వ విచారానికి జర్మనుల తత్త్వదర్శనాలు ప్రేరణనిచ్చాయి.

ఈ నవ్యయుగ చైతన్యానికి దారితీసిన కారణాలను కొన్నింటిని వివేచించవచ్చును. మొదటిది- ఆంగ్లేయులలో సహజంగా ఉన్నస్వతంత్రప్రవృత్తి. ఆంగ్లేయులలో దేశీయభావంతో కూడిన స్వతంత్ర ప్రవృత్తి అధికం. నియోక్లాసికల్ యుగంలో కూడా ఆంగ్ల విమర్శలో దేశీయతాప్రవృత్తిని తీసికొని రావటానికి చేసిన యత్నం అంతస్సూత్రంగా కనపడుతుంది. అది ఈ యుగంలో సమగ్రవ్యక్తిత్వాన్ని సంతరించుకొన్నది. దీనికితోడు యూరపు దేశాలలో వచ్చిన రాజకీయోద్యమాల ప్రభావం కూడా బలంగా పనిచేసింది.

ఫ్రెంచి విప్లవం, అమెరికా స్వాతంత్ర్య ప్రకటనం ఆ ఉద్యమాలలో ముఖ్యమైనవి. స్వేచ్ఛ (Liberty), సమానత్వం, (Equality), సౌభ్రాత్రుత్వం (Fraternity) అనే ఫ్రెంచి విప్లవ నినాదత్రయం 'స్వాతంత్ర్యం జన్మహక్కు' అన్న అమెరికన్ స్వాతంత్ర్యోద్యమ నినాదం ఈ యుగ రచయితలకు స్వేచ్ఛాప్రీతిని కలిగించాయి. క్రొత్తగా, సొంతగా ఆలోచించే జవసత్త్వాలను ప్రసాదించాయి.

వీటికి ఉపబలకంగా జర్మన్ రచయితల సౌందర్యతత్త్వ మీమాంస కాల్పనికోద్యమ కవులకు, విమర్శకులకు కావ్యకళాతత్త్వ వివేచనదృష్టిని ప్రసాదించింది. ముఖ్యంగా ష్లెగెల్ (Schlegal) సోదరులు, షెల్లింగ్ (Schelling) చేసినరచనలు ఈయుగసాహిత్యదర్శనానికి దోహదం చేశాయి. వీరు సంప్రదాయ కాల్పనిక కవిత్వ స్వభావాలను వివేచించి చెప్పారు. వీరి అభిప్రాయాలను రెనెవెలెక్ మాటలలో ఇలా గ్రహించవచ్చును. "Ancient Poetry and art is a rhythmical nomos, a hormonious promulgation of the eternal legislation of a beautifully ordered world mirroring the eternal Ideas of things. Romantic Poetry, on the other hand, is the expression of a secret longing for the chaos which is perpetually striving for new and marvellous births, which lie hidden in the very womb of orderly creation.[49] ప్రపంచం ప్రాచీనులు భావించినంత వ్యవస్థగా లేదనీ, అవ్యవస్థయే ప్రపంచ ధర్మమనీ, ఆ అవ్యవస్థలోని అంతరార్థాన్ని అన్వేషిస్తూ విశ్వంలోని అద్భుతశక్తుల తత్త్వానికి సన్నిహితం కావటమే కాల్పనికోద్యమ ప్రవృత్తి అనీ వారు భావించారు. షెల్లింగ్, కవిభావనాశక్తికి అగ్రతాంబూల మిచ్చాడు. కవి దర్శనమే కవితకు అభివ్యక్తిని కలిగిస్తుందనీ, అందువలన కవి యే నియమాలనూ, లక్షణసూత్రాలనూ పాటింప నవసరం లేదనీ నొక్కి వక్కాణించాడు. వీరి ప్రవచనాల ప్రభావం కాల్పనికోద్యమం మీద పడింది. అంతేకాక ఐరోపా మధ్యయుగ కాలంలో బయటపడిన గేయాలూ, వీరగీతాలూ, శృంగారగేయాలూ పాశ్చాత్యుల నుత్తేజపరిచాయి. బిషప్ పెర్సీ వంటివారు వాటిలోని అందాలనూ, చందాలనూ వివరించిన రచనలు విమర్శకులను విశేషంగా ప్రభావితం చేశాయి. ఇవన్నీ కలిసి సామూహికంగా కాల్పనికోద్యమ విమర్శకు రూపరేఖలను దిద్దితీర్చాయి.

# విలియం వర్డ్స్‌వర్త్

కాల్పనిక విమర్శ యుగానికి వైతాళికుడు విలియం వర్డ్స్‌వర్త్ (1770-1850). ఇతని విమర్శ నియోక్లాసికల్ యుగానికి భరతవాక్యమనీ, ఆంగ్ల కాల్పనికోద్యమానికి మేనిఫెస్టో వంటిదనీ రెనేవెలెక్ అభివర్ణించాడు.[50] Lyrical Ballads కు ఆయన వ్రాసిన పీఠికలు (1798 నుండి 1815 వరకూ వచ్చినవివిధ ముద్రణలకు) అతనికి కాల్పనికోద్యమ విమర్శప్రవక్తగా అఖండ కీర్తిని తెచ్చిపెట్టాయి. ఆయా పీఠికలలో తనను విమర్శించిన విమర్శకులకు ఆవేశంతో ఇచ్చిన సమాధానాలు కూడా ఉన్నాయి. ఒక విధంగా ప్రతివిమర్శ లోనుండే ఆయన ప్రతిభావంతమైన విమర్శ ప్రభవించిందని చెప్పాలి. వర్డ్స్‌వర్త్ లిరికల్ బాలెడ్స్‌కు వ్రాసిన విమర్శ సిడ్నీ 'Apology for Poetry', షెల్లీ 'Defence of Poetry' కోవకు చెందింది. సంప్రదాయదాస్యంతో క్రుంగిపోతున్న సాహిత్య విమర్శకు అది క్రొత్తఊపిరి పోసింది.

వర్డ్స్‌వర్త్, కవితాస్వభావాన్ని గురించి చేసిన వివేచనం అత్యంత అభినవం. "Poetry is the spontaneous overflow of powerful feelings; it takes its origin from emotion recollected in tranquillity; the emotion is contemplated till, by a species of reaction, the tranquillity gradually disappears, and an emotion, kindred to that which was before the subject of contemplation, is gradually produced, and does itself actually exist in mind. In this mood successful composition generally begins, and in a mood similar to this it is carried on." ఈ వివేచనం కవితా స్వభావాన్నే కాక కవితావతార క్రమాన్ని కూడా వివరించింది. ఇతని అభిప్రాయంలో 'spontaneous' అంటే 'అప్రయత్నంగా' 'సహజంగా' అనిభావం. 'Powerful' అంటే పఠితల కాహ్లాదం కలిగించే విధంగా' అని అర్థం. నియోక్లాసికల్‌యుగం వరకూ విమర్శకులు అరిస్టాటిల్ సిద్ధాంతాన్ని ప్రమాణంగా గ్రహించి, కవి బాహిరమైన వస్తుదర్శనం చేసి, దాని ప్రాగ్రూపానుకరణరూపంగా కవితను ఆవిష్కరిస్తాడని పేర్కొంటూవచ్చారు. కాని, వర్డ్స్‌వర్త్ ఆ ప్రక్రియను

తారుమారు చేసి యీ నిర్వచనాన్ని ప్రతిపాదించాడు. భవ్యకవితావేశంతో కూడిన ఆంతరమైన రసభావ వ్యక్తీకరణమే కవిత అని ప్రపంచించాడు. కవియొక్క వ్యుత్పత్తిసైతం భావోద్రేకంగా పరిణమించినప్పుడే కవిత అనిపించుకొంటుందని వివేచించాడు.

కవి ప్రతిభానేత్రంతో ప్రకృతిని దర్శిస్తాడు; స్పందిస్తాడు. ఆ స్పందనలో నుండి అతడు భావోద్రేకస్థితిని పొందుతాడు; అయితే, ఆ స్థితిని సామాజికుల కందించేముందు కవి తన మానసికసమాధిలో దానిని పునర్మథనం చేస్తాడు. భావాలను ఆలోచనలతో మిళితం చేస్తాడు. వాటి సమగ్రాభివ్యక్తికి అంతఃపరిపాకాన్ని సాధించుకొంటాడు. అప్పుడు, మొదటి స్పందనలో మొలకెత్తిన భావాలకు ఒక తాత్త్విక అలౌకిక ప్రవృత్తి యేర్పడుతుంది. దానిని కవితామయంగా వ్యక్తీకరించటానికి సమాహిత చిత్తవృత్తి సారిస్తాడు. దానినుండి అప్రయత్నంగా, అలవోకగా, సహజంగా కవితాధార పెల్లుబుకుతుంది. భావోద్రేకరూపంగా కవితప్రవహిస్తుంది. ప్రాథమిక భావస్పందనలో ప్రభవించిన భావాలను పరిపక్వరూపాలుగా పరిణమింప చేసికొనే ప్రస్థానమంతా కవియొక్క ఆంతరప్రవృత్తిలోనే కవితావతార ప్రస్థానంగా సాగుతుంది. ఇలా చెప్పటం నిజంగా అపూర్వమైన అభినవ దర్శనం.

పాశ్చాత్యామిక నాగరకత ప్రభావంవలన ప్రకృతిసౌందర్యదర్శనశక్తిని సమాజం క్రమంగా విస్మరిస్తున్న ఆ రోజులలో వర్డ్స్వర్త్ కవితను పల్లెపట్టులలో ఉండే ప్రకృతి రామణీయకత్వం వైపు మరలింప చేశాడు. అచ్చమైన ఆత్మీయత, భావప్రకటన, భాషాభివ్యక్తీ గ్రామీణులలో కనపడినంతగా నగరవాసులలో గోచరించదన్నాడు. కవితా వస్తువులను గ్రామీణజీవితాలలోంచే ఎన్నుకోవాలని సూచించాడు. ఈ క్రిందివాక్యాలు అతని దృక్పథానికి కరదీపికలు. "Humble and rustic life was generally chosen, because, in that condition, the essential passions of the heart find a better soil in which they can attain their maturity, are less under restraint, and speak a plainer and more emphatic language; because in that condition of life our elementary feelings co-exist in a state of greater simplicity, and conse-

quently, may be more accurately contemplated, and more forcibly communicated; because the manner of rural life germinates from those elementary feelings, and from the necessary character of rural occupations, are more easily comprehended, and the more durable; and, lastly, because in that condition the passions of men are incorporated with the beautiful and permanent forms of nature".

వర్డ్స్‌వర్త్ ప్రజల సజీవభాషయే కవితాశైలికి ప్రాణ మన్నాడు; వచనానికీ పద్యానికీ భాషలో భేదం పాటింపవలసిన అవసరం లేదన్నాడు. అయితే, వచనాన్నీ పద్యాన్నీ ఛందస్సు వేరుచేస్తుంది. కవితాశైలిలో వ్యవహారంలో ప్రచురంగా ఉన్న భాషలోని పదాలలో అభిరుచినీ, అభివ్యక్తినీ, భావానుభూతినీ కలిగించేవాటిని యేర్చికూర్చటం ముఖ్యం భావపుష్టి. భావనాశక్తిగల రచనలో వస్తుచిత్రణం భావాభివ్యక్తి సముచితంగా సమన్వయింపబడాలి; అది రచయిత భావానుభూతిని పఠితకు అందజేసేటట్లుగా సముచితమైన రీతిలో సజీవభాషాపదప్రయోగ ప్రధానమైన శైలిలో వ్యక్తీకరింపబడాలి. వచనమైనా పద్యమయినా ఆ అభివ్యక్తికి శక్తిమంతమైన సాధనమే అవుతుంది అని వర్డ్స్‌వర్త్ ప్రవచించాడు. ఇతని కవితాశైలి సిద్ధాంతాలు పరస్పర విరుద్ధంగా ఉన్నాయని విమర్శకులు విమర్శించినా, కవితాశైలి కళాసౌందర్యాన్ని కమనీయంగా పఠిత కందించి, అతనిని అనురంజింప జేయాలనే వర్డ్స్‌వర్త్ అభిమతాన్ని అందరూ ఆమోదించారు.

కవితా హేతువులను ఆరింటిని పేర్కొన్నాడు వర్డ్స్‌వర్త్. అవి- 1. Observation and Description. 2. Sensibility. 3. Reflection. 4. Imagination and fancy. 5. Invention. 6. Judgement. వీటిలో భావనాశక్తి (Imagination)ని గురించీ ఊహాచమత్కారాన్ని (Fancy) గురించీ ఇతడు చేసిన వివేచనం ప్రాచీనులకంటె విలక్షణంగా ఉంది. భావనాశక్తిని సంపుటీకరణ, సంవాదకరణశక్తి (aggregative and associative power) గానూ, ఊహాచమత్కారాన్ని నిర్మాణాత్మక శిల్పీకరణ శక్తి (shaping and modifying power) గానూ నిర్వచించి, ఆ రెండింటిలో భావనాశక్తికే అగ్రతాంబూల మిచ్చాడు. అతని మాటల్లో- "Fancy is given to quicken and beguile the temporal part of

our nature, Imagination to incite and to support the eternal. Yet is it not the less true that Fancy, as she is an active, is also, under her own laws and in her own spirit, a creative faculty... Fancy ambitiously aims at a rivalship with imagination, and imagination stoops to work with the materials of Fancy".

కావ్యప్రయోజనాల్లో ఉపదేశం కంటె ఉపరంజనం ముఖ్యమని ఈతని వాదం- "The poet writes under one restriction only, namely, the necessity of giving immediate pleasure to human being possessed of that information which may be expected from him, not as a lawyer, a physician, a mariner, an astronomer, or a natural philosopher, but as a man". ఈ వాక్యాలందుకు సాక్ష్యం.

మేధావులైన రచయితలు సర్వస్వతంత్రులని ప్రకటించాడు వర్డ్స్‌వర్త్. నియమాలూ నిబంధనలూ వారిని బంధించలేవని స్వాతంత్ర్యాన్ని నిర్దేశించాడు. "Every author, as far as he is great and at the same time original, has had the task of creating the taste by which he is to be enjoyed; so has it been, so it will continue to be". కవితా రచనలలో ఆలోచనలకూ ఆర్ద్రభావాలకూ అవిచ్ఛిన్నమైన సంయోజన స్థితిని ఆయన ఆదేశించాడు. "Good poems are produced only by a man who has thought long and deeply. For our continued influences of feelings are modified and directed by our thoughts, which are indeed the representatives of all our past."

వైతాళికుడుగా కీర్తింపబడే వర్డ్స్‌వర్త్ విమర్శలో కూడా దోషాలు లేకపోలేదు. వాటి స్వభావాన్నంతా ఒక్కమాటలో చెప్పాలంటే- అతని విమర్శలో ఆత్మాశ్రయ ధోరణి ఎక్కువగా ఉండటంచేత, చెప్పేది తీవ్రంగా చెప్పటం, తరచుగా సంయమనాన్ని కోల్పోవటం, సమత్వానికి దూరంకావటం జరుగుతుండేవి. అయినప్పటికీ, ప్రాచీనలాక్షణిక విమర్శను కవితాతత్త్వ వివేచనం వైపు మరలించిన ఘనత వర్డ్స్‌వర్త్‌కే దక్కుతుంది.

## కోల్‌రిడ్జి

శామ్యూల్ టేలర్ కోల్‌రిడ్జి (Samuel Tayler Coleridge) (1772-1834) ఆంగ్ల విమర్శకులలోనే కాక ఐరోపా విమర్శకులలోనే ఉత్తమ విమర్శకులలో ఒకడని పరిగణింపబడ్డాడు. పాశ్చాత్యవిమర్శకులలో విమర్శకత్రయాన్ని చెప్పాలంటే అరిస్టాటిల్-లాంగినస్-కోల్‌రిడ్జి అని కొందరు చరిత్రకారులు పేర్కొన్నారు.

తాత్త్వికదృక్పథంతో కవిత్వాన్ని అనుశీలించే విధానంలో కోల్‌రిడ్జి వర్డ్స్‌వర్తుకంటె విమర్శకు లోతులు చూపించాడు. టి. యస్. ఇలియట్ మాటల్లో-"Coleridge, with his authority due to his great reading, probably did much more than Wordsworth to bring attention to the profoundity to the philosophic problems into which the study of Poetry may take us."[51] దీనికి కారణం కాంట్, షెల్లింగ్, ష్లెగెల్ సోదరులు మొదలైన జర్మన్ తత్త్వ విమర్శకుల యొక్క ప్రభావం గాఢంగా ఉండటమే. రెనేవెలెక్ కోల్‌రిడ్జి విమర్శలో వారి సిద్ధాంతాల ప్రభావాన్ని బింబప్రతిబింబ సంవాద రూపంగా వివేచించి నిరూపించాడు కూడా. అయినా, వాటిమీద అతని ప్రత్యేకముద్ర ఉన్నదని విమర్శకు లంగీకరించారు. Biographia Literaria, Lectures on Shakespeare, The Friend, The table talk—మొదలైనవి కోల్‌రిడ్జి రచనలు. అందులో Biographia Literaria కవుల జీవితచిత్రణ ప్రధానమైన విమర్శగ్రంథం. అతనిని విమర్శకునిగా నిలిపిన రచన.

ఆయన విమర్శ స్వభావాన్ని వివేచించటానికి ఆయనే తన విమర్శ లక్ష్యాలుగా చెప్పుకొన్న కొన్ని వాక్యాలు తోడ్పడతాయి. మచ్చుకు-

1. "To establish the principles of writing rather than to furnish rules how to pass judgement on what has been written by others".

2. "To reduce criticism to a system by the deduction of causes from principles involved in our faculties".

కావ్యలక్షణ ప్రవచనం కంటె కావ్యకళా నిర్మాణ సూత్రాలను స్థాపించటం, ఆ సూత్రాల అనుశీలనంవలన ఒక విమర్శవిధానాన్ని రూపొందించటం కోల్‌రిడ్జి ధ్యేయం. అతని విమర్శ ప్రస్థావం ప్రధానంగా Descriptive criticism గా పరిగణింపబడుతున్నది. "In his descriptive criticism he applies his own theories of Poetry and drama into practice and has tried to show their validity. Without his descriptive criticism his theoretical criticism might have appeared more metaphysical abstraction'.[52] అని విమర్శకులు చేసిన ప్రశంస గమనింపదగింది.

కోల్‌రిడ్జి ప్రవచించిన కొన్ని కావ్యకళా సూత్రాలను గమనిస్తే అతని తాత్త్వికమైన విమర్శదృక్పథం స్పష్టమౌతుంది

1. 'No man was ever a great poet, without being at the same time a profound philosopher.'

2. 'A poet brings the whole soul of man into activity, with the subordination of its faculties to each other, according to their relative worth and dignity.'

3. 'A poem is the species of composition which is opposed to works of science, by proposing for its immediate object pleasure, not truth; and from all other species (having this object in common with it) it is discriminated by proposing to itself such delight from the whole, as is compatible with a distinct gratification from each component part.'

4. 'A poem of any length neither can be, nor ought to be, all Poetry.'

5. 'Good sense is the Body of the poetic genius, Fancy its Drapery, Motion its Life, and Imagination the Soul that is everywhere, and in each; and forms all into one graceful and intelligent whole.'

6. 'Art itself might be defined as of a middle quality between a thought and a thing, or, the union and reconciliation

of that which is nature with that which is exclusively human. It is the figured language of thought and is distinguished from nature by the unity of all parts into one thought or idea.'

7. 'The end and purpose of all reason is unity and system; the ultimate end of human thought and human feeling is unity.'

Genius కూ Talent కూ; Imagination కూ, Fancy కీ వ్యష్టమైన భేదాన్ని కోల్‌రిడ్జి విడమరిచిచెప్పి, వర్డ్స్‌వర్త్ కంటె ఒకఅడుగు ముందుకు వేశాడు. సంగ్రహంగా చెప్పాలంటే-"Genius like imagination, is creative; and talent, like Fancy, merely combinatory." "Genius is inborn and talent acquired. A poet is a man of genius, born not made."[54] కవి మేధావి, మహాప్రజ్ఞావంతుడని ప్రతిపాదించిన కోల్‌రిడ్జి, కవి ప్రజ్ఞ నాలుగు అంశాలతో రూపుకట్టి అభివ్యక్తమౌతుందని విశిష్టంగా వివేచించాడు ఆ నాలుగు విశిష్టాంశాలూ ఇవి: 1. Sense of Musical Delight 2. Objectivity 3. The Shaping and Modifying Power of Imagination 4. Depth and Energy of thought. పద్యరచనా మాధుర్యం, వస్తువుకు, భావాభివ్యక్తికీ అనుగుణమైన నాద మాధుర్యాన్ని కల్పించే శాబ్దికమైన స్వరమాధుర్యం Sense of Musical Delight కు ముఖ్యలక్షణాలు. కవి హృద్గతమైన భావలయను బాహిరంగా అభివ్యక్తీకరించే ప్రవృత్తి దీనిది రచయిత తన వైయక్తిక జీవితానికీ, పరిసరాలకూ దూరంగా ఉండే కవితావస్తువులను ఎన్నికచేసి కోవటం అందులో అభివర్ణించే భావాలనూ, పాత్రలనూ, సన్నివేశాలనూ తానే చిత్రించి పోషిస్తున్నా, వాటితో తాను తాదాత్మ్యం పొందుతున్నా, వాటికంటె విలక్షణంగా, ప్రత్యేకంగా నిర్లిప్తంగా ఉండే ప్రవృత్తిని సాధించటం Objectivity భగవంతుడు ప్రకృతిలో ప్రత్యణువునందు ప్రతిబింబిస్తున్నా ప్రత్యక్షంగా తాను కనపడనట్లు, వాటిలో అతనికి మమత్వం లేనట్లూ కవి రచనలో ఉండటం దీని స్వభావం. మూడవ లక్షణం కవి భావనాశక్తికి సంబంధించింది. ప్రకృతిలో కవి చూచిన ప్రతిచిత్రం అతనిలో ఒక భావచిత్రాన్ని రూపొందిస్తుంది. దాన్ని యథాతథంగా చిత్రించటం ప్రజ్ఞావంతుని లక్షణం కాదు. అతని ఆత్మలక్షణాన్ని వ్యంజింపజేసే విశిష్ట

దృక్పథంతో తాను దర్శించిన భావచిత్రాలను ప్రధానతాత్పర్యాని కనుగుణంగా రూపొందించి, శిల్పీకరించి, భావనామయంచేసి, బహుత్వంలో ఏకత్వం, వైవిధ్యంలో ఐక్యత భాసించేటట్లు చేసి ఆలోచనామృతాన్ని కల్పించే యత్నం చేయటం The Shaping and Modifying power of Imagination. లోతైన, శక్తిమంతమైన భావనను మనం దర్శనంగా పేర్కొనవచ్చు. ఇది మనీషి లక్షణం, ద్రష్టస్వభావం. గాఢభావనం వలన అది సాధ్యం. మహాకవిత్వనిర్మాణానికి అది అవశ్యకమైనగుణం. తత్త్వవేత్త అయినవాడే మహాకవి కాగలడని చెప్పిన కోల్‌రిడ్జి - కవిత్వం మానవ విజ్ఞానానికీ, భావనకూ, అభిరుచులకూ, రస భావాలకూ, భాషకూ మూర్తికట్టిన సుగంధపుష్పమని అభివర్ణించాడు. అట్టి కవితాప్రతిపత్తిని పరిపోషించటానికి కవికి గాఢత్వం, భావశబలత Depth and Energy of thought అవసరం. ప్రమాణ విచారానికి ప్రాతిపదికలైన కవిమనోగత ప్రజ్ఞాలక్షణాలను తాత్త్వికవివేచనతో చేసిన కోల్‌రిడ్జివిమర్శ కీ విశ్లేషణం మచ్చుతునక.

కోల్‌రిడ్జి భావనాశక్తిని గూర్చి చేసిన వివేచనం మౌలికమైనది, విశిష్టమైనది. అతని మాటలలో- "The imagination, then, I consider either as primary, or secondary. The primary Imagination I hold to be the living power and the prime agent of all human perceptions and as a repetition in the finite mind of the eternal act of creation in the infinite I AM. The secondary imagination I consider as an echo of the former coexisting with the conscious will, Yet still as identical with the primary in the KIND of its agency, and differing only in DEGREE, and in the mode of its operation. It dissolves, diffuses, dissipates, in order to re-create or where the process is rendered impossible, yet still at all events in struggles to idealise and to unity. It is essentially Vital, even as all objects (as objects) are essentially fixed and dead."

ఇలాగే Fancy ని గురించిన ఇతని అభిప్రాయం ప్రాచీనుల కంటె భిన్నంగానూ, మెరుగుగానూ ఉన్నది. "Fancy, on the contrary, has no other counters to play with, but fixities and definites. The fancy is indeed no other than a mode of Memory emanci-

pated from the order of time and space; while it is blended with, and modified by that empirical phenomenon of the will, which we express by the word 'CHOICE'. But equally with the ordinary memory the FANCY must receive all its materials ready made from the law of association."

ఈ వివేచనంలో కోల్‌రిడ్జి తాత్త్విక దృక్పథమే కాక, మనస్తత్త్వశాస్త్ర దృక్పథాన్ని కూడా ప్రదర్శించాడు. అందువలన ఆంగ్లంలో Psychological criticismకు కూడా ఇతడు నారుపోశాడని విమర్శకులు భావిస్తున్నారు. "Metaphysics and Psychology have long been my hobby-horse" అని స్వయంగానే అన్నాడు కోల్‌రిడ్జి.

ఇతని విమర్శక వ్యక్తిత్వాన్ని గూర్చి జార్జివాట్సన్ చేసినవ్యాఖ్య విలువైనది. " As a descriptive critic, his achievement is brilliant but sporadic, and offers no single example worthy to be advanced as a model. If his criticism survives, as it vigorously does, it is not by virtue of what it demonstrates but by what it abundantly suggests, for no English critic has so excelled at providing profitable points of departure for twentieth-century critics[54]."



20వ శతాబ్ది విమర్శకు తెరువులు తెరచిన తెగువరి కోల్‌రిడ్జి.

## షెల్లీ

ఆంగ్ల సాహిత్య కాల్పనిక యుగంలో ప్రసిద్ధ కవులుగానే కాక, ప్రతిభావంతులైన కావ్యలక్షణ విమర్శకులుగా కూడ పరిగణింపబడేవారు షెల్లీ, కీట్సు. Percy Bysshe Shelley (1792-1822) రచించిన 'A Defence of Poetry' ప్రసిద్ధ విమర్శగ్రంథం. అదిగాక అతడు మిత్రులకు వ్రాసిన ఉత్తరాలలో, గ్రంథాలకు వెలయించిన పీఠికలలో, కొన్ని సూచికలలో అతని అభిప్రాయాలు వ్యక్తమౌతున్నాయి. కవిత్వ స్వరూప స్వభావ ప్రభావాలను గురించి అతని విమర్శ విశేషంగా సాగింది.

షెల్లీకి ముందు థామస్ లవ్ పికాక్ (Thomas Love Peacock) అనే విమర్శకుడు యాంత్రిక నాగరకతను సమర్థిస్తూ 'The Four Ages of Poetry' అన్న గ్రంథంలో కవితనూ, కళలనూ చిన్నచూపుతో విమర్శించాడు. అతని అభిప్రాయంలో- కవితకు ఆదిమయుగాల్లో గౌరవం ఉండేది, కాని, ఆధునిక నాగరకతలో కవిత తన ప్రతిపత్తినీ, ప్రయోజనాన్నీ కోల్పోయింది. "The Poet is semi-barbarian in a civilized community". "Mathematicians, astronomers, chemists, metaphysicans, moralists, historians, politicians, and political economists, who have built into the upper air of intelligence a pyramid...... see the modern Parnassus far beneath them." సాహిత్య చరిత్రను సాధారణంగా లోహయుగ (Iron Age)మనీ, స్వర్ణ యుగ (Golden Age)మనీ, రజత యుగ (Silver Age) మనీ, కాంస్య యుగ (Brass Age)మనీ నాలుగులోహాల పేర్లతో విభజించవచ్చుననీ; అలాగే ఆంగ్లసాహిత్యచరిత్రలో మధ్యయుగచరిత్ర అయోమయ (Iron) యుగమనీ, షేక్స్పియర్ కాలం స్వర్ణయుగమనీ, డ్రైడెన్ పోప్‌లకాలం రజతయుగమనీ, తనకాలం కాంస్యయుగమనీ విభజించి చెప్పాడు. పికాక్ ఇలా కవితమీద చేసిన దారుణమైన దాడిని షెల్లీ ఎదుర్కొని కవిత్వాన్ని సమర్థించే 'Defence of Poetry' అనే తన గ్రంథాన్ని ప్రకటించాడు. ఇతని రచన కవిత్వగౌరవాన్ని సమాజంలో పునరుద్ధరింపజేసింది. రెనె వెలెక్ మాటలలో-"Poetry was re-established as part of the fabric of the society and of the process of history potent even when scarcely visible. This was Shelley's true defence of Poetry, surely more convincing than the arguments confusing philosophy, morality, and art in one common mixture. It was the defence of poetry which came to dominate the 19th Century'.[55]

కవులను గురించి, కవిత్వాన్ని గురించి షెల్లీ వ్యక్తంచేసిన అభిప్రాయాలు కాల్పనికయుగ సుస్థిరతకూ, దాని మాన్యతకూ ఎంతో తోడ్పడ్డాయి. మచ్చుకు కొన్ని-

1. "Poets are the unacknowledged legislators of the world' '

2. "Poets are not only the authors of language and of music, of the dance and architecture, and statuary, and Painting: they are the institutors of laws, and the founders of a civil society, and the inventors of the arts of life"

3. "Poetry is the record of the best and happiest moments of the happiest and best minds".

4. "Poets are also "philosophers of the very loftiest Power" and Poetry is "the centre of and circumference of knowledge." "that which comprehends all science"[56]

5. "A great poem is a fountain for ever overflowing with waters of wisdom and delight; and after one person and one age has exhausted all its divine effluence with their peculiar relations enable them to share, another and yet another succeeds and new relations are ever developed, the source of unforeseen and an unconceived delight.[57]

6. "Poetry, in a general sense, may be defined to be the "expression of the imagination".

7. "A poet is a nightingale, who sits in the darkness and sings to cheer its own solitude with sweet sounds, his auditors are as men entranced by the melody of an unseen musician, who feel that they are moved and softened, yet know not whence or why".

8. "Poetry is indeed something divine. It is at once the centre and circumference of knowledge; it is that which conprehends all science, and that to which all science must be referred" [58]

షెల్లీ తన Defence of Poetry లో హేతువాదశక్తికీ, భావనాశక్తికి (Reason and Imagination) భేదాన్ని నిరూపించాడు. 'Reason is the enumeration of quantities already known; imagination is the perception of the value of those qualities, both separately and as a whole. Reason respects the differences, and imagination the similitudes of things. Reason is to imagination as the instrument to the agent, as the body to the spirit, as the

shadow to the substance.' ఈ రెండింటిలో భావనాశక్తి ప్రాముఖ్యాన్ని ప్రతిపాదించి కవిత్వమంటే భావనాశక్తి యొక్క వ్యక్తీకరణమే అని షెల్లీ సిద్ధాంతీకరించాడు. అతని దృష్టిలో–'A Poet participates in the eternal, the infinite, and the one; as far as it relates to his conceptions, time and place and number do not" భావన (conception)కు, అభివ్యక్తి (expression)కు గల సంబంధాన్ని వివేచిస్తూ షెల్లీ ఇలా అన్నాడు– "The former is as a mirror which reflects the later as a cloud which enfeebles,the light of which both are mediums of communication." కవిత్వ ప్రయోజనాన్ని ప్రభావాన్నిగురించి విశేషంగాచెప్పిన షెల్లీ ఆనందం(రసానందం)దాని ముఖ్యప్రయోజన మన్నాడు. "Poetry is ever accompanied with pleasure: all spirits on which it falls open themselves to receive the wisdom which is mingled with its delight." అయితే కవిత నీతిని కూడా అందిస్తుందని పేర్కొంటూ దాని స్వరూప స్వభావాలను ఇలా వివరించాడు. "The great secret of morals is love ... A man to be greatly good, must imagine intensely and comprehensively; he must put himself in the place of another and of many others; the pain and pleasures of his species must become his own. The great instrument of moral good is the imagination, and poetry administers to the effect by acting upon the cause. Poetry enlarges the circumference of the imagination by replenishing it with thoughts of ever new delight, which have the power of attracting and assimilating to their own nature all other thoughts, and which form new intervals and interstices whose void for ever craves fresh food."

కవిత్వం మానవునిలోని దివ్యత్వాన్ని మేలుకొలిపి, ఉద్దీపింపచేసే మహనీయ శక్తిగా షెల్లీ అభివర్ణించాడు. "Poetry makes immortal all that is the best and most beautiful in the world; it arrests the vanishing apparitions which haunt the interlunations of life. Poetry redeems from decay the visitations of the divinity in man." కవిత్వానికీ తర్కానికీ ఉన్న చుక్కెదురును వివేచిస్తూ ఆలంకారికంగా అన్న మాట లివి–" Poetry is not like reasoning, a power to be exerted according to the determination of the will. A man cannot say 'I will compose poetry:' The great poet even

cannot say it; for the mind in creation is as a fading coal, which some invisible influence like an inconstant wind, awakens to transitoty brightness, this power arises from within, like the colour of the flower which fades and changes as it is developed and the conscious portions of our nature are unprophetic either of its approach or its departure."

షెల్లీ కాల్పనికోద్యమ కవిగా ఎంత రాణించాడో, విమర్శలో కాల్పనిక స్వభావాన్ని చొప్పించటంలో విమర్శకుడుగా అంత ప్రకాశవంతంగా శోభించాడు. అందువలన సాహిత్య సిద్ధాంతాలను ప్రత్యేకించి ప్రపంచించ లేకపోయాడు.

## జాన్ కీట్స్

> 'Beauty is truth, truth Beauty' – that is all
> Ye know on earth, and all ye need to know.

అని చాటిన సౌందర్యారాధకుడు జాన్ కీట్స్ (1795–1821). "I am certain of nothing but of the holiness of the Heart's affections and the truth of Imagination. What the Imagination seizes as Beauty must be truth– whether it exists before or not for I have the same Idea of all our passions as of Love; They are all, in their sublime, creative essential Beauty" అని తన వాదాన్ని వ్యక్తంచేశాడు. ఇతడు ప్రత్యేకంగా వ్రాసిన విమర్శ గ్రంథం లేదు కాని, సమకాలీనులకు వ్రాసిన లేఖలవలననే ఇతని అభిప్రాయాలు లోకానికి తెలిశాయి. కవితలోకూడా తన కళాదృక్పథాన్ని వ్యక్తంచేశాడు.

1818 ఫిబ్రవరి 27వ తేదిన జాన్ టేలర్‌కు వ్రాసిన లేఖలో కీట్స్ మూన్ని కవితాధర్మాలను పేర్కొన్నాడు. "First, I think, Poetry should surprise by a fine excess and not by singularity– it should strike the reader as a wording of his own highest thoughts, and appear almost a remembrance. Second: its touches of Beauty should never be half way, thereby making the reader breathless instead of content; the rise, the progress, the setting of imagery should, like the sun, come natural to him and set soberly although in magnificence, leaving him in the

luxury of twilight. But it is easier to think what Poetry should be than to write it– and this leads me on to another axiom, that if Poetry comes not as naturally as the leaves to a tree, it had better not to come at all." నీతిప్రబోధక కవిత్వాన్ని కీట్స్ సమర్థించలేదు. కవితాసృజన వ్యాపారం వివేచనం చేస్తూ కీట్స్ 'Negative capability' అనే విమూత్నాంశాన్ని విశేషించి ప్రతిపాదించాడు. దాన్ని ఇలా నిర్వచించాడు- "When man is capable of being in uncertainties, mysteries, doubts without any irritable reaching after fact and reason." ఈ లక్షణం షేక్స్పియర్‌లో మిక్కుటంగా కనపడుతుందని పేర్కొన్నాడు.

కీట్స్ విమర్శక వ్యక్తిత్వాన్ని గూర్చి టి. యస్. ఇలియట్ చెప్పిన మాటలు యథార్థాలు. "Keats" sayings about Poetry thrown out in the course of private correspondence, keep Poetry close to intuition, and they have no apparent bearing upon his own times......... Keats has no theory, and to have formed one was irrelevant to his interests and alien to his mind...... He had no theories, yet in the sense appropriate to the Poet, in the same sense, though to a lesser degree than shakespeare, he had a 'philosophic' mind".[59]

## విలియం హాజ్‌లిట్

విలియం హాజ్‌లిట్ [William Hazlitt (1778-1830)] ఈ యుగ కవుల్లో ప్రత్యేకంగా పేర్కొనదగినవాడు. ఇతణ్ణి కోల్‌రిడ్జికి వారసుడంటారు కాని అతనివలె కాక యితడు అనువర్తిత విమర్శ ప్రవృత్తిని అధికంగా ప్రదర్శించాడు. ఇతని రచనలు ప్రధానంగా నాలుగు. 1. Characters of Shakespeare's plays (1817), 2. The English Poets (1818), 3. The English comic writers (1819). 4. Dramatic Literature of the Age of Elizabeth (1820). మిగిలినవి- Table-Talk (1821–22), The Spirit of the Age (1825). The Plain Speaker (1826).

హాజ్‌లిట్ విమర్శ సాధారణంగా కావ్యానుశీలన పద్ధతికి (Descriptive criticism) సంబంధించింది. కాని, అందులో అభిరుచి విమర్శ (Impressionist criticism) ఎక్కువ, "I say what I think. I think what I feel. I cannot help receiving certain impressions from things, and I have sufficient courage to declare what they are" అన్నప్పుడూ, "If I have praised an author, It was because I like him; If I have quoted a passage, it was because it pleased me in the reading; if I have spoken contemptuously of any one, it has been reluctantly"- అని అన్నప్పుడూ విమర్శలో అతని స్వీయాభిరుచిముద్ర ఉన్నట్లు స్పష్టమౌతుంది. Lectures on English Poets లో అతడు కవిత్వంమీద వ్యక్తం చేసిన అభిప్రాయాలు అతని విమర్శకవ్యక్తిత్వాన్ని తెలుపుతున్నాయి.

1. "The best general notion which I can give of poetry is, that it is the natural impression of any object or event, by its vividness exciting an involuntary movement of imagination and passion, and producing, by sympathy, a certain modulation of the voice, of sounds expressing it."

2. "Poetry is in all its shapes the language of the imagination and the passions, of fancy and will".

3. "Poetry is that fine particle within us that expands, rarefies, refines our whole being without which man's life is poor as beast's."

కవిత్వంలో భావనాశక్తి (Imagination), భావోద్వేగం (Passion) ప్రధానంగా ఉండాలని హాజ్‌లిట్ ప్రపంచించాడు. భావనాశక్తిని కోల్‌రిడ్జి మొదలైనవారికంటె భిన్నంగా నిరూపించాడు; "Imagination is that faculty which represents objects, not as they are themselves, but as they are moulded by other thoughts and feelings into an infinite variety of shapes and combinations of power." కవిత్వంలో భావోద్వేగ ప్రాధాన్యాన్ని ఉగ్గడిస్తూ అన్నమాట లివి- "Poetry is only the highest eloquence of passion, the most vivid form of expression that can be given to our conception of anything,

whether pleasurable or painful, mean or dignified, delightful or distressing."

హాజ్‌లిట్ చేసిన నాటకవిమర్శ కవితావిమర్శకంటె ప్రశంసల నందు కొన్నది. అతని దృష్టిలో విషాదాంత రూపకలక్ష్యం ఇది.- "The aim of tragedy is to resolve the sense of pain of suffering into the sense of power by the aid of imagination, and by grandeur of concepfion and character". English comic writersలో హాజ్‌లిట్ 'Wit'కూ "Humour"కూ భేదాన్ని నిరూపించి అనుశీలించాడు. 'Humour is the describing of the ludicrous as it is in itself; wit is the exposing it, by comparing or contrasting it with something else Humour is, as it were, the growth of nature and accident; wit is the product of art and fancy. Humour, as it is shown in books, is an imitation of the natural or acquired absurdities of mankind, or of the ludicrous in accident, situation, and character; Wit is the illustrating and brightening the sense of that absurdity by some sudden and unexpected likeness or opposition of one thing to another, which sets off the quality we laugh at or despise in a still more contemptible or striking point of view." హాజ్‌లిట్ మానవ బలహీనతలను బయటపెట్టే సాంఘికమోదాంత రూపకాలను విశేషంగా మెచ్చుకొన్నాడు. ఆయన అభిప్రాయంలో "Comedy is a graceful ornament to the civil order; the corinthian capital of polished society." ఇతడు విద్వద్విమర్శకుడు కాకపోయినా ఆంగ్లరచయితలను గురించి చేసిన విమర్శలు చిత్తశుద్ధితో కూడికొని ఉన్నాయి. అంతేకాక తన భావాలను తన తరంవారికే కాక, భావితరాలవారికి కూడా అందజేస్తూ ముందుకు నడిచే ఏకాకియైన పథికునిలాగా కనిపిస్తాడు హాజ్‌లిట్.

ఇతడు తన విమర్శలో 'Gusto' అనే పదాన్ని తరుచుగా వాడేవాడు. "Gusto in art is power or passion defining any object." ఈ లక్షణం ఇతని విమర్శలో విరివిగా కనపడుతుంది.

ఇతని విమర్శలో హృదయాకర్షకమైనది ఇతని మనోహరమైన శైలి. "We may all be fine fellows, but none of us can write like Hazlitt. To write a style that is easy yet incisive, lively and at

the same time substantial, buoyant without being frothy, glittering but with no tinsel frippery, a style combining the virtues of homeliness and picturesqueness has been given to few mortals, but Hazlitt excelled in it[60]"- అన్న స్టీవెన్‌సన్ మాటలు విలువైన సత్యాలు.

## చార్లెస్ లాంబ్

సరళవ్యాసకర్తగా ఈ యుగవిమర్శకులలో చార్లెస్ లాంబ్ (1775-1834)కు ప్రత్యేకస్థాన మున్నది. అనుకరణసాధ్యం కాని అతని వచనశైలి పఠితల సహానుభూతిని పొందుతూ ఉండేది." Among the romantic critics he is the least philosophical and depends for his judgements on his own common sense and good taste. He takes delight in literature in all its forms and he always wants to share that delight and enjoyment with readers. His critical writings possess a charm of their own which delights the readers immensely"[61] అన్న విమర్శకుల అభిప్రాయం గమనింపదగింది. లాంబ్ షేక్‌స్పియర్ నాటకాలు ప్రదర్శన కనుకూలంగా రచింపబడలేదని భావించాడు. నాటక పాత్రపోషణను విమర్శించాడు. మోదాంత రూపకాలలో 'Comedy of Manners'ను విశేషించి అభిమానించాడు. అతని వ్యాసాలు అప్పటికీ ఇప్పటికీ పాఠకుల ఆదరాన్ని పొందుతున్నాయి. అవి- లక్షణవిమర్శకు దూరంగా ఉండి, విమర్శకుని అభిరుచినుండి పుట్టిన రుచితో ఆయా రచనలను సరసామోదదృష్టితో సమీక్షిస్తున్నట్లుంటాయి. సరళవ్యాస (Light essay) పద్ధతికి చక్కని మార్గాలు వేశాడు లాంబ్. అందులోనూ అతనిశైలి ఎంత అందంగా ఉండేదో, అంత అనన్యసాధ్యంగా ఉండేది. శైన్ట్స్‌బరీ మాటల్లో- "Very much of his quality arises from his extraordinary command of phrase,- the phrase elaborate without affection, borrowed but absolutely individual and idiosyncratic, mannered to the oath, but never mannerised, in which, though he might not have attained to it without his great seventeenth century masters, he stands original and alone."[62] Lamb is inimitable అనేది అందరూ అంగీకరించే సత్యం.

# విక్టోరియన్ సాహిత్య విమర్శాయుగం

19వ శతాబ్దంలో మూడు దశాబ్దాలు గడిచే నాటికి పాశ్చాత్య విమర్శ చరిత్రలో ఒక క్రొత్తశకం తలయెత్తిందని చెప్పాలి. జర్మనీలో ఫ్రెడరిక్ ష్లెగల్ 1829లోను, హెగెల్ 1831లోనూ, గెథే 1832లోనూ కన్నుమూశారు. ఇంగ్లండులో హాజ్‌లిట్ 6830లోనూ, కోల్‌రిడ్జి 1834లోనూ, లాంబ్ 1834 లోనూ, ఇటలీలో ఫోసొలో 1827లోనూ, లియొపార్డీ 1836లోనూ గతించారు. ఫ్రాన్సులో జులై విప్లవం వచ్చింది. వాతావరణం పూర్తిగా మారిపోయింది.

"హెగెల్ అను జర్మను తత్త్వవేత్త గతితార్కిక సిద్ధాంతమునకు పునాది వేసెను. ఇతడు హెరాక్లిటస్ అను ప్రాచీన గ్రీకు తాత్త్వికుని సిద్ధాంతముల నాధారముగా చేసికొని, శాస్త్రీయ దృక్పథముతో, ప్రపంచము లోని ప్రతివస్తువు మార్పు చెందునని, పరస్పర సంబంధము లేని ప్రాణులు, పదార్థములు, సంఘటనలు లేవని నిరూపించెను. అనవరత పరిణామ శీలక మైన ప్రపంచమునకు మూలము భావము (Idea) అని ఇతని అభిప్రాయము. ఇతని సిద్ధాంతములకు భావవాదము ప్రాతిపదిక. ఇతనికి ముందుండిన తత్త్వ వేత్తలు మార్పునుగురించి వివరించినప్పుడు స్థలమును మాత్రమే పరిగణించెడి వారు. ఇతడు స్థలముతో పాటు కాలమునుగూడ దృష్టిలో నుంచుకొనవలె ననెను. ప్రతిపదార్థము పరస్పర వైరుధ్యములతో కూడు కొన్నదని, సంఘర్షణమే పదార్థముల ప్రధానధర్మ మని నిరూపించెను."[63]

హెగెల్ మరణించినతరువాత అతనిఅనుయాయులలో దక్షిణ(Right) పక్షీయులనీ,వామ (Left) పక్షీయులనీ రెండు తెగ లేర్పడ్డాయి.రాజకీయ మత విషయాలలో వీరికి పరస్పర విరుద్ధభా వాలుండేవి. దక్షిణపక్షీయులు హెగెల్ మతా న్ననుసరించి సౌందర్యతత్త్వశాస్త్రానికీ, అలంకారశాస్త్రానికీ, సాహిత్య చరిత్రకూ సంబంధించిన రచనలు పుంఖానుపుంఖంగా రచించారు. కాని అవి అన్నీ అనుకరణలు కావటంచేత ప్రత్యేక ప్రతిపత్తిని గడించుకోలేక పోయాయి. వామపక్షీయులు మాత్రం ముందడుగు వేయగలిగారు. అయితే, వారి మార్గం మార్క్సిస్టు విమర్శగా రూపొందటానికి మరికొంత కాలం పట్టింది. రెనెవెలక్ మాటల్లో- "The Hegelian Left showed more

life : Arnold Ruge was a sharp critic of romanticism, and Marx and Engels, though hardly themselves literary critics, were to exert long after their death a profound influence on literary criticism in the 20th century, even in distant countries. Marx and Engels adopted the Hegelian dialectic but rejected his metaphysics. Their literary interests and opinions, still deeply coloured by the taste of German Classicism, were, however, quite subordinate to their political and social concerns. One cannot speak of Marxist Literary Criticism before Plekhanov and Mehring, in the last decade of the 19th century."[64]

ఫ్రాన్సులో Taine, Saint-Beuve కావ్యానుశీలనంలో శాస్త్రీయ పద్ధతుల నన్వేషించారు. టైనే- సాహిత్యం సాంఘిక శక్తులవలన ఉత్పన్న మయ్యేదనీ, ఆ శక్తులు జాతి (Race), పరిసరం (milieu), పురోగతి (movement) అనే మూడంశాల మీద ఆధారపడి ఉంటాయనీ వివేచించారు. ఒక రచయిత మానసికస్థితి, భావప్రకటన వైఖరి అతడు పుట్టిన జాతిని, పెరిగిన వాతావరణాన్నీ అతడు నివసించిన యుగాన్నీ, అతడు పురోగతిని సాగించే వయఃకాలాన్నీ బట్టి నిశ్చయించాలని చెప్పాడు. వీటిని అనుశీలనంలో గ్రహించకపోతే ఒకరచనకు నిజమైన విలువకట్టటం సాధ్యం కాదని పేర్కొన్నాడు. అవే రచనకు వస్తువునూ (Content), ఆకృతినీ (Form) నిర్ణయిస్తాయని నిశ్చయించాడు. ఇతని ప్రభావానికి లొంగి కొందరు విమర్శలు సాగించారు. వారందరిలో శిఖరప్రాయుడుగా భాసించింది Sainte-Beuve. "Sainte-Beuve, whose first book was published in 1828, joined them but went beyond them, combining, virtuoso fashion, all possible methods; Literary history, characterization, psychological explanation, impressionistic subjectivism. He came to dominate the time, and by his long labours he restored the critical prestige of France. For many people in France and outside he is still THE CRITIC"—[65] అన్న రెనెవెలక్ ప్రశంస ఆ విమర్శకుని గొప్పతనాన్ని ప్రకటిస్తున్నది.

ఇంగ్లండులోని సాహిత్యవిమర్శ పరిస్థితిని సమీక్షిస్తూ రెనెవెలక్— "In critical theory we see a turn towards sheer emotionalism, the view that poetry is an overflow of feelings, mere personal self-expression. John Stuart Mill, associated to day with

hard-headed utilitarianism, formulated this view most clearly and extremely in his youth, and John Keble, the poet of the CHRISTIAN YEAR. applied it even to Homer. "Poetry; he said, is a kind of medicine, which gives relief to secret emotion, yet without detriment to modest reserve." The bulk of criticism became didactic, sentimental, moralistic. Macaulay, though hardly sensitive to poetic values, sharpened at least a feeling for the past. Poetic theory was almost non-existent; only Mathew Arnold brought about a sorely needed critical revival in the 1860's"[66]

## మాథ్యూ ఆర్నాల్డ్

మాథ్యూ ఆర్నాల్డ్ (1822–1888) విక్టోరియన్ విమర్శయుగాన్ని గాఢంగా ప్రభావితం చేసిన మహా విమర్శకుడు. పారిశ్రామిక నాగరకతవలన సమాజంలో ప్రబలమైన భౌతికవాదదృక్పథం మతంపట్ల, జీవితపు నైతిక విలువలపట్ల నిర్లిప్త భావాన్ని వ్యాపింపచేసింది. ఆ పరిస్థితిని చూచి ఆర్నాల్డ్ ఆవేదనపడ్డాడు. సాహిత్యంద్వారా సామాజిక జీవితాన్ని గురించిన సవ్యమైన సదవగాహనను రేకెత్తింప చేసి, జీవిత మౌలికధర్మాలైన మత నైతిక, సాంస్కృతిక ప్రవృత్తులను జాగృతం చేయాలని ఆర్నాల్డ్ తీవ్రంగా ప్రయత్నించాడు. Walter Raleigh అన్నట్లు- "It was with this aim, to arrest what he conceived to be the national decay, to lead English literature into the paths of sanity and wisdom that Mathew Arnold became a critic, a missionary. a prophet."[67]

సమకాలీన సమాజజీవితంలో పెచ్చు పెరిగిన భౌతికదృక్పథానికీ, అంతరించిన ఆధ్యాత్మిక ప్రవృత్తికీ మధ్య కవిత సమన్వయవారధిగా ఉండాలని ఆర్నాల్డ్ భావించాడు. మతగ్రంథాలు మేధాప్రధానంగా చేసే ప్రవచనం సమాజాన్ని ఆకట్టుకోలేనప్పుడు కవితయే ఆస్థానంలో నిలిచి రమణీయంగా ప్రబోధం సాగించాలి. 'సాహిత్యమే భావిసంస్కృతికి ప్రాతిపదిక; రేపటి మతం' అంటూ ప్రబోధించాడు. ఆర్నాల్డ్ దృష్టిలో మతమంటే సద్వర్తనం. సత్ప్రవర్తనం ద్వారా సత్యజ్ఞాన సాధనం మానవుడు చేయాలి. ఈ సాధనకు సాహిత్యం సాత్త్వికసాధనగా తోడుపడాలి. జాతికి నీతివర్తనం నేర్పని

సాహిత్యం జీవితగమ్యాన్నే విస్మరించిన అయోమయ ప్రయోగ మౌతుంది. "A Poetry of revolt against moral ideas is a Poetry of revolt against life: A Poetry of indifference towards moral ideas is a Poetry of indifference towards life" అన్న ఆర్నాల్డ్ మాటలు కవిత్వం నీతిప్రబోధాన్ని తప్పకుండా నిర్వహించాలన్న అతనిగాఢ విశ్వాసాన్ని వ్యక్తం చేస్తున్నాయి. అయితే, అతని దృక్పథంలో నీతిని బోధిస్తూ కవితాకళను విస్మరించిన కృతులు సమాదరణీయాలు కావు. కవితాకళలో నీతి వ్యంగ్యంగా, సునిశితంగా వ్యక్తం కావాలి. ఆర్నాల్డ్ దృష్టిలో నీతి అంటే 'ఎలా జీవించాలి?' అన్న ప్రశ్నకు అనువైన సమాధానం. "The question 'how to live', is itself a moral idea; and it is the question which most interests every man and with which, in some way or other. he is perpetually occupied"- అని పేర్కొంటూ "The greatness of a poet lies in his powerful and beautiful application of ideas to life-to the question; How to live?" అని,-కవిగొప్పతనం ఆ ప్రశ్నను జీవితాని కన్వయించి సుందరంగా శక్తిమంతంగా అభివ్యక్తీకరించటంలోనే ఉన్నదని స్పష్టం చేశాడు. జాతి జీవనంలో మతం, నీతివర్తనం అవినాభావంగా ఉండే అంశాలని ఆర్నాల్డ్ చెప్పటమే కాకుండా కవితను కూడా ఆ రెండింటితో కలిపి ఒకటి చేశాడు. కవితయే జీవితమత మని చాటాడు. "Without Poetry, our science will appear incomplete: and most of what now passes with us for religion and philosphy will be replaced by Poetry" అని అపూర్వంగా చెప్పాడు.

ఈ దృష్టితో ఆర్నాల్డ్ కవిత్వాని కిచ్చిన నిర్వచనం నూత్నదృక్పథాన్ని ఆవిష్కరించింది. "Poetry is 'a criticism of life under the conditions fixed for such a criticism by the laws of Poetic truth and poetic beauty." అన్నది అత డిచ్చిన ప్రసిద్ధ నిర్వచనం. ఇందులో criticism of life 'అంటే' the noble and profound application of ideas to life' అని, 'Poetic truth' అంటే 'truth and seriousness of substance and matter' అని, 'Poetic beauty' అంటే 'felicity and perfection of diction and manner' అని అర్థాన్ని వివరించి చెప్పాడు, జీవితాన్ని యథాతథంగా

చిత్రించటం కవితాధర్మం కాదు. కవి తనదైన దర్శనంతో దాన్ని చూచి, భావనామయంచేసి చిత్రిస్తాడు. అప్పుడు వాస్తవసత్యం భావసత్య మౌతుంది. వాస్తవానికి కవి కల్పించే భావనాకృతియే కవిత్వసత్యం. అందు లోనే ఉదాత్త జీవిత విమర్శ ఇమిడి ఉంటుంది. కవి భావనలో విమృష్టమైన జీవితం కమనీయ భావనామయ జీవిత చిత్రంగా కవితలో ఆవిష్కృత మౌతుంది. దాని అభివ్యక్తికి వ్యంజకంగా సమకూర్చే రచనావిధానం, శైలీ సౌందర్యస్ఫూర్తిని కలిగిస్తాయి. కవితలో భావం సత్యం. సర్వస్వమున్నూ. దానిని భావసంవాదంతో భవ్యభావనామయం చేస్తే కవితాకృతి ఆవిర్భవిస్తుంది. ఆర్నాల్డ్ మాటల్లో— "For Poetry the idea is every thing; the rest is a world of illusion, of divine illusion. Poetry attaches its emotion to the idea: the idea is the fact". సమకాలీన జగత్తులో మతసాహిత్యం కోల్పోయిన దర్శనశక్తిని కవితద్వారా పునరుద్ధ రించి సమాజంలో ధర్మచైతన్యాన్నీ, నీతిసౌరభాన్నీ, కవితాదర్శనాన్నీ వ్యాపింపచేయడానికి ఆర్నాల్డ్ కవియైనప్రవక్తగా కంకణం కట్టుకొన్నాడు. కవి తకు ఉదాత్తశైలి (The grand style) ముఖ్యమని ఇతడు భావించాడు. "I think it will be found that the grand style arises in poetry, when a noble nature, poetically gifted, treats with simplicity or severity a serious subject." ఇతని ఉదాత్తశైలి సిద్ధాంతం మనరీతివాదానికి దగ్గరగా ఉంటుంది. ఆర్నాల్డ్ గ్రాండ్ స్టైల్ ను simple, severe, mixed అని మూడు విధాలుగా భావించి క్రమంగా హోమర్, డాన్టే, మిల్టన్ శైలు లటువంటి వని పేర్కొన్నాడు. భారతీయ లాక్షణికుల వైదర్భీ, గౌడీ, పాంచాలీరీతు లీ పద్ధతిలోనే సంభావింపబడుతూ ఉంటాయి. ఈ విధంగా చూస్తే కవితలోని వస్తువుయొక్క భావవ్యక్తీకరణ కు రీతి తోడ్పడుతుందని ఆర్నాల్డ్ విశ్వసించినట్లు స్పష్టం. మన లాక్షణికులు కూడ రీతులవలన వృత్తులు రూపుకట్టుతాయని రీతులు పరోక్షరసోపస్కా రకాలనీ భావించటం ప్రసిద్ధం.

ఆర్నాల్డ్ కాల్పనికోద్యమ కవుల సిద్ధాంతాలను ప్రతిఘటించాడు. ఆ కవులు జీవితస్వభావ విమర్శనం కంటె, తాము తమ తమ అభిరుచులతో జీవిత సత్యాలను వ్యాఖ్యానించే వైఖరికి ప్రాముఖ్య మిచ్చారని ఆర్నాల్డ్ అభిప్రాయం.

ఆత్మాభివ్యక్తియే వారి కవితకు ధ్యేయం. ఆర్నాల్డ్ దాన్ని వారించాడు. జీవితాన్ని ఉదాత్త నైతిక తాత్త్విక దృక్పథంతో దర్శించి భావించటమే కవుల ధర్మమనీ, కవిత్వం ద్వారా సమాజంలో శాశ్వతనైతిక ప్రమాణాల విలువలు పునరుద్ధరింప బడాలనీ ఆర్నాల్డ్ తనయుగ కవుల కర్తవ్యాన్ని చాటిచెప్పారు. ఉత్తమ వస్తువులు, ఉదాత్తశైలి కవితకు అత్యవసరమన్నాడు, కవితయే కాలాని కవసరమైన, కలకాలం నిలువ దగిన విలువలను కల్పించే విలువైన ద్రవ్య మన్నాడు.

ఆర్నాల్డ్ రచనలలో ముఖ్యమైనవి; Preface to the Poems (1853); On Transilating Homer (1861), The study of Celtic literature (1867), Essays in criticism (1865, 1888). ఇతడు తన విమర్శలో ఆకృతి, అభివ్యక్తి శిల్పాలకంటె వస్తువుకు గౌరవ మిచ్చి మన్నించాడు. పఠితలకు చమత్కారాన్ని కలిగించే పంక్తులు ప్రతి కవితలోను కొన్ని ఉంటే చాలనే పరిచ్ఛిన్న దృక్పథాన్ని విమర్శించి రచన యొక్క సమగ్రతనూ, అది కలిగించే అనుభవ ప్రభావాలనూ ప్రశంసించాడు. ఉదాత్త వస్తువు నెన్నుకుంటే కావ్యానికి గౌరవం కలుగుతుందనీ, అందలి సన్నివేశాలను అనుభావస్ఫోరకంగా, రసభావబంధురంగా రచయిత నిపుణంగా చిత్రింపగలిగితే కావ్యజీవితం నిరాఘాటంగా సాగుతుందనీ ప్రవచించాడు, "All depends upon the subject; choose a fitting action, penetrate yourself with the feeling of its situations; this done every thing else will follow"— అని కవులకు ఆర్నాల్డ్ చెప్పిన హితవు. వస్తువు ప్రాచీనమైనా, ఆధునికమైనా దానిలో ఉన్న కార్యశక్తి చేతనే అది గౌరవింపబడుతుందని చెపుతూ "The grand work of literary genius is a work of synthesis and exposition, not of analysis and discovery; its gift lies in the faculty of being happily inspired by a certain intellectual and spiritual atmosphere, by certain order of ideas, when it finds itself in them; of dealing divinely with these ideas, presenting them in the most effective and attractive combinations,— making beautiful work with them, in short"— అని ప్రపంచించాడు.

ఆర్నాల్డ్—విమర్శకుని కుండవలసిన లక్షణాలను వివేచిస్తూ అనాసక్తత-లేదా-వ్యామోహరాహిత్యం (Disinterestedness) ప్రధానమైనదిగా పేర్కొ-

న్నాడు. ప్రాచీన మహాకవుల జీవితాలూ, రచనలూ కావ్యానుశీలనంలో నికషోప లాలుగా రాణిస్తాయన్నాడు. విమర్శలో కవిజీవిత విమర్శ పద్ధతినీ, తులనాత్మ కాధ్యయనపద్ధతినీ విశేషంగా అనుసరించాడు. విమర్శను కవితలాగా సృజ నాత్మక ప్రవృత్తిగా సంభావించాడు. ఇతడు ప్రతిపాదించిన 'Imaginative reason', ప్రత్యేకంగా పేర్కొనదగింది. "The main element of the spirit's life" he says "is neither the senses and understanding, nor the heart and imagination' it is the imaginative reason. The imaginative reason–with this phrase Arnold feels he has closed the gap between head and heart, between feeling and intellect, a schism, as it had appeared in his Poetry"[68]

ఆర్నాల్డ్ ఆంగ్లవచనశైలి పఠితల కత్యంతాహ్లాదాన్ని కలిగిస్తుంది. ట్రిల్లింగ్ మాటల్లో– "Arnold has a manner and style rather new to England and perfectly adopted to the art of criticism–elegant yet sinewy, colloquial yet reserved, cool yet able to glow into warmth, careful never to flare into heat."[69]

ఆంగ్ల విమర్శలో అభినవ అరిస్టాటిల్‌గా అభివర్ణింపబడ్డాడు ఆర్నాల్డ్. ప్రతిభలో, ప్రభావంలో, ప్రత్యేకతలో, భాషలో, శైలిలో వారిద్దరి మధ్యనున్న భేదాన్ని సమీక్షిస్తూ స్కాట్‌జేమ్స్ చేసిన సమీక్ష విమర్శకులు గమనింప దగింది. "Aristotle shows us the critic in relation to art, Arnold shows us the critic in relation to the public. Aristotle dissects a work of art, Arnold dissects a critic The one gives us the principles, which govern the making of a poem; the other, the principles by which the best poems should be selected and made known; Aristotie's critic owes allegiance to the artist, but Arnold's critic has a duty to society. He is a propagandist filling the soil so that 'the best ideas may prevail, making an intellectual situation of which the creative power can profitably avail itself.' To prepare a social atmosphere which will stimulate the artist-to make the best that has been written familiar to the public–this was the new task of criticism. It was to be contributed to the problem of 'perfection' or 'how to live'. It was on the way to becoming a branch of social reform."[70] ఆర్నాల్డ్ అనుయాయులైన విమర్శకులెందరో ఉన్నారు.

వారిలో— Walter Pater, Arther Symons, J A. Symonds, Leslic Stephen, F.W.H. Myers, George Saintsbury, Charles Whibley, A.C. Bradly, W P. Ker మొదలైనవారు ముఖ్యులు.

కావ్య ప్రయోజనాన్ని సంలక్షించిన విధాన్ని బట్టిచూస్తే విక్టోరియన్ యుగ విమర్శకులు మూడు వర్గాలుగా కనపడతారు. నీతిని బోధించేదే కవిత అనేవా రొకవర్గం; కళ కళకొరకే (Art for Art's sake) అనేవారు మరోవర్గం; ఉపరంజనంతో పాటు ఉపదేశం చేసేదే కవిత అనేవర్గం మరొకటి. కార్లైల్, రస్కిన్ మొదలైనవారు మొదటి వర్గానికి చెందేవారు. వాల్టర్ పేటర్, ఆస్కార్‌వైల్డ్ ప్రభృతులు రెండవవర్గానికి చెందినవారు. ఆర్నాల్డ్ ప్రభృతులు మధ్యేమార్గమైన మూడవవర్గానికి చెందినవారు. ఆర్నాల్డ్ మార్గం అర్ధశతాబ్దిదాకా ఆదర్శమార్గంగా ఆదరింపబడింది. రెనెవెలక్ మాటలలో- "Arnold, almost single-handedly, pulled English criticism out of the doldrums into which it had fallen after the great Romantic Age."[71]

## వాల్టర్ పేటర్

19వ శతాబ్దపు చివరిపాదంలో ఆంగ్లసాహిత్య విమర్శ రంగం సాహిత్యసౌందర్య సమాలోచనానికి అంకితంకావటానికి ప్రధానకారకుడు వాల్టర్ పేటర్ (Walter Pater—1839-1893). Gautier, Baudelaire, Flaubert మొదలైన ఫ్రెంచిరచయితలు ఫ్రాన్స్‌లో ప్రాచుర్యానికి తెచ్చిన సాహిత్యసౌందర్య సమారాధనోద్యమం (Aesthetic movement) ఇతనిమీద బలంగా ప్రభావం వేసింది. వారి దృష్టిలో కవితకు వస్తువు కంటె కళాస్వరూపం గొప్పది; నీతికంటె సౌందర్యం ముఖ్యం. కళ కళకొరకే అన్నది వారి వాద తాత్పర్యం. ఈ సౌందర్య సమారాధనోద్యమాన్ని ఆంగ్ల విమర్శలో పేటర్ ప్రవేశపెట్టి ప్రచారానికి తెచ్చాడు. అయితే ఇతని దృష్టిలో సౌందర్యం ఇంద్రియ గమ్యమయ్యే భౌతిక స్వభావం కలది కాదు; మనో గమ్యమయ్యే భావసౌందర్యం మాత్రమే. అట్టి సౌందర్యస్ఫూర్తిని, దర్శ నాన్ని పఠితల కందించటమే కళాధర్మం; దాన్ని అనుశీలించటమే విమర్శ

ధర్మ మని పేటర్ ప్రతిపాదించాడు. ఇతని రచనలు— Studies in the History of the Renaissance (1873), Marius the Epicurean (1885), Appreciations (1889), Plato and Platonism (1893)

రచయిత తాను పొందిన అనుభవాన్నంతా తన రచనలో ఆవిష్కరించడు. కాని, తన కంటిన గాఢానుభూతిని కవితలో వ్యక్తం చేయటానికి యత్నిస్తాడు. తన అనుభూతిని పఠితలోకూడ కల్పించటానికి ప్రయత్నిస్తాడు. కళానుభవమే కళకు ప్రయోజనం కాని, అనుభవం వలన పఠిత పొందే ఉపదేశం కాదు. పేటర్ మాటలలో- "Not the fruit of experience, but the experience itself, is the end."

De Quincey సాహిత్యాన్ని Literature of power అనీ, Literature of Knowledge అనీ విభజించినట్లుగానే, పేటర్ కూడా సాహిత్యంలో Imaginative forms అనీ unimaginative forms అనీ రెండు ఉంటాయని వివేచించాడు. కవి భావనాశక్తితో అంతరమైన దర్శనాన్ని అందంగా అభివ్యక్తీకరించే కళాకృతి Imaginative form. వాస్తవ వస్తువును వాస్తవంగా చిత్రించే అనుకరణ కళాకృతి unimaginative form. కవి దర్శించే సుందర కళాసత్యమే కళాకృతికి ప్రాణాధారం. పేటర్ మాటలలో- "All beauty is in the long run only FINENESS of truth, or what we call expression, the finer accomodation of speech to that vision within." వచన శైలి కవితాశైలిలాగా శక్తిమంతమైనదనీ, ఆధునిక లోకానికి వచనమే ఉపాదేయమనీ ఇతడు భావించాడు. "It will be good literary art not because it is brilliant or sober, or rich, or severe, but just in proportion as its representation of that sense, the soul-fact, is true verse being only one department of such literature, and imaginative prose it may be thought, being the special art of the modern world".

ఉత్తమశైలి లక్షణాలను వివేచిస్తూ పేటర్- 'The MIND in style అనీ, the SOUL in style' అని ద్విధాకరించాడు ఇందులో మొదటిది కవితలోని నిర్మాణ సంవాదాన్ని (structural harmony) వ్యక్తీకరించేది; రెండవది రచనలో రచయిత వ్యక్తిత్వం రంగరింపబడే విధాన్ని వివేచించేది

(infusion of writer's personality). ఈ రెండింటి స్వభావాలను సమీక్షిస్తూ ఇలా వివరించాడు పేటర్: "As a quality of style, at all events, soul is the fact, in certain writers-the way they have of absorbing language, of attracting it into the peculiar spirit they are of, with a subtlety which makes the actual result seen like some inexplicable inspiration. By mind, the literary artist reaches us, through static and objective indications of design in his work, legible to all. By soul, he reaches us, somewhat capriciously perhaps, one and not another, through vagrant sympathy and a kind of immediate contact."

పేటర్ కళను మరలా రెండువిధాలుగా భావించాడు- good art and great art అని. కవిత కీ విభాగాన్ని అన్వయించుకుంటే సత్కవిత, ఉదాత్త కవిత అని అనవచ్చునేమో! ఆ రెండింటి స్వభావాలను ఇలా వివేచించవచ్చు. "A good artist says to the reader. 'I want you to see precisely what I see.' Where his style succeeds in doing this, it is true to his sense of fact. Good art therefore consists in the 'absolute accordance of expression to idea'-the accurate translation of the sense of fact into language. But with all this it may not be a great art. For the fact which attracts the writer's soul may not, with all its aptness of expression, be great enough to attract 'the soul of humanity'. It may be too personal to be universal. Unless therefore the writer's sense of fact is allied to great ends, his work is not great art. The other conditions remaining the same, great art is 'devoted further to the enlargement of our sympathies with each other, or to such presentment of new or old truth about ourselves and our relation to the world as may ennoble and fortify us in our sojourn here or immediately to the glory of God".[72]

ఆంగ్ల సాహిత్య విమర్శ చరిత్రలో కావ్యానుశీలనంలో అభిరుచి విమర్శ పద్ధతిని (Impressionistic method) పతాక స్థాయికి తీసికొనిపోయినవాడు పేటర్ "His method is that impressionism which Hazlitt and Lamb have brilliantly illuminated. His intuition, no less acute, is still more personal than theirs, in so far as it is more limited, exclusively governed by the feeling of his own powers; in so far, too, as it readily utilizes semi-cons-

cious states, the dim regions of the inner world, and his judgements more often are a deviation of the obscure parts and of the reverse side of the souls".[73]- అన్న Cazamian సమీక్ష గమనింపతగింది. "His stress on beauty in all things made him insensible to many other beauties of literature and this resulted sometimes in the misrepresentation of certain writers"[74] అన్న విమర్శకూడా జ్ఞాపకముంచుకొన దగింది.

పేటరు విమర్శదృక్పథాన్ని ఇలా క్రోడీకరించవచ్చు- "If a Poet's work is to have an aesthetic as distinct from historical value, it is not enough for a Poet to have been the true child of his age, to have conformed to its aesthetic conditions, and by so conforming to have charmed and stimulated that age, it is necessary that there should be perceptible in his work something individual, inventive, unique, the impress thereof the writer's own temper and personality"[75].

ఇది అతని అభిప్రాయమేకాదు, అభిరుచి విమర్శ ధ్యేయం కూడా.

## ఆధునిక విమర్శ యుగం
## టి.యస్. ఇలియట్

ఆధునిక సాహిత్య విమర్శ యుగానికి నాయకమణిగా టి. యస్. ఇలియట్ పరిగణింపబడుతున్నాడు. ఇతడు కవీ విమర్శకుడూ కావటంచేత ఉత్తమ కవియే ఉత్తమ విమర్శ వెలయింపగలడని భావించాడు. విమర్శ ప్రవృత్తీ సృజనాత్మక ప్రవృత్తీ పరస్పర పోషకంగా వర్ధిల్లాలని ఆశించాడు. ఇతడు చేసిన విమర్శ ప్రధానంగా అతని వ్యాసాలలోనూ, ఉపన్యాసాలలోనూ కనపడుతుంది. వాటిలో ప్రధానమైనవి-The Sacred Wood, Homage to John Dryden, For Lancelot Andrews, Selected Essays, The use of Poetry and the use of criticism, Elizabethan Essays, Essays Ancient and Modern. కళలోనూ విమర్శలోనూ ఒక క్రమపద్ధతి ఉండాలన్నది ఇలియట్ ఆశయం. "I am a royalist in Politics, Christian in religion and a classicist in literature'- అని నిస్సంశయంగా ప్రకటించుకొన్నాడు.

Thomas Stearns Eliot (1888-1965) సమకాలీన సాహిత్య రంగంలో ప్రవర్తిల్లుతున్న Impressionistic criticism లేక Aesthetic criticism ను Philosophical, abstract and Intellectual criticism ను, ఎదుర్కొని విమర్శించాడు. 'The sentimental person, in whom a work of art arouses all sorts of emotions which have nothing to do with the work of art whatever, but are accidents of personal association, is an incomplete artist"[76] అని అభిరుచి విమర్శ వెలయించేవారిని అసమగ్ర విమర్శకులని గేలిచేశాడు. "Philosophical crittcs look for philosophical material in a work of art. This type of criticism wants to remove the emotional element from literature"[77] అని తత్త్వవిమర్శను త్రోసిరాజన్నాడు. తన దృష్టిలో సాహిత్య విమర్శ, సాహిత్య విమర్శకుడూ ఎలా ఉండాలో స్పష్టంగా వివేచించి చెప్పాడు.[78]

1. Criticism must always profess an end in view, which' roughly speaking, appears to be the elucidation of works of art and the correction of taste".

2. The critic, if he is to justify his existence, should endeavour to discipline his personal prejudices and cranks-tares to which we are all subject-and compose his diff ıences with as many of his fellows as possible, in the common pursuit of true judgement."

3. "A literary critic should have no emotions except those immediately provoked by a work of art...The new impressions modify the impressions received from the objects already known. An impression need to be constantly refreshen by new impressions in order that it may persist at all; it needs to take its place in a system of impressions. And this stystem tends to become articulate in a generalized statement of literary beauty".

కవీ, విమర్శకుడూ ఒక అవిచ్ఛిన్న సంప్రదాయధారలో ముందుకు సాగిపోతుంటారు. సంప్రదాయం స్థిరమైన జడపదార్థం కాదు. గతిశీలం దనిలక్షణం. గతంలోని మంచి మారుతున్న వర్తమానంలోకి ప్రవహిస్తుంది. సంప్రదాయం వంశపారంపర్యంగా వచ్చే లక్షణం కాదు; ఎప్పటికప్పుడు

పరిశ్రమతో సాధించి అలవరచుకొనేది. సంప్రదాయావగాహనకు చారిత్రక పరిజ్ఞానం అత్యవసరం. అయితే ఈ పరిజ్ఞానం గతాన్ని త్రవ్వుకొంటూ కూర్చుండేదికాదు. పరంపరగా వస్తున్న చరిత్ర ప్రవాహంలో వర్తమానంలోని క్రొత్తదనంతో గతంలోని విలువలను వివేచించి సమన్వయించుకొంటూ క్రొత్తదృక్పథంతో గతాన్ని సమీక్షిస్తూ, క్రొత్తను సృజించుకొంటూ వర్తమానంలోని విలువలను సరిదిద్దుకొంటూ సాగే సాహిత్య చైతన్యానికి వివేకాన్నిచ్చే విజ్ఞాన పీఠి. "This historical sense which is a sense of the timeless as well as of the temporal and of the timeless and of the temporal together, is what makes a writer traditional. And it is at the same time what makes the writer most acutely conscious of his place in time, of his own contemporancity" అని అంటాడు ఇలియట్.

ఒక నవ్యకృతి సాహిత్యంలో వెలిసిందంటే చరిత్రలో వస్తున్న క్రమం కొద్దిగానైనా మారుతుంది. అంటే గతాన్ని వర్తమానం మారుస్తుంది; గతం వర్తమానంలో ప్రవహిస్తుంది. ఆ వరుసలో ఆ కృతిని అనుశీలించాలి కాని, దానిని ప్రత్యేకంగా పరిశీలించటం కుదరదు. దానివలన కలిగే అభినవాభిరుచులను ప్రాతవాటితో పోల్చి సంవదించుకొని చరిత్ర గతిలో వాటి విలువలను వివేచించాలి. అందువలన విమర్శకు తులనాత్మక పరిశీలన ప్రవృత్తి (comparison) ముఖ్యలక్షణం. ఇలియట్ దృష్టిలో తులనాత్మక ప్రవృత్తి, వివేచనాత్మకశీలం విమర్శకు ముఖ్యసాధనాలు. "Comparison and analysis are the chief tools of the critic. It is obvious indeed that they are tools, to be handled with care and not employed in an inquiry into the number of times giraffs are mentioned in the English novel"[79] అని హెచ్చరించాడు ఇలియట్. ఈ రెండు సాధనాలతో చేసే విమర్శ గతాన్ని వినూత్నంగా వాఖ్యానిస్తుంది; వర్తమానాని కొక నియతితో కూడిన గతిని ప్రసాదిస్తుంది. "The existing order is complete before the new work arrives; for order to persist after the supervention of novelty, the whole existing order must be, if ever so slightly, altered; and so the relations, proportions, values of each work of art towards the whole are readjusted; and this is conformity betwenn the old and the new "[80] గతానికీ వర్తమానానికీ మధ్య జరిగే ధ్రువీకరణమే

సంప్రదాయం. గతానికీ వర్తమానానికీ భేదాన్ని చెప్పుతూ ఇలియట్ ఇలా అన్నాడు- "The difference between the present and the past is that the conscious present is an awareness of the past in a way and to an extent which the past's awareness of itself cannot show."[81]

కవి రచన చేసేటప్పుడు క్రమంగా స్వీయప్రత్యయాన్ని త్యాగంచేసి కొంటూ, అంతకంటే ఉదాత్తమైన కావ్యప్రవృత్తిలో లీనమైపోవాలి. దీన్నే "The progress of an artist is a continual self-sacrifice, a continual extinction of personality" అంటాడు ఇలియట్. దీన్ని సమర్ధిస్తూ, వివరిస్తూ ఆతడు చేసిన వ్యాఖ్యలు అమూల్యాలు.మచ్చుకు కొన్ని-

1. "Poet has, not a 'personality' to express, but particular medium (the mind), which is only a medium ar not a personality, in which impressions and experience combine in particular and unexpected ways. Impressions and experiences which are important for the man may take no place in the poetry, and those which become important in the poetry may play quite a negligible part in the man, the personality."

2. "Very few know when there is an expression of SIGNIFICANT emotion, emotion which has its life in t poem and not in the history of the Poet. The emotion of t art is impersonal. And the poet cannot reach this impersonality without surrendering himself wholly to the work to be done. And he is not likely to know what is to be done unless he lives in what it is not merely the present but the present moment of the past, unless he is conscious, not of what is dead but of what is already living."

కవి తన భావాన్ని సరాసరి పఠితకు అందించలేడు. దాని కతనికి కావ్యంలో ఏదైనా వాహిక కావాలి. అందువలన తనభావాన్ని వ్యంజింప జేయగల కొన్ని వస్తువుల ద్వారా కానీ, సన్నివేశం ద్వారా కానీ, సంఘటనల పరంపర వలన కానీ వ్యక్తీకరిస్తాడు. అంటే రచయిత వస్తుగత పాత్రలద్వారానో, సన్నివేశాలద్వారానో పరోక్షంగా తన భావాలను

వ్యక్తీకరిస్తాడన్నమాట. దానిని ఇలియట్ 'Objective correlative' అని అన్నాడు. దీన్ని తెలుగులో వస్తుగత సంవాదమని పేర్కొనవచ్చు. ఇలియట్ మాటల్లో "The only way of expressing emotion in the form of art is by finding an 'objective correlative'; in the other words, a set of objects, a situation, a chain of events which shall be the formula of that particular emotion; such that when the external facts, which must terminate in sensory experience, are given, the emotion is immediately evoked."[23] కవి నిజభావానికి కవిత పరోక్షప్రమాణమే అవుతుంది కాని ప్రత్యక్ష ప్రమాణం కాదని ఇలియట్ అభిప్రాయం. కవి జీవిత కావ్యార్థ సమన్వయ విమర్శలో కనపడే దోషాన్ని ఇత డిలా పరిశుద్ధంచేసి ప్రపంచించాడు.

ఇలియట్ దృష్టిలో 20వ శతాబ్దపు విమర్శ రెండుబాధ్యతలను నిర్వహింప గలిగిందిగా ఉండాలి. గతంలో రచయితలు సాహిత్యంలో సాగించిన వ్యవసాయాన్ని వినూత్న దృక్పథంతో పునఃపరిశీలించి విలువలుకట్టటం మొదటి బాధ్యత. వర్తమాన సాహిత్యంలో వినూత్న భావాలను ప్రచలితంచేయటం రెండవ బాధ్యత. ఈ రెండింటిలో మొదటి బాధ్యతకు ఇలియట్ అగ్రస్థానాన్నిచ్చాడు. ప్రతితరంలోనూ వెలిసే కళాస్రష్టలకు కొన్ని ప్రత్యేక కళాప్రమాణాలూ, విలువలూ ఉంటుంటాయి. వాటితో గతాన్ని పునఃపరిశీలించి, పునర్వ్యవస్థీకరించటం జరగాలి. అప్పుడే గతంలో జరిగిన గుణదోషాల సమ్యక్పరిశీలనం సిద్ధిస్తుంది. ఇది విప్లవంలా విధ్వంసక విధా న్ననుసరించి కాక పునర్వ్యవస్థీకరణంలా నిర్మాణాత్మకంగా సాగాలని ఇలియట్ అభిప్రాయం. ప్రతియుగంలోనూ ఒక మహావిమర్శకుడు జనించి ఈ కర్తవ్యాన్ని నిర్వహించాలని ఇలియట్ ఆశించాడు. "From time to time, every hundred years, it is desirable that some critic shall appear to review the past of our literature, and set the poets and poems is a new order. This taste is not one of the revolution but of re-adjustment."

వర్డ్స్‌వర్త్ కవిత్వాని కిచ్చిన ప్రసిద్ధ నిర్వచనాన్ని విమర్శించి ఇలియట్ తన భావాల నిలా వ్యక్తంచేశాడు:

1. "Poetry is not a turning loose of emotions, but an escape from emotion; it is not the expression of personality but an escape from personality."

2. "Poetry is a superior amusement : I do not mean an amusement of superior people. I call it an amusement...... not because that it is a true definition, but because if you call it anything else you are likely to call it something still more false."

3. "Poetry is not the inculcation of morals. or the direction of politics; and no more is it religion or an equivalent of religion, except by some monstrous abuse of words'.

4. "It (Poetry) may effect revolutions in sensibility such as are periodically needed; may help to break up the conventional modes of perception and valuation which are perpetually forming, and make people see the world afresh, or some new part of it. It may make us from time to time a little more aware of the deeper, unnamed feelings which form the substratum of our being, to which we rarely penetrate; for, our lives are mostly a constant evasion of ourselves, and an evasion of the visible and sensible world. But to say all this is only to say what you know already, if you have felt poetry and thought about your feelings."

ఇలియట్ తన విమర్శలో కవిత్వసంబంధులైన మౌలికాంశాల నన్నింటినీ వివేచించాడు. విమర్శ కొక నిర్దుష్టమైన పద్ధతి ఉండాలనీ, అనుశీలనంలో శాస్త్రసమ్మతమైన సరణి నెలకొల్పబడాలనీ ప్రబోధించాడు. సంప్రదాయ సాతత్యాన్నీ, సమన్వయాన్నీ సమర్థించాడు. అతని ప్రసిద్ధ సందేశం- "The people which ceases to care for its literary inheritance becomes barbaric; the people which ceases to produce literature ceases to more in thought and sensibility."

## ఐ. ఎ. రిచర్డ్స్

20వ శతాబ్ది పాశ్చాత్య విమర్శను, ప్రత్యేకంగా ఆంగ్లో–అమెరికన్ విమర్శను ప్రభావితం చేసిన ప్రసిద్ధవిమర్శకుడు Ivor Armstrong Richards. (1893–) సాహిత్య వివేచనంలో మనస్తత్వ శాస్త్ర సూత్రాలను అన్వయించి విమర్శసూత్రాలను వెలయించి, సాహిత్య సిద్ధాంతపద్ధతిని రూపొందించటంలో ఇతడు తన ప్రత్యేకతను ప్రకటించుకొన్నాడు ఇతడు రచించిన అయిదు గ్రంథాలు ప్రధానంగా ఇతని విమర్శ ప్రస్థానాన్ని మనకు తెలియపరుస్తున్నాయి. అందులో మొదటి రెండు గ్రంథాలను ఇతడు ఇతరులతో కలిసి రచించాడు. అవి: The Foundation of Aesthetics (1922)( C. K. Ogden, James Woodతో కలిసిచేసిన సంయుక్త రచన), The Meaning of Meaning (1923) (C. K. Ogdenతో కలిసి వ్రాసింది). మిగిలిన మూడు రచనలూ ఈతని సొంత ప్రచురణలే. అవి–The Principles of Literary Criticism (1924), Practical Criticism (1929), Coleridge on Imagination (1935).

విమర్శ వివేచింపవలసిన ప్రధానాంశాలను పేర్కొంటూ రిచర్డ్స్ తన విమర్శక ప్రస్థానానికి నాంది నాలపించాడు Principles of Literary Criticism లో. "What gives the experience of reading a certain poem its value ? How is the experience better than other? Why prefer this picture to that ? In which ways we listen to music so as to receive the most valuable moments ? Why is one opinion about works of art not as good as another ?–These are the fundamental questions which criticism is required to answer, together with such preliminary questions–What is a picture ?, a poem, a piece of music ? How can experience be compared ? what is value ?—as may be required in order to approach these questions"[83] మౌలికమైన ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పేబాధ్యత సాహిత్యవిమర్శకున్నదని వక్కాణించాడు. ఈ దృష్టితో చూస్తే గతకాలపు విమర్శ అంతా ఓటుపోయిన పాతరలా కనిపిస్తుందని చెప్పాడు "A few conjectures, a supply of admonitions, many acute isolated observations, some brilliant guesses, much oratory and applied poetry, inexhaustibel

confusion, a sufficiency of dogma, no small stock of prejudices, whimsies and crotchets, a profusion of mytsicism, a little genuine speculation, sundry stray inspirations, pregnant hints and random APERQUS; of such as these, it may be said without exaggeration, is extant critical theory composed"[84]— అని విమర్శించాడు.

కళానుభవానికీ, కళానుశీలనానికీ భేదం తెలిసి ప్రవర్తించటమే విమర్శ ధర్మం. కళానుభవ స్వభావాన్ని గురించీ, కళకు విలువకట్టే విమర్శసిద్ధాంతాలను గురించీ, కళను లోకాని కందించే విధానాలను గురించీ తెలియకపోతే విమర్శ తన ధర్మాన్ని సక్రమంగా నిర్వహించలేదు. రిచర్డ్స్‌మాటలలో— "Criticism, as I understood it, is the endeavour to discriminate between experiences and to evaluate them. We cannot do this without some understanding of the nature of experience or without theories of valuation and communication."[85]

సాహిత్యవిమర్శకు కళల విలువలను నిర్ణయించే శక్తి, కళాప్రసార శక్తిని వివేచించే వివేకం (An account of value and an account of communication) అనేవి రెండుకన్నులవంటివి. రిచర్డ్స్ ప్రతిపాదించిన కవిత్వపు విలువనుగూర్చిన సిద్ధాంతం మనస్తత్వశాస్త్రంమీద ఆధారపడి ఉంది. మానవమనస్సు ప్రేరణల (Impulses) తో నిండిన ఒక సజీవ వ్యవస్థ. అందులో పరస్పర విరుద్ధాలైన ఇచ్ఛలు లేక సహజకామనలు (appetencies) ఉంటాయి. వాటి సంతత సంఘర్షణంవలన మనస్సుకు ఆందోళన, లేదా అశాంతి కలుగుతుంది. మనస్సు ఆ ఉద్విగ్నస్థితినుంచి ఉపశాంతి పొందాలని యత్నిస్తూఉంటుంది. ఆ ప్రయత్నంలో తనలో కలిగిన విరుద్ధ కామనలను, భావాలను ఒక క్రమపద్ధతిలో వ్యవస్థీకరించుకోవటానికి పాటుపడుతుంది. అలా చేసికొనేశక్తి మనస్సుకు సహజంగా ఉంటుంది కూడా. జీవితంలో ఒక్కొక్క అనుభవం మనస్సుకు వినూత్న ప్రేరణలను కల్పించి, అంతవరకున్న వ్యవస్థను కొంత కలతపెడుతుంది. దాన్ని మరలా సమస్థితికి తెచ్చుకోవటానికి మనస్సు యత్నిస్తుంది. అయితే అనుభవం మనస్సులోని అన్ని కామనలకూ సమాంతరంగా సంతృప్తిని కలిగించక

పోవచ్చును. అప్పుడు మనశ్శాంతి లభించటం కష్టం. అయినా, మనస్సు తన కామనలలో పెక్కింటిని తృప్తిపరిచే అనుభవంకోసం అర్రులు చాస్తుంది. అటువంటిది లభిస్తే మిగిలిన కొద్ది కామనలకు తృప్తి కలుగక పోయినా, అధిక కామనలకు తృప్తికలుగటంవలన మనస్సులోని ఇచ్ఛలను వ్యవస్థీకరించుకొనగలుగుతుంది. తృప్తిపొందని కామనలు తృప్తిపొందిన కామనలతో సహకరించి అనుభవాస్వాదానికి తోడ్పడతాయి. మనస్సుకు ఇటు వంటి సమతను (poise) లేదా వ్యవస్థను (system) సత్వరంగా సమగ్రంగానో, అధికంగానో కల్పించే గుణం కళలోగాని, కవితలోగాని విలువ (value) అని పిలువబడుతుందని రిచర్డ్స్ వివేచించాడు. అట్టి విలువను వివేచించటమే విమర్శధర్మంలో ఒకటి. అది మానసికశాస్త్ర పరిజ్ఞానంవలననే విమర్శకు సాధ్యం.

రిచర్డ్స్ సహజకామనలను సజాతీయాలనీ, విజాతీయాలనీ రెండు రకాలుగా విభజించాడు. మొదటివి అవ్యక్తచేతనలోనుండి పుట్టేవికాబట్టి గాఢతమాలు. సజాతీయకామనలు అధికసంఖ్యలో సంవదింపబడటమే సమత. కామనలలోకూడా – భావాల్లో స్థాయిభావాలలాగా - ముఖ్యమైనవి ఉంటాయి. వాటిని సాధ్యమైనంతవరకు సంతృప్తిపరచినప్పుడే కళలో విలువ నిలువరింపబడుతుంది. రిచర్డ్స్ మాటలలో– "Anything is valuable which will satisty an appetency without involving the frustration of some equal or MORE IMPORTANT appetency; in other words, the only reason which can be given for not satisfying a desire is that more important desires will thereby be thwarted." "What is good or valuable, we have said, is the excercise of impulses and satisfaction of their appetencies. When we say anything good we mean that it satisfies, and by a good experience we mean one in which the impulses which make it are fulfilled and sucessful, adding as the necessary qualification that their exercise and satisfaction shall not interfere in any way with more important impulses."

కవి తాను పొందిన అనుభవాన్ని కళద్వారా సామాజికులలోకూడా కలిగించే విధానం కళాప్రసారం (communication). దీని ప్రాముఖ్యాన్ని

ప్రతిపాదిస్తూ రిచర్డ్స్ ఇలా అన్నాడు; "A large part of the distinctive features of the mind are due to its being an instrument for communication. An experience to be formed, no doubt, before it is communicated, but it takes the form it does largely because it may have to be cammunicated. The emphasis with natural selection has put upon communicative ability is overwhelming.'

శాస్త్ర వచనకూ, కవితకూ భేదాన్ని వివరిస్తూ రిచర్డ్స్ చేసిన వివేచనం అమూల్యం: "It is never what a poem SAYS which matters, but what it IS. The poet is not writing as a scientist. He uses the words because the interest which the situation calls into play combine to bring them, just in this form, into his consciousness as a means of ordering, controlling, and consolidating the whole experience. The experience itself, the tide of impulses sweeping through the mind, is the source and the sanction of the words."

శాస్త్ర సత్యాన్నీ, కవితాసత్యాన్నీ వివరిస్తూ రిచర్డ్స్ - 'A scientist makes 'true statements' while poet makes 'pseudo-statements. A pseudo-statement is a form of words which is justified entirely by its effect in releasing or organising our impulses and attitudes; a statement, on the other hand, is justified by 'it's 'truth' i. e. its correspondence, in a highly technical sense, with a fact which it points". "A pseudo-statement is 'true' if it suits and serves some attitude or links together attitudes which on other grounds are desirable"– అని అన్నాడు.

భాషను శాస్త్రంలోనూ, కవితలోనూ ఎలా వాడాలో వివరిస్తూ రిచర్డ్స్ చక్కని వివేచన చేశాడు: "A statement may be used for the sake of REFERENCE, true or false, which it causes. This is the scientific use of language. But it may also be used for the sake of the effects in emotion and attitude produced by the reference it occasions. This is the EMOTIVE use of languages"

భాషకు నాలుగు విధాలైన వృత్తులుంటాయని రిచర్డ్స్ ప్రాక్టికల్ క్రిటిసిజమ్‌లో పేర్కొన్నాడు. అవి: Sense, Feeling, Tone and Intention. వీటి స్వరూప స్వభావాల నిలా పేర్కొనవచ్చును.[86]

1. "Sense means to make reference to something, that is, when the writer says something he wants to direct his hearer's attention upon some state of affairs, to present to them some items of consideration and to excite in them some thoughts about these items."

2." Feeling refers to the feelings of the writer or speaker about these items, about the state of affairs he is referring to. He has an attitude towards it, some special direction, bias, or accentuation of interest towards it, some personal flavour or colouring of it, and he uses language to express these feelings, this nuance of interest."

3." Tone means the attitude of the writer towards his readers. The writer or the speaker chooses and arranges his words differently as his audience varies, in automatic or deliberate recognition of his relation to them."

4." Intention is the speaker's or writer's aim, conscious or unconscious. Ordinarily the speaker speaks with a purpose and his purpose modifies his speech. The understanding of it is part of the whole business of apprehending his meaning.

Practical criticism కు మూడు లక్ష్యాలను రిచర్డ్స్ నిర్దేశించాడు. అవి: 1. To introduce a new kind of documentation to those who are interested in the contemporary state of culture whether as critics, as philosophers, as teachers, as psychologists, or merely as curious persons.

2. To provide a new technipue for those who wish to discover from themselves what they think and feel about poetry (and cognata matters) and whey they should like at dislike in.

3. To prepare the way for educational methods more efficient than those we use now in developing discrimination and the power to understand what we hear and read".

రిచర్డ్స్ తన దృక్పథంలో ఉత్తమ విమర్శకుని కుండవలసిన మూడు లక్షణాలను పేర్కొన్నాడు. అతని మాటలలో- 'He must be an adept at experiencing without eccentricities, the state of mind relevant to the work of art he is judging. Secondly he must be able to distinguish experiences from one another as regards their less superficial features. Thirdly he must be a sound Judge of values[88]. రిచర్డ్స్ విమర్శ స్వభావమంతా ఈ విమర్శక నిర్వచనంలో ప్రతిబింబిస్తోంది.

మనస్తత్వశాస్త్రం మీద ఆధారపడిన ఇతని విమర్శ ఒక నూత్న మార్గాన్ని ఆవిష్కరించి ఆధునిక విమర్శలో Practical criticismకూ New criticismకూ త్రోవలు చూపినా ఇది చాలవరకు శాస్త్రీయం కాకటంచేత ప్రజలలో ప్రాచుర్యం పొందటం కష్టసాధ్యమనీ, మానసికశాస్త్రం బహుశాఖలలో విస్తరించి పరిజ్ఞానం పెరిగిన కొద్దీ ప్రాథమిక మానసిక శాస్త్రసూత్రాల మీద ఆధారపడిన ఈ విమర్శ తన అస్తిత్వాన్ని కోల్పోవచ్చుననీ, కవియొక్క మనస్తత్వాన్నే కేంద్రంగా చేసికొని సాగే యీ విమర్శవిధానం కళారహస్యాల నన్నింటినీ దర్శించి కావ్యానుభవ స్వరూపాన్ని సమగ్రంగా ఆవిష్కరించలేదనీ అభిజ్ఞులు భావిస్తున్నారు. ఏమైనా రిచర్డ్స్ సాహిత్య విమర్శను శాస్త్రంగా లక్షించాడు; కావ్యానుశీలనంలో శాస్త్రీయప్రమాణాలతో ప్రయోగించే పద్ధతులను సూచించాడు.

కవితాస్వరూప స్వభావ నిరూపణంలో ఇలియట్ కూ, రిచర్డ్స్ కూ భేదం స్పష్టంగా కనపడుతుంది. "Eliot stands by his bold assertion that a poem is a fusion of thought and feeling. Richards, on the other hand, from the first has endeavoured to maintain a careful distinction between the emotional state produced in the reader (the balance of impulses or state of synthesis) and the means used to produce this emotional state."[89]

# ఫ్రాంక్ రేమండ్ లెవిస్

ఇంగ్లీషులోని Practical criticismను తెలుగులో ప్రయోగవిమర్శ అని పిలుద్దాం. ఈ ప్రక్రియలో వివేచన విధానాలను వివరించి ప్రవర్తింపచేయటంలో వివిధ ప్రయోగాలు(experiments) చేసి ఉపాధ్యాయ విమర్శకుడుగా (Teacher-critic) ప్రసిద్ధిచెంది అమెరికాలోని New criticism లేదా అభినవ విమర్శకు దారులు చూపి, 20వ శతాబ్ది సాహిత్య విమర్శను రూపొందించటంలో విశిష్టమైన కృషిచేసినవాడు డాక్టర్ ఫ్రాంక్ రేమండ్ లెవిస్ (Dr. Frank Raymond Leavis 1895-)ఇతడు 1932 నుండి 1953 వరకూ నడిపిన Scrutiny అనే త్రైమాసిక సాహిత్య పత్రిక ఈ విమర్శకెంతో దోహదం చేసింది. ఇతని సంపాదకత్వంలో వెలువడిన 'The Calendar of Modern Letters.–Towards Standard of Criticism (1933) అనే గ్రంథం ఈ మార్గానికి రూపరేఖలు దిద్దింది. New Bearings in English Poetry (1932), For Continuity (1933), Revaluation (1936). Education and the University (1944). The Great Tradition (1948). The Common Pursuit (1952), D. H. Lawrence : Novelist (1955) ఇతని విమర్శను వ్యక్తీకరించే విమర్శగ్రంథాలు.

'స్క్రూటినీ' పత్రిక సాధించిన విశేషాలను గురించి లెవిస్ చెప్పిన మాటలు- "The achievement of SCRUTINY is, in a way, peculiar to the twentieth century ; it is the building up of a body of practical criticism of substantiated literary judgements, that has surely no equal in extent and quality." Scrutiny set out from the beginning "to apply their methods (i. e. those of Eliot, Graves, Richards, Middleton Murry and the American New Critics) not sporadically but systematically, over the whole field of English Literature" and the Scrutineers proceeded by 'a minute and brilliant examination — by a scrutiny-of actual passages." Scrutiny అంటే తెలుగులో పరిశీలన మననవచ్చును. ఈ పత్రికపేరే ఆ విమర్శప్రవృత్తికి మారుపేరుగా కనపడుతున్నది.

లెవిస్ సాహిత్యవివేచనంలో సంస్కృతికి సమధికస్థానా న్నిచ్చాడు. ఒక నాగరికసంఘాని కుండే ఆదర్శంప్రకారం వ్యవస్థీకరింపబడిన క్రమబద్ధమైన జీవన విధానాన్ని సంస్కృతి అని అభివర్ణించాడు. ప్రాచీనగ్రామాలలోని సహజీవన విధానంలో ఇటువంటి సంస్కృతి సుసంపన్నంగా ఉండేదనీ, ఆధునిక యాంత్రిక జీవిత విధానంలో ఆ సమైక్యత, ఆ సహజీవనం, సహానుభవప్రవృత్తి లోపించిందనీ అతడు భావించాడు. సమాజంలో ప్రతి వ్యక్తికీ నిజమైన సంస్కృతిని, కృత్రిమ సంస్కృతిని గుర్తించే వివేకాన్ని సాహిత్యం అందించాలని ఆదేశించాడు. రచయిత సమకాలీన సమాజంలో సంస్కృతి సంప్రదాయ సదవగాహనకు తోడ్పడాలని ఆశించాడు. చరిత్ర ఈ పనిచేస్తుంది, కాని దానికంటె విలక్షణంగా సాహిత్యం సంస్కృతిపునరుజ్జీవనాన్ని నిర్వహిస్తుందని వివేచించాడు. ఇతని అభిప్రాయాన్ని బిర్జాదీశ్ప్రసాద్ ఇలా వివరించాడు- "It is no doubt, the function of history too to explore the state of culture in each age, but its method is different from that of literature. In the first instance, its exploration proceeds no further than a bare record of it, whereas what the literature offers is invariably its evaluation- the tastes and habits it fosters and their effect on 'the quality of living'- In the second place, while history is merely content to STATE its findings, literature, and particularly Poetry, by its evocative use of words makes everything RE-LIVE for us. Words in it do not state but REALISE an experience. Like the actors in theatre they ENACT it for the reader to live through it himself. Their true function is not to clothe an already formed thought but to bring the very thought into being. Leavis calls it "the exploratory-creative use of words upon experience". For it is by their free play upon an unformed thought that the thought ultimately comes to life."[91]

ఈ దృక్పథంతో లెవిస్ సాహిత్య విమర్శ స్వభావాన్ని వివేచించాడు. సాహిత్యంలో వికాసం చెందుతున్న ఒక సంప్రదాయాన్ని కానీ, ఒక ప్రక్రియలో అనుస్యూతంగా విస్తరిల్లుతున్న సాహిత్యసంప్రదాయాన్ని గానీ, తద్వికాసానికి దోహదకారులుగా ఉన్న రచయితల రచనలను అనుశీలించటం ద్వారా అధ్యయనం చేయటం విమర్శధర్మమని ఇతడు పేర్కొన్నాడు.

సాహిత్యం వర్తమానంలోనే జీవిస్తుంది. వర్తమాన సాహిత్యమే మన సమీక్షాక్షేత్రం. వర్తమానంలో సజీవంగా ఉన్నదే సంప్రదాయం. అయితే వర్తమాన సాహిత్యం గతంలోనుంచి అవిచ్ఛిన్నంగా అభివృద్ధిచెందుతున్న సంప్రదాయమే. గతంలోని మంచిని మీగడ తరగల్లా వర్తమానం గ్రహించి జీర్ణించుకొంటుంది. విమర్శకుడు వర్తమాన సాహిత్యానుశీలనంలో సజీవంగా ఉన్న గతాన్నీ, అది చెందిన మార్పులనూ సమీక్షించగలుగుతాడు. ఈ దృష్టితో సాహిత్యాన్నీ, దానివాస్తవ పద్ధతినీ విమర్శ గమనించాలి. లెవిస్ విమర్శ విధానంలో ప్రధానంగా మూడు పద్ధతులు కనపడతాయి. అవి 1. A complete response to the work in hand. 2. Its close scrutiny or an analysis. 3. Judgement of its significance. సంప్రదాయంగా వస్తున్న ప్రమాణాలను కావ్యవివేచనానికి తోడ్పడినంత వరకే గ్రహించాలి కాని, అవశ్యకర్తవ్యంగా అనుసరింపరాదని లెవిస్ మతం.

లెవిస్ విమర్శలో కొన్ని వినూత్నార్థ ప్రతిపాదకాలైన పారిభాషిక పదాలు కనపడతాయి. వాటిలో ముఖ్యంగా--Enactment, Realisation, Reality, Sincerity, Moral, Tradition ముఖ్యమైనవి. "The word 'enactment' implies that good poetry embodies, enacts a valuation of a reality at once inner (spiritual) and outer (social and sensuous). To enact a valuation is to realise whatever is evaluated; it is to bring us into an immediate and living relation with reality."

"Leavis explains 'realisation' as "the signs of something grasped and held, something presented in an ordering of words, and not merely thought of or gestured towards."[92] Reality అంటే సాహిత్యసత్యమనీ, Sincerity అంటే కళాకారుని నిజాయితీ అని భావించవచ్చు. లెవిస్ అభిప్రాయంలో- "works of art act their moral judgements." ఈ వాక్యంలోని moral అంటే నీతిని ప్రబోధించేది అని కాదు అర్థం. ఉత్తమ కావ్యనిర్మాణంలో కనపడే సమగ్రత. 'The whole poem is moral, అని అంటా డందుకనే. కాగా, గతంలోని గతాన్నే చూడటం కాకుండా గతంయొక్క వర్తమానస్థితిని దర్శించటం సంప్రదాయం (Tradition) అంటాడు. ఒక విమర్శకుడు

అన్నట్లు ఇతని విమర్శలో-'The best features of academic criticism are combined with best features of periodical criticism and then the amalgam is refined and ennobled with a master's touch.''[93]

## అభినవ విమర్శ

అభినవవిమర్శ (New Criticism) అమెరికాలో ఈ శతాబ్ది రెండవ పాదంలో ప్రచురంగా వెలువడింది. ఈ విమర్శోద్యమ ప్రవర్తకులలో ముఖ్యులు–John Crowe Ransom, Allen Tate, Robert Penn Warren, R. P. Blackmur, Cleanth Brooks, Yuor Winters మొదలైనవారు. ఈ ఉద్యమ స్వభావాన్నిగురించి Max I. Bayam ఇలా వ్యాఖ్యానించాడు.- The New Criticism defies definition, except by contrast with the older criticism. Whereas older criticism related itself to history, biography, philosophy, and even some branches of science, the New Criticism regarded all such relationships as irrelevant for a true understanding of literature. It's poetic ontology recognized only structural tensions and their resolutions within the literary work itself. The elements to be dealt with were diction, rhythm, metaphor, symbol, semantic pointers, and texture. Life was, at best, a tangential consideration. Tradition was a desideratum only insofar as it revealed tonalities of literary pattern."[94] అభినవ విమర్శోద్యమం ప్రధానంగా చారిత్రక విమర్శ పద్ధతిని, మానవతావాద విమర్శనూ, మార్క్సిస్టు విమర్శ విధానాన్నీ ప్రతిఘటించింది. ఈ ఉద్యమ విమర్శకులు T.E. Hulme, Ezra Pound రచనలచే ప్రభావితులైనా, టి.యస్. ఇలియట్ పంథాను అనుసరించారు. అయితే అతని చారిత్రకవిమర్శ దృక్పథాన్ని గ్రహించలేదు. వీరు కవిత్వంపట్ల ప్రసరించిన దృక్పథాన్ని స్థూలంగా చెప్పాలంటే Cleanth Brooks మాటలలో–''The Poem has to be read as a poem–that what it 'says' is a question for the critic to answer, and that no amount of historical evidence as such can finally determine what the poem says.''[95]

ఈ ఉద్యమం ఉవ్వెత్తుగా సాగుతున్నప్పుడే చికాగో విశ్వవిద్యాలయానికి సంబంధించిన Ronald S. Crane మొదలైన విమర్శకులు దానికి వ్యతిరేకంగా మరొక ఉద్యమాన్ని లేవదీశారు. దాన్ని Chicago School of Criticism అనీ, లేదా Neo Aristotelian School of Criticism అనీ పిలుస్తారు. అభినవవిమర్శలోని ప్రధానమైన రెండులోపాలను క్రేన్ ఎత్తి చూపాడు. అవి—

1. "It approaches a variety of poems in the same way; it looks in all of them for one and the same structure (Paradox, irony, complex meaning).

2. It is preoccupied with intellectual content; it seeks for structure exclusively in terms of thought rather than in anything that may be the distinctive unifier of a given poem."[96]

అభినవ విమర్శ చారిత్రకస్పృహను నిరసించినందుకు Lionel Trilling ఆ ఉద్యమాన్ని విమర్శించాడు. "The New Critics in their reaction from the historical method forget that the literary work is inevitably a historical fact, and what is more important, that its historicity is a fact in our aesthetic experience...It is part of the GIVEN of the work, which we cannot help but respond to. The New Critics imply that the situation SHOULD not exist, but it cannot help existing."[97]

## అభినవ అరిస్టాటిల్ విమర్శ పద్ధతి

అభినవ అరిస్టాటిల్ విమర్శపద్ధతి వస్తునిర్మాణ శిల్పానికీ, కథాకార్య ప్రగతిపరిశీలనకూ ప్రాధాన్యం ఇచ్చింది. 'Action is the soul of Tragedy' అన్న అరిస్టాటిల్ అభిప్రాయం వీరికి ఉత్తేజాన్ని కలిగించింది. అరిస్టాటిల్ విమర్శలో ప్రముఖస్థానాన్ని వహించిన 'Table' ఉదాహరణం లాగానే అభినవ అరిస్టాటిల్‌వాదానికి చెందిన Elder Olson కుర్చీ ఉదాహరణాన్ని తీసికొని తమవాదాన్ని వ్యక్తీకరించాడు. "The chair is not wood but wooden; Poetry is not words but verbal. In one sense,

of course, the words are of utmost importance : if we do not grasp them, we do not grasp the poem. In other sense, they are the least important elements in the poem for they do not determine the character of anything else in the poem; on the contrary, they are determined by everything else. They are the only things we see and hear; yet they are governed by imperceptible things which are inferred from them And we are moved by Poetry, we are not moved by the words, except in so far as sound and rhythm move us; we are moved by the things that the words stand for.[98] వీరు అరిస్టాటిల్ పేరు నుపయోగించుకొన్నా. అరిస్టాటిలును అనుకరించటం కాదు వీరి అభిమతం. అభినవవిమర్శ సల ఆకృతివిమర్శకంటె భిన్నమైన భావావేశ ప్రధానమైన విమర్శను వెల యించటమే వీరి మతం. "We feel some emotion, some form of pleasure or pain, because our desires are frustrated or satisfied; we feel the desires because we are friendly or hostile to, or favour or do not favour the characters set before us...and we are friendly or hostile to the characters because of their ethical traits; in brief, we side with the good against the bad or...with the oppressed against the oppressor"[99]. — అన్నది వీరి దృక్పథం.

## ఆధునిక విమర్శలో వివిధ దృక్పథాలు

సాహిత్యవిమర్శలో ప్రాచీనయుగాలకూ, ఆధునిక యుగానికీ మధ్య భేదం కనబడుతుంది. 20వ శతాబ్దికి పూర్వం వర్తిల్లిన యుగాలలో సమకాలీన విమర్శకులలో బలమైన ఒక ఉద్యమచైతన్యం సమాంతరంగా ప్రవర్తిల్లుతున్నట్లూ, అనుశీలనవిధానాలలో ఒకవిధమైన సామ్యం ఉన్నట్లూ స్పష్టమౌతుంది. కాని, ఆధునిక విమర్శయుగంలో వైవిధ్యం ప్రధానలక్షణంగా గోచరిస్తుంది. ఇందులోకూడ ఉత్తమవిమర్శకులు కొద్దిమంది కనపడతారు. వారిలోనూ, దృక్పథాలలో భిన్నత్వం అధికం కావటంచేత, ఏకత్వంగానీ, సమత్వంగానీ గోచరించటం దుర్లభం. ఆధునికయుగంలో ప్రపంచితమౌతున్న దృక్పథాలు ప్రధానంగా అయిదని వర్గీకరించటానికి వీలుంది. ఇంగ్లీషులో వీటిని assumptions అనీ, attitudes అని పిలుస్తుంటారు. తెలుగులో దృక్పథా లని పేర్కొనవచ్చు. అవి- 1. Realistic assumption

(వాస్తవ దృక్పథం), 2. Emotional assumption (రసభావ దృక్పథం), 3. Expressionistic assumption (అభివ్యక్తి దృక్పథం) 4. Transcendentalism(అతీంద్రియ తత్త్వదర్శన దృక్పథం). 5. configurational assumption (నిర్మాణ సమగ్రైక్యతాభావ దృక్పథం). వీటిని హెరాల్డ్ ఆస్బర్న్ (Harold Osborne) ఇలా వివేచించాడు:

1. The REALIST assumption makes the excellence of any work of art dependent upon the veracity with which it copies or symbolizes something not itself.

2. The EMOTIONAL assumption makes the excellence of any work of art dependent upon the intensity or the pleasantness of the emotion which it arouses in an observer.

3. The EXPRESSIONIST assumption makes the excellence of work of art dependent upon the exactness with which it causes to be reproduced in the observer an experience which previously occured in the mind of the artist. It professes to escape the subjectivity of Emotional Criticism by providing an object criterion in the degree of similarity between two concrete experiences. Such a criterion is indeed objective.

4. TRANSCENDENTALISM is a special type of Emotional assumption, which makes the excellence of any work of art dependent on the intensity with which it evokes the special type of mystical emotion which we have called Revelatory. Since different people experience such emotions in contact with different objects, and at different intensities, this assumption also leads to a subjective standard of criticism.

5. The CONFIGURATIONAL assumption makes the excellence of any work of art dependent upon the compactness with which it is organized into our organic unity. It affords an objective standard of critisim, since organic configuration is not constitutively dependent upon emotional response and it seems to lead to critical assessments less violently at

variance with the usual judgements of critics than those which would result from a consistent and logical application of most other assumptions about the nature of artistic excellence.[100]

ఆధునికయుగంలోని రచనలను అనుశీలించేటప్పుడీ దృక్పథాలను గూర్చిన స్పష్టమైన పరిచయం అవసరం. ఒకదానిలో మరొకటి సాంకర్యం చెందితే వస్త్వాశ్రయరీతులు, ఆత్మాశ్రయరీతులు సంఘర్షణపడి, సాహిత్యపు విలువలను నిర్ధరించే ప్రక్రియలో స్పష్టత, నిర్దుష్టత కొరవడి అవ్యవస్థ ఏర్పడుతుంది. ఆధునిక విమర్శలో ఈ అయోమయస్థితి అంతో ఇంతో అంతటా లేకపోలేదు.

సాహిత్యంలో కళానుభవానిష్పత్తి ప్రవృత్తినే ప్రత్యేకించి అనుశీలించే విధానం, జీవితాని కనుసంమయ్యే అంశాలను అందించే ప్రవృత్తిని సమీక్షించే విధానం, ఉపదేశ ప్రధానమైన విషయాలను వివేచించే విధానం, విజ్ఞానదాయకమైన విశేషాలను వివేచించే విధానం, తాత్త్విక దృక్పథాలను నిరూపించే విధానం, వస్తువిశ్లేషణ విధానం, మొదలైనవి ఆధునిక పాశ్చాత్య విమర్శలో కనపడే ప్రధాన ప్రవృత్తులు. వీటన్నింటినీ తాత్పర్యతః రెండు మార్గాలుగా భావించవచ్చుననీ, వాటిని కావ్యసౌందర్యతత్త్వ మీమాంసామార్గ మని, కావ్యవస్తు సంవిధాన శిల్పమార్గ మని పేర్కొనవచ్చుననీ. ఈ రెండూ ఆధునిక విమర్శలో అవసరమనీ హెరాల్డ్ ఆస్బర్న్ అభిప్రాయపడ్డాడు. అతని మాటలలో- "What we have therefore, is two disciplines and not one discipline. On the one hand is literary or aesthetic criticism which assesses or describes works of art in respect of the qualities in virtue of which they are good or bad as works of art. On the other side the criticism of ideas and attitudes...... If you describe or assess the extractable, paraphrasable 'content' of work of literature, you are dealing with something which is not peculiar to it. If you assess or describe its quality of organic unity, the compactness of its organization, you are dealing with that is unique to it; you are dealing with it as an aesthetic object and not with an abstraction taken from it. There need be no confusion between these two disciplines, both of which are commendable."[101] వీటిలో మొదటి మార్గం భావసృష్టి ప్రధానం; రెండవది వస్తుసృష్టి ప్రధానం.

స్టాన్లీ ఎడ్గార్ హైమన్ (Stanley Edgar Hyman) ఆధునిక సాహిత్య విమర్శ ప్రవృత్తిని - "The organisied use of non-literary techniques and bodies of knowledge to obtain insights into literature"[102] అని అభివర్ణించాడు. అంటే ఆధునిక సాహిత్యవిమర్శ సాహిత్య పరమార్థ దర్శనం కంటె సాహిత్య మర్మాలను తెలిసికొన టాని కుపయోగపడే సాహిత్యేతర శాస్త్రపద్ధతుల ప్రయోగ విధానాలకే ఎక్కువ ప్రాధాన్యమిస్తున్నదని స్పష్టమౌతున్నది. ఈ ప్రస్థానంలో ప్రత్యక్షమయ్యే ఉద్యమ ప్రవృత్తుల ననుశీలించటం ఇక్కడ ప్రస్తుతమవుతుంది.

## ఆధునిక విమర్శోద్యమ ప్రవృత్తులు

1. గ్రంథ పరిష్కార విమర్శ- దీనిని ఇంగ్లీషులో Bibliographical Criticism అనీ, Textual Criticism అనీ, Exegetical Criticism అనీ పిలుస్తారు. దీని స్వరూప స్వభావాలను ఇలా సంగ్రహంగా భావించ వచ్చును. "Textual criticism is the skilled and methodical exercise of human intellect on the settlement of a text with the sole object of restoring it, so far as possible, to its original form. By 'original form' we understand the form intended by the author"[103] రచయితల రచనలకుగల మూలాలను, ఆకరాలను అన్వేషించటం, కాలనిర్ణయం చేయటం, పౌర్వాపర్య విచారణ సలపటం, గ్రంథ పరిష్కారం చేయటం మొదలైనవి ఈ విమర్శలో కనపడే అంశాలు. గ్రంథ పాఠాల నిర్ణయం, మార్పులను, చేర్పులను, కూర్పులను, ప్రక్షిప్తాలను, గ్రంథపాతాలను, వ్రాతదోషాలను, చివరకు ముద్రారాక్షసాలను గుర్తించి పాఠప పరిష్కర్త లిందులో పరిశ్రమచేయవలసి వుంటుంది. ఇంగ్లండులో పాశ్చాత్య పండితులు 18వ శతాబ్దంలో షేక్స్పియర్ రచనలను పరిష్కరించి ప్రచురించే ప్రయత్నం చేశారు. లిపిజ్ఞానం ఈ పని కెంతో అవసరం. R.W. Mckrrow, W.W. Greg, A. W. Pollard, Dover Wilson మొదలైన పాశ్చాత్య పండితుల కృషి నిర్దుష్టం కాకపోయినా, ఈ పద్ధతికి గట్టి పునాదులు వేసింది. డా॥ జాన్సన్ కాలంలో ఈ పద్ధతి మంచిపరిణతిని సాధించింది. ఆ తరువాత ప్రాచీన గ్రంథాలకేకాక

ఆధునిక గ్రంథాలకు కూడ ప్రామాణిక పరిష్కృత ప్రతులను తయారుచేసే పరిశ్రమ సాగింది. Pascal, Goethe, Jane Austen, Trollope, W.B. Yeats మొదలైన వారి రచనలకు Michael Bernays, R.W. Chapman మొదలైన పరిష్కర్తలు ప్రామాణిక ప్రతులను సిద్ధం చేశారు. పరిష్కర్తలు మొదట భాషాపండితులై ఉండాలి. వారు సాహిత్య విమర్శకులై కూడా ఉంటే ఈ విమర్శకు ఉభయతారకం. సామాన్యంగా గ్రంథ పరిష్కర్తలు పాఠ పరిష్కారానికి పనికి వచ్చినంతగా కావ్య విమర్శకు పనికిరారు. R. P. Blackmur అన్నట్లు- "Upon scholarship all other forms of criticism depend, so long as they are criticism, in much the same way that architecture depends upon engineering"[104].

గ్రంథ పరిష్కార విమర్శ స్వతః సాహిత్య విమర్శ అనిపించుకోదు. ఆయా గ్రంథాలకు పరిష్కర్తలు వెలయించే పీఠికల్లో పాఠనిర్ణాయకాంశాలకు కాక గ్రంథానుశీలనాంశాల కధికస్థానముంటే అప్పు డది సాహిత్య విమర్శ కావచ్చును. అందువలన సామాన్యంగా ఈ విమర్శ పద్ధతి సాహిత్య విమర్శకు పూర్వరంగం సిద్ధం చేసేదే అయిఉంటుంది. "It may be said that these activities are pre-critical than critical, but they are a necessary preliminary to any critical evaluation".[105]

2. కవిజీవిత కావ్య సమన్వయ విమర్శ- (Biographical criticism) కవుల జీవిత ఘట్టాలూ, వారి మానసిక స్థితులూ, వారి తాత్త్విక భావనలూ వారి రచనలలో ఎలా ప్రతిబింబించాయని కానీ, వారి వ్యక్తిత్వాలు కృతుల నెలా రూపొందింపజేశాయని కానీ వివేచించే విమర్శన పద్ధతి యిది. ఈ విమర్శన విధానాన్ని ఆంగ్లంలో అభినివేశంతో ఆవిష్కరించిన మాథ్యూ ఆర్నాల్డ్ మాటలు గమనింపదగినవి-"Literature, the literary product is for me indistinguishable from the whole organization of the man. I can enjoy the work itself, but I find it difficult to Judge this work without taking into account the man himself." ఆంగ్ల సాహిత్యంలో ఈ విమర్శ శాఖను ఆరంభించిన వాడు డ్రైడెన్. Lucan, plutarch ల జీవితచరిత్రలను వ్రాస్తూ ఆయన వారి కృతులను గూర్చి విమర్శ కూడా చేశాడు. జాన్సన్ ఈ ప్రక్రియను 'The Lives of the

Poets' లో పరిపోషించాడు. ఫ్రెంచిలో ఈ విధానానికి పరిణత రూపాన్ని కల్పించి ఆంగ్ల విమర్శపై తన ప్రభావాన్ని వేసిన వాడు Sainte-Beuve. అతని ప్రభావంతో మాథ్యూ ఆర్నాల్డ్ ఈ విమర్శకు ఒక ప్రత్యేకతను కల్పించాడు. ఫ్రాన్సులో, ఇంగ్లండులో ఈ ప్రక్రియ ప్రజాదరణను కూడా పొందగలిగింది. తరువాత క్రమంగా విమర్శలో రచయితల మనస్తత్వ విశ్లేషణం అధికం కావటంతో ఇది మనస్తత్వ విమర్శలో లీనమైపోయింది. ఈ విమర్శకున్న పరిమిత పరిధిని గుర్తించిన విమర్శకులు దీనిని నిరసించారు. M. Raymond Picard మాటలలో-"For my part I remain resolutely hostile to biographical criticism, except perhaps when it reveals the author's attitude to social problems and thus contributes to the sociological study of literature... No attention is given to a work's composition or to its architecture; every thing that comes from the author is ground down to a rubble of signs, undifferentiated by any literary judgement. If some of the champions of this kind of criticism claim to be interested in structure, their structure is certainly not a literary one"[106].

3. అభిరుచి విమర్శ-ఇంగ్లీషులో Impressionistic or Aesthetic criticism అని పిలువబడే విమర్శను తెలుగులో అభిరుచి విమర్శ అనీ, సౌందర్య తత్త్వ విమర్శ అనీ పిలువవచ్చును. Anatole France అన్నట్లు అభిరుచి విమర్శ చేసే విమర్శకుడు- "Gentlemen. I am going to speak about myself apropos of Shakespeare, apropos of Racine-' అని అంటాడు, అతని అభిరుచియే ఆ విమర్శలో ప్రధాన పాత్ర నిర్వహిస్తుంది. కాబటి అభిరుచి విమర్శ అనటం బాగుంటుందని భావించటం జరిగింది. "The impressionist critic is one who, having contacted the work of art in appreciation, regards it as his function to communicate his experience to other men in written words" అన్న హెరాల్డ్ ఆస్బర్న్ వాక్యాలూ, "The impressionistic critic brings home to us the fact of his own existence and you must not ask him any other aim than the perfecting of himself" అన్న ఆస్కార్ వైల్డ్ మాటలూ అభిరుచి విమర్శ అనటానికి సమర్థనీయాలుగా ఉన్నాయి. ఈ శాఖను నిర్వహించే విమర్శకుడు సుందర

వస్తువులను చూచి తనదైన ఒక అభిరుచితో స్పందించే రసికుడై ఉండాలి. కళాకారుడే విమర్శకుడు కాగలడనే భావం ఈ వాదానికి మూలం. ఆంగ్ల సాహిత్యంలో ఈ విమర్శ 19వ శతాబ్దపు చరమపాదంలోనూ 20వ శతాబ్దపు ప్రథమ పాదంలోనూ విశేషంగా సాగింది. లాంబ్, హాజ్‌లిట్, డీక్వెన్సీ దీనిని ప్రారంభించారు. పేటర్, ఆస్కార్‌వైల్డ్, సైన్ట్సబరీ, క్విల్లర్‌కోచ్, లూకాస్ మొదలైనవారు పోషించారు. అలాగే అన్టోల్‌ఫ్రాన్స్, జూలెస్ లెమైర్ మొదలైనవారు ఫ్రాన్సులోనూ, Hunekar, Menken, Nathan, అమెరికాలోనూ ఈ ఉద్యమాన్ని సాగించారు.

టి.యస్. ఇలియట్, టి.ఇ. హూల్మ్, ఇజ్రాపౌండ్ మొదలైనవారు ఈ ఉద్యమాన్ని నిశితంగా విమర్శించారు. అభిరుచి విమర్శకుడు అసమగ్ర విమర్శకుడని ఇలియట్ నిర్మొగమోటంగా చెప్పాడు. వీరందరి విమర్శల సారాంశాన్ని David Daiches మాటలలో ఇలా పేర్కొనవచ్చును- "Mere impressionism, the falling back on autobiographical chatter about personal likes and dislikes and the thrill one gets out of this or that work, is fatal to any critical order or critical method and when it is rampant, literature suffers. If literature is valuable, its value must be demonstrable, and if there is good and bad literature there must be some reasonably objective method of distinguishing the one from the other [107]

4. మనోవిశ్లేషణాత్మక విమర్శ (Psycho-analytical school of criticism) సిగ్మండ్ ఫ్రాయిడ్, ఆడ్లర్, యూంగ్ మానసిక తత్త్వ విశ్లేషణ సిద్ధాంతాలను సాహిత్యానికి అన్వయించి చేసే అనుశీలనం ఈ విమర్శ శాఖలో బహుళం. ఫ్రాయిడ్ ప్రతిపాదనలలో మూడంశాలు ముఖ్యం. "(1) An unconscious mind wherein lurk and moil basic Impulses of the race, also thwarted personal desires. (2) An inner censor that, recognizing society's ban on these impulses, forcing their repression, seeks to sublime them in more allowable forms of expression (one of which is art). (3) A basic libido or sex-drive which, when checked may produce (Oedepus Complex: Mother-Fixation) distorted if not broken lives. Thus it sets love (the chief topic of modern Poetry, Novel, Drama) at the roots of human action.[108]

వీటికి తోడు ఆల్ఫ్రెడ్ ఆడ్లర్ ప్రతిపాదించిన ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్, సుపీరియారిటీ కాంప్లెక్స్, జి. జి. యూంగ్ ప్రతిపాదించిన సామూహిక ప్రజ్ఞాచేతన (Collective unconscious) పాత్రల మనోవిశ్లేషణలో సాహిత్య విమర్శకు సాధనాలుగా ఉపయోగపడుతున్నాయి.

మనస్తత్త్వ విమర్శ ప్రధానంగా రెండు విధాలుగా సాగుతుంది. రచయిత సృజనవ్యాపారంలో భాసించే మానసికావస్థల అనుశీలనంగానూ, అతని మానసికావస్థలకూ రచనలోని విశిష్టలక్షణాలకూ మధ్యనున్న సంబంధాన్ని వివేచించే పరిశీలనంగానూ ఈ విమర్శ పనికివస్తుంది. ఆస్బర్న్ మాటలలో-"The Psychological study of artistic production may be undertaken from either of two opposed motives. On the one hand works of art and the known process of their manufacture may be studied for the indications they afford about the mental dispositions of the men who made them. On the other hand known psychological facts about the artist other than the fact that he made certain works of art may be used as data from which to draw inferences about the works of art which he made. In the one case the purpose of the investigation is to know more about the mentality of the artist as a man and in the other is to know more about the work of art as a work of art"[109] మరికొందరు విమర్శకులు రచయిత మనస్తత్వాన్ని విశ్లేషించటానికి మారుగా పాత్రల చిత్తవృత్తులను వివేచించటానికీ, ఆధునిక మనస్తత్త్వసిద్ధాంతాలు పాత్రచిత్రణంలో ఎలా తోడ్పడ్డాయో పరిశీలించటానికీ ఈ విమర్శ-పద్ధతులను వినియోగిస్తున్నారు. ఎడ్మండ్ విల్సన్, డా. హాన్స్ సాచ్స్, జీ. విల్సన్ నైట్, మాడ్ బోడ్కిన్, చార్లెస్ మారన్, హెర్బర్ట్ రీడ్ మొదలైన విమర్శకు లీశాఖలో విశిష్టమైన కృషిచేశారు. వీరందరిలో అగ్రగణ్యుడు ఐ. ఎ. రిచర్డ్స్.

మనోవిశ్లేషణాత్మకవిమర్శ రచయిత యొక్కగానీ, పాత్రలయొక్కగానీ మానసిక చిత్తవృత్తులను తెలుసుకోవటానికి తోడ్పడినా, రచన యొక్క విలువను, ఉత్తమాధమత్వాలను నిర్ణయించటానికి సహాయకారి కాదు. ఈ విమర్శ విధానం ఎంత శాస్త్రీయమైనా సమగ్రం కాదు; ఇది సాహిత్యతత్త్వాన్ని సాక్షాత్కరింపచేయలేదు. రెనేవెలెక్ మాటలలో- "It scarcely does justice

to the indirect or oblique effect of contemplative work, to the "alterations in the outer world" effected by the readers of novelists and philosophers. It also fails to recognize that creation is itself a mode of work in the outer world; that while, the day-dreamer is content to dream of writing his dreams, one who is actually writing is engaged in an act of externalization and of adjustment of society'.[110]

5. చారిత్రిక విమర్శ (Historical method of criticism) ఒక యుగంలో ఒక ప్రక్రియలో వెలసిన కావ్యంయొక్క విలువను నిర్ధరించటానికి ఆప్రక్రియయొక్క చారిత్రికజ్ఞానం అవసరం. ప్రక్రియయొక్క పుట్టుపూర్వోత్తరాలు, వికాసదశ మొదలైన వాటియొక్క చారిత్రిక పరిణామ పరిజ్ఞానం లేనిదే సాహిత్యపు విలువలను నిగ్గు తేల్చటం సాధ్యం కాదని భావించే విమర్శవిధానం చారిత్రిక విమర్శ. సాహిత్యసిద్ధాంతాల క్రమ వికాసాన్నీ, సాహిత్య ప్రస్థానాల ప్రగతినీ, ప్రయోగ పరిణామాల ప్రవృత్తిననూ పరిశీలించటానికి చారిత్రికజ్ఞానం అత్యవసరం; చారిత్రిక విమర్శ అత్యంతోపయోగం. చారిత్రిక విమర్శ సామాన్యంగా ఈ క్రింది ప్రవృత్తులను భజిస్తుంది.

1. 'To explain why any work of art was made by showing all the various factors which influenced the mind of the artist and made him the sort of man he was.'

2. 'The critic's task is not to assign causes, not to 'explain' works of art in terms of their antecedent conditions nor to assess them in terms of their social effects, but to collect, and record the judgements made in each age about the art produced in that age and in preceding ages. He is, in effect, to produce a history of taste."[111] మొదటి ప్రవృత్తి ప్రాచీన చారిత్రిక విమర్శకు, రెండవది నవీనచారిత్రికవిమర్శకు వర్తిస్తాయి.

ఈ విమర్శ పద్ధతి ఇంగ్లీషులో 16వ శతాబ్దిలోనే కవిజీవిత చరిత్ర రచనాప్రక్రియలో ప్రభవించింది. లీలండ్, బేల్, టానర్, మెకంజీ మొదలైనవారు దీనికి నారు వేసి నీరు పోశారు. 18వ శతాబ్దంలో ఈ విమర్శకు ప్రాచుర్యాన్ని తెచ్చిన విమర్శకులు. డ్రైడెన్, డా॥ జాన్సన్,

థామస్ వార్టన్ మొదలైనవారు. ఒక ప్రాచీన గ్రంథకర్త రచనకు విలువలను నిరూపించాలంటే, ఆ కాలంలో ఉన్న ఆచారవ్యవహారాలను, సాంఘిక పరిస్థితులనూ, సాహిత్యసిద్ధాంతాలనూ, ఆ గ్రంథంపై ప్రభావం చేసిన ప్రాచీనగ్రంథాలనూ తెలిసి విమర్శించవలసి ఉంటుందని వీరు భావించారు. 18వ శతాబ్దంలో ఈ విమర్శవిధానం విస్తృతిని, వైవిధ్యాన్నీ సాధించింది. ఇది జర్మనీ, ఫ్రాన్స్ మొదలైన దేశాలలో కూడా ప్రచారం పొందింది. గెథే, శైన్ట్‌బవే, టైనీ, హాజ్‌లిట్, డిక్వెన్సీ, కార్లైల్స్, లస్లీస్టెఫెన్, జార్జి శైన్ట్‌బరీ, మొదలైనవారీయుగ చారిత్రికవిమర్శకు ప్రగతిపథాన్ని చూపించినవారు. ఆధునికయుగంలో హార్టస్ క్రైగ్, డేవిడ్ డిచెస్, లియొనల్ ట్రిల్లింగ్, W. P. కెర్. R. W. ఛాంబర్స్, C S లెవిస్ మొదలైన వారీ పద్ధతి నాశ్రయించినవారు. అయితే 20వ శతాబ్దంలో ఈ విమర్శ ప్రత్యేక ఉద్యమ ప్రతిపత్తిని కోల్పోయి సాంఘికవిమర్శలో అంగంగా అంతర్భవించి పోయింది.

ఈ విమర్శ పద్ధతి వలన కలిగే ప్రధాన ప్రయోజనాన్ని గురించి టి. జి. విలియమ్స్ ఇలా అన్నాడు —"The chief ment of historical criticism is that it cuts through accretions formed by prejudice, and provides a detached evaluation of whatever work is being studied."[112]. అయినా దీనికీ పరిమితులూ, పరిధులూ ఉన్నాయి. ఉత్తమ సాహిత్య ప్రమాణాన్ని నిర్ణయించటానికి చారిత్రకస్పృహ ఒకటే చాలదు. ఒక్కొక్కప్పుడది అప్రస్తుతం కూడా కావచ్చు. అందువలన దీనిని ప్రామాణికమైనదిగా విమర్శకులు గ్రహించటం క్రమంగా మానివేశారు. "If criticism considered as evaluation has as its purpose the assessment of the work as a piece of literature, then it might be urged that any historical consideration is irrelevant. A work of art is either good or bad, and though historical conditions may help to count for its badness (or its goodness) it cannot alter the fact."[113] "For a man who takes this path has decided to refrain from criticism and in its place to write a history of criticism in the past"[114]– అన్న విమర్శలు దీని పరిమితులను తెలుపుతాయి.

6. ప్రకృతివాద విమర్శ:- (Naturalist Movement in Criticism). చార్లెస్ డార్విన్ పరిణామవాదం (Theory of evolution) ఈ విమర్శ విధానానికి మూలం. మానవస్వభావాన్ని వంశపారంపర్య లక్షణాలతోనూ, పరిసరప్రభావాలతోనూ అనుశీలించవచ్చునని ఈ ప్రయోగం లక్షించింది. ప్రకృతివాది తన చుట్టూ ఉన్న ప్రకృతిని తాను చూచినట్లు వాస్తవంగా వర్ణిస్తాడు. ప్రకృతిని ఉదాత్తీకరించటంగానీ, ఆదర్శవంతంగా చిత్రించటం గానీ అతని పని కాదు. పాత్రలను, వాటి పరిసరాలను ఉన్నవి ఉన్నట్లు చిత్రించటం అతని సాహితీవ్రతం. ఈ వాదంలో నవలలు రచించిన జోలా (Zola) మొదలైన వారు పాత్రలను అనువంశికలక్షణాలతో చిత్రించి, పరిసరాల ప్రభావాలతో అవి పొందే సహజపరిణామాలను వర్ణించటమే ప్రకృతివాద రచనావిధానంగా వెలయించారు.

వాస్తవవిమర్శ (Criticism based on Realism) కంటె ప్రకృతి వాద విమర్శ విలక్షణమైనది. నిశ్చయాత్మక భౌతికవాద తత్త్వం (Philosophy of deterministic materialism) దీనికి వెన్నెముక. మానవ నైతికపు విలువ లీవాదంలో ఈ తత్త్వా న్నాశ్రయించి సహజంగా వివరింపబడతాయి; మానవప్రవర్తన వ్యాఖ్యానింపబడుతుంది. ఫ్రాన్సులో పర్నాషియన్ వర్గ కవు లీవాదాన్ని ప్రపంచించారు. ఇంగ్లండులో బ్రౌనింగ్, టెన్నిసన్ మొదలైన కవులు దీనివలన ప్రభావితులయ్యారు. ఇబ్సెన్ నాటకాలలో, ఫ్లోబేర్ నవలలో ఈ వాదం కళారూపాన్ని సంతరించుకొన్నది. Zola తన 'The experimental Novel' అనే గ్రంథంలో ఈ వాదంలోని మౌలిక సూత్రాలను చర్చించాడు. "His theme like that of any other considerable novelist was the nature and destiny of man, but nature and destiny of man interpreted in terms of a naturalist philosophy"[115] అని టర్నెల్ వ్యాఖ్యానించాడు. జోలా ప్రభావం అమెరికన్ రచయిత ఫ్రాంక్ నోరిస్ మీద బాగా పడింది.

ప్రకృతివాదం సామాజికావగాహనకు తోడుపడింది: మధ్యతరగతి ఉద్యోగస్థుల, కార్మికుల, సామాన్యుల జీవన వ్యవస్థలలో కనపడే కష్ట విషాదాలను వాస్తవంగా చిత్రించే యత్నం చేసింది; విమర్శ కూడా అదే బాటన నడిచింది. కాని, మానవతావాదుల విమర్శకు గురియై క్రమంగా సన్న

గిల్లింది. కాల్పనికవాద విమర్శ, ప్రతీకాత్మక వాద విమర్శ దీనికి ప్రత్యర్థులుగా పుట్టి ఎదుర్కొని దీనిని అస్తి నాస్తి విచికిత్సకు పాత్రం చేశాయి.

7. ప్రతీకాత్మకవాద విమర్శ—లేక—ప్రతీకవాద విమర్శ- ఈ వాదం ఫ్రాన్సులో సంగీతం, చిత్రలేఖనం వంటి లలితకళల నాశ్రయించి ప్రవర్తిల్లింది; తరువాత సాహిత్యక్షేత్రంలో రూపుదిద్దుకొన్నది. ఇది ప్రధానంగా న్యూటన్, డార్విన్ సిద్ధాంతాలు సాహిత్యం మీద వేసిన ప్రభావాన్ని ఎదుర్కొన్నది. 1886లో 'Decadents' అనే పేరుతో కొంత మంది రచయితలు ప్రతీకవాదపు మానిఫెస్టోను ప్రకటించారు. అందులో— "This movement, contemporary with impressionism in painting and in music, and with the philosophy of the subconscious culminating in Bergson, coincides with the idealism of late 19th century, and as an offshoot of Romanticism to which it is connected by an almost uninterrupted, if sometimes underground current and, more generally, to a mystical conception of universe, devided more or less remotely from neo-platonism"-అని తమ వాదస్థితిని పేర్కొన్నారు.

ఎడ్మండ్ విల్సన్ ప్రతీకవాదాన్ని నిర్వచించి, దాని స్వభావాన్ని వివరించాడు. అతని వివరణం ఈ వాద స్వరూపాన్ని ప్రత్యక్షీకరింప చేస్తుంది.

1. Symbolism is " an attempt by carefully studied means a complicated association of ideas represented by a medley of metaphors to communicate unique personal feelings '.

2. "Every feeling or sensation we have, every moment of consciousness, is different from every other; and is, in consequence, impossible to render our sensations as we actually experience them though the conventional and universal language of ordinary literature. Each poet has his unique personality; each of his moment has its special tone, its special combination of elements. And it is the poet's task to find, to invent the special language which will alone be capable of expressing his personality and feelings. Such a language must make use of symbols: what is so special, so fleeting and so vague cannot be conveyed by direct statement or description but only by a succession of words of images, which will serve to suggest it to the reader. "The theory of

the suggestiveness of words comes from a belief that a primitive language, half-forgotten, half-living, exists in each man."[116]

ఫ్రెంచి ప్రతీకవాదుల్లో ప్రసిద్ధులు బోద్లేర్, మలార్మే, ఆర్థర్ రెంబడ్, వెర్లైన్ మొదలైనవారు. కళాకారుడు ప్రకృతిని అనుకరించకుండా, నిత్య జీవితంలో నుంచి విశిష్టమైన భావచిత్రాల నెన్నుకొని, తన దృక్పథాన్ని వాటి ద్వారా అభివ్యక్తీకరించాలనీ, అప్పుడు బ్రతుకే ఒక ప్రతీకగా భాసిస్తుందనీ బోద్లేర్ అంటాడు. ప్రతీకవాదులలో శిఖరప్రాయుడైన మలార్మే ప్రతీకను బహురూపాభివ్యక్తినిచ్చే భావచిత్రమనీ, ఆలోచన కభివ్యక్తియనీ, భావోద్రేక శక్తియనీ, ఒక తత్త్వానికే ప్రతీకయనీ అభివర్ణించాడు. ఆర్థర్ రింబడ్ ప్రతీకవాదాన్ని నవ్యసాహిత్య సిద్ధాంతంగా రూపొందించి దాని లక్షణాలను నిర్దేశించాడు. "The Poet is a true stealer of Fire. He is charged with humanity, with the animals themselves, he must take his inventions felt, handled, heard. If what he brings back from BEYOND has form, he gives form; if it is formless, he gives the formless."[117] వెర్లైన్ ఆకృతి, రచన మొదలైన విశేషాలను ప్రతీకవాద ధోరణిలో వివరించాడు.

ఆంగ్ల ప్రతీకవాదులలో జార్జిమూర్, ఆస్కార్‌వైల్డ్, ఆర్థర్‌సైమన్స్, ఎర్నెస్ట్ డాసన్, ఎడ్మండ్ గాస్, ఎజ్రాపౌండ్, టి. యస్. ఇలియట్, W. B. యీట్స్ మొదలైనవారు ముఖ్యులు. యీట్స్‌మీద భారతీయ ఉపనిషత్తుల ప్రభావం కూడా కనబడుతుంది. "పాశ్చాత్య ప్రపంచములో వెలువడిన యీప్రతీకవాదము శబ్దమునకు భావప్రకటనము కాక సూచనయే ప్రధాన మని, వాతావరణకల్పనమే ప్రధానలక్షణమని భావించినది. అందుకు ప్రతీకవాదులు వెలుతురును జ్ఞానమునకు, చీకటిని అజ్ఞతకు, వసంతమును జన్మకు, శిశిరమును మృత్యువునకు ప్రతీకలుగా స్వీకరించిరి. ఈ వాదము తాత్త్వికదృక్పథముతో ముడిపడి యుండుట గమనింపదగినది. జపధ్యానముల ద్వారా ఆస్తికులు సాధించు లక్ష్యమును ప్రతీకవాదులు 'కళ' ద్వారా పొందుటకు ప్రయత్నించిరి. అందుకొరకు వారు మతసంబంధమైన ప్రతీకలనే

కాక క్రొత్తవానిని సృష్టించుకొనిరి. ప్రముఖ ప్రతీకవాదకవి మలార్మే తన అనుభవక్షేత్రమునుండి అనేక ప్రతీకల నేరుకొనెను. అందుచేతనే ఇతని కవిత్వములో అస్పష్టత (obscurity) అనుదోషము ప్రవేశించినది. ప్రతీకవాదు లందరిలో ఈ అస్పష్టత కలదు. వీరు ప్రయోగించిన ప్రతీకల నర్థము చేసికొన్నచో అపూర్వానందము కలుగును; లేనిచో అయోమయ మనిపించును."[118].

ప్రతీకవాదం ప్రచారానికి దూరం కావటానికి హేతువు దానిలోనున్న అస్పష్టతాభివ్యక్తియే. ఈ అంశాన్ని సి. యం. బౌరా ఇలా స్పష్టపరిచాడు—"By the simple act of cutting himself off from vulgar emotions and concentrating on private visions the symbolist severed himself from large part of life and his work became the activity of a cultivated few."[119] కవితలోని ప్రతీకల పరమార్థ విచారమే ప్రతీకవాద విమర్శ జీవితం.

8. <u>మార్క్సిస్టు విమర్శ</u> (Marxist Criticism)- మార్క్స్, ఏంగెల్స్ ప్రతిపాదించిన గతి తార్కిక భౌతిక వాదం (Dialectical Materialism) ఆధారంగా ఈ విమర్శ విధానం 19వ శతాబ్దపు వాస్తవ విమర్శ నుండి 20వ శతాబ్ది ప్రథమ పాదంలో పుట్టి పెరిగింది. సామ్యవాద వాస్తవికత (Socialist realism) దీని ప్రాతిపదిక. "Literature must become a component part of the organized, planned, unified socialist party work" (లెనిన్) అన్నది దీని స్వభావం. వింసట్ అండ్ బ్రూక్స్ మాటల్లో ఈ విమర్శ లక్ష్యాలివి:-

1. An emphasis on class propaganda and revolutionary didacticism and on the ideological specifications of the total state.

2. A corresponding emphasis on the deterministic origins of art- the economic and social status (Proletarian, bourgeois, pseudo-bourgeois or aristrocratic) of artists and artisans in various past eras."[120]

"సమాజము యొక్క వర్గ సహితత్వము. వర్గ స్వభావములు, వర్గ సంఘర్షణము యొక్క నైరంతర్యము; సామాజికముగా వివిధ సామాజిక వ్యవస్థలపురోగతి- అభివృద్ధి, మార్క్సీయపరిణామ రీతి, ఆయా వ్యవస్థల స్వరూప స్వభావములు; సామాజిక పరిణామములకు,వ్యక్తుల పరస్పర సామాజిక సంబంధములకు, వ్యక్తుల చైతన్యము రూపొందుటకు సామాజిక పరిస్థితుల హేతుత్వము; ఈయన్నింటికి పునాది వస్తూత్పత్తులు, ఉత్పాదక శక్తులు వాటిలోని మార్పులు,వాటి నియంత్రణములు మొదలగునవి యగుట - అనగా ఆర్థిక మౌలికత,సమాజము యొక్క ఉపరితలమునందు దాని ప్రత్యక్ష, పరంపరా భూత ప్రభావము; ఉపరితల నిర్మాణములోని వివిధాంశములు, వ్యవస్థలు-పునాదివ్యవస్థ పరస్పరము ప్రభావించుకొనుట, సర్వమును కేవలముగా భౌతిక దృష్టి,అవగాహనకు చారిత్రక దృష్టి.అనువర్తనమునకు గతితర్కదృష్టి-మొదలుగా మార్క్సువాదము నిరూపించిన యంశములు దాదాపుగానన్నియు సాహిత్యమును విమర్శించుటలో ప్రమాణీకరింపబడును. శాస్త్రము, మతము, రాజకీయము, న్యాయ వ్యవస్థ, కళలు మొదలగునవి యన్నియు సామాజిక చైతన్య నిష్పన్న రూపములు కావున పరస్పరము ప్రభావించుకొనును. సాహిత్యము కళలోనిది. సౌందర్య దృష్టి. కళలు శ్రమనుండి ఆవిర్భవించినవి. శ్రామిక వర్గము చైతన్యవంతము కావలయుట, తిరుగుబాటు, విప్లవాదులద్వారా సామ్యవాద సమాజ స్థాపనము, దానికి తగిన విధమైన దోహదీకరణము ప్రధానములు. ఈ విధమైన పూర్వ నిర్ణయములతో మార్క్సీయ సాహిత్య విమర్శ సాగును."[121]

మార్క్సిస్టు విమర్శ దృక్పథాన్ని తెలిసికొనటానికి కొందరు ప్రసిద్ధ విమర్శకుల అభిప్రాయా లిచ్చట పొందుపరచటం జరుగుతున్నది—

1. "Political, legal, philosophical, religious, literary and artistic development rest on the economic. But they also react on each other and on the economic base. It is not that economic factor is the only active factor and everything else mere passive effect, but it is the interaction with the economic base which always proves **decisive in the last analysis**".[122]

—**Friedrich Engels, (1820-95)**

2. "Marx and I are partly to blame for the fact that younger people sometimes lay more stress on the econo side than is due to it. We had to emphasise the main princ vis-a-vis our adversaries, who denied it, and we had always the time, the time, the place or the opportunity give their due to the other elements involved in the inter tion"-[123] —Friedrich Eng

3. "Art is the privilege of the free". "All art is cor tional by the concept of freedom which rules in the soci that produces it; art is a mode of freedom, and a class soci conceives freedom to-be absolutely whatever relative freed that class has attained to.. In bourgeois art man is conscio of the necessity of outer reality but not of his own, becau he is unconscious of society that makes him what he is. is only a half-man. Communist Poetry will be comple because it will make man conscious of his own necessity well as that of outer reality"..."Art is one of the conditio of man's realisation of himself and in its turn is one of t realities of man"[124] —Cristopher Caudw

4. "Socialist humanism accomplishes the unificati of historical and purely artistic knowledge within Marx aesthetics, the continuous convergence of historical and ae thetic evaluation. The Marxist aesthetics resolves the que tion with which men of stature have long been grappling: t integration of the enduring aesthetic value of a work art into the historical process, the process from which the wo in its very perfection and aesthetic value is inseparable"[12.]

—Georg Lukac

5. "To-day people repeatedly condemn any serio emphasis on WHAT as inartistic. The reproach is justifie only where the WHAT is divorced from the artistic HOW ar rendered autonomous. It can never be autonomous".[126]

—Georg Lukac

ఆధునిక మార్క్సిస్ట్ విమర్శకులలో క్రిస్టఫర్ కాడ్‌వెల్, జార్జ్ లూకాక్స్ ఆంగ్ల రంగంలో ప్రసిద్ధులు. వీరిద్దరిలో లూకాక్స్ 19వ శతాబ్ది సాహిత్యాన్ని రాజకీయ సాంఘిక సంబంధాలపై ఊనిక యిస్తూనే సాహిత్యపు విలువలను కూడా వివేచిస్తూ సామ్యవాద వాస్తవికతకు వినూత్న సమన్వయాన్ని సంతరించి ప్రత్యేకత గడించుకొన్నాడు.

మార్క్సిస్ట్ విమర్శలో ప్రవర్తిల్లే సాహిత్యేతర ప్రమాణాలను దృష్టియందుంచుకొని సాహిత్య తత్త్వ నిర్ణాయకశక్తి దానికి లేదని సాహిత్య విమర్శకులు నిశితంగా దానిని విమర్శించారు. మచ్చు కొకటి రెండు అభిప్రాయాలు-

1. "It is well known by now that orthodox Marxism has proved critically sterile through offering a purely mechanical explanation of works of literature and providing slogans rather than criteria of value. It follows that most fruitful criticism has to be looked for, as it were, on the frontiers of Marxism, not at its recognized centre".[127]

—Ronald Barthes.

2. "They (Marxist critics) practise evaluative, 'Judicial' criticism, based on non-literary political and ethical criteria. They tell us not only what are the social relations and implications of an author's work but what they should have been or ought to be They are not only students of literature and society but prophets of the future, monitors, propagandists, and they have difficulty in keeping these two functions separate."[128]

—Rene Wellek and Austen Warren.

3. "Socially vigilant critics are not convinced that aesthetics constitutes the highest court of appeal in literary verdicts"[129]

—K. K. Ruthven.

సాహిత్య తత్త్వం సాహితీ దర్శనం వలన, సాహితీ ప్రమాణాలతో విలువలను వివేచించే విమర్శ విధానాలవలన తెలియబడుతుంది. కాని, సాహి

త్యేతర ప్రక్రియలద్వారా విశ్లేషించి చూస్తే అంతుపట్టదు. ఆధునిక విమర్శలో వివిధ విమర్శక ప్రయోగాలు ప్రక్రియావస్తుస్వభావ పర్యాలోచనకు పనికివచ్చి నంతగా పరమార్థ దర్శనానికి ప్రయోజనకారులు కావటంలేదు సౌందర్య దర్శనాన్ని సంపదించుకొన్న సాహిత్య విమర్శ ప్రస్థానమే సాహిత్య తత్త్వాన్ని అనుశీలించి లోకాని కందించగలదు. ప్రయోగ విమర్శ కూడా పరమార్థ దృష్టిని ప్రదర్శించినప్పుడే ప్రయోజనకారి అవుతుంది

"Works of art cannot be described or explained. They must be perceived. And the most the critic can do is to offer hints and directions for focusing the attention in the very difficult art of excercising and cultivating the skill to perceive."[130]

—Herald Osborne.

# 5

# ప్రభావాలు - పరిధులు

"A clear consciousness of a scheme of relationships between methods is in itself a remedy against mental confusion, even though the individual may elect to combine several methods."[1]

**—Rene Wellek and Austin Warren.**

ఆకృతిమీద పడిన ప్రభావంకంటె ఆలోచనమీద పడిన ప్రభావం శక్తిమంతం. ఆలోచనకంటె అనుభవంమీద పడిన ప్రభావం గుణవంతం. విమర్శపై ఆకృతిప్రభావం అధికంగా పడితే అది వస్తువు, ఆకృతి, రచన, శైలి మొదలైన అంశాలపై ప్రధానంగా ప్రసరిస్తుంది. ఆలోచన ప్రభావం పడితే సాహిత్య సిద్ధాంత సమాలోచనంగానీ, సందర్శనంగానీ చేస్తుంది. తదనుగుణంగా అనుశీలిస్తుంది. అనుభవప్రభావం పడితే సౌందర్యతత్త్వ వివేచనం చేస్తుంది. అనుభూతిని ఆవిష్కరిస్తుంది. సమన్వయవివేచనంతో సాధనగా సాగేది మొదటిరకం విమర్శ; సృజనాత్మక దృక్పథంతో శోధనగా సాగేది రెండవరకం విమర్శ; దార్శనికదృష్టితో కావ్య కళాతత్త్వాన్ని అనుశీలిస్తూ ఆరాధనగా సాగేది మూడవరకంవిమర్శ. ఒకటి కావ్యబహిఃప్రకృతినీ, మరొకటి కావ్యాంతఃప్రవృత్తినీ, ఇంకొకటి కావ్యాత్మవ్యక్తినీ ఆవిష్కరిస్తాయి. ఈ మూడింటిలో ఉత్తరోత్తర ప్రభావప్రవృత్తులు క్రమంగా ఉత్తమోత్తమాలు.

## కావ్యానుశీలన యుగం : కట్టమంచి

ఆంధ్ర సాహిత్య విమర్శయుగ విభాగాన్నీ, ఆంగ్లసాహిత్య విమర్శ యుగ విభాగాన్నీ పరిశీలించి చూస్తే కొన్ని స్థూలమైన విశేషాలు మనకు అవగత మౌతాయి. ఆంగ్లంలో ఏదైనా నవీనదృక్పథంగానీ, నూతన సిద్ధాంత ప్రయోగంగానీ, విశిష్ట కవితా దర్శన విస్ఫూర్తిగానీ కొట్టవచ్చినట్లు కనపడినప్పుడే ప్రత్యేకయుగంగా విమర్శలో వ్యవహరించటం జరిగింది. తెలుగులో కూడా స్థూలంగా ఆ ప్రమాణాన్నే పాటించి యుగవిభాగం 'యుగాలు—యోగాలు' అన్న అధ్యాయంలో చేయబడింది. వికాసయుగంలో వెలసిన వివిధ ప్రయోగాలూ, ప్రక్రియలూ కావ్యానుశీలన యుగంలో సాహిత్య సిద్ధాంత వివేచనానికి వివేకాన్ని ప్రసాదించాయి. వికాసయుగంలో పాశ్చాత్య ప్రభావ ముద్రితమైన సాహిత్య విమర్శ ప్రయోగసాధన జరిగింది; కావ్యానుశీలన యుగంలో కవిత్వతత్త్వాన్ని గురించిన శోధన సాగింది. పాశ్చాత్య ప్రభావం తెలుగు సాహిత్య విమర్శ కొక వినూత్న వ్యక్తిత్వాన్ని ఇచ్చింది కావ్యానుశీలనయుగంలోనే. అదీ కట్టమంచి రామలింగారెడ్డిగారి (1880-1951) విమర్శలోనే.

అయితే, 'రామలింగారెడ్డిగారు ప్రతిపాదించిన సిద్ధాంతము లేవియు క్రొత్తవి కావు. కవిత్వముపై వారు వెల్లడించిన అభిప్రాయములు అంతకు ముందు పలువురు వెలిబుచ్చినవే'[2] - అను అభిప్రాయం విమర్శకులలో లేకపోలేదు. ఇది కట్టమంచివారిని తెలుగు సాహిత్య విమర్శకు 'ప్రథమాచార్యని'గా ప్రశంసించటానికీ, మార్గదర్శిగా నిర్దేశించటానికీ కొంత అవరోధం కావచ్చును. పై అభిప్రాయాన్ని ప్రకటించిన డా॥ యస్. వి. రామారావుగారే—'అంతకుముందు విమర్శకుల పరిశీలనా చక్షువులకు గోచరము కాని పరమసత్యము ద్రష్టయగు వారి నేత్రములకు స్ఫురించినది. ఆయనకు పూర్వులైన విమర్శకులు కావ్యసౌధముచుట్టును పరిభ్రమించిరేకాని లోపలి రసజగత్తును చూడగోనలేదు. వర్ణనలు, అలంకారములు, శైలి, శబ్ద ప్రయోగములు మున్నగు అంశములను విడివిడిగా దర్శించిరేకాని, కావ్యము నందవి ఎట్లు పొందియున్నవో, ఆ కావ్యసౌందర్యమున కెట్లుద్దీపకము లగుచున్నవో పరికింపలేదు. ఈ సమన్వయశక్తి వారియందు లోపించుటచేతనే వారి విమర్శలన్నియు కావ్య బహిఃసౌందర్యపోషకములే కాని, అంతర్యప్రకాశకములు కావు. ఈ అంతర్యమును ప్రప్రథమముగా దర్శించినవాడు కట్టమంచి"[3] —అని ప్రశంసించారు.

ఇది యిట్లుండగా—ఆధునిక తెలుగు సాహిత్య విమర్శలో సాంప్రదాయికరీతిని అనుశీలించిన డా॥ కోవెల సంపత్కుమారాచార్య కట్టమంచివారి యుగకర్తృత్వ గౌరవాన్ని సంశయిస్తూ సమీక్షించారు- "దీనికన్న ముందు ముందు వచ్చిన సాహిత్య విమర్శ స్వరూపస్వభావాలను సరిగా పరిశీలించి అవగాహన చేసికొన్నచో, 'కవిత్వ తత్త్వవిచారము' తెలుగులో ఆధునిక సాహిత్య విమర్శకు ఆద్యమనుటలో ఔచిత్యము కన్పించదు. కాని, అంత మాత్రమున '-విచారము'యొక్క ప్రాధాన్యమునకు లోపము లేదు. దాని ప్రాధాన్యము అనంతర కాలీన విమర్శపై అది వెలయించిన ప్రభావములో నున్నది. ఆ విమర్శ కలిగించిన ప్రేరణలో నున్నది. '—విచారము'లోని కవితాసంబంధి విమర్శ; మరియు భారతీయసమాజమును, దాని వ్యవస్థను, అది తరంతరాలుగా ఉదాత్తములని మన్నించి పాటించు నంశములను విపరీత ధోరణిలో ఎగతాళి చేయుచు, నిందాపరముగా సాగిన విమర్శ[4] - వీటిలోని తీవ్రత అనుకూల[5] ప్రతికూల స్పందనలను[6] కలిగించు విమర్శరంగమును రెచ్చగొట్టినది. కవితా-కావ్యవిషయముగా'-విచారము' వెలువరించిన యంశములు క్రొత్తవి కాకున్నను, అది వ్యాప్తికి వచ్చునప్పటికి, అంతకుముందరి గ్రంథములు వ్యాప్తిలో లేకుండుటవలన, ఇతరేతర కారణములచే ఉపేక్షింపబడుటవలన వాటికన్న నిదే అందుబాటులో నుండుటవలన, కర్తృత్వము వలన, దీనినుండే ప్రేరణ పొంది, అందలి యంశములన్నింటినో, కొన్నింటినో గ్రహించి విశిష్టమార్గమున విస్తరించుట, పూరించుట, సమన్వయించుట, నిరసించుట, నిరాకరించుట-ఈ మొదలైనవి విరివిగా జరుగుటవలన- '-విచారము'నకు విశేషప్రాధాన్యము లభించినది. ఇదిట్లుండగా, ఈ'-విచారము' వెలువడునాటికి పాశ్చాత్య ప్రభావగాఢత్వముతో తెలుగు కవితారీతి 'నవ్యకవిత'గా రూపు దిద్దుకొనసాగినది. ఈ కవితారీతిలోని నవ్యకవులకు,[7] వారు వెలయించిన 'నవ్యకవిత'కు పరోక్షముగా ఈ'-విచారము' సైద్ధాంతిక ప్రామాణ్యమును భావనాశక్తిపరముగా సంపాదించిపెట్టినది.[8] ఈవిధమగు ప్రేరణ, ప్రభావ, శక్తియుక్తులద్వారా 'కవిత్వ తత్త్వవిచారము' ఆధునిక సాహిత్య విమర్శమార్గమున కాద్య మన్పించునంత ప్రాధాన్యము సంపాదించినది."[9] ఆచార్యులవారు కవిత్వ తత్త్వవిచార ప్రాధాన్యాన్ని తదనంతరం సాహిత్యవిమర్శమీద అది వేసిన ప్రభావాన్నీ. కలిగించిన ప్రేర

ణనూ గణించి ఒప్పుకొన్నా, ఆ ప్రాధాన్యానికి దాని ప్రామాణికత్వంకంటె ప్రాచుర్యమే కారణమని తలంచారు. నవ్యకవిత్వాని కది సైద్ధాంతిక ప్రామాణ్యాన్ని కల్పించిందనే అభిప్రాయాన్ని అంగీకరిస్తూనే దాని ఆచార్యకత్వాన్ని అనుమానించారు. సాహిత్యవిమర్శలో సాంప్రదాయికరీతిని అనుశీలించే దృక్పథం వారిని ఈ సందిగ్ధావస్థలో పడవేసింది కాని, కవిత్వతత్త్వవిచారానికి గల యుగప్రవర్తన గౌరవాన్ని గుర్తించటానికి వారి అనుమానం అడ్డంకాదు.

కట్టమంచి వారి రచనకు ముందు- పి. దక్షిణామూర్తిగారు 1-8-1892 నాడు మదరాసులోని క్రైస్తవ కళాశాల ఆంధ్ర భాషాభిరంజని సమావేశంలో ఎస్. రంగయ్య చెట్టియార్ గారి అధ్యక్షతలో చదివిన 'పింగళి సూరన' వ్యాసం తెలుగు సాహిత్య విమర్శలో కావ్య బహిరంగాంశాలనుగాక కావ్యాంతరంగాంశాలైన కథాకల్పనలు, వర్ణనాదుల పొందిక, రసానుగుణ్యం, భావనాశక్తి,కవితాశక్తి మొదలైన అంశాలను అనుశీలిస్తూ ఆంధ్రకవితాపరిణామ రీతుల్లో ప్రబంధ యుగలక్షణాలను వివేచించిన మొదటిరచన అనీ, అది తెలుగుసాహిత్య విమర్శరీతిలో ఆధునికతా వాతావరణానికి రంగనిర్మాణారంభాన్ని చేసిందనీ, ఆధునిక ప్రక్రియా విశేషమైన 'నవల'పై కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రిగారు చేసిన 'వివేకచంద్రికా విమర్శనము' (1896) 'ప్రథమాంధ్ర నవలపై వెలువడిన ప్రథమ విమర్శగను, విమర్శకుల దృష్టిని ఇతివృత్తనిర్వహణముపైకి మరలించిన తొలివిమర్శగను ప్రత్యేకత వహించిన' దనీ, పెన్నేటి రామచంద్రరావుగారి 'మను వసు చరిత్రరచనా విమర్శనము' (1899) 'ఆధునిక సాహిత్య విమర్శకు నాందీ వచన మగుచునే భిన్నకవుల కావ్యముల తులనాత్మక పరిశీలనరీతికిని శ్రీకారము చుట్టి,'పాశ్చాత్యరీతుల ప్రసారరేఖలతో తెలుగుసాహిత్య విమర్శకు ఆధునికతాస్ఫూర్తి' నిచ్చిన మొదటి విమర్శగ్రంథమనీ,పుదుప్పాకం సుబ్రహ్మణ్య అయ్యరుగారు 1910లో రచించిన 'నన్నయభట్టారకు'డనే విమర్శవ్యాసం ఆధునిక సాహిత్య విమర్శ పురోగమించటంలో దోహదం చేసిందనీ, వింజమూరి రంగాచార్యులుగారి 'పింగళి సూరనార్యుడు' వ్యాసం (1913లో వ్రాతప్రతి 1914లో ముద్రణ) చారిత్రక విమర్శరీతి నాశ్రయించి సాగి, వస్త్వైక్యం, పాత్ర భావోన్మీలనం, ఐక్యానికి భంగం గలిగింపని వర్ణనల ఉనికి, భావనాశక్తి ప్రేరితాలైన అలంకారాల ప్రయోగం, భావనాశక్తి, తదనుగుణమైన రచనాశక్తి, దాని కావశ్యమగు విమర్శశక్తీ, వీటన్నింటివలన రసప్రతీతీ, ధ్వనిమయ సందేశం

మొదలైన అంశాల ననుశీలిస్తూ, 'ఒకే కావ్యమును పురస్కరించుకొని వివిధాంశములను ప్రతిపాదించుట' అనే ఆధునికమైన ఒకానొకరీతిని ప్రవర్తిల్ల చేసిందనీ, పెన్నేటివారి విమర్శ సాహిత్య విమర్శకు నాంది అయితే, వింజమూరివారి విమర్శ ప్రస్తావన అవుతుందనీ ఆచార్యులవారు ఆధునిక సాహిత్య విమర్శారంభదశావస్థను వి ంచారు. 1912లో బుర్రా శేషగిరిరావు గారు వ్రాసిన 'గ్రంథవిమర్శనము' అన్న వ్యాసం 'పాశ్చాత్య సాహిత్య విమర్శనములోని విమర్శ సూత్రములను 'ప్రసాదించుట'యేగాక అవియే మనకు శరణ్యమన్నంత గాఢప్రత్యయాన్ని ప్రకటించిందని పేర్కొన్నారు.10

ఆచార్యులవారు రూపకమర్యాద ననుసరించి సాహిత్యవిమర్శ వికాస దశల్లో నాందీ ప్రస్తావనలను నిర్వహించిన వారిని పేర్కొనటం సమంజ సంగానే ఉంది. కాని, సూత్రధారుడూ, ప్రస్తావన ప్రవర్తకుడూ కథా నాయకులు కాలేరు. అందువలన రంగప్రవేశం చేసి నాటకకథ నారంభించి ముందుకు సాగించిన నాయకుడు కట్టమంచి రామలింగారెడ్డి గారే. ఈ కథా నాయకునికి ఒక ఉద్యమస్ఫూర్తి ఉంది; ఒక నిర్వహణదక్షత ఉంది. సాహిత్యవిమర్శరూపకానికి పురోగతినీ, కార్యశక్తినీ, నిర్వహణ నైపుణ్యాన్నీ కల్పించింది కట్టమంచివారే.

ఇక్కడ మరొకవిషయం గమనించాలి. తెలుగు సాహిత్యవిమర్శలో సంప్రదాయరీతికి పాశ్చాత్యదృక్పథాన్ని సంవదించటమే ఆధునికలక్షణ మని విమర్శారంభదశా సమీక్షలో ఆచార్యులవారే కాదు, అందరూ అంగీకరిస్తున్న విషయమే. పాశ్చాత్యప్రభావ గాఢత్వమే ప్రగతికి చిహ్నంగా ప్రారంభ దశలో భావింపబడింది. పెన్నేటి వింజమూరుల విమర్శలో పాశ్చాత్య లక్షణాలను ప్రాచ్యలక్షణాలతో సంవదించి ప్రవర్తింపచేయాలన్న ఉత్సాహం కనపడుతుంది కాని, పాశ్చాత్య విమర్శోద్యమాలలో దేనికైనా గాఢంగా స్పందించి, ఆ ఉద్యమచైతన్యాన్ని తెలుగులోకి తీసికొనిరావాలన్న తీక్ష్ణమైన స్వభావం లేదు. బుర్రావారి విమర్శకూడా ప్రవక్తగా పలికిందే కాని ప్రయోక్తగా ప్రదర్శించి చూపలేదు. డ్రైడెన్, కార్లయిల్, మాథ్యూఆర్నాల్డ్ అభిప్రాయాలను పేర్కొనటం ఒక ప్రత్యేకఉద్యమస్ఫూర్తి నివ్వటం కాదు. ప్రసిద్ధసాహితీవేత్తల (వివిధయుగాలకు చెందినవారి) అభిప్రాయాలను

తెలుగు వారికి పరిచయం చేయటమే. దీనికంటె బుర్రాశ్రీవారి 'విమర్శాదర్శం' మేలు (1915)[11], అంతకంటె పురాణం సూరి శాస్త్రిగారి 'విమర్శక పారిజాతం' (1925)[12] విశిష్టం. ఆంగ్ల సాహిత్య విమర్శ స్వభావాన్ని వర్గీకరణ పద్ధతి ననుసరించి వివరించటానికి ప్రయత్నించిన పరిచయగ్రంథా లవి. పాశ్చాత్య విమర్శవిజ్ఞానం పరిజ్ఞానా న్నిస్తుందేకాని ప్రయోగాన్ని నేర్పదు.

## కట్టమంచిపై కాల్పనిక విమర్శాయుగ ప్రభావం

కట్టమంచివారు ఆంగ్లసాహిత్య విమర్శలోని కాల్పనికోద్యమచైతన్యంతో గాఢంగా ప్రభావితులై ఉత్తేజితులయ్యారు. తెలుగులో దానిని ఉద్యమ స్ఫూర్తితో ఆవిష్కరించారు. సృజనాత్మకతను వ్యక్తీకరించారు; గుణమైనా దోషమైనా, అభిరుచి విమర్శధోరణిని అవలంబించారు. ఆంగ్ల కాల్పనిక యుగస్వభావాన్ని గురించి విమర్శకుల వివేచనాన్ని గమనిస్తే కట్టమంచివారి కాల్పనికోద్యమ విమర్శలక్షణం, దాని ప్రత్యేకత తేటపడుతుంది.

1. "The most striking thing in the Romantic criticism is its note of freedom. The Romantic criticism is remarkably fresh and original in its approach towards all the problems connected with Poetry and poetic creation. In the eighteenth Century criticism the poet was not given any liberty; he was supposed to follow the ancients rigidly, almost slavishly, the chief feature of Poetry being imitation. But the Romantics discarded all the rules and restrictions and allowed free play to the imagination of the Poet."[13]

2. "The chief merit of the Romantic criticism is that it deals with fundamental question, 'what is Poetry?'. The English criticism before that was mainly pre-occupied with problems of language and style, with the outward form of Poetry. But the Romantics went into the heart of the matter and tried to probe the origin of Poetry itself."[14]

విమర్శప్రవృత్తిలో స్వేచ్ఛ, ప్రవర్తనలో సృజనాత్మకత, పరిశీల నంలో కవితా తత్త్వవివేచనం కాల్పనికోద్యమ విమర్శలక్షణాలు. వాటికి ప్రతీకగా కుదిరింది కట్టమంచివారి గ్రంథనామం 'కవిత్వతత్త్వ విచారము.'

కట్టమంచివారు పింగళి సూరన కళాపూర్ణోదయాన్ని ఆధారంగాచేసికొని తన విమర్శోద్యమాన్ని ఆరంభించటం కూడా ఒక విధంగా ఆయన కాల్పనికోద్యమ స్ఫూర్తిని వ్యక్తంచేస్తున్నది. సూరన ప్రబంధకవులలో స్వతంత్రకల్పనకు ప్రాధాన్యం ఇచ్చి ప్రబంధం వ్రాశాడు. పాత్రచిత్రణంలో లోకవృత్తానుకరణం అధికంగాచేసి ఆదర్శపాత్ర వినిర్మాణ వ్యక్తిత్వాన్ని సడలించాడు. ప్రబంధ ప్రయోగాలలో నవ్యతను సాధించాడు. ప్రాచీన కవులలో సూరనలో కనపడే స్వాతంత్ర్యేచ్ఛయే కట్టమంచివారి నాకర్షించింది. వారు 1899లోనే, చెన్నపురి క్రైస్తవ కళాశాలలో విద్యార్థిగా ఉన్న రోజులలోనే, 'ఆంధ్ర భాషాభిరంజనీ' సమాజం సభలో పింగళిసూరన మీద వ్యాసం వ్రాసి చదివారు.[15] సమకాలీనులప్రశంస లందుకొన్నారు. ఆ తరువాత రెండు సమావేశాల్లో ఆ వ్యాసాన్ని వినిపించారు. చిలకమర్తివారు మెచ్చుకున్నారు. వేదంవారు ఆమోదించి అత్యుక్తులను సవరించుకోమని సలహాచెప్పారు. అయితే, రామలింగారెడ్డిగారు 1902లో ఇంగ్లండు వెళ్లారు. అక్కడా కళాపూర్ణోదయాన్నీ, భారతాన్నీ అధ్యయనం చేస్తూనే ఉన్నారు. తిరిగివచ్చేసరికి అయిదేళ్ళు పట్టింది. కార్యబాహుళ్యం వలన మరికొన్నేళ్ళు గడిచాయి. వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు కట్టమంచివారి వ్యాసాన్ని తాము ప్రకటించే కళాపూర్ణోదయానికి పీఠికగా ప్రచురించటానికి పూనుకొన్నారు. అప్పటికా వ్యాసం ఎక్కడపడిపోయిందో కట్టమంచి వారికి కనపడలేదు. కాని, దాని వాసనలు మాత్రం వారి మనస్సులో స్థిరంగా నిలిచిపోయాయి. ఆంగ్ల భాషాసాహిత్య విమర్శోద్యమాల సన్నిహిత సమ్యగనుశీలనం వలన కట్టమంచివారికి తమభావాలకు సిద్ధాంతరూపకల్పనం చేసే వ్యక్తిత్వం వచ్చింది 'తాత్త్వికముగా విషయములన మొనర్చి పటుత్వముగల జీవభాషలో రోపపత్తికమైన సిద్ధాంతము చేయునేర్పు"[16] ఆయనవిమర్శ కబ్బింది. 1914 ఏప్రిల్‌లో కవిత్వతత్త్వవిచార మావిర్భవించింది.

'కవిత్వతత్త్వ విచారము'లోని మొదటి ప్రకరణంలో కట్టమంచి వారి సిద్ధాంతం, కవితాతత్త్వ దర్శనం మనకు స్పష్టంగా గోచరిస్తాయి. ఆంగ్ల సాహిత్యంలోని కాల్పనికోద్యమ విమర్శ ప్రభావంతో వారీ అధ్యాయాన్ని వ్రాశారు. అందులో ప్రతిపాదించిన వివిధ సాహిత్యాంశాలస్వరూప స్వభావాలను వివేచిస్తే ఆ విషయం ధ్రువపడుతుంది.

కట్టమంచివారు ప్రతిపాదించిన సాహిత్యాంశాలలో భావనాశక్తి ముఖ్యమైనది. దానిని వా రీవిధంగా నిరూపించారు -

1. 'భావనాశక్తి యనగా విషయముల మనసులోఁ బ్రతిబింబించునట్లు చేయు సామర్థ్యము. ఒక్క ప్రతిబింబించుట యననేల? ప్రత్యక్షముగ నవతారమెత్తునట్లు చేయుట.' (మొదటి ప్రకరణము. పుట 4.)

2. 'కేవల కల్పితములైన వానింగూడ సాక్షాత్కారముందాల్చిన చేతనములం జేయంజూచునది కావున భావనాశక్తి నాటకకౌశలంబుతో ననుసంధించియుండును.' (పు. 8)

3. 'భావనాశక్తి నుద్దీపింపఁజేయు ప్రకృతి భావతైక్ష్ణ్యము. మనుష్యుల మనంబులతో నిరంతర సంయోగముం దాల్చిన ప్రకృతులు మూఁడు గలవు. (౧) ఆలోచనములు (కార్య కారణములం గూర్చి విచారము చేయుట, వస్తు స్వరూపము నిర్ణయించుట, యిత్యాదులు). (౨) భావములు—అనగా మనోవికారములు. ఉదా: కామక్రోధాదులు, ప్రేమ, పశ్చాత్తాపము, దయ, దాక్షిణ్యము మొదలగు చిత్తసంచారములు. (3) సంకల్పములు, అనగా నేదైన నొకదానిం గోరి, దానిని సాధింపవలయునని ప్రతిజ్ఞఁ బూనుట. ఈ మూడు శక్తులలో భావనాశక్తి నధికంబుగ విజృంభింపఁజేయునవి భావములు.' (పు. 8, 9.)

4. 'భావనాశక్తి, సంఘటనోత్సాహము ఇవిపరస్పర మిత్రములనుట విమర్శ శాస్త్రమునందలి యాదిమతత్త్వము.' (పు. 9)

5. 'భావములతో సాంగత్యముం దాల్చినది గదా భావనాశక్తి........ ఇఁక భావనాశక్తియొక్క తెఱంగన్నను మనః ప్రకృతుల కన్నిటికన్నను గోప్యమైనది. దాని చర్యలను గణింపనే కాదన్న నిఁక నిరూపించుటెట్లు?'—(పుట. 38)

6. భావనాశక్తి యనేక మాయలం బన్ను లీలావినోదిని. ఈ మాయలన్నిటికి సామాన్యలక్షణ మొక్కటియే. ఏ రసము నుత్పాదింపఁజూచునో దానిని కవియే మనఃపూర్ణముగ దాల్చినఁగాని చదువరులయందు అభిమతమగు

చిత్తవిభ్రమము గలుగ నేరదు. భావము లనంతములు నగాధములుగాఁ బ్రభవిల్లినఁ గవియు నమోఘుడగును'. (పు. 43)

కట్టమంచివారు పైన వాడిన పారిభాషికపదాలు సంస్కృతాంధ్ర లక్షణ సంప్రదాయానికి సంబంధించినవి కావు. పాశ్చాత్య విమర్శలోనుంచి తెలుగుచేసి తీసికొన్నవి. ముందుగా మన మీ విషయంలో స్పష్టంగా ఉండాలి. అందువలన కట్టమంచి విమర్శ విధానాన్ని అవగాహనం చేసికోవాలంటే పాశ్చాత్య—ప్రధానంగా ఆంగ్ల—సాహిత్యవిమర్శ వికాస పరిజ్ఞానంతో పాటు ఆయా యుగకవులు, విమర్శకులు ఆయా సాహిత్య పారిభాషిక పదాలకు, దృక్పథాలకూ, సిద్ధాంతాలకూ వారు కల్పించిన, భావించిన, నిర్వచించిన స్వరూపస్వభావాలను స్పష్టంగా అవగతం చేసికోవాలి. (ఈ అవగాహనకు ఈ గ్రంథంలోని 'ఉద్యమాలు-ఉపక్రుతులు' అన్న అధ్యాయం కొంతవరకు తోడుపడుతుంది). పాశ్చాత్య విమర్శోద్యమాల స్వభావాన్ని పరిశీలిస్తే కట్టమంచివారి విమర్శ కాల్పనికోద్యమ విమర్శ ప్రభావాన్ని ప్రధానంగా తనలో జీర్ణించుకొన్నట్లు కనపడుతుంది.

కట్టమంచివారు నిర్వచించి, విమర్శలో నిర్వహించిన 'భావనాశక్తి' విలియం వర్డ్స్‌వర్త్ ఆంగ్ల కాల్పనికోద్యమ విమర్శలో వ్యక్తీకరించిన Imagination అన్న సాహిత్యలక్షణానికి సన్నిహితంగా ఉన్నదని విమర్శకులు గ్రహించకపోరు. భావములు-అనగా మనోవికారములు అని అనడంలో ఆయన emotions అన్న మాటనే ప్రస్తావించారు.

ఆంగ్ల సాహిత్య విమర్శలో భావనాశక్తి (Imagination), ఊహా చమత్కారం (Fancy) అనే పదాలు అనాదినుంచీ వాడబడుతునే ఉన్నాయి. కాని, ఆయా యుగాల్లో వాటి నిర్వచనాలు విమర్శకులచేత వేరువేరుగా చేయబడి నాయి. 17వ శతాబ్దంలో ఈ రెండూ సమానార్థకాలుగానే వాడబడినాయి. 18వ శతాబ్దంలో వీటి ప్రత్యేక ప్రతిపత్తిని గణించటం జరిగింది కాని, వాటిలో ఊహాచమత్కారానికే అగ్రతాంబూల మివ్వబడింది. 18వ శతాబ్ది చరమ భాగంలో వీటి కొక విశిష్ట ప్రతిప్రత్తినిచ్చి కవులు, విమర్శకులు వివేచించటం మొదలు పెట్టారు. కాల్పనికయుగంలో వీటికి ప్రాధాన్యం హెచ్చింది. వర్డ్స్‌వర్త్ తన కవితా సంకలనానికి 1815లో వ్రాసిన పీఠికలో ఈ రెండింటిని గూర్చిన ప్రాచీన దృక్పథాన్ని సవరిస్తూ వినూత్న నిర్వచ నాలను ప్రతిపాదించాడు.

"A man has imagination in proportion as he can distinctly copy in idea the impressions of sense : It is the faculty which images within the mind the phenomena of sensation. A man of fancy in proportion as he can call up connect, or associate, at pleasure, those internal images so as to complete ideal representation of absent objects. Imagination is the power of depicting, and Fancy evoking and combining" అన్న విలియం టైలర్ అభిప్రాయం వర్డ్స్‌వర్త్‌కు ముందు ఒక శతాబ్దికాలంగా ఉన్న విమర్శకుల వివేచనకు ప్రతినిధి. దీనిని వర్డ్స్‌వర్త్ తిరస్కరించాడు. భావనాశక్తి, ఊహాచమత్కారశక్తి- రెండూ సృజనాత్మక ప్రవృత్తులని వాటిస్థాయిని ఉన్నతంగా సంభావించాడు.ఆ రెండిట్లో భావనాశక్తి గొప్పదని ప్రతిపాదించాడు. భావనాశక్తిని "The shaping and modifying power' గానూ, ప్రతిభను "The aggregative and associative power" గానూ నిర్వచించాడు. అతడు భావనాశక్తిని గూర్చి చేసిన ప్రతిపాదనంలో ప్రధానంగా నాలుగంశా లున్నాయి. అవి: 1) Imagination in its real sense devotes the working of a poetic mind upon eternal objects-objects present before the physical eye, or visible to the eyes of the mind. 2) Imaginative process sometimes confers additional properties upon on object, and sometimes abstracts from it some of the properties and qualities possessed by it. Imagination thus transforms an object, into something new, and thus enables it to react upon the mind. (3) Apart from acting upon individual image, the Faculty of imagination also connects, modifies and juxtaposes different images. (4) Imaginative activity not only modifies the objects and creates new objects, it also 'consolidates numbers into unity' and 'dissolves and separates unity into numbers.'[17]

పైన పేర్కొన్న కట్టమంచివారి మొదటి నిర్వచనానికీ, ఇందులోని మొదటి అంశానికీఉన్న సాజాత్యం గమనింప తగింది. అలాగే రెండవ అంశాలు రెండూ కేవల కల్పితాంశాలను కూడా సాక్షాత్కరింపచేసే లక్షణంతో సంవదిస్తాయి. అక్కడి నాలుగో నిర్వచనం ఇందులోని మూడవ అంశంతో సరిపోతుంది. భావనాశక్తి మాయల ప్రసక్తి ఇక్కడి నాలుగో అంశంతో

పౌసగుతుంది. 'కన్నులఁ గట్టినట్లు కలఁగాంచిన రూపము ముందు నిల్చినట్లు ఆకృతులు మనసుకుం దట్టవేని యయ్యది నిక్కమైన కవిత కానేరదు. ఈ మహేంద్రజాల కౌశల్యమున కాధారమైన గుణము భావనాశక్తి' (పు. 4) అన్నది ఆంగ్లకాల్పనిక భావనకు సన్నిహితమైనది.

వర్డ్స్‌వర్త్ కంటె విశిష్టంగా, గాఢంగా భావనాశక్తిని గురించి భావించి నిరూపించినవాడు కోల్‌రిడ్జి. అతడు భావనాశక్తిని Primary అనీ, Secondary అనీ విభజించాడు. వాటిని కట్టమంచివారు గ్రహించలేదు. కోల్‌రిడ్జి తరువాత వచ్చిన హాజ్‌లిట్ కూడా ఆ విభాగాన్ని మన్నించ లేదు. కట్టమంచిలో వర్డ్స్‌వర్త్ కవితాతత్త్వ వివేచనంతో పాటు హాజ్‌లిట్‌లో ఉన్న అభిరుచి(Impressionistic)స్వభావం కూడా సంవదించికొనినట్లు కనపడు తుంది. హాజ్‌లిట్ వర్డ్స్‌వర్త్ కవితాతత్త్వ వివేచనం చేసినవాడు. అందు వలన వీరిద్దరి భావాలకూ సంవాదం సాహిత్యానుశీలనంలో స్పష్టంగ గోచరిస్తుంది. 'ఉద్రేకమే కదా కవితాశక్తికి ప్రాణాధారమైన కారణము' [16] 'భావనాశక్తి నుద్దీపింపఁజేయు ప్రకృతి భావతైక్ష్యము'- అని భావించే కట్టమంచి కవితాతత్త్వ దర్శనం మీద 'Poetry is the spontaneous overflow of Powerful feelings' అన్న వర్డ్స్‌వర్త్ నిర్వచన పరిభావం, అది తర్వాత విస్పష్టమై హాజ్‌లిట్‌చేత వ్యక్తీకరింపబడిన 'Poetry is in all its shapes the language of imagination and the passions, of fancy and will' అన్న నిర్వచన ప్రభావం స్పష్టంగా కినబడుతున్నాయి. ఊహాచమత్కారానికి భావనాశక్తి కిచ్చిన ప్రాధాన్యం ఇవ్వకుండా, గౌణమైన దాని స్థానాన్ని గుర్తించి, వర్డ్స్‌వర్త్ Fancy కిచ్చిన నిర్వచనాలనే దానిపట్ల స్థూలంగా కట్టమంచి పాటించాడు. కళాపూర్ణోదయ విమర్శనంలో- 'సూరనార్యునందు ప్రబంధకవులకు గల వర్ణనాశక్తితోడ, కథాకల్పనాశక్తియు, వివిధములైన సందర్భములను సంధానమునకుఁ దెచ్చు ప్రతిభయు సహవాసములు' (పు. 70), 'స్వతంత్ర ముగ నవీనభంగుల రచించుట కవియొక్క మహాప్రతిభకు ఫలము-' (పు 137) మొదలైన వాక్యాలు కట్టమంచివారు కాల్పనిక విమర్శకుల Fancy స్వభావాన్నే తెలుగులో సంభావించారన్న విషయాన్ని నిరూపిస్తున్నాయి.

పాశ్చాత్య సాహిత్యవిమర్శ మర్యాదలతో ఈ అంశాలను వివేచిస్తేనే వాటి నిజస్వరూపం గోచరమౌతుంది. కట్టమంచివారిలో విశేష మేమంటే - వారు పాశ్చాత్య పారిభాషిక పదాలను తెలుగులో వాడుతున్నప్పుడు వాటి ఆంగ్ల మూలాల నివ్వరు. ఇవ్వలేదు. దానికి కారణం, బహుశః తెలుగువారిని తెలుగులో ఆలోచింపచేయటానికి ఆయన చేసిన ప్రయత్నమే కావచ్చును. అయితే, వాటిని అర్థం చేసికోవటానికి పఠితకు కూడా పాశ్చాత్యసాహిత్య పరిజ్ఞానం అవసరం; అంతేకాదు, అతడుకూడా కట్టమంచివారిలాగా తెలుగులో వాటిని దేశీయం చేసికొని అవగాహన చేసికొనే నేర్పును కూడా సాధించాలి. సాహిత్యవిమర్శను అన్యభాషాప్రయోగాలనుండి విముక్తం చేసి దేశీయం చేయాలన్న ఆంగ్లకాల్పనికోద్యమ చైతన్యం కట్టమంచివారిమీద బలంగా ఈ విషయంలో ప్రభావం వేసిందని చెప్పాలి. 'నూతన శాస్త్రపరిచయము వలననో, అన్యసంప్రదాయ సంపర్కమువలననో 'తమలో కలిగిన' అపూర్వభావములను వ్యక్తీకరించుటకు 'నూతన పదజాలమును సృష్టించుటో', పూర్వపదములనే లక్షణార్థమున వాడుటయో తప్పనిసరియగును. ఈ పద్ధతులలో అన్యదేశ్యపద ప్రయోగము భాషాస్వచ్ఛత కుపహతి కల్గించును. రెడ్డిగారు అట్టి స్వచ్ఛతాభ్రంశమును బొత్తిగా నొల్లరు. పూర్వపదములనే అపూర్వార్థములకుఁ దగినట్లు మలతు'[19]రని పింగళి లక్ష్మీకాంతంగారు అనటం కట్టమంచి దేశీయతకు నీరాజనం పట్టటం. పాశ్చాత్య ప్రభావాన్ని విమర్శలో ప్రవాహంలా పొంగించాలనే కట్టమంచి ఉద్యమోద్రేకం సాధించిన హేలలలో ఇది యొకటి.

వర్డ్స్‌వర్త్ లిరికల్ బాలడ్స్‌కు వ్రాసిన పీఠిక యొక్క ప్రయోజనాన్ని వివరిస్తూ కోల్‌రెడ్జి ఇలా అన్నాడు - "Mr. Wordsworth....was to propose to himself as his object, to give the charm of novelty to things of every day, and to excite a feeling analoguous to the supernatural, by awakening the mind's attention from the lethargy of custom, and directing it to the loveliness and the wonders of the world before us; an inexhaustible treasure, but for which, in consequence of the film of familiarity and selfish solicitude, we have eyes, yet see not, ears that hear not and hearts that neither respond nor understand."[20] ఇటువంటి ప్రవృత్తి కట్టమంచి రెడ్డిలో కూడా కనబడుతుంది. వేదాంతులవలన సాంఘిక

జీవనంలో ఏర్పడిన నిస్తేజత్వాన్ని, స్తబ్దతనూ, ప్రాచీనాలంకార సిద్ధాంతాలను గొడ్డెదాయిగా అనుసరించే పండితుల సృజనాత్మకతారాహిత్యాన్నీ ఈసడించిన కట్టమంచిలో కాల్పనికోద్యమావేశమే కన్నులకు కట్టినట్లు కనపడుతుంది. వర్డ్స్‌వర్త్ వీరగీతాలకు వ్రాసిన పీఠికలాగా కట్టమంచివారి కళాపూర్ణోదయ పీఠికా, షెల్లీ వ్రాసిన A Defence of Poetry లాగా, కవిత్వతత్త్వ విచారం తెలుగులో ప్రామాణికత్వాన్ని గడించాయి,

వర్డ్స్‌వర్త్ వీరగీతాలలోని వస్తువును కీర్తిస్తూ అన్నమాటలు కట్టమంచి వారి నుత్తేజ పరిచాయి. "The Principal object proposed in these poems was to choose incidents and situations from common life, and to relate or describe them, throughout, as far as was possible in the selection of language really used by men, and, at the same time, to throw over them a certain colouring of imagination, whereby ordinary things should be presented to the mind in an unusual aspect; and further, and above all, to make these incidents and situations interesting by tracing in them, truly though not ostentatiously, the primary laws of our nature; chiefly, as far as regards the manner in which we associate ideas in the state of excitement"[21] అన్న వర్డ్స్‌వర్త్ వాక్యాల ప్రభావం కట్టమంచివారు పల్నాటి వీరచరిత్ర, బాలనాగమ్మకథ, బొబ్బిలిరాజుకథ, రాజాదేసింగుకథలలాంటి ప్రజాసమ్మతాలైన కృతులలో కన పడే సహజమానసిక ప్రవృత్తులను మెచ్చుకొని, వాటిలో పుష్కలంగా కన పడే 'హృదయముల నల్లలనాడించు భావనాశక్తిని ప్రశంసించటానికి దోహదం చేసింది. (పు.7)

19వ శతాబ్ది మధ్యభాగంలో ప్రాచీనాంగ్లకావ్యాలలోని పాండిత్యప్రధాన మైన శైలిమీద తిరుగుబాటు వచ్చింది. 18, 19వ శతాబ్దులలో కావ్యశైలి మీద వచ్చిన తిరుగుబాట్లను విమర్శకులు రెండురకాలుగా నిర్దేశించారు. "Two Kinds of protests against poetic diction have occurred; that of the classicists, hostile to pedantry and affectation, appealing to polite spoken word; and that of romantics, hostile to same things, but appealing to the primitive, the native the directly passionate."[22] గిడుగు గురజాడల వ్యావహారిక భాషావాదం,

మొదటిరకం తిరుగుబాటుకు చెందుతుంది; గ్రాంథికభాషలో వ్రాసినా కట్ట మంచి మౌలికంగా కాల్పనికవాదప్రవృత్తి కలవాడే. "రేయింబవలును వ్యాకరణములను నిఘంటువులను ప్రాచీనకావ్యములను వల్లించుటచేత నూనెకు నష్టియే కాని కవితకు పుష్టి లేదు. తనమనసున నెన్నియో భావములు ప్రభవిల్లకున్న నితరుల మనసులలో భావము లుత్పత్తిఁజేయుట యెట్లు? కట్టెవాసన కోవిదులకన్న లోకవాసనల ననుభవించి యానందించువారు మేలు" (పు.12) అన్న కట్టమంచి వారి మాటలు కాల్పనికోద్యమ ప్రవృత్తికి కంచుకాగడాలు. అయితే వర్డ్స్‌వర్త్ ప్రతిపాదించిన, 'selection of real language of man' అనే దృక్పథాన్ని కోల్‌రిడ్జ్ విమర్శించాడు. కట్టమంచి రామలింగారెడ్డి గారు కావ్యానుశీలనంలో వర్డ్స్‌వర్త్ ననుసరించినా, తన శైలిలో కోల్‌రిడ్జిని పోలి నడిచాడు.

"శాస్త్రములయందు సామాన్య గుణంబులకు గౌరవ మెక్కువ. ఏలయన వస్తుజ్ఞానమే యందు ముఖ్యము. అట్లుగాక మనోరంజనమే ప్రధానముగాఁ గల కవితాది శిల్పములందు భిన్నగుణములకు గౌరవ మెక్కువ" (పు. 22) మొదలైన వాక్యాలు "The man of science seeks truth as a remote and unknown benefactor; he cherishes and loves it in his solitude; the Poet, singing a song in which all human beings join with him, rejoices in the presence of truth as our visible friend and hourly companion"[23] అన్న వర్డ్స్‌వర్త్ భావాలకు ప్రతిబింబాలు.

కావ్యరచనా శైలులలో కనపడే పరిణామాన్ని చారిత్రకంగా అనుశీలిస్తూ వర్డ్స్‌వర్త్ ఇలా అన్నాడు- "The earliest poets of all nations generally wrote from passion excited by real events; they wrote naturally and as men; feeling powerfully as they did; their language was daring and figurative. The succeeding times, Poets, perceiving the influence of such language, and desirous of producing the same effect without being animated by the same passion, set themselves to a mechanical adoption of these figures of speech, and made use of them, sometimes with propriety, but much more frequently applied them to feelings and thoughts which they had no natural connection whatsoever."[24]

వర్డ్స్‌వర్త్ కున్న ఇటువంటి భావాలే కట్టమంచికి కూడా ఉన్నాయి. ఆయన ప్రాచీనయుగ, ప్రబంధయుగ కవులను విమర్శించే వైఖరిలో ప్రదర్శించిన ప్రవృత్తులు పై దృక్పథానికి వ్యాఖ్యాసదృశాలని చెప్పవచ్చును. మచ్చుకు.— 1. 'అలంకారము లనావశ్యకములు— అలంకారములఁ గూర్చిన ముఖ్యపద్ధతు లెవ్వియన, అయ్యవి ప్రయత్నము లేకయ వచ్చినంత సహజముగ నుండుట. కథలోని స్త్రీపురుషులు మాటాడునపుడు పాత్రోచితము లైన కొన్నింటిమాత్ర ముపయోగించుట. కవియే వర్ణించునపు డొకింత యెక్కువగా నలంకారములు వాడినను దోషము లేదు. కాని, భావములు మహోజ్జ్వలములుగ రేగునపుడు ప్రకృతమునందే యవధానము నిలుపుట మంచిది. అట్టి తరుణముల నలంకారములు సాధారణముగ నసంబద్ధ ప్రలాపములు.' (పు. 13)

2. 'సమస్తవస్తువుల యనుభవములయందును స్వతస్సిద్ధములైన సుఖక్లేశాది భావము లున్నవి. వస్తువులు, వృత్తములు, చర్యలు ఇత్యాది ప్రకృతులకును మానవమనఃప్రకృతికిని స్వచ్ఛందముగ నుండు లావ విషయమైనరీతులను వర్ణించుట కవితయొక్క ప్రథమగణ్యోద్దేశము. ఈ కార్యమునకు, సాదృశ్య నిరూపణాద్యలంకారములు సులభముగఁ దోడ్పడిన వల దనరాదుగాని,యిట్టి యలంకారములు లేకున్న వర్ణనము తుదముట్టనేర దని భ్రమించి, వానిని కుయుక్తి యను త్రాటిచే బంధించి ప్రబంధ మను చెఱలో నుంచుట యెంతయుఁ బశ్చాత్తాపకరమైన నేరము.' (పు. 15)

3. 'విపరీతాలంకారరచనకుఁ బ్రేరకము భావశూన్యత— ఇంగ్లీషు కవులకంటె నాంధ్రకవులలో నలంకారము లధికములు. అందును బ్రబంధ కవులలో నత్యంత విపరీతములు. దీనికిఁ గారణ మేమన, అలంకార రచన యాలోచనాశక్తికిఁ జేరినంత భావనాశక్తికిఁ జేరునది కాదు. మనకవులు తరుచు పండితులు. ఇంటిలోనే కూర్చుండి నిఘంటువులఁ గంఠపాఠము సేయువారు కావుననే భావనాశక్తి మట్టు, ఒకవిధమైన యాలోచనాశక్తి యెక్కువకాన రేపగలును ఆలోచించి యాలోచించి దిక్కుగతి మోక్షములేని యూహలఁగల్పించుచునదియే కవిత్వమని విఱ్ఱవీగసాగిరి యుక్తులు కుయుక్తులఁ గవితాశక్తి యగునా? కానేరవు కవిత్రయమువారిలో నిట్టి విరుపులు లేవని

చెప్పఁగాను గాని ప్రబంధకవులయందుబలె పిచ్చి ముదిరి యుండలేదనుట సర్వజన విదితము.' (పు. 17)

కోల్‌రిడ్జి షేక్‌స్పియర్ నాటకాలను విమర్శిస్తూ అందులో అంగాంగ సమన్వయంతో కూడిన ఐక్యతను - లేదా - ఏకవాక్యతను విశేషించి నిరూపించాడు. "In his criticism on Shakespeare, he insists, with much felicity, on the unity of a work of art as its characteristic excellence. It must be a concrete whole, all its parts in just subordination to the leading idea or principle of life—"[25] అన్న విమర్శకుల అభిప్రాయాన్ని గమనిస్తే 'పట్టినములకన్న అంగాంగ సాంగత్యము కావ్యముల శ్రేష్ఠ' మనటానికీ, నాటకీయత, పాత్ర చిత్రణ, సన్నివేశకల్పన, భావపోషణ మొదలైన అంశాలను ప్రత్యేక దృక్పథాలతో ప్రపంచించటానికీ కాల్పనిక విమర్శకుల ఆలోచన సరణులే కట్టముంచివారికి మార్గదర్శకాలైనవని చెప్పవచ్చును.

కవిత్వాన్ని "The expression of the Imagination"గా భావించి, ఉపరంజనమే కవిత్వప్రధానధర్మంగా—'Poetry is ever accompanied with pleasure; all spirits on which it falls upon themselves to receive the wisdom which is mingled with its delight-', అని ప్రవచించిన షెల్లీసాహిత్యసిద్ధాంతప్రభావంకూడా రెడ్డిగారి మీద ఉన్నది. 'నీతి యనునది కవిని కైతవముయొక్క అపరాధతాపము' (పు.28) అను రెడ్డిగారి యభిప్రాయం కాల్పనికోద్యమ ప్రవృత్తికి సజాతీయం.

ఒక విమర్శకుడు తానేర్పరచుకొన్న సాహిత్య దృక్పథంతో, ప్రమాణ సూత్రాలతో తా నెన్నుకొన్న కావ్యాలలో కవిత్వాన్ని, కావ్యగుణదోషాలను అనుశీలించే పద్ధతి కాల్పనికోద్యమ విమర్శకులు సామాన్యంగా పాటించిందే. రెడ్డిగారి కవిత్వతత్త్వ విచారంకూడా ఆ పద్ధతిని పుడికిపుచ్చుకొన్నది. ముందు లక్షణ వివేచనం, ఆ తరువాత కావ్యానుశీలనం అనేక్రమం ఈ గ్రంథంలో పాటింపబడిన నిర్మాణపద్ధతి. ఇది పాశ్చాత్య లక్షణవివేచన స్వభావంతో ప్రధానంగా కూడికొని ఉండటంచేత ఆ నిర్మాణ పద్ధతి తప్పనిసరి అయింది. తరువాతి యుగంవారు సాధ్యమైనంతవరకు దీన్ని పాటించకుండా ముందుకు సాగారు.

పద్యానికీ గద్యానికీ శైలిలో భేదాన్ని పాటించని వర్డ్స్‌వర్త్‌లాగానే కట్టమంచివారు కూడా కవిత్వ గ్రంథాలలో ప్రక్రియాస్వభావాన్నిబట్టి లక్షణ వివేచనం మారుతుం దన్న వివేకమే విస్మరించారు. రెడ్డిగారు కథలో ఉండాలని చెప్పిన ఐక్యలక్షణం--అరిస్టాటిల్‌నుంచి పరంపరగా వస్తున్న ఆ లక్షణానికి కోల్‌రిడ్జి మొదలైనవారు అన్వయించిన విధానానికి అపరావతారం. వర్ణనలు, నాటకసరణి మొదలైనవాటిని గురించిన రెడ్డిగారి భావాలు కాల్పనిక యుగంలో శ్రవ్యదృశ్యకావ్య సమాలోచనంలోనుండి వెలువడిన సమన్వయ సూక్తాలు. ఆదర్శకావ్య పాత్రలపట్ల నిరాదరణం, మానవజీవిత మిశ్రస్వభావ వ్యక్తీకరణానికి తోడ్పడే సజీవపాత్రలకల్పనపై సమాదరణం కాల్పనిక యుగధర్మమే. కోల్‌రిడ్జివంటి విమర్శకులు పాత్రల స్వభావానుశీలనంలో, కవిభావ సమీక్షణంలో మనస్తత్త్వశాస్త్రదృష్టిని ప్రదర్శించటం కూడా ఆ యుగధర్మమే. కట్టమంచి విమర్శలో ఈ లక్షణాలు సలక్షణంగా చోటుచేసి కొన్నాయి.

కట్టమంచివారు విశ్లేషణాత్మక విమర్శపద్ధతులను నిరసించి సమన్వయాత్మక విమర్శవైపు విమర్శకులదృష్టిని మరలించారు. 'ఒకానొక విద్యాంసుడు గొప్ప గ్రంథమున కొకదానికి విమర్శనప్రాయమైన పీఠిక వ్రాయుచు నా గ్రంథమును బ్రశంసించుటకై యందుఁ బదునెనిమిది విధములైన వర్ణనములున్నవియని దృష్టాంతములతోఁ జూపియున్నాఁడు. ఇది దోషము గాదు కాని పొరపాటునకు వీలిచ్చెడి పద్ధతి'యని (పు. 29) విశ్లేషణ పద్ధతిని (Analytical method) గౌరవింపక, 'విమర్శనముఁ జేయుటలో కథ, పాత్రములు, ప్రకృతి విశేషములు, వర్ణనములు ఇవియన్నియుఁ బరస్పర మైత్రి కలిగి విఱుపులులేని యేకాకృతిగా నున్నవా యను విచారణ ప్రధానతమ మని నామనవి' (పుట. 31) అని సమన్వయ పద్ధతిని (Interpretative method) ప్రపంచించారు ఈ పద్ధతి కట్టమంచివారికి ముందే ప్రవర్తిల్లి యున్నను, [illegible] (Evaluative criticism) దాని [illegible] ప్రమాణా[illegible] కట్టమంచివారే [illegible] చను [illegible] దానికి [illegible] దృష్టాంతం.

'ప్రబంధములలో కథ ముఖ్యము కాదు; మఱి వర్ణనలకు నవకాశ మిచ్చుటకై తెచ్చిపెట్టుకొన్న నెపము. అనఁగా వర్ణనలు కథాసాంగత్యము లేని వనుట. సందర్భశుద్ధి లేని వనుటకు పర్యాయవచనము' - (పు. 52) అను ప్రమాణంతో పింగళి సూరన సమకాలీనులకంటె విశిష్టంగా సాధించిన విలువలను, కాలప్రభావానికి లోగి పాటించిన పాత పద్ధతులను కట్టమంచి వారు వివరించి చెప్పారు.

'ప్రబంధములలో నాటకసరణి మృగ్యమని' (పు. 59) పేర్కొని సూరన కావ్యంలో తత్కాలప్రబంధాలకంటె విశిష్టంగా కనపడుతున్న నాటకీయతను కట్టమంచి ప్రశంసించారు. సూరన అపూర్వ కథాసంవిధానానికి పూనుకోవటంచేత ఉపజ్ఞనూ, భావనాశక్తినీ ప్రదర్శించటానికి వీలైన దని వివేచించి వివరించారు. 'కల్పనాసామర్థ్య మీకవికింబలె నాంధ్రులలో మఱెవ్వరికిం గానము - తిక్కనాదుల కుండవచ్చునేమో' (పు. 70) అని ప్రశంసించి దృష్టాంతసహితంగా నిరూపించారు. 'ఈ కవితో సమకాలీకుఁడైన షేక్స్పియర్ అను నాంగ్లేయ కవిచక్రవర్తి కొన్నియెడలఁ దనశైలిం గూర్చి సగము నవ్వటాలకుంబలెఁ బ్రసంగమ్ముఁ జేయం దలంచి స్వయముగ వ్యాఖ్యానంబుఁ జేయుట యనుచితంబు కాదు. కథాగమనమునకు విరుద్ధము నని యెంచి, పాత్రముల యొండొరుల వచనముల విమర్శించినట్లు సేసి యా మార్గమునఁ గొంతకుఁ గొంత దన యభిప్రాయంబు వెలువరించుట కలదు. సూరన్నయు నీమార్గ మవలంబించినవాడే'-అను విమర్శ గమనించి నచో ఆంధ్రప్రబంధ రచనా విశేషముల ననుశీలించటంలో పాశ్చాత్య నాటక రచనా ప్రక్రియా ప్రమాణాలను ప్రయోగించి అనుశీలించే కట్టమంచివారి నైపుణ్యం స్పష్టమౌతుంది. సూరన కవితాశైలిలో కానవచ్చు విశేషాలను సమీక్షిస్తూ కట్టమంచివారు కళాపూర్ణోదయ ప్రభావతీ ప్రద్యుమ్న శైలీ తారతమ్యాన్ని తులనాత్మక పద్ధతి (comparative study) ననుసరించి నిరూపించారు. ప్రాచ్యపాశ్చాత్య కావ్యాలలో-విశేషించి ఆంధ్రప్రబంధాలలో-వర్ణింపబడే శృంగార వర్ణనాన్ని గుణదోష విచక్షణత్వంతో వివరించారు. "మనవలె వారు (పాశ్చాత్యులు) అంగవర్ణన మంతగాఁ జేయరు. చేసినను మొగము కన్నులు మొదలగు బాహిరభాగముల మాత్రము ప్రశంసింతురు. మనలో నఖశిఖ పర్యంతము విప్పివిప్పి చూపుట యందఱు నాశ్రయించిన

కావ్యలక్షణము"- (పు. 88) ఇటువంటి విమర్శ లిందుకు ఉదాహరణాలు. 'నీతికిఁ గవితకుఁ బ్రత్యక్షసంబంధము లే'దను వాదము కాల్పనికోద్యమ స్వభావమే. ఇది ప్రబంధవిమర్శలో వారు ఉపయోగించిన మానదండం.

'ఈ కావ్యములో కొన్ని యద్భుత విశేషము లున్నవి. అవి యనితర సాధ్యములు. మానవ ప్రకృతి నద్దమువలె (జూపించునవి. సంభాషణములు విస్మయావహములు. నాటక ధర్మములను బోషించి యున్నాఁడు. స్ఖాలిత్య ములతో మిశ్రమైనదను చింతయేగాని నాకు గుణము మగ్నమైనదని క్షణమైన నెంచినవాఁడఁగాను'– అని కట్టమంచివారు కళాపూర్ణోదయంలోని కళాత్మకపు విలువలను వివేచించి నిర్ధరించారు. సూరన తనకృతిలో ప్రదర్శించిన చిత్తవిజ్ఞాన మనల్పమని ప్రశంసించి, పాత్రచిత్రణంలో మానసికశాస్త్ర మర్యాదలు పాటింపబడిన విధానాన్ని అనుశీలించారు. కథా నిర్మాణ ప్రక్రియలను పరిచయంచేసి కాలసరణికంటె హేతుసరణి శిల్పసుందరమని పేర్కొని కళాపూర్ణోదయ కథానిర్మాణంలో కానవచ్చే కథాసంవిధాన నైపుణ్యాన్ని ప్రశంసించారు. ఐక్యమను లక్షణమును సాంగంగా నిరూపిం చారు. శృంగారమునుగురించి వీరు కావించిన వివేచనం పాశ్చాత్య భావముద్రి తమే కాకుండా, తెలుగువారికి క్రొత్తచూపును కల్గించేదిగా ఉన్నది. ప్రాబం ధిక శృంగారవర్ణనంలో రెడ్డిగారు రెండులోపాలు చూపించారు– 'ఒకటి, వారి శృంగార మనునది తుచ్ఛసుఖ విషయాసక్తియైన శరీరతాపము గాని మనో రాగము గాదు. రెండవది, శృంగారమును నాయికా నాయకుల చిత్తవృత్తుల ననుసరించి యనేకరీతుల నుండునని మనవారికి తెలియదు కాబోలు. జావళీ శృంగారముఁదప్ప నింకేరీతియు వా రెఱుంగరు. అందఱి శృంగారము నొక రుచి గలిగినదే. నానాభంగులఁ గాక, యేకరీతిగా నెల్లెడల నుండుటచే రోతఁ గలుగక మానునెట్లు? అసలు వాస్తవమైన శృంగారము కాదు'- అని విమర్శించారు. సూరన పాత్రచిత్రణలో ప్రదర్శించిన మనోరాగవైవిధ్యాన్ని విశ్లేషించి వివరించారు. కల్పనను మెచ్చుకుంటూనే అందులో దొరలిన స్ఖాలిత్యాల నెత్తిచూపించారు. వైవిధ్యం, వ్యక్తిత్వం, మిశ్రప్రవృత్తిలేని ప్రబంధ పురాణపాత్రలను గర్హించారు. గుణాన్నెంత గౌరవంగా మెచ్చుకొ న్నారో దోషాన్నంత తీక్ష్ణంగా,వ్యంగ్యంగా ఎత్తిపొడుపులతో విమర్శించారు.

ఒక క్రొత్త విమర్శోద్యమాన్నీ, భావవిప్లవాన్నీ, అనుశీలనవిధానాన్నీ తెలుగులోకి తెచ్చిన కట్టమంచివారి విమర్శలో ఖండనం ముందూ, మండనం ఆ వెనుకా సాగటం సహజం!

కట్టమంచివారు 'రస' 'రసాభాస' శబ్దాలను వాడారు ఇవికూడా పాశ్చాత్యుల 'Emotive Experience'కు సంబంధించినవే కాని ప్రాచ్యుల రససిద్ధాంతాలను వర్తించేవి కావు. 'కళలలో ప్రధాన పురుషార్థమైనది రసము (పు.31); కావ్యములందుఁ దత్వము కాదు ప్రధానము, మఱి, రసము (పు. 132); కళారచనలో గమనింపవలసిన యంశమేమన, రసాభాస మేమాత్రము గలుగనంత పొందికగా నున్నదా, లేదా యనుట (పు. 42), రసభంగమా కాదా యనుటయే శిల్పవిమర్శనముయొక్క ఒక్క పరీక్ష' (పు. 94) - మొదలైన వాక్యాలు ప్రాచీన లాక్షణిక మతానుగుణంగా వ్రాసినవి కావు. "Great poetry is always written with feeling, emotion, inspiration and imagination and not following the old traditional and outmoded rules of rigidity"[26]—అన్న షెల్లీవాక్యాలలో వినపడే కాల్పనికోద్యమ కవుల, విమర్శకుల దృక్పథమే కట్టమంచివారి 'రస, రసాభాస, రసభంగ' శబ్దాలను కల్పించింది. ఉత్తమ కవితకు చెప్పిన పై నాలుగు గుణాలుంటే అది రసకవిత్వం, వాటి సంయోజనంలో ఐక్యత లేకపోతే రసాభాసం, అసలు ఐక్యదృష్టియే లేకపోతే రసభంగం. కట్టమంచివారి నానా రసాశ్రయ ధోరణి పాశ్చాత్య ప్రభావ ఫలితమే. పాశ్చాత్యులు classic లో నానారసభావోల్లాస స్థితిని భావిస్తారు. ఇది ప్రాచీన భారతీయ లాక్షణికమతం కాదు. ప్రాచ్యలక్షణదృష్టి కట్టమంచి మతం కాదు. 'పాశ్చాత్య వాతావరణంలో చేతులు మొగిడ్చి కూర్చున్నవారికి, ప్రాచ్యకావ్య విషయము లెట్లు తెలియును?' అని అక్కిరాజు ఉమాకాన్తంగారు విమర్శించటం అందువలననే. ప్రసిద్ధ ప్రాచ్య పారిభాషిక పదాల కున్న రూఢ్యర్థాలను ప్రక్షాళనం చేసి పాశ్చాత్య పారిభాషిక పదాలకు మారుగా ఒక్కసారి తెలుగులో పదాలను స్వేచ్ఛగా వాడితే విమర్శకులు ఉక్కిరిబిక్కిరి కాక తప్పదు. వినూత్న భాషాసాహిత్య ప్రభావం వెల్లువగా వచ్చిపడ్డప్పు డిటువంటిది తప్పదు।

'కవిత్వ తత్త్వవిచారమునందు సాహిత్య విమర్శతోపాటు సాంఘిక విమర్శయు చాలినంత కల'[27]దని పేర్కొంటూ డా యస్.వి. రామారావు గారు 'కట్టమంచి దేశచరిత్రకు, సాహిత్యానికి గల పరస్పర సంబంధాన్ని విశదీకరించి, ఆధునికమైన సాంఘిక విమర్శనాపద్ధతికి (Sociological Criticism) ఆయన మార్గదర్శకుడైనా'[28] డన్నారు. 'విద్యాసాహిత్య రంగాల్లో కట్టమంచివారు కొండంతరెడ్డి. ఆ కొండశిఖరం నుంచి ఎన్నో మెరుపులు మెరిశాయి, ఉరుములు ప్రతిధ్వనించాయి, ఝరులు ప్రవహించాయి. పరిసరస్థమైన ప్రజానీకం మొదట దిగ్భ్రమ పొందినా తర్వాత మేలుకొన్నది. ముందుకు సాగింది. సాహిత్యరంగంలో సరికొత్త భావాలకు, నూతన ఆలోచనారీతులకు మనోవికాసాత్మకమైన విమర్శకు కట్టమంచి వారు చేసిన దోహదం అసదృశం' అని డా. జి. యన్. రెడ్డిగారు ప్రశంసించారు.

సాహిత్య విమర్శకుడుగా కట్టమంచి సాగించిన ఉద్యమంవలన తెలుగు సాహిత్య విమర్శపై పాశ్చాత్య కాల్పనిక విమర్శ ప్రభావం ఉప్పెనగా పొంగి ముంచెత్తి వేసినట్లయింది. ఆయన అగస్త్యునివంటివాడు కాబట్టి పాశ్చాత్య యుగచైతన్య పయోధినంతా ఆపోశన పట్టి తెలుగులో దేశీయంగా వెలువరించగలిగాడు. అయినా, ఆయనదీ ఉప్పెనలాంటి స్వభావమే· ఆయనకు నచ్చనివాటిని ముంచటం తెలుసు, మెచ్చినవాటిని తేల్చటం తెలుసు, అడ్డం వస్తే కోతపెట్టడం తెలుసు. ఉప్పెనవలన ఒండ్రుమట్టి క్రొత్తగా వచ్చి పొలాలను సారవంతం చేసినా, ఉన్నపంట ముందుగా గంగలో మునిగి పోయే ప్రమాదం ఉంటుంది. పొంగే ఉప్పెన తీయక మానదు; తీసిన తరువాత పొలాలకు పడ్డ గండ్లను రైతులు పూడ్చుకొంటారు. ఒండ్రును రక్షించుకొంటారు. విదేశీయమైనా ఒండ్రు సారవంతమైన మట్టి. దాని మీద దేశవాళీ పంటలు మూడు పూవు లారు కాయలుగా పండించుకొంటారు. రెడ్డిగారు ఆంధ్ర సాహిత్య విమర్శక్షేత్రాని కటువంటి మేలు చేశారు.

కాల్పనికోద్యమ విమర్శలోని కళాకాంతులను తెలుగువారి కందించిన కట్టమంచివారు ఆయుగ విమర్శకుల లోపాలనుకూడా తన విమర్శలో అప్ర

యత్నంగానే అనుసంధించుకొన్నారు. "The main defect of wordsworth as a critic is that he shows a lack of balance in his critical approach. He constantly overstates in everything. It is true that wordsworth was confronted with the task of demolishing outmoded beliefs and principles and, of course, nobody can criticise a dogma without himself becoming a little dogmatic"[30]-అన్న విమర్శలో నున్న వర్డ్స్వర్త్ లోపాలనూ, హాజ్లిట్‌లో ఉన్న మరొక రెండులోపాలనూ-అవి యేమిటంటే- "The first is his lack of wide study and knowledge of things. He had read only English literature and was ignorant of all other literatures. The second thing is his ill temper and extra-literary prejudices"[31] కట్టమంచివారు వారసత్వంగా తెచ్చుకున్నారు. అయినా, వర్డ్స్వర్త్ దృక్పథం, హాజ్లిట్ శైలీ, అభిరుచి విమర్శపద్ధతి, కోల్‌రిడ్జిలాంటి ప్రవచన విధానం కట్టమంచిలో త్రివేణిలా సంగమించి ఒక ఉద్యమాన్నే తెలుగువిమర్శకు ప్రసాదించాయి. "If this criticism survives, as it vigorously does, it is not by virtue of what it demonstrates but by what it abundantly suggests, for no English critic has so excelled at providing profitable points of departure for twentieth-century critics"[32] అన్న జార్జి వాట్సన్ మాటలు కోల్‌రిడ్జికి ఇంగ్లీషులో ఎంత వర్తిస్తాయో తెలుగులో కట్టమంచికి కూడా అంత అనువర్తిస్తాయి.

## సాహిత్య సౌందర్య మీమాంస - రాళ్లపల్లి, దువ్వూరి

ఆంగ్ల కాల్పనిక విమర్శ యుగంలో షెల్లీ, కీట్స్‌లాగా, ఆంధ్ర కావ్యానుశీలన యుగంలో రాళ్లపల్లి అనంత కృష్ణ శర్మ (1893-1979) దువ్వూరి రామిరెడ్డి (1897-1947) గారలు రాణిస్తారు. వీరిద్దరూ కట్టమంచివారి నవ్య ధోరణులను మెచ్చుకొన్నవారే. కాని, వారిలాగా పాశ్చాత్య ప్రభావ ప్రవాహంలో తల మున్కలు వేసినవారు కారు. ఆంగ్ల విమర్శ పద్ధతిని అచ్చ తెనుగులో వ్రాసినంత మాత్రాన దేశీయం కాదు, దేశీయమైన భావనంలో ఇమిడే విధంగా సంపదించినప్పుడే తెలుగువారిచేత స్వాయత్తం చేసికొన బడుతుందని భావించి, భారతీయ సంస్కారంలో పాశ్చాత్య ఫణుతులను సమీక్షించి ప్రాచ్య పాశ్చాత్య సమన్వయాత్మకమైన ఫణితిని తెలుగుదనం ఉట్టి

పడేటట్లు ప్రవర్తింపచేసిన విమర్శకద్వయం రాళ్లపల్లి, దువ్వూరి. కట్టమంచి వారు సాహిత్య సిద్ధాంతాలను, ప్రమాణాలను ప్రవచించి, వాటిని అనువర్తిత విమర్శ పద్ధతి నాశ్రయించి కావ్యాల కన్వయిస్తూ దానిలో అనుశీలన ప్రవృత్తికి ప్రాముఖ్యాన్ని కల్పిస్తూ వచ్చారు. రాళ్లపల్లి, దువ్వూరి మరొక అడుగు ముందుకు వేసి, ఆంగ్ల కాల్పనిక కాలంలో ప్రవృద్ధమానమౌతున్న సాహిత్య సౌందర్య మీమాంస (Literary Aesthetics) ను తెలుగులోకి తీసికొని రావటానికి యత్నించారు. కట్టమంచి కావ్య కవితాతత్త్వాన్ని అనుశీలిస్తే- రాళ్లపల్లి, దువ్వూరి కావ్యకళాసౌందర్య తత్త్వాన్ని అనుశీలించే శాఖను పెంపొందించారు అది వీరి ప్రత్యేకత.

పాశ్చాత్య సాహిత్య సౌందర్య మీమాంస అంటే యేమిటో పరిచయం చేసికోటానికి Max I. Baym మాటలు పనికి వస్తాయి. "Literary aesthetics is primarily concerned with the criteria of beauty and pleasure in the creation and in the appreciation of literary works of art.... Since literature is one of the fine arts, it follows that the aesthetics of it can be most richly grasped in the context of principles that apply to artistic expression generally." కావ్య కళా సృష్టిలోని సౌందర్యాన్నీ, ఆనందాన్నీ గురించి అనుశీలించేది సాహిత్య సౌందర్య మీమాంస. కళాభివ్యక్తికి సంబంధించిన సూత్రాలను వివేచించేటప్పుడు ఈ సౌందర్య మీమాంస ఎంతో పనికి వస్తుంది. అలా వివేచింపబడిన సూత్రాలను కావ్యార్థాల కన్వయిస్తే సాహిత్య సౌందర్య విమర్శ అవుతుంది. అలా అన్వయింపబడే అంశాలలో ముఖ్యమైనవి-"The aesthetic questions are : the relationship of sensibility to knowledge, the nature of poetic creativity, the roles of symbolism and metaphor, the differentiae of Poetry and Prose, the tension between poetry and science, feeling and reason as form of cognition, the literary applications of metaphysics and science, and the nature of sentimentality."[33] వీటిలో రాళ్లపల్లి, దువ్వూరి తెలుగు విమర్శలో తామెన్నుకొన్న కావ్యాలకు సంబంధించినంతవరకు పనికి వచ్చే

అంశాలను తమ సమన్వయ దృక్పథంతో వెలువరించారు. కట్టమంచివారి విమర్శలో నిలువెల్లా పాశ్చాత్య ప్రభావమే అయితే, వీరి విమర్శలలో వెలుగొందే సౌందర్యపు విలువలే పాశ్చాత్య సమీక్షణ సంస్కారజనితాలు. వీరిపై బడిన పాశ్చాత్య ప్రభావం కట్టమంచిలోలాగా పైకి కొట్టవచ్చినట్లు కానరాదు. ముత్తెంలో నీరులాగా లోలోన నిగనిగలాడుతుంది. అందాన్ని గురించి అనుశీలించే వీరిద్దరూ అందంగా చెప్పటంలో కూడా ఆరితేరినవారు కావటం ఒక విశేషం.

సౌందర్య మీమాంస ప్రస్థానంలో సాగిన పాశ్చాత్య విమర్శకులలో కోల్ రిడ్జి, జార్జి శాంతాయన (1863-1952) మొదలైన వారి ప్రభావం రాళ్లపల్లి వారి మీదా, షెల్లీ, కీట్స్, ఎడ్గర్ అలన్ పో (1809 - 1849) మొదలైనవారి ప్రభావం దువ్వూరి మీదా స్థూలంగా కనపడుతుంది.

కాల్పనిక యుగంలో 'Art is an expression of life' అనే దృక్పథం పరిణతి చెంది కళాభివ్యక్తియే సౌందర్యం (Expression is Beauty) అనే తత్త్వానికి చెందిన సిద్ధాంతాలు రూపొందాయి. ఆ కాలంలో "The art-product was valued as the expression of the artist's uniqueness, as the means by which he communicated his inspired insight into reality, or conveyed his wonderfully delicate or passionately intense emotional responses to the less favoured and gifted of mankind."[3-L] రాళ్లపల్లి వారు తమ సాహిత్య విమర్శలో అభివ్యక్తికి (Expression) అధిక ప్రాధాన్యాన్ని చూపించారు. అనుశీలనంలోనూ, తమ స్వీయశైలిలోనూ, నాచన సోముని నవీన గుణాలను గురించీ, ఆంధ్ర వాఙ్మయంలో అతనికీయదగిన స్థానాన్ని గురించీ 'సారస్వతాలోకం'లో సునిశితమైన విమర్శ చేస్తూ తమ ప్రత్యేక దృక్పథాన్ని వెలువరించారు. వారు ప్రతిపాదించిన 'భావ-వస్తు-రచనా' కళలు అభివ్యక్తికి సంబంధించినవే. అనగా కావ్య సౌందర్య మీమాంసకు చెందినవే.

'చిత్రలేఖనము, సంగీతము, మొదలగు ఇతర కళలన్నిటివలె కవిత్వమునందును ప్రధానముగా నుండెడు తత్త్వములు రెండు : భావము, వస్తువు.

భావములు ప్రేమ, కోపము, అసహ్యము, అలక్ష్యము, దయ మొదలగు ప్రాణిధర్మములని వేరుగా చెప్పఁబనిలేదు. వస్తువు అనగా ప్రకృతియందుఁ గానవచ్చు జాతి, గుణము, క్రియ మొదలగు వివిధ పదార్థములు. పై భావములు మన మనస్సునందు పుట్టకయున్నప్పుడు, పై వస్తువులు మనయెదుట లేనప్పుడు వాని ననుభవించునట్లు, వీనిని సాక్షాత్కరించునట్లు చేయుటయే కళావంతుని పనితనము. వస్తువులేని భావములు కాని, భావములులేని వస్తువులు కాని యుండుట యరుదైనను ప్రాధాన్యమునుబట్టి భావకళలని, వస్తుకళలని మనము విభాగము చేయవచ్చును."[35]

"భావ వస్తువులకు తోడుగా తక్కిన కళలవలె కవిత్వమునందును మూడవ తత్త్వమొకటి కలదని మనము గమనింపవలసియున్నది. అదే దనఁగా-రచన. అనఁగా ఆ భావవస్తువులను వెలుపఱచు పద్ధతి. ఇది ఆరెంటిని తెలుపు వాక్యములు. వాక్యములను గూర్చు పదములు, ఆ పదములను లోగొన్నశైలి, ఛందస్సు మొదలగువానియందు గానవచ్చును. చిత్తరువునందు పన్నెలు, పలక, చౌకట్టు మొదలైనవానివలె; గానమందు రాగభేదములు, శ్రుతి, తాళము, ఇత్యాదులట్లు, నాటకమునందు వేషము, పాట, పద్యము మున్నగు వాని రీతి; రచన కవిత్వకళకు బహిరంగమగు ప్రకృతి, భావవస్తువు లంతరంగములు; కళావ్యక్తికి భావము జీవమని, వస్తువు బుద్ధియని, రచన శరీరమనియుఁ జెప్పవచ్చును."[36] రాళ్ళపల్లి వారి కళాత్రయి వివేచనం కాల్పనిక కవుల అభివ్యక్తి మతమునకు సన్నిహితం. నిజానికి రాళ్ళపల్లివారు వాడిన భావ, వస్తు, రచనాపదాలు భారతీయ సంప్రదాయపరంగా వాడినవి కావు. వాటి వివరణం గమనిస్తే పాశ్చాత్యప్రభావంతో రూపొందిన పారిభాషిక పదాలని సులభంగా తెలిసిపోతుంది. ఇక్కడ మరొక విషయం గమనించవచ్చు. శిల్పం, చిత్రకళ, సంగీతం, అభినయం మొదలైన కళలతోపాటు కవిత్వాన్ని కూడా కలిపి సమాలోచించటం, లలిత కళలన్నింటినీ ఏకదృష్టితో, సమ్యక్పరిశీలనంతో సమీక్షించటం పాశ్చాత్య విమర్శకుల ప్రత్యేకత. ఆ లక్షణం రాళ్ళపల్లి విమర్శలో అత్యంత సహజ సుందరంగా రాణించటం విశేషం. వారికి సంగీత సాహిత్య నాట్యాభినయాది కళలలో ఉన్న అపారమైన అభినివేశం, ప్రగాఢమైన పాండిత్యం అందుకు దోహదమై ఉండవచ్చును.

రాళ్ళపల్లి వారి 'రస'శబ్దంకూడా ప్రాచ్యలాక్షణికులు నిర్దేశించింది కాదు. పాశ్చాత్య సౌందర్యదర్శన ప్రభావంతో ప్రతిపాదించిందే. వారు వ్రాసిన వాక్యాలే యిందుకు సాక్ష్యాలు. "రసమనగా మన లాక్షణికులు నియమించినట్లు, శృంగారము మొదలగు తొమ్మిది భేదములే కలిగి 'యలౌకిక చర్వణావిషయ'మగు నొక వివరింపరాని పదార్థమని నా యుద్దేశము గాదు. తర్కశాస్త్ర పరాధీనులగు మన లాక్షణికులు వాదవివాదములను బెంచి యెవరో వ్రాసిన రసలక్షణములనే స్థాపింపఁబూని రసశబ్దమునకు మార్గమును సంకోచపఱచి రని నా యభిప్రాయము....శృంగారము మొదలగు రసముల 'చర్వణ' యలౌకిక మేమి? యిది లౌకిక మేమి? ఏ భావములైనను వాని తీక్ష్ణదశలో నవిదితవేద్యాంతరముగా ననుభవింపఁగల్గుదుమేని, యానందస్వరూపులై రసశబ్దవాచ్యము లగును: అనఁగా శిల్పమందన్నమాట. జుగుప్సాభక్తి వాత్సల్యాదులుగూడ రసములే యని వాదించువారు మనలో లేకపోలేదు. తర్కశాస్త్రము నోరు మూసినను, హృదయమును మూయజాలదు. కావున, కవి భావనాబలముచే తనకుఁ గలుగు శోకము, మోహము, అసూయ, ద్వేషము, సంతోషము, ప్రణయము మొదలగు భావము లనబడు చిత్తవికారముల మూలమున వర్ణింపవలసిన పదార్థముల స్వరూపమును నిర్ణయించి, విగ్రహమును (ఏ విగ్రహమైనను సరియే) సరళమగు భాషతోఁదీర్చి యెదుట నిలిపినపుడు రసానుభవ సంస్కారముగల సహృదయుల కట్టి మనోవికారములే కలిగి అవి యెట్టివైనను, శిల్పమందుఁ గల యొకానొక అనిర్వచనీయ మహిమచే, ఆనందముగాఁ బరిణమించును. ఈ యర్థమందే ప్రకృతము రసపదమును నే నుపయోగించెదను·"—అను రాళ్ళపల్లివారు—ఎంత సంప్రదాయవాదిగా కనపడినా ఎంత పాశ్చాత్యప్రభావంతో ఆలోచించారో స్పష్టమౌతుంది. ఈ రసశబ్దవ్యాఖ్యానానికి భరతమహర్షిపాదం పట్టి లాభంలేదు. పాశ్చాత్యలక్షణాన్ని ఉపలక్షించాలి.

20వ శతాబ్ది ప్రథమ పాదం నాటికే తెలుగువారు ఈస్థెటిక్సులోని సౌందర్య రసతత్త్వములను గురించి తమభాషలో మననం చేసికొంటున్నట్లు 'విమర్శక పారిజాతా'దులు స్పష్టం చేస్తున్నాయి, పురాణం సూరిశాస్త్రిగారి సమాలోచనం ఇందుకు సాక్ష్యం. "సౌందర్యముయొక్క స్వభావ స్వరూపములను, రసతత్వమును నిర్ణయించెడి శాస్త్రము 'ఈస్థటిక్సు' అనఁబడును.

రుచిభేదము లెందున జనించునదియు, లలితకళల మూలసూత్రము లెవ్వియై నదియు గూడ నీ శాస్త్రము విచారించుచున్నది. గ్రీకుభాషలో 'ఈస్థటిక్సు' అను పదమునకు ఇంద్రియములచే గ్రహించుట, తెలిసికొనుట అను వ్యుత్పత్త్యర్థ మొప్పుచున్నది. వస్తుసౌందర్యమును మనసా చింతించి (కాంటెంప్లేటు చేసి) రసానంద మనుభవించుటకు ఈ పదము బామ్‌గార్టెనుచే వ్యాపింపజేయ బడినది. ఇంద్రియగ్రాహ్యమగు విషయములను చింతించుటలో ప్రీతిని, ఆనందమును చవిజూచు మానసవ్యాపారముల నీ శాస్త్రము పరిశోధించు చున్నది. ఇంద్రియద్వారమున నవబోధమగు సంగతి సందర్భములన్నియు విషయము లనజెల్లును. ప్రకృతి వైచిత్ర్యములు, ప్రియదర్శనంబులు, చిత్రశిల్పాదులు ప్రత్యక్షముగ కన్నులగట్టి రససౌందర్య చింత నేర్పరచును. సంగీత మిటులనే ప్రత్యక్షముగ శ్రవణేంద్రియమును దాకి, రసధ్యాన మేర్ప రచును కావ్యపఠన మిట్టి సౌందర్య విచారణను బురికొల్పుచున్నను కావ్య నిర్దిష్టములగు విషయములు ప్రత్యక్షములుగ నింద్రియములకు గోచరింపవు. పదములకును, భావములకును, వస్తువులకును మన్నించి, మానసకోశ మాపద ములు నిరూపించెడి విషయములను మానసవీధిలో నగుపడునట్లు చేయును. ఇట్లు సాక్షాత్కరించిన విషయచ్ఛాయలను జింతించుచు రసానంద మనుభ వించుచున్నాము. అందుచే కావ్యపఠనమువలన జనించెడి రసయోగము వ్యంగ్యప్రభూతమై, పదసూచితమై, ప్రత్యక్షేతరముగ నుండును. తక్కువ గల లలితకళలు సూటిగ నింద్రియ గ్రాహ్యములై సౌందర్యసూచన లందించు చున్నవి."

"మన చిత్త మొక విషయముపై చూపునిలిపి దానిని సంతోషముగ నుత్సాహముగఁ జింతింప మొదలిడు నప్పుడు మన మానసము రసయోగ మధిష్ఠించెనని చెప్పవచ్చును. (ఈస్థటిక్ యాటిట్యూడ్). ఇట్టి యవస్థలో మన మనుభవించెడి మానస వ్యాపార విశేషములు రసానుభవ మనబడు చున్నవి. రససౌందర్య విరాజితంబులగు విషయములఁ జింతించునపుడెల్ల ప్రీతియే, ఆనందమే, సంతోషమే గలుగుచుండును. ఇట్టి రసానంద మను భవించెడి సమయములందు మన శక్తియుక్తులు పెల్లుబ్బి, జీవసంచలన వికాస మొందుచుండును. మన రాగద్వేషములు, భావోద్రేకములు చల్లబడి

యొక విధమగు సాధుత్వ మొందును. మానస మనిర్వచనీయ సంతోష తేజఃపుంజమున సంకల్పహీనమై నిశ్చల సంతుష్టితో దేలుచుండును"[37]. ఇట్టి పాశ్చాత్య రససౌందర్యతత్త్వ సమాలోచన సంప్రదాయం తెలిస్తేనేకాని రాళ్ళపల్లివారు తమ విమర్శలో వాడెడి రసశబ్ద స్వరూపంగాని, తదనుగుణంగా సాగే సాహిత్యానుశీలనంగానీ మనకు అవగతం కావు.

రాళ్ళపల్లివారి పాశ్చాత్య ప్రభావ ముద్రితమైన సాహిత్య సౌందర్య తత్త్వ దర్శనాన్ని అందుకోలేక, ప్రాచ్యలక్షణానుగుణంగా దర్శించి, అపార్థంచేసికొని ఏకుమళ్ళ అచ్యుతరావు, నడకుదుటి వీరరాజు పంతులు గారు, దుర్భా సుబ్రహ్మణ్యశర్మ మొదలైనవారు చేసిన ఖండనలకు రాళ్ళపల్లివారు స్వయంగా సమాధానం చెప్పకొని తమ దృక్పథాలను వివరించుకో వలసి వచ్చింది. పాశ్చాత్య కళాసిద్ధాంతాలను ప్రాచీనాంధ్ర కావ్య గుణ దోషాలను, సౌందర్యతత్త్వాలను వివేచించటానికి ప్రమాణాలుగా ప్రయోగిస్తు న్నప్పుడు, పాశ్చాత్య దృక్పథం తెలియని పండితులు వ్యతిరేకిస్తే ఎవరైనా ఏంచేస్తారు! ఎదుగలేని వారి యెఱుకకు జాలిపడి సానుభూతిని ప్రకటిస్తారు!

ఒక కవి జీవితాన్నీ కవిత్వాన్నీ విశ్లేషించి, వివేచించి చూపి రాళ్ళపల్లి వారు 'వేమన' గ్రంథంద్వారా పాశ్చాత్య విమర్శ ప్రయోగాల్లో కవి జీవిత కావ్యార్థ సమన్వయ విమర్శ పద్ధతికి సమగ్రోదాహరణాన్ని సంతరించి యిచ్చారు. కోల్‌రిడ్జ్, 'Biographia Literaria' స్థాయిలో తెలుగులో నిలువగలిగిన గ్రంథం ఇది.

రాళ్ళపల్లివారి నాటకోపన్యాసాలు సమకాలీన నాటకరంగ ప్రయోగ రచనా ప్రక్రియలమీద ప్రాచ్య పాశ్చాత్య సమన్వయ దృక్పథంతో సాగిన సరళ సమీక్ష సహృదయ విమర్శ అందులో రాళ్ళపల్లివారి దృక్పథం పాశ్చాత్య రూపకమర్యాదలను మన్నించిన వైఖరి. కొన్నియెడల విమర్శిం చిన వైఖరి వారి స్వతంత్ర విమర్శక వ్యక్తిత్వాన్ని చాటుతున్నాయి. మచ్చుకు కొన్ని— 1. పాశ్చాత్య వైఖరులను మెచ్చుకొన్నతీరులు:

(i) "కళాకార్యము వస్తువుయొక్క విశిష్టస్వరూపమును- ఇది ఫలానిదని గుర్తించుటకుఁ గావలసిన ముఖ్యధర్మమును-మన భావనావీధిలో ప్రతి

బింబింపఁజేయుటయే తప్ప, దాని అంగోపాంగముల జ్ఞానమును మన మెదడున కంటించుట కాదు. అనఁగా అంగవర్ణన అక్కఱలేదని కాదు, అంగసామాన్యముల వర్ణన మక్కఱలేదనుట." (పు. 10-11)

(ii) "శాంతి అనగా సోమరితనము కాదు; ఏకాగ్రత. అవిదిత వేద్యాంత రముగా ఏదేని యొక వస్తువునందు చిత్తము నిల్పఁగలుగుట". (పు. 13)

(iii) "సామ్యమున్నచోట చక్కఁదనమును, వైషమ్యమున్నచోట వికార మును మన మనుభవింతుము". (పు. 15)

(iv) "సహజమగు లయాభిమానమును వెలువరించు మానవప్రవృత్తులే కళలు." (పు. 16)

(v) "పందొమ్మిదవ శతకపు తుదలో ఆంగ్లసాహిత్య వ్యాసంగము స్థిర ముగా నిలిచి స్వతంత్రబుద్ధిని ప్రేరేచి నరముల నల్లాడించువరకును మనవారు మేలుకోలేదు". (పు. 39)

(vi) ధర్మపరమువారు, కోలాచలమువారు, పాశ్చాత్య సారస్వత పరిచ యము మూలమున తమ మాతృభాషను, తన్మూలమున దేశీయులను వృద్ధికిఁ దేవలయు నని యుద్రేకముతో ప్రవర్తించినారు. కానీ, వీరేశలింగము పంతులు మొదలగు కొందఱివలె అన్నిత్రోవలలోను నడువబోయి అవకతవక పని చేయలేదు." (పు. 40)

(vii) ప్రాచ్యపాశ్చాత్య నాటక రచనలో భేదసాదృశ్యాలను గురించి—చూడు. పు. 41-43.

(viii) "అంకములను రంగములుగా విభజించుట, నాందీప్రస్తావనలను వదలుట, మరణము మొదలగు వానిని ప్రత్యక్షముగా చూపుట-ఇత్యా దులలో పాశ్చాత్య పద్ధతి ననుసరించి మన కవులు నాటకరచనకు చాల మేలిమి తెచ్చిరనుటలో సందేహము లేదు. (పు. 51)

(ix) ఆంగ్ల సాహిత్య పరిచయఫలముగా మన కవు లిద్దరును సాహసించి తెలుగువాఙ్మయమునఁ బ్రవేశపెట్టిన విషయములలోనెల్ల ముఖ్యమైనది శోకాంతముగా వ్రాయుట.... ప్రకృతము మనకు మిగిలినది ఆద్యంతము శోకమయమైనది 'సారంగధర' యొక్కటే. కానీ, పది శోకాంత నాటకములు చేసినంతపని తెలుగువారి కది యొకటే చేసినది; చేయుచున్నది. దీనికిఁ దగినట్లు కార్చుటకుఁ గావలసినన్ని కన్నీళ్లు తెలుగువారి కున్నవా అని సందేహింపవలసి యున్నది. (పు. 59).

2. పాశ్చాత్య వైఖరులను వ్యంగ్యంగా నిరసించిన తీరులు:

(i) 'విషాదము నెక్కువగా నాటకములం దనుభవించుటచే జనులు నీతిమంతులగుదురనుట నా సిద్ధాంతమునకుఁగాని, యనుభవమునకుఁగాని యింకను రాని మతము (పు. 61).

(ii) "మిశ్రవ్యక్తులను ప్రదర్శించుటయే కళాకారుని ధర్మమని మాత్రము నేనంగీకరింపజాలను" (పు. 69)

(iii) "ఇద్దఱిలో ఎవరును నీతిపేర రసమునుగాని, రసమనుపేర నీతినిగాని ప్రాయశః చెఱిచినవారు గారు. మనుష్య జీవితమునందు రెండును సమానమైన విలువగల తత్త్వములు." (పు. 77).

పాశ్చాత్య సాహిత్య సౌందర్య శాస్త్ర మీమాంసలోని రస, భావ, వస్తు, రచనాంశాలకు ప్రాధాన్యమిచ్చి రాళ్లపల్లి వారు విమర్శను సాగిస్తే, దువ్వూరి రామిరెడ్డిగారు రస, రామణీయక, ప్రతిభలనే అంశాలకు అన్వయం చెప్పి ఆవిష్కరించే విమర్శకు బాటలు వేశారు. అమెరికన్ విమర్శకులలో అడ్గార్ అలన్‌పో, షెల్లీ కీట్స్ వంటి ఆంగ్ల విమర్శకులూ భావించిన సౌందర్య కళాతత్త్వాలను సంపదించుకొని రెడ్డి గారు ముందుకు సాగారు. సౌందర్య శాస్త్రంలో రస-రామణీయకత్వాల వివేచనాన్ని పురాణం సూరి శాస్త్రి గారి మాటలలో గమనించవచ్చు-'రసానుభవము కళోత్పత్తికి పూర్వమేర్పడుటయేగాక కారణము కూడ నగుచున్నది. మానవ విజ్ఞానమభివృద్ధియైన కొలది

మానవ స్వరూపమునందేగాక చేతనాచేతనమగు సర్వ ప్రపంచమునందు సౌందర్య మవలోకించి యానందించెడి ప్రవృత్తి వికసించెను. మరియు. కావ్యశిల్పాదులు రసపిపాసకు కొంత ప్రసిద్ధ సామాగ్రి నేర్పరిచి సరసతను, రుచులను పెంపొందజేసినవి. ప్రకృతి శాస్త్రజ్ఞులు జనసామాన్య మవలోకించెడి విషయముల యంతరార్థమును, సామాన్య ధర్మములను గుర్తించి, విశ్వ సామాన్యమగు ధర్మముల నివేదించునట్లే, కవులు శిల్పకులు జనసామాన్యము అనుభవించెడి యవస్థలలోని నిగ్గును, సౌందర్య తత్త్వమును, రసరాశిని విడ దీసి వెలిగింపజేతురు....రసికుడు కవికృతి నవలోకించియే తన సౌందర్య లక్షణముల నేర్పరచుకొనును. ఇంద్రియ వికాసము బుద్ధి సామర్థ్యము విప్పారిన యువురి మతములో రసవత్సందర్భములుగ నెంచబడు విషయములను చక్కగ నిరూపించునవే సత్కళలుగ నెంచబడుచున్నవి. కళాస్వరూపముల విలువ రసజ్ఞుల రసానుభవముతో, సౌందర్య లక్షణములతో నివి యేకీ భవించి సాదృశ్యమొందినంతలో నున్నది."...."ప్రకృతి, పూర్వాచారము, కవి ప్రతిభ, సమకాలీన పరిస్థితులు, ప్రేక్షక సమాజము, మత నైతికోద్యమ ములు, ప్రస్తుత ప్రయోజనము మున్నగు నంశములెన్నియో చేరి కళాస్వరూప మును, స్వభావమును నిర్ణయించును. అందువలన కేవల కళాస్వరూప పరి శీలనము వలన కవియొక్క రసానుభవమును, ప్రకృతిలోని రమ్యసందర్భము లను నిశ్చయింపజాలము"-[38] ఇటువంటి కళా సౌందర్య తత్త్వ వివేచనం పత్రికగా ఉంచుకుంచేనే దువ్వూరి రామిరెడ్డిగారి సాహిత్య దృక్పథం అవగత మవుతుంది.

దువ్వూరి వారు కావ్యానుశీలన విధానంలో 'కవిత్వతత్త్వ నిరూపణం' చేయటానికి విమర్శపథాన్ని చేపట్టారు. కట్టమంచివారు కవిత్వ తత్త్వవిచారం చేశారు. దువ్వూరి వారు 'నిరూపణం' చేశారు. ఆ ప్రయత్నాన్ని 1922-23లో నే, పాకాల రాఘవన్నాయుడు గారి సంపాదకత్వంలో వెలువడిన 'కళ' పత్రికలో తొమ్మిది వ్యాసాలుగా రచించారు. వీరి దృక్పథంలో కళాస్వరూపంలోని విలువ గణనీయకం. రసం దానికి ప్రేరకం, లేదా కారకం; సంవాదశిల్పనైపుణ్యం ప్రతిభ.

రామిరెడ్డిగారి సౌందర్య దృష్టికి 'Poetry is the rhythmic creation of beauty' అన్న ఎడ్గార్ ఆలెన్‌పో కవిత్వ నిర్వచనం ప్రమాణంగా తోచింది. రసానుభవంలోనుంచి లయాత్మక సౌందర్య సృష్టి జరిగితే కవిత్వ మనిపించుకొంటుంది. అనుభవం మూలం; లయాత్మకమైన ఆకృతి వైభవం రమణీయం. ఆకృతిలోని శిల్పసంవిధానం ప్రతిభ. "పాంచ భౌతిక ప్రకృతి చిత్సంబంధము వలన 'ప్రాణవంతమగునట్లు సామగ్రి కవి ప్రతిభతోడ సంయోగమునొంది జీవన్మూర్తిని దాల్చుచున్నది........కావ్యమునకు కవి ప్రతిభయే జీవితము. కావ్యమునందలి చిత్ప్రకాశము సౌందర్యస్ఫురణముగ గోచరించును. శిల్పనైపుణ్యము (అనగా ప్రతిభయు), కవితా సామగ్రియు నవిభాజ్యముగ నొకదానియందొకటి లీనమయినపుడు సజీవవిలసనము కావ్యము నందుఁదేలియాడుచున్నది"-అన్న రెడ్డిగారి మాటలు ప్రతిభా ప్రాముఖ్యాన్ని వ్యాఖ్యానిస్తున్నాయి. అందువల్లనే 'కావ్యమునకు కవిప్రతిభయే జీవితము' అని నిర్దేశించారు. జీవితం వేరు జీవం వేరు, ఒకటి ప్రవృత్తి; మరొకటి ప్రాణం. రెడ్డిగారి దృష్టిలో కవితకు ప్రాణం రామణీయకం. అందువలననే 'కవిత్వమునకు రామణీయకము ముఖ్యము' అనీ, 'కావ్యమునందు రామణీయకము ముఖ్య'మనీ నిర్దేశించారు. రామణీయకమన్నది యేకవస్తువుకాదు, అది సమష్టి భావము. రోజాపూవు రమ్యముగనున్నదనుటలో దాని యాకారము, రంగు, పరిమళము మున్నగువి చేరియున్నవి' (పుట 45) 'రామణీయకము బాహిరమేకాక ఆంతరిక మనః స్థితికి కూడ సంబంధించినది.... (పుట 45) కవిత్వములోని ఏకవస్తువుకాదు, ఏకగుణముకాదు; వస్తుగుణములు ఉచితమైన రీతిగా సమ్మేళింపబడి కవిప్రతిభచేత సచేతనమయి ఆకృతి బద్ధముయొక్క సమష్టిమోహనత్వమే సౌందర్యము' (పు. 201) అని వివరించారు. సచేతనాలేకాక అచేతనాలు కూడా రసానుభవ యోగ్యాలని రెడ్డిగారు పాశ్చాత్య సౌందర్య దర్శనానుగుణంగా ప్రతిపాదిస్తూ ఇలా అన్నారు-'అచేతన వస్తువులు కూడ రమణీయభావములఁ బ్రేరేపించును. అవి యనుభవింపునపుడు ఆనందము పుట్టును. సుఖానుభవయోగ్యమగు ప్రతిభావమును రసత్వము పొందును'. (పుట. 43)

రామిరెడ్డిగారి 'రామణీయకం' అడ్గార్ అలన్‌పో సౌందర్య భావనంతో సంవదిస్తుంది. పో సౌందర్య భావనను గురించి రెనెవెలెక్ ఇలా వ్యాఖ్యా

నించాడు- 'Most frequently Poe offers us the idea of beauty of 'supernal' beauty, as the aim and centre of art. His concept of beauty is not, as some pronouncements seem to suggest, completely divorced from knowledge; it is Neoplatonic in its reference to harmony, to mathematical proportions, to the ideal and ideality. The concept assumes a romantic cast in the insistence that beauty is vague, suggestive and strange, sad or melancholy, but also 'supernal', 'ethereal' and mystic '[39] 'పో' దర్శనాన్ని రెడ్డిగారు 'రామణీయకంగా' తెలుగు విమర్శలో వ్యవస్థీకరించి కాల్పనికోద్యమ సౌందర్య తత్త్వ మీమాంసకు శ్రీకారంచుట్టారు.

'రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్య'మ్మని ప్రతిపాదించిన జగన్నాథ పండితరాయలవాదంలోని తాత్పర్యాన్ని వివేచిస్తూ, అది పాశ్చాత్య దర్శనాను గుణంగా ఉంటే బాగుండేదని భావించి ఇలా అన్నారు- 'పండిత రాయలు రసమునందు రామణీయకమున్నదని నుడివియున్నాడు-అంతకన్న రామణీయ కమునందు (రమణీయ భావమునందు) రసమున్నదని చెప్పుట సమంజసముగ నుండును. (పు. 44) పాశ్చాత్య ప్రతిభాచక్షువుతో ప్రాచ్య సిద్ధాంతాలు పరి శీలించే చూపిది.[40] 'Beauty is truth, truth Beauty' అని భావించే కీట్స్ భావాల ప్రభావం రెడ్డిగారి మీద ఉంది.

రెడ్డిగారికి ప్రేరణనిచ్చిన 'ఎలెన్ పో'ను 'అమెరికాదేశపు పండిత రాయ'లని వర్ణించిన రసికులు రెడ్డిగారు. మనం రామిరెడ్డి గారిని 'ఆంధ్రా ఎలెన్ పో' అనవచ్చును. వారి అనుశీలనంలో అంగాంగ సంయోగం, అను రూపత్వం, వస్తువునందలి సర్వజనీనభావం, కవి వ్యక్తిత్వం అనే అంశాలు ప్రధానంగా పరామర్శింపబడినాయి. మొత్తానికి- "The great service Poe rendered to literary aesthetics came not so much directly through his dicta and formulations as through his awakening of literary criticism to a search for the forces underlyng artistic expression-[41] అని 'పో'ను గురించి చేసిన ప్రశంస రాళ్లపల్లికీ, దువ్వూరికీ గూడా వర్తిస్తుంది.

## యుగకర్తలు : పోషకులు : ప్రసారకులు

కావ్యానుశీలన యుగ సమీక్ష ననుసరించి తెలుగు సాహిత్య విమర్శ మీద పడిన పాశ్చాత్య ప్రభావాన్ని అనుశీలించడంలో ఈ క్రింది అంశాలను పరిగణనలోనికి తీసికోవటం జరిగింది.

1. తెలుగులో ప్రయోక్తలైన సాహిత్య విమర్శకులపై పాశ్చాత్య విమర్శకుల వ్యక్తిగత ప్రభావంకంటె పాశ్చాత్య విమర్శ యుగప్రభావాలే ప్రధానంగా కనపడుతున్నాయి. కాబట్టి ఆయా యుగధర్మాల నెంతవరకు ఎలా తెలుగులోకి వారు తీసికొని వచ్చారన్నదే ప్రభావ పరిశీలన ప్రధాన ప్రవృత్తిగా పరిగణింపబడుతుంది.

2. యుగకర్త యెప్పుడూ ఒక యుగ చైతన్యానికి ప్రతినిధిగా నిలిచి సృజనాత్మక విమర్శ ప్రవృత్తిని ప్రవర్తింపచేస్తాడు కాబట్టి, తనదైన ఒక సాహిత్య దర్శనాన్ని కానీ, సిద్ధాంతాన్నిగానీ, సమన్వయ విధానాన్నిగానీ, అనుశీలన ప్రక్రియనుగానీ, స్వతంత్రంగా ప్రస్తరించినవాడే యుగకర్త కాగలడు. అతణ్ణే యుగకర్తగా సంభావించటం సమంజసం.

3. ఒక యుగచైతన్యంలోని పాక్షిక సిద్ధాంతాలనుగానీ, ప్రత్యేక వైఖరులనుగానీ, విశిష్టప్రయోగ వీచికలనుగానీ గ్రహించి తెలుగు విమర్శలో వివేచించిన వారిని ఆ యుగ ప్రవృత్తికి పోషకులుగా భావించి, గౌరవించాలి.

4. ఒక యుగచైతన్యానికీ, స్ఫూర్తికీ కట్టుబడకుండా, తెలుగుసాహిత్య విమర్శకు వెలుగురేకల్లా పాశ్చాత్య విమర్శక దృక్పథాలనుగానీ, సిద్ధాంతాలనుగానీ, నిర్వచనాలనుగానీ, పారిభాషిక పదాలనుగానీ, అన్వయ విధానాలనుగానీ యథావకాశంగా సమీక్షలో సంపదించుకొంటూనో, సంపుటీకరించుకొంటూనో రచనలు సాగించేవారినీ, ప్రక్రియాపరంగా పరిశ్రమించేవారినీ పాశ్చాత్య ప్రభావ ప్రసారకుల్లా పరిగణించాలి.

5. ప్రభావ పరిశీలనంలో యుగకర్తలకు అగ్రతాంబూల మివ్వాలి; పరిణామ ప్రవర్తకులకూ, పోషకులకూ సముచిత గౌరవమివ్వాలి. ప్రసారకులను పలుకరించి యోగక్షేమం విచారిస్తే చాలు.

6. పాశ్చాత్య ప్రభావ వివేచనంలో దేశీయ సంప్రదాయ ప్రపంచనం ఉండకూడదని నిషేధించలేము. కాని, దేశీయ వ్యవస్థలలో పాశ్చాత్య ప్రభావంవలన కలిగిన ప్రత్యేక పరిణామాలనుగానీ, వెలసిన అభినవ దర్శనాలనుగానీ, కానవచ్చిన వినూత్న కళాకాంతులనుగానీ ముఖ్యంగా పేర్కొన వలసిఉంటుంది.

7. ఆయా యుగాలలో, ఆయా కాలాలలో, ఆయా విమర్శకులు పాశ్చాత్య ప్రభావంతో ప్రవర్తింపజేస్తున్న ప్రయోగాలను, చారిత్రక స్పృహతో, పూర్వాపరకాల ప్రవృత్తులనూ, సాహిత్యావసరాలనూ, సామాజిక కామనలనూ, సాపేక్ష ప్రమాణాలనూ దృష్టియం దుంచుకొని ప్రక్రియా ప్రవృత్తుల కనుగుణంగా అనుశీలించి, విలువలను నిర్ధరించాలి.

8. పరిణామశీలమైన సాహిత్య జీవితంలో ప్రవర్తిల్లే అభినవధోరణు లెప్పుడూ సమగ్రంగానూ, నిర్దుష్టంగానూ, సార్వకాలికంగానూ, సర్వవ్యాపకంగానూ ఉంటాయని భావించటం పొరపాటు. అయితే, వాటి లక్ష్యాలూ, వాటికి తగినట్లుగా అవి సాగించే ఉద్యమాలూ లక్ష్య లక్షణ సమన్వయంగానూ, ప్రయోజనవంతంగానూ, సాహిత్య ప్రగతి సాధకంగానూ ఉన్నవా అని విచారించటం అవసరం.

9. ప్రభావాల తరతమ భేదాన్ని నిరూపించటానికి ముందు ప్రభావం ఆలోచన మీద పడిందా, అనుభవం మీద పడిందా, ఆకృతి మీద పడిందా అని వివేచించి దర్శనమూలమైంది ఉత్తమమనీ, సిద్ధాంత మూలమైంది మధ్యమమనీ, ప్రక్రియాపరమైంది సామాన్యమనీ పరిగణించాలి.

10. పాశ్చాత్య ప్రభావాన్ని పరిశీలించేటప్పుడు విమర్శకునికి మొదట పాశ్చాత్య సాహిత్య విమర్శ చరిత్ర పరిజ్ఞానమైనా ప్రాథమికంగా ఉండాలి. పాశ్చాత్య సిద్ధాంత వివేకం, ప్రపంచ సాహిత్యాలలో ప్రవర్తిల్లుతున్న సాహిత్య విమర్శోద్యమాల తులనాత్మక వివేచనం ఉంటే మరీ మంచిది. అలా ఉంటే ప్రపంచ సాహిత్య విమర్శలో తెలుగువారి విమర్శ స్థానాన్ని విలువకట్టి నిర్దేశించటానికి వీలౌతుంది కూడా.

ఈ దశసూత్రి ఆదర్శ ప్రమాణాల సంపుటి కాకపోయినా, ఆచరణ యోగ్యమైన ప్రమాణాల పద్ధతులను రూపొందించటానికి అనువైనదనటంలో విప్రతిపత్తి ఉండబోదనుకుంటాను. ఏ పద్ధతులూ లేకపోతే ఎటుపోతున్నామో, ఎందుకు పోతున్నామో, ఏమైపోతున్నామో తెలిసికోవటం దుర్లభం.

పై ప్రమాణాలనుబట్టి కట్టమంచి రామలింగారెడ్డి గారు తెలుగులో కావ్యానుశీలన యుగకర్త అనీ, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, దువ్వూరి రామిరెడ్డి మొదలైనవారు పరిణామ ప్రవర్తకులూ, పోషకులూ అనీ, పానుగంటి లక్ష్మీనరసింహారావు మొదలైనవారు ప్రక్రియా ప్రసారకులనీ నిర్ణయించవచ్చును.

ఇక్కడ మరొక విషయం గమనించాలి. పై విమర్శకులందరూ తమ వివేచనను పాశ్చాత్య ప్రపంచం నుంచి ప్రభావితులై తెలుగునేలకు తెచ్చినవారైనా, వారనుశీలించింది ఆంధ్ర సాహిత్యజగత్తునే. అయినా, వీరందరూ కలిసిగానీ, వ్యక్తిగతంగా కానీ ఆంధ్ర సాహిత్యాన్నంతా తమదైన దృక్పథంతో సమీక్షించి వినూత్న సమన్వయాలను వెలయించారని చెప్పలేము. వారి వారి సిద్ధాంతాలు సమన్వయించే సాహిత్య క్షేత్రాలను, సాహిత్యాంశాలను ఎన్నుకొని తమ అనుశీలనాన్ని అనువుగా సాగించారు. ప్రస్తావవశంగా సాహిత్య వివేచనకు పనికివచ్చే సమన్వయ సూత్రాలను ప్రపంచించారు. స్పాట్‌లైట్సుగా ఉండే వారి సాహిత్యవిమర్శ ఫలితాంశాలు సాధకులకు విస్తరించి వ్యాపింపజేసికోవటానికి తోడుపడే సాంకేతిక సాధనాలు మాత్రమే.

## శిల్పానుశీలనయుగం : విశ్వనాథ

తెలుగు సాహిత్య చరిత్రలో కావ్యానుశీలనయుగం తరువాత ప్రవర్తిల్లిన కావ్యశిల్పానుశీలన యుగానికి యుగకర్త, ప్రవక్త, ప్రయోక్త శ్రీ విశ్వనాథ సత్యనారాయణ (1895-1976). ఇంగ్లీషులో 1800 నుండి 1825 వరకూ ప్రబలంగా ప్రచారంలో ఉన్న కాల్పనిక విమర్శకు ప్రతినిధిగా తెలుగులో కట్టమంచి నిలిస్తే, విశ్వనాథ ఇంగ్లీషులో దాదాపు 1850 నుండి 1950 వరకూ-అంటే ఒక శతాబ్ది కాలంలో-ప్రవర్తిల్లిన సాహిత్యవిమర్శ

యుగచైతన్యాలకు తెలుగులో ప్రయోక్తగా ప్రసిద్ధికెక్కాడు. విశ్వనాథ 'కవి సమ్రాట్టు' 'విమర్శక చక్రవర్తి', ఉభయకళాప్రవీణుడు, ఉభయరంగాల్లో ఉజ్జ్వలతార. కవిత చెప్పేటప్పుడు 'నన్నయ తిక్కనలు నన్నావేశించా'రని వాచ్యం చేశాడు కాని, విమర్శ చేసేటప్పుడు 'ఆర్నాల్డ్', 'ఇలియట్' నన్నావేశించా'రని వాచ్యం చేయలేదు. అంతే తేడా. పాశ్చాత్య ప్రభావాన్ని ఆలోచనకే పరిమితం చేయకుండా అనుభవరంగానికి తీసికొనివెళ్లి దేశీయం చేసి దివ్యంగా అభివ్యక్తీకరించే ప్రస్థానానికి ప్రాచార్యు డనిపించుకొన్నాడు.

ఈ మాట వింటే తెలుగుదేశంలో కొందరికి మొదట ఆశ్చర్యం వేయవచ్చు. ఈ గ్రంథంలోని-'ఉద్యమాలూ-ఉపశ్రుతులు' అన్న అధ్యాయంలో విక్టోరియన్ విమర్శ యుగంలోనూ ఆధునికయుగంలోనూ ప్రసిద్ధ విమర్శకులుగా వివేచింపబడిన మాథ్యూ ఆర్నాల్డ్, వాల్టర్ పేటర్, టి.యస్.ఇలియట్, ఐ. ఎ. రిచర్డ్సు మొదలైనవారి సాహిత్యవ్యక్తిత్వ సాహిత్యోద్యమ స్ఫూర్తులను ఒక్కసారి సమీక్షించి చూస్తే - వారందరిలో ఉన్నచైతన్యం విశ్వనాథలో సమాహారంగా విశిష్టంగా మూర్తీభవించి తెలుగుదనాన్ని వెలార్చిందా! అని సహృదయులకు స్ఫురింపకపోదు. కవిగా విశ్వనాథ చేసిన ప్రయోగాల వైలక్షణ్యాన్నీ, పరిణామ ప్రయోజనాలనూ గురించి తెలుగువారు తెలిసికొనటానికి కృషి చేసినంతగా,విమర్శకునిగా ఆయన వ్యక్తిత్వాన్ని వివేచించటానికి విశేషంగా ప్రయత్నించినట్లు కనపడదు. భారతీయ సంప్రదాయ దృష్టితో ఆయన విమర్శకు విలువ కట్టటం మనకు కొంత తెలుసు. అస లాయనకున్న సంప్రదాయ బలమంతా పాశ్చాత్య విమర్శన రీతుల అవగాహనం మీద ఆధారపడి ఉందంటే అత్యుక్తి కాదు; అతిశయోక్తి కాదు. ఆయన విమర్శ ప్రవృత్తికి పాశ్చాత్య ప్రభావమే మూలబలం, ప్రాచ్య సాహిత్య తత్త్వ దర్శనం ప్రాణం.

విశ్వనాథ విమర్శక వ్యక్తిత్వ విశ్వరూపాన్ని దర్శించటానికి మనం కూడా మూడడుగులువేసి ముందుకు నడవాలి; మూడంచెలలో దాన్ని మూర్తి కట్టించుకోవాలి. ఆయన సమకాలీన సాహిత్య ప్రయోగాలనుగురించి చేసిన సమీక్ష మొదటి అంచె. కాల్పనికోద్యమ విమర్శలో కనపడే విశృంఖలత్వాన్నీ పాశ్చాత్యైక దృక్పథంలో ఉండే అస్వాతంత్ర్యాన్నీ, విజాతీయతనూ పరిహ

రించి, అభిరుచి విమర్శ పద్ధతిని అవరోధించి, దేశీయతతో నిండిన విదేశీయ సాహిత్యవిమర్శ వివేకాన్ని తెలుగులో వెలుగునింపేటట్లు చేసే ప్రయత్నం రెండో అంచె; ఒక శతాబ్ది పాశ్చాత్యవిమర్శ ప్రస్థానాన్నీ, పాశ్చాత్యప్రభావ స్వభావాన్నీ సామాన్యులు తెలిసికోవటానికి వీలులేకుండా దేశీయస్వభావంతో సంపదించుకొని,'లోనారసి'చూస్తే తప్ప లోతులు తెలియనట్లు తనలో ప్రతిబింబించుకొని, ప్రదీప్తుడై ప్రౌఢంగా తన విమర్శ విధానంలో వెలార్చిన ప్రయోగ విమర్శ విధానం ఆయన మూడవ అంచె. వాటిని రేఖామాత్రంగా చిత్రించటమే ప్రస్తుత ప్రయత్నం. విస్తారంగా వ్రాస్తే అదొక గ్రంథ మౌతుంది.

ముందుగా ఒక చారిత్రకాంశం మనం గమనించటం అవసరం. కాల్పనిక విమర్శకు మూలకందమైన వర్డ్స్‌వర్త్ Preface to Lyrical Ballads మొదటి ముద్రణ దాదాపు 1798లో వచ్చింది. అది తరువాత 1815 దాకా మార్పుచేర్పులతో వివిధ ముద్రణలకు మొదటి మాటగా సాగింది. కట్టమంచి వారు కళాపూర్ణోదయానికి వ్రాసిన పీఠికకు తొలిరూపమైన పింగళిసూరన మీది వ్యాసం మొదట 1899లో ఒక సభలో చదువబడింది. ఆ తరువాత అదీ మార్పులు చెందుతూ 'కవిత్వ తత్త్వవిచారంగా' (1914లో) పరిణతిగాంచింది. అంటే తెలుగువిమర్శ మీద పాశ్చాత్య కాల్పనికోద్యమ ప్రభావం ఒక శతాబ్ది తరువాత పడిందన్నమాట ! ఆ నూరేళ్ళలో ఆంగ్లసాహిత్యం ఎంతో ప్రగతిని సాధించింది. అసలు కాల్పనికోద్యమమే వెనుకంజవేసింది. అయినా, మన కది క్రొత్త కాబట్టి, క్రొత్త ఒక వింతగా గ్రహించాం. పాశ్చాత్య సాహిత్యంవెంట, నూరేళ్ళ వెనుకగా, ముందుకు సాగటం ప్రారంభించాం. మరొకవిషయం. కాల్పనికోద్యమ కవిత తెలుగుకవుల అనుభూతిమీద ప్రభావం వేసింది; కాల్పనికోద్యమ విమర్శ తెలుగు విమర్శకుల ఆలోచన మీద ప్రభావం వేసింది. ఆలోచనను పంచిపెట్టాడు కట్టమంచి; ఆయుగం లోని అనుభూతి నందుకొని కవిగా స్పందించి కవితలు వెలయించాడు విశ్వనాథ. అయితే, విశ్వనాథ ఎంత అనుభవిస్తాడో అంత ఆలోచిస్తాడు. అంతేకాదు, ఆలోచిస్తూ అనుభవిస్తాడు. అచ్చమైన అనుభూతిని అనుభవిస్తున్నట్లు అభివ్యక్తీకరించటం కాల్పనికోద్యమ కళాస్వభావం. వ్యక్తినిష్ఠమైన అనుభవాన్ని విశ్వజనీనంగా వెలుపరించటం తరువాతి యుగాల స్వభావం ప్రతియుగ స్వభావంలోనూ పరస్పర విరుద్ధలక్షణాలు ముడిపడి

ఉంటాయి. ఆత్మీయమైన అనుభవం ఎంతకళామయమైనా జీవితానుభవాన్ని సంపదించుకోవాలి. కాల్పనికోద్యమం కళానుభూతికి పట్టంకట్టి కళ్ళకు కనపడే వాస్తవాన్ని విస్మరించింది. అదే అందులో ఉన్న సహజ విరుద్ధధర్మం. వాస్తవం కళమీద తిరుగుబాటుచేసి జీవితానికి సన్నిహితంగా కళను లాగింది. జీవితం వాస్తవాన్ని దర్శిస్తుంది; తత్త్వాన్ని ఆరాధిస్తుంది. కళాభావనలో జీవితసత్యం తత్త్వసుందరంగా, జీవితవిమర్శరూపంగా దర్శనమిస్తుంది. ఈ దర్శనాన్ని పాశ్చాత్యలోకం 19వ శతాబ్ది నడిమి భాగంలో చేసి కళావిమర్శ రంగాలలో ప్రయోగించింది. విశ్వనాథ ఈ దర్శనాన్ని త్వరలోనే స్వాయత్తం చేసికొన్నాడు. కాల్పనికయుగం తెలుగులో కాలూనిన మొదటి రోజులలో ఆ ప్రక్రియా స్వరూప స్వభావాలను తెలుసువారికి వివేచించి చెప్పిన కొద్దిమంది విమర్శకులలో విశ్వనాథ ఒకడు. డా॥ సి. నారాయణరెడ్డిగా రన్నట్లు-"భావ కవిత్వమును నిర్వచించినవారిలో పంచాగ్నులవారు, విశ్వనాథవారు గణ నీయులు. "కవియొక్క ఒక అవిస్పష్టవాంఛాంకురము, ఒక అంతర్నిగూఢ తాపము, ఒక చిన్న కావ్యములో ఊచబడిన"చో అది భావకవిత్వమని విశ్వనాథవా రన్నారు. ('లిరికల్ పొయెట్రీ' అని ఇంగ్లీషు పదాన్ని యథా తథంగా వ్యాసశీర్షికగా గ్రహించి తెలుగులో విశ్వనాథ వారు దాని స్వరూప స్వభావాలను వివరించారు. చూడు: భారతి; అక్టోబరు : 1939) ఇది ఇంగ్లీషు విమర్శకులు Lyrical Poetry కి చేసిన నిర్వచనముతో తులతూగుచున్నది. "The Lyric has the function of revealing, in terms of pure art, the secrets of the inner life, its hopes, its fantastic joys, its sorrows, its delirium".[42] కవి తన మనస్సులోని సుఖదుఃఖములను, విభిన్నకాంక్షలను, 'లిరిక్కు' ద్వారా వ్యక్తము చేయు నని ఈ నిర్వచనము వలన స్పష్టమైనది. దీనినే విశ్వనాథవారు కొంచెము మార్పుతో స్వీక రించిరి."[43] అంటే విశ్వనాథ ప్రయోగాన్ని చేపట్టినాటికే ఆప్రయోగాన్ని గురించిన స్పష్టమైన అవగాహనను పాశ్చాత్య సాహిత్యాన్ని చదివి యేర్పరచుకొన్నాడన్నమాట! అవగాహనతో భావకవిత్వాన్ని విమర్శించిన విమర్శకులు కొద్దిమంది మాత్రమే. అంటే, సామాన్య విమర్శకలోకం ప్రక్రియలను విలువకట్టటానికి తగినంత వివేకాన్ని సంపాదించటానికి తెలుగులో కొన్నేళ్లు పట్టిందన్నమాట. ప్రక్రియవెంట పరుగెత్తే శక్తియే లేనప్పుడు విమర్శకులు భవిష్యత్తు నేం చూపిస్తారు? విశ్వనాథ, వివేకంలో

వెనుకబడ్డవాడు కాదు. వర్తమానాన్ని తెలిసి అనుశీలించాడు. అంతటితో ఆగక పాశ్చాత్యలోకం ఒక శతాబ్ది సాగించిన ప్రగతిపథాన్ని సమీక్షచేసి సాహిత్యదృక్పథాల నేర్పరుచుకొన్నాడు. ఒక శతాబ్ది ముందుచూపు పాశ్చాత్య ప్రభావంవలన విశ్వనాథకు వచ్చింది. ఉప్పు డాయనకు తెలిపింది- కాల్పని కోద్యమం తెలుగు సాహిత్యాన్ని— కనీసం ఆంగ్లసాహిత్యంతో పోల్చిచూచు కొంటే- ఉండవలసిన వర్తమానస్థితికంటె - ఒకశతాబ్దం వెనుకకు తీసికొని పోతున్నదని. అందుకే ఆయుగప్రభావంనుంచి ప్రక్కకు జరిగి- అంతే ముందుకు సాగిపోయి- తరువాతి పాశ్చాత్యప్రగతిని తన ప్రతిభాదర్శనంలో ప్రసన్నం చేసికొన్నాడు.

"ఆ రోజులలో కట్టమంచి రామలింగారెడ్డిగారు తమ కవిత్వ తత్త్వ విచారము వ్రాసి, విమర్శపథాలలో గొప్ప దృక్పథము కలిగించి, నవ్య సాహిత్యానికి క్రొత్తబోదెలు తవ్వా"[44] రని కట్టమంచివారి నవ్యయుగ కర్తృత్వాన్ని ప్రశంసించారు విశ్వనాథవారు. అయినా యింకా తెలుగులో ఎంతో విమర్శ రావాలని ఆయన ఆకాంక్షించారు. "తెలుగులో విమర్శనా సాహిత్యం తక్కువగా వుంటున్నది. తెలుగులో విశేషకృషి ఈ రంగంలో కూడా జరిగవలసి వున్నదన్నారు."[45]

ఇంగ్లండులో కాల్పనికయుగాంతకాలంలో ఉన్న సాంఘిక సాహిత్య సాంస్కృతిక పరిస్థితులను చూచి ఆర్నాల్డ్ ఆవేదన పడ్డాడు. సాహిత్యంతో సమాజాన్ని ఉద్ధరిద్దామని కంకణం కట్టుకొని కృషిసాగించాడు. "In his theoretical writings Matthew Arnold was concerned with social, educational, religious, cultural as well as literary improvements. He saw the degradation into which the society had fallen in his age and it grieved him deeply. In the Victorian age there was rapid development of industry and in material wealth, and it led to the neglect of religion and culture. Arnold wanted to lift men from this degenerated condition; therefore he propagated forcibly the importance of culture and religious values"-[46] అన్న విమర్శకుల అభిప్రాయాన్ని గమనిస్తే ఆర్నాల్ఉద్యమచైతన్యం విశ్వనాథ నెంతగా ఆవేశించిందో తెలిసి పోతుంది.

"Arnold repeats over and over again that literature educates, that it forms man, makes him see things, makes him know himself, gives him serenity"[47]- అన్న రెనెవెలెక్ మాటలు ఆర్నాల్డ్‌కు ఎంత వర్తిస్తాయో విశ్వనాథకూ అంతే వర్తిస్తాయి. అంతేకాదు ఆర్నాల్డ్ సాహిత్య దృక్పథంలో కనపడే అనేకవిశేషాలు విశ్వనాథలో గోచరించటం విశేషం. మచ్చుకు కొన్ని[48]–

1. "The future of Poetry is immense, because in Poetry, where it is worthy of its high destinies, our race, as time goes on, will find an ever surer and surer stay." (పుట 500)

2. "I think it will be found that the grand style arises the poetry, when a noble, poetically gifted, treats with simplicity or severity a serious subject". (పు. 499)

3. "He insisted on the union of the best subjects and the highest expression in poetry. Only poetry of this sort can achieve its ultimate end".(పు. 503)

4. "The ground work of literary genius is a work of synthesis and exposition, not of analysis and discovery; its gift lies in the faculty of being happily inspired by a certain intellectual and spiritual atmosphere, by a certain order of ideas, when it finds itself in them: of dealing divinely with these ideas, presenting them in the most effective, attractive combinations.- making beautiful work with them, in short." (పు. 504)

5. "If the chief merit of critic is to promote in others the intelligent appreciation, the conscious enjoyment of literature then, in the words of prof. Saintsbury, "Few critics can meet this question more triumphantly than Mr. Arnold." (P.508)

6. "According to him criticism was creative as poetry, and in good criticism there should be a synthesis of imagination and reason". (పు. 509)

7. "Arnold's religion was poetry. He thought that religion and morality were as broad as life, and since poetry can never be divorced from life, religion, morality and poetry, to him, became one." (పు. 511)

**Walter Pater** లో విశ్లేషణకు సన్నిహితంగా ఉన్న అంశాలు:

1. "Mind in the style, soul in the style" సిద్ధాంతం (P. 517)

2. "The beauty of which he takes account is essentially of a religious kind; it draws the mind to the further issue, the inner spirit. All the charm of ritual and ceremonial in worships has for Pater an indefinable and constant attraction. He is for ever recurring to it, because it seems to him to interpret and express an emotion, a need of the human spirit, whose concern is to comprehend if it can what is shadowy figure, the mysterious will, that moves behind the world of right and sense". (P. 523)

టి. యస్. ఇలియట్ భావాలు :

1. "Criticism must always profess an end in view, which, roughly speaking, appears to be the elucidation of works of art and the correction of taste." (P. 537)

2. "There are two different directions of literary criticism in the twentieth century - a re-assessment of the achievements of the past writers, and creation of new literary ideas. Eliot also believes that the importance of revaluation of past writers is great, because of the fact each generation has its own values of art and judges the writers in a different way". (P. 536)

3. "Comparison and analysis are the chief tools of the ritic" (P.538).

4. "Eliot's idea of 'conformity to tradition'. (మా.పు.540)

5. "In Eliot's theory of Poetry a union of thought and eling is very essential. The poet should have a unified ensibility and should transform his thoughts into feelings." P.535)

6. 'Objective Correlative'—influence of French symbolis. (P.534)

7. 'Poetry is not a turning loose of emotions, but an cape from emotion; it is not the expression of personality, it an escape from personality". (P.532)

. ఎ. రిచర్డ్స్ అభిప్రాయాలు :

1. 'Value, according to Richards, lies in the 'minute rticulars' of response and attitude not in the general rules conduct and such abstract terms like virtues and vices" .559)

2. Account of value and account of communication. 562)

3. Four functions of language - sense, feeling, tone, d intention. (P.566)

4. Unhistorical method of criticism. (P.570)

5. "The influence of Richards has been strong in two as in particular; that of education in proper thinking and mprehension of written material by improving our skills th words and that of the appreciation of poetry." (P.571)

6. "Criticism as I understood it, is the endeavour to criminate between experiences and to evaluate them. We

cannot do this without some understanding of the nature of experience, or without theories of valuation and communication." (P. 574)

ఇలా ఎన్నైనా పేర్కొంటూ పోవచ్చును. ఒక యుగం తరువాత మరొకయుగం సృష్టింపబోయే విమర్శకుడు పూర్వయుగంకంటే వైలక్షణ్యాన్ని సాధింపవలసి ఉంటుంది. కట్టమంచి పాశ్చాత్య విమర్శ వివేకాన్ని తెలుగులో క్రొత్తగా దింపాడు. అందులోని పారిభాషికపదాలు తెలుగులోనే చెప్పబడినా భారతీయాలంకారికధారకుగానీ, తెలుగులోని దేశీయ సాహిత్య ప్రక్రియా పరిజ్ఞానానికి గానీ అవి క్రొత్తవి అయినాయి. అయితే, అనుశీలన విధానం, వివేచన వైఖరీ మాత్రం తెలుగువారికి బాగా తేటపడింది. సిద్ధాంతం సమన్వయిబలంతో తెలుగువారి నాకర్షించింది. కాల్పనికయుగంలో కవులకూ, విమర్శకులకూ స్వాతంత్ర్యం ప్రధానలక్షణం. ప్రాచీన పద్ధతులను పరిత్యజించటంతోపాటు దేశీయమైన విమర్శవిధానాన్ని సృష్టించుకోవటం వారి ధ్యేయం. అన్యసాహిత్య సిద్ధాంతాలప్రభావంనుంచి దూరంగా ఉండి తమ సాహిత్యాని కనువైన సిద్ధాంతాలను కల్పించుకోవటమే వారు సాధించిన స్వాతంత్ర్యం. కోల్‌రిడ్జి మొదలైనవారు ఫ్రెంచి విమర్శకుల అభిప్రాయాలను గణించినా, వాటిని తమ దేశీయభావనకు ఆలంబనంగా మాత్రమే గ్రహించారు. మరి, ఈ దృష్టితో చూస్తే కట్టమంచి తెలుగులో ఆంగ్ల విమర్శ విధానాన్ని చొప్పించటం స్వాతంత్ర్యం అవుతుందా? దేశీయం అవుతుందా? అన్న ప్రశ్నను గూర్చి విశ్వనాథ వివేచించాడు. విశ్వనాథ దేశీయతను కోరాడు. కానీ, సంస్కృత లాక్షణిక సూత్రాలను నిర్ద్వంద్వంగా తెలుగుకు అన్వయించాలన్న కఠినత్వం ప్రకటించలేదు. ప్రక్రియా విభేదరహితంగా అనుశీలన విధానాలను విశ్వజనీనంగా వర్తింపచేసే కట్టమంచివారి పాశ్చాత్యపద్ధతికి విరుద్ధమైన ప్రవృత్తిని, కాల్పనికయుగంలో ఒక లోపంగా ఆంగ్లంలోనే భావింపబడినదాన్ని, నిరసించాడు. దానితో, దృక్పథం సిద్ధాంతానికి సంబంధించినంతవరకు తెలుగుదనం, అనుశీలన ప్రవృత్తికి సంబంధించినంతవరకు పాశ్చాత్యప్రభావం తెలుగువిమర్శమీద ఉండటం సముచితమని విశ్వనాథ భావించాడు. ప్రక్రియ పాశ్చాత్యమైతే తెలుగులో అది సంతరించుకొంటున్న దేశీయతనుగూడా

గుర్తించి అనుశీలించాలని భావించాడు. విశ్వనాథ తెచ్చిన మార్పు తెలుగు విమర్శకు తెలుగుదనంతో ఆలోచించే నేర్పును ప్రసాదించింది. అయితే, తన విమర్శక్షేత్రంలో దేశీయోద్యమాన్ని నడపటానికి విశ్వనాథకు స్ఫూర్తిని. బాటనూ చూపింది పాశ్చాత్యప్రభావమే. 19వ శతాబ్ది నడిమికాలంనుండి ఇంగ్లీషు సాహిత్య విమర్శలో ఒక శతాబ్దంపాటు వచ్చిన పరిణామాలలోని మేలిమినంతా గ్రహించి ఆంధ్ర సాహిత్య విమర్శ దేశీయంగా ఏకాసం చెందటాని కనువుగా పిద్దితీర్చాడు.

"కాల్పనికోద్యమ (Romantic Movement) ప్రభావంతో ప్రారంభమైన విశ్వనాథ సత్యనారాయణ సాహితీకృషి అనతికాలంలోనే ఆ ప్రభావాన్ని అధిగమించి ఆయన యేర్పరుచుకొన్న విశిష్ట దృక్పథాన్ని ప్రతిబింబిస్తూ పరిణతి చెందింది. ఆయన ప్రతిభ భావనాత్మకమే కాదు. ఆలోచనాత్మకం కూడా. ఆపైన ఆధిభౌతిక దర్శన శక్తి (Capacity for spiritual insight) ఒకటి ఆయన భావనకు, సామాన్యంగా కాల్పనికయుగ రచయితలకు లేని, తత్త్వపరిపూర్ణతను ఇచ్చింది. కాని, ఆయనలో భావన, ఆలోచన, దర్శనము (insight) అన్నీ హైందవ సంప్రదాయ నిబద్ధమైనవి. అవి పరిధి దాటి వెళ్ళకూడదనే ఆయన దృఢసంకల్పము. అదే సత్యనారాయణగారి దృక్పథంలో బలానికీ, బలహీనతకూ కూడా హేతువయినట్లు తోస్తుంది"[49]- అన్న శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం గారి సమీక్ష ఈ సందర్భంలో స్మరింప దగింది.

విశ్వనాథలో మరొకవిశేష మేమంటే ఆయన సాహిత్య విమర్శను, కావ్యాలలోనూ, నవలలలోనూ, నాటకాలలోనూ- చేపట్టిన ప్రతిసృజనాత్మక ప్రక్రియలోనూ అంతో యింతో సాగించాడు. ఆర్నాల్డ్‌లాగా మత,సాంఘిక, సాంస్కృతిక. నైతిక, ధార్మిక, సాహిత్య విషయాల మీద తన ఉద్యమ ప్రభావం వేయగలిగినవి ముఖ్యంగా సృజనాత్మక ప్రక్రియలని గుర్తింపగలిగాడు. మతమే కవిత అని ఆర్నాల్డ్ అంటే, నా ఉద్యమమే నా కవిత అని విశ్వనాథ అంటాడు. అయితే, విశ్వనాథ రచనలలో కనపడే విమర్శ ఒకరకం, విమర్శలో వెలువడే విమర్శ మరొకరకం. కవిత్వంలో ధిషణాహంకారంలా కనపడే అభిమానం కళామయంగా విమర్శను వెలారుస్తుంది.

నవలలలో- పాత్రలలో జోరబడ్డ ప్రవక్తగా, ప్రతీకాత్మకంగా భాసించే ప్రచ్ఛన్న శక్తిగా విశ్వనాథ, విమర్శనే కాదు ప్రబోధాన్ని కూడా సాగిస్తాడు. విమర్శలో ఆయన తన వ్యక్తిత్వాన్ని కవివ్యక్తిత్వంలో లీనంచేసి నిరహంకారంగా కవి కావ్య జీవిత పరమార్థాలను జీవిత విమర్శగా సాగిస్తాడు. కవిత్వం జీవిత విమర్శ అన్న ఆర్నాల్డ్ దృక్పథాన్ని కవితలో తాత్త్వికంగానూ, నవలలలో కళామయంగానూ, విమర్శలో వివేచనాత్మకంగానూ విశ్వనాథ విశిష్టంగా జాలువారింప చేశాడు. రిచర్డ్స్ సాగించిన ప్రయోగ విమర్శ (Practical Criticism) విధానం తరువాతి 20వ శతాబ్ది విమర్శకుల కెలా మార్గదర్శక మైనదో విశ్వనాథ- తెలుగుకవులు తమవిగా చెప్పకొన్న కావ్యగుణాలను విశ్లేషించి, వివేచించి, అన్వయించి, అనుశీలించే విధానం భావివిమర్శకూ, పరిశోధనకూ పరిశీలనపథాలను నిర్దేశించింది. ఇలియట్ చెప్పిన ఆదర్శ విమర్శక లక్షణం విశ్వనాథలో మూర్తి తాల్చింది. స్వీయప్రత్యయాన్ని త్యాగం చేసికొనే సంయమనం (The Process or Depersonalisation) విమర్శకుడైన విశ్వనాథలో మనం స్పష్టంగా చూస్తాం। అందుకే ఆయనకు విమర్శ ఒక దర్శనంలా తోచింది.

"నేను ఏమి వ్రాస్తానో నేను తెలుసుకొని వ్రాస్తాను కనక, నేను వ్రాసిన దానిని, అనంత విషయములు నేను చొప్పించి వ్రాస్తాను కనక, అనాదినుంచీ ఈ దేశంలో ఒకటి జ్ఞానం అనిపించుకుంటూ వస్తున్నది, ఆ జ్ఞానం నాపాఠకులకు కల్పించి నేను సఫలుణ్ణయి, వాళ్ళను జ్ఞానవంతులను చేస్తున్నాను అనేభావం నాకు ఉన్నది కనక, ఈ భావం ఉన్నవాళ్లు చాలామంది ఉన్నారని నాకు తెలుసు కనక, పూర్వసాహిత్యం ఒకటి ఉన్నది, అది నేను పోతే నాతో పోయేవాళ్లు నన్నయ, తిక్కన, ఎఱ్ఱన, నాచన సోమనాథుడు, శ్రీనాథుడు, పోతన్న, పెద్దన్న, తెనాలి రామకృష్ణుడు మొదలైనవారు.- ఊరకే ఒట్టి పూర్వకవులని కాదు- పద్యరచనా సామ్రాజ్య పట్టభద్రులు, కథాకథన శిల్ప సూత్రాచార్యులు, వేదవేదాంగాది మహాగ్రంథస్థలు, మహావిషయ నిర్ణేతలు, బహువిషయ వ్యాఖ్యాతలు, కావ్య కథాశిల్ప రహస్య వేత్తలు,- అనే దృష్టితో ఆ పూర్వకవులను నిలబెట్టుకొంటే అప్పుడు నేనూ నిలుస్తాను. నేను చేసిన పని అటువంటిది. రోజులు మారిపోయి తెలియటం లేదు"[50]- అన్న విశ్వనాథవాక్యాలను అనుశీలిస్తే వాటిలో ఆర్నాల్డ్వేదన వినపడటంలేదూ?

ఇలియట్‌లోని 'The idea of conformity to tradition' కనపడటం లేదూ? తన జాతికి తన సంస్కృతికి సంబంధించిన సందేశాన్ని వినిపించాలనే విక్టోరియన్ యుగంలోని పాశ్చాత్య విమర్శకుల ఉద్యమం విశ్వనాథలో స్ఫురించటంలేదూ?

'నిజానికి శిల్పము కాని, సాహిత్యము కాని, జాతీయమై యుండవలెను. విజాతీయమై యుండరాదు వ్రాసిన వానికి ముక్తి, చదివిన వానికి రక్తి, ముక్తి. ఎంత సముద్రము మీద ఎగిరెనను, పక్షి రాత్రి గూటికి చేరును. ఇది జాతీయత, ఇది సంప్రదాయము'[51]- అన్నప్పుడు విశ్వనాథ కాల్పనికోద్యమ ప్రవృత్తిని ఎంత నిశితంగా, నిపుణంగా విమర్శించాడు! సముద్రం మీద ఎగరటం పాశ్చాత్య సాహిత్య సమాలోచనం, గూటికి చేరటం తత్సమాలోచన సంస్కారసంపాదిత సాహిత్య కళాప్రవృత్తిని తన తెలుగు సాహిత్యానికి సజాతీయంగా సంపదించటం. నీ యింట నీవు నిలవాలన్న నిష్ఠతో నిఖిలజగాన్నీ నీవు పరిష్వంగించటం। విశ్వనాథ దృష్టిలో సంప్రదాయం కదుడు గట్టిన ఛాందసం కాదు; క్రొత్త గూటిలో దూరి సొంత కొంపకు అగ్గి పెట్టుకోటం కూడా కాదు. వరదలా వచ్చిపడే పాశ్చాత్య ప్రభావ ప్రవాహంలో పడి కొట్టుకొని పోవటమూ కాదు; ప్రభావానికి నికషోపలంగా నిలిచి పరిశీలించి పరిగ్రహించటం. సాహిత్యాన్ని సాహిత్యప్రమాణాలతో నిగ్గు తేల్చటం విశ్వనాథ దృష్టిలో శిల్పం; సాహిత్యేతర ప్రమాణాలతో సాహిత్యానుశీలనం చేయటం ఆయన దృష్టిలో సాహిత్య సంప్రదాయం కాదు ఆయనను ప్రభావితం చేసిన పాశ్చాత్య విమర్శయుగ స్వభావం కూడా సంప్రదాయాన్ని అలాగే భావించింది. దానికి ఆయన ప్రతినిధి.

"In my opinion whatever Telugu literature has its roots in the ancient classical tradition and indestructable values is bound to acquire an enduring quality whatever forms it may assume. It cannot be surpassed by any literary activity however intense or sophisticated, based merely on trends and techniques"[52]- అన్న విశ్వనాథవారి వాక్యాలు వారి దృక్పథాన్ని స్పష్టం చేస్తున్నాయి.

ఆయన చేసినసంప్రదాయభావనం ఆధునికతను అలక్ష్యం చేసిందికాదు; ఆర్నాల్డ్ ఇలియట్‌ల లాగా ఆధునికతతో పాటు ఆధ్యాత్మికతను కూడా అందు కొన్నది. విశ్వనాథవారే తమ దృక్పథాన్ని ఇలా వ్యాఖ్యానించి చెప్పుకొన్నారు– "If people say that I have no sympathy for modernism I can only pity them. I am not an enemy of science and technology the train, the phone, the plane, the TV, the spacecraft, these are all irreplaceable. If you go through my writings carefully and dispassionately you are sure to attribute to me unqualified admiration for the sort of the government that Russians have in their country. My ideal briefly stated is socialism plus God plus Religion. I may be a defender of best causes. But I think it is better to cling firmly to something that is within your reach than chase desperately that shall never be ours"[53]- అని అంటున్నప్పుడు పాశ్చాత్య యుగవిమర్శకులు వామపక్షీయులకంటె విలక్షణంగా సాగించిన సంప్రదాయ ధార తెలుగులో మనకు వెలుగునీయటం లేదా? "My books, if read with no prejudice and a deep insight into things reveal the modernism, the high scientific modernism"[54]- అన్నమాటలు ఆయనను అర్థం చేసికోవటానికి తోడ్పడే అక్షరగవాక్షాలు.

విశ్వనాథ ఆధునికమైన మార్క్సిజంను కూడా బాగా చదివినవాడు. అది భారతదేశంలో ఏ పద్ధతిలో ఉంటే దేశప్రవృత్తిని ఆకట్టుకొంటుందో నిశ్చితమైన అభిప్రాయం ఉన్నవాడు. "నేడు రష్యాలో ఏశాంతి యున్నదో ఆ శాంతిని మన దేశములోను వాంఛించెడి వారిలో నేను ప్రధానుడను పదునెనిమిది యేండ్లనుండి నేను అంతరాంతరములలో అటువంటి కమ్యూనిస్టును- నాకు కమ్యూనిస్టులలో చాల మంది స్నేహితులు కలరు. ఈ పదునెనిమిది సంవత్సరములనుండి నాకమ్యూనిస్టు మిత్రులతో నేనిదియే చెప్పుచుందును.- ఈనాటి ప్రపంచములోనున్న దేశములలో ఏ రాజ్యాంగమును నిజమునకు ప్రజాసౌఖ్యము సమకూర్చుట లేదు. ఆ రాజ్యాంగ విధానము చేతనే ప్రజా సౌఖ్యము సమకూడునట్లున్నది. కాని. నాకు ప్రజాసంహారము గిట్టదు.

మనదేశము ఆధ్యాత్మిక దేశము. దైవమును విశ్వసించెడి దేశము. మన దేశము నిజముగా మానవజాతికి సుఖము సమకూర్చదలచినచో ఆధ్యాత్మిక ప్రవృత్తియు, స్త్రీ పురుష మధ్యగత నీతియు, దైవభక్తియు గలిగిన ఆ కమ్యూనిజము రావలయును ఇది నా కోరిక! మన దేశములోని కమ్యూనిస్టులకు ఈ భావము లేదు. వారిలో చాలమంది నాస్తికులుగా కనిపింతురు. ఈరెండు ఒకచోట ఇముడవనుటకు వీలులేదు. ఇమిడి తీరును భారతదేశము సర్వ ప్రపంచమునకు చేసెడు మహోపకార మేమనగా అట్టి కమ్యూనిజమును భారతదేశములో స్థాపింపవలయును "[55] జాతీయత, దేశీయత అంటే తెలిసిన రచయిత అన్నమాట లివి. రాజకీయాన్ని తన దేశాని కనుగుణంగా ఎలా భావిస్తాడో, పాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాలనూ, దృక్పథాలనూ అలాగే భావిస్తాడు.

విశ్వనాథ విమర్శక వ్యక్తిత్వాన్ని గురించి 'బ్రాహ్మీమయమూర్తి'లో 'విమర్శక చక్రవర్తి' అనే వ్యాసాన్ని శ్రీ తాటికొండ వేంకటకృష్ణయ్య, 'విశ్వజనీనకవి' అనే వ్యాసాన్ని శ్రీ ముదివేడు ప్రభాకరరావు గారలు వ్రాశారు. వాటిలో ప్రత్యేకించి. ప్రభాకరరావుగారు ఇలియట్‌కూ-విశ్వనాథకూ ఉన్న సామ్యాలను చక్కగా వివరించారు. నేను యువభారతి వారి 'ఆలోచనా లహరి'లో విశ్వనాథపై వ్రాసిన వ్యాసం కూడా ఆయన విమర్శకవ్యక్తిత్వాన్ని విశిష్టంగా వ్యాఖ్యానిస్తున్నది. వివరాలకు ఈ గ్రంథంలోని 'యుగాలూ యోగాలూ' అన్న అధ్యాయాన్ని చూడవచ్చును.

సాహిత్య శిల్పానుశీలన యుగకర్తయైన విశ్వనాథ శిల్పప్రాముఖ్యాన్ని గురించి చెప్పిన మాటలు— "కావ్యము శిల్పముతో కూడినది. శిల్పశక్తి తగ్గని యే కావ్యమైనను బహుగ్రాహ్యమే యగును. పాశ్చాత్య మహాకావ్యములు శిల్పభూయిష్ఠము లగుటచేతనే యచ్చటి మత సంప్రదాయాది విషయములు మనవి కాకపోయినను వానిని బహుగ్రహించుచున్నాము. రచయితల కా శిల్పబుద్ధి తగ్గనిచో కావ్యము కావ్యమగును. శిల్ప మక్షరమునొద్దనుండి కావ్య మహార్థాంత మనుస్యూతమైన విషయము. ప్రపంచ మెంత యనంతమైనదో, ఎంత వివిధమైనదో కవితావిద్య యంత అనంతమైనది, యంత వివిధ మైనది. "[56]

"ఇది (కావ్యము) మహాశిల్పభూమి. కావ్యభాష శిల్పభాష. వాడుక భాష వాడుకభాష. ఈ రెండుభాషలు కలియుట యెప్పుడు జరుగదు. జరిగినచో మహాకావ్య స్వరూపనాశనము జరుగును. శిల్పబుద్ధిలేనికవులు సర్వకాలములయందుందురు."

"కావ్యము నీకు సుగమముగా నర్థము కావలయునని వ్రాయబడునది కాదు. కవి తన శిల్పచాతుర్యముచేత నిర్మించును నీవు దానిని గ్రహింపఁ గలిగినచో, నీమనస్సు నుదాత్తమార్గములయందు నలౌకికమైన నిష్ఠయందు బ్రహ్మభావన బ్రహ్మచారియైన రసవీథియందు నీచిత్తమును లయింపఁజేయు ప్రయత్నము చేయుము. అది సామాన్యునకు సుగమమైనది కాదు. శిల్పవేత్తను రసవీథియందు రమింపఁజేసెడిది. అదియొక మహాప్రయత్నము. అభాష వేరు."[50]

విశ్వనాథవారి శిల్పప్రస్థానం ఒక్క తెలుగు కావ్యాలకే పరిమితమైంది కాదు. విశ్వకావ్యానుశీలనంలో విశ్వజనీనంగా ప్రయోగింపదగింది. పాశ్చాత్య ప్రయోగ విమర్శ లక్ష్యం కూడా అదే. దానిమీద భారతీయ సంప్రదాయ ప్రభావంకూడా కొండంత ఉంది. దానికి విశ్వనాథ పరిపూర్ణ స్థితిని కల్పించాడు. ఆ కల్పించటంలోనే ఉంది వారి అధునికతా ముద్రితమైన దేశీయ సంప్రదాయధోరణి. శిల్పానుశీలనం ఎంత దేశీయమో అంత విశ్వజనీనం. విశ్వనాథ సాహితీ వ్యక్తిత్వానికి కీర్తినీరాజనం.

విశ్వనాథ సత్యనారాయణగారు రచించిన విమర్శగ్రంథాలు ప్రధానంగా ఇవి-1 నన్నయగారి ప్రసన్న కథాకలితార్థయుక్తి, 2. అల్లసానివాని అల్లిక జిగిబిగి 3. ఒకడు నాచనసోమన్న 4. కావ్యపరీమళము 5. సాహిత్యసురభి 6. విశ్వనాథ సాహిత్యోపన్యాసములు. 7. శాకుంతలముయొక్క అభిజ్ఞానత 8. కావ్యానందము. 9. కల్పవృక్ష రహస్యములు 10. నారాముడు. 11. What is Ramayana to me. ఇవికాక ఎన్నో వ్యాసాలూ, పీఠికలూ, ఉపన్యాసాలూ ఉన్నాయి. ఒక విశిష్ట విమర్శకునిగా సాహిత్యక్షేత్రంలో తన స్థానాన్ని సంపాదించుకోవటానికి పైరచనలు చాలు.

వీరి విమర్శగ్రంథాలలో శిల్పానుశీలానికి అన్నీ ఉదాహరణలైనా ప్రతి రచనలో ఒక ప్రత్యేకత కనపడుతుంది. తెలుగులోని మహాకవులు రచించిన గ్రంథాలలో ప్రతిదానికీ ఒక ప్రత్యేకత ఉన్నదన్న వివేచననూ, ప్రతి ప్రక్రియనూ ప్రత్యేకప్రమాణాలతో పరిశీలించాలన్న పద్ధతినీ విశ్వనాథ ప్రవచించిచూపించాడు. నన్నయ కవితాగుణాలకు పట్టిన వైజయంతిక వారి నన్నయగారి ప్రసన్నకథా కలితార్థయుక్తి (1949 భారతి). ఇతిహాస కథాశిల్పం, కావ్య కథాశిల్పం, ఉపాఖ్యాన శిల్పం అనేవి కథార్థాల నాశ్రయించి ఎలా వైవిధ్యంతో భాసిస్తాయో ఈ గ్రంథం చదివితే తేటపడుతుంది. సంవిధానం, పాత్రపోషణ, భావికథార్థ ధ్వని, కథార్థ ప్రసన్న ప్రక్రియ మొదలైన సూక్ష్మశిల్పవిశేషాలే కాక శైలికి, పదప్రయోగ శక్తికి, వాక్యరచనా విచ్ఛిత్తికి ఎలా వ్యాఖ్యానం చేయాలో స్పష్టమౌతుంది. వీటిని మించి వస్తుధ్వని రసధ్వనిలో పర్యవసించే వైఖరి సరళసుందరంగా ఈ గ్రంథంలో అభివ్యక్తీకరింపబడింది. కథా కథన శిల్పరహస్యాలను విశ్వనాథ వివరిస్తున్నప్పుడు ఆనందవర్ధనుని నుండి ఆంగ్లవిమర్శకుల దాకా కావ్యశిల్పానుశీలనంలో పాటించే ప్రక్రియలు పరమ దేశీయంగా, సరళ సుందరంగా సంపదింపబడటం విశేషం. ఆదికవి నన్నయ కవితా గుణాన్ని ఆధునిక వివేచనంతో వ్యక్తీకరించిన శిల్పప్రస్తారం ఈ గ్రంథం. విశ్వనాథవారు వివరించిన నన్నయగారి కథాకథనశిల్ప రహస్యాలు కేవలం మన లాక్షణికదృష్టితో మాత్రమే వివేచించబడినవి కావు. షేక్స్పియర్, మిల్టన్ మొదలైన మహాకవుల రచనాశిల్పాలను గురించి పాశ్చాత్య విమర్శకులు చేసిన అనుశీలనాలను గూర్చిన అవగాహన కూడా వాటిలో నిక్షిప్తమై ఉంది. ఒక కావ్యాన్ని ఆ రీతిగా ఒక అంశాన్ని ఆధారంగా చేసి కొని తలస్పర్శిగా అనుశీలించటం తెలుగులో అపూర్వం. ఇరవయ్యోశతాబ్ది పాశ్చాత్య విమర్శధోరణులను ఆకళింపు చేసికొన్న ప్రతిభావంతుడు మాత్రమే ఆ విధమైన విమర్శ వ్రాయగలడు.

'అల్లసాని వాని అల్లిక జిగిబిగి' అన్నది ప్రసిద్ధికెక్కిన ఒక జనసూక్తి. దాన్ని సార్థకంగా సలక్షణంగా సమన్వయించిన ప్రతిభ విశ్వనాథదే అని చెప్పాలి. ప్రబంధ కథకు ఏకవాక్యత ముఖ్యమని చెప్పే వివేచనం భారతీయ సంప్రదాయసారం. ఆ కథ కిచ్చిన సమన్వయం ప్రతీకాత్మక విమర్శకు

(Symbolic criticism) మచ్చుతునక. సాహిత్య సిద్ధాంతాలను కథలో ప్రతీకాత్మకంగా ప్రపంచించే ఆంధ్రకవితాపితామహుని కావ్యశిల్పాన్ని విశ్వనాథవారు శిఖరప్రాయంగా చిత్రించారు. జీవశాస్త్రసంబంధి సమన్వయం పింగళివారు సాధిస్తే, జీవసంస్కార పరిణామసిద్ధాంతంమీద ఆధారపడిన తాత్త్విక వ్యాఖ్యానం చేసి, విశ్వనాథవారు తమ వ్యక్తిత్వాన్ని ప్రదర్శించారు. విశ్వనాథవారి 'అల్లసానివాని అల్లిక జిగిబిగి' 1962లో ప్రచురితమైంది.

నాచనసోముడు విశ్వనాథవారి అభిమాన కవుల్లో ఒకడు. అతని ప్రత్యేకత సంవిధాన చక్రవర్తిగా ఎలా భాసిస్తుందో వారు 'ఒకడు నాచన సోమన్న' (1970) గ్రంథంలో నిరూపించారు. విష్ణుపారమ్యాన్ని వ్యంజింపజేసే కథాకదంబాన్ని ఎన్నుకోవటంలోనూ, వాటి నిర్వహణంలోనూ, జ్యోతిషాది శాస్త్ర మహార్థాలను ప్రతీకాత్మక ప్రవృత్తితో ప్రతీయమానం చేయటంలోనూ, శైలీవైశిష్ట్యంలోనూ నాచనసోముని కవితామూర్తిని విశ్వనాథవారిందులో వ్యక్తీకరించారు. రాళ్ళపల్లివారు నాచనసోముని కవితారీతికి ఉత్తమగౌరవాన్నిచ్చారు. విశ్వనాథవారు ఆ కావ్యాన్ని పరమవ్యంగ్యమైన పరమార్థ ప్రతిపాదక దృష్టితో సమీక్షించి నాచనసోముని ప్రత్యేక స్థానాన్ని ప్రతిపాదించారు. ప్రతీకాత్మక విమర్శకీ గ్రంథం మరొక మణిదర్పణం. పాశ్చాత్యవిమర్శలో విశ్వనాథను ప్రభావితం చేసిన శతాబ్ది ప్రతీకాత్మక విమర్శధోరణిని పరిపోషించింది. దాని స్ఫూర్తిని విశ్వనాథ తెలుగులో తనదిగా పండించుకొన్నాడు.

కావ్య విమర్శతో పాటు కావ్యాంగ విమర్శ ఎలా ఉంటుందో నిర్దేశించే ప్రయోగం విశ్వనాథవారి కావ్యపరీమళం. ఆంగ్లంలోని ప్రయోగవిమర్శ (Practical criticism)లో కావ్యాంగ విమర్శ ప్రధానాంశం. దానికి విశ్వనాథ శిల్పమార్గం చూపించారు తెలుగులో. కావ్యానుశీలనం చేస్తూ కళామయంగా కావ్యలక్షణాలను రవ్వల్లా కురిపించే ప్రజ్ఞ యీ ప్రక్రియలో ప్రకాశిస్తుంది. కావ్యశిల్పాస్వాదన కనువైన మధుబిందువు లీ పద్యశిల్ప వ్యాఖ్యలు. భారతభాగవతాలలోని ప్రసిద్ధపద్యాల కిలాగే ప్రపంచించిన పద్య వ్యాఖ్యలతో 'సాహిత్య సురభి' కూర్చబడింది. రిచర్డ్స్‌లాగా వృత్తిరీత్యా ఉపాధ్యాయుడై, ప్రవృత్తిరీత్యా మహాకవియైన విశ్వనాథ ప్రాచీనకవుల

కావ్యాలలోని రహస్యాలను విప్పిచెప్పే రసవ్యాఖ్యా ప్రవృత్తిని ఈ సంకలన సంపుటాల్లో సమృద్ధిగా పండించారు.

ప్రసిద్ధ పాశ్చాత్య విమర్శకులందరూ షేక్స్పియర్ నాటకాలపై తమ తమ దృక్పథాలతో విమర్శలు వెలయించి నట్లుగానే తెలుగు విమర్శకులు కాళిదాస, భవభూతుల నాటకాలను అనుశీలించటం పరిపాటి. విశ్వనాథ కూడా ఆ పని చేశాడు. అందరికంటే అభినవంగా అనుశీలించాడు. రస సిద్ధాంతానికి రమణీయనాటకాకృతిని కల్పించిన కాళిదాసుని శిల్పమర్మాలను వెలికితీస్తూ, ప్రతీకాత్మక విమర్శనం చేశాడు 'శాకుంతలము యొక్క అభిజ్ఞానత' (1960 మార్చి-జులై. జయంతి పత్రికలో ప్రథమంగా ప్రచు రితం నామసార్థక్యం నుంచి అంతఃకరణచైతన్యంవరకు సాగిన రస తత్త్వానుశీలనం ఇందులో గమనింప దగింది. శాపవిస్మృతివలన దుష్యంతుడు పొందే వేదనలో, జన్మాంతరవాసనాబలంతో జీవుడు పొందే వేదనయొక్క వైచిత్రిని అభినవగుప్తుని సిద్ధాంతా న్ననుసరించి ప్రస్తరించి, మనస్తత్వ శాస్త్రవిశేషాలను సంవదించుకుంటూ, రసనిష్పత్తి సూత్రానికి శిల్ప వ్యాఖ్యానం చేసి చూపించారు. ఇందులో నాటకరచనా శిల్పంలోని ధ్వనిని నిరూపిస్తున్నప్పుడు ప్రాచ్య పాశ్చాత్య సౌందర్యతత్త్వం, రసభావతత్త్వాన్ని వ్యాఖ్యానిస్తున్నప్పుడు తత్త్వసౌందర్యం వీరి విమర్శలో ప్రసరిస్తాయి. తత్త్వ గంభీరమైన ఈ విమర్శ శిల్పమార్గానికి శిఖరప్రాయం।

విశ్వనాథ వారి 'కావ్యానందం' (1972) వర్ణనాత్మక లక్షణ గ్రంథం. ఆనందత్రయం ఆభాసమనీ, అబద్ధమనీ భావించే భౌతికవాదుల సాహిత్య దృక్పథాలు ప్రచారమౌతున్న ఈ రోజుల్లో ఆధునిక జగత్తుకు సాహిత్యశాస్త్ర మర్యాదలను, సౌందర్యశాస్త్ర సమాలోచనంగా సమర్పించిన మీమాంస ఈ గ్రంథం. సూత్రలక్షణ గ్రంథాలకంటె విలక్షణంగా వివిధాంశాలపై ఆలోచనా ధారగా సాగిన ఈ ప్రక్రియ వర్ణనాత్మక లక్షణ గ్రంథం అనటం న్యాయం. వారిప్రణాళికలో ఇది మొదటి గ్రంథం. ఆ తరువాతి మూడు సంపుటాలు పూర్తికాకుండానే విధి వారిని మనకు దూరం చేసింది.

విశ్వనాథ రసానుశీలన ప్రవృత్తికి ప్రత్యక్షసాక్ష్యంగా నిలిచేవి వారి 'సాహిత్యోపన్యాసములు'. ఇందులోని 'కాళిదాస భవభూతులు', రామాయణ మహాభారతాలలోని రసచర్చ, కావ్యార్థచర్చ తులనాత్మక విమర్శకు చక్కని ఉదాహరణలు.

సాహిత్య విమర్శను దర్శనంగా భావించిన విశ్వనాథ- అనుశీలనాన్ని విమర్శగానూ, దానికి మూలమైన తత్త్వదర్శనాన్ని దర్శనంగానూ భావించారు. విమర్శ దర్శనాన్నుంచి జాలువారుతుంది. మరల కావ్యానుశీలనంలో తత్త్వ దర్శనం చేసి పఠితల కందిస్తుంది. అప్పుడు విమర్శయే దర్శనంలా భాసి స్తుంది. కావ్యానందపీఠికలో విశ్వనాథవారిలా అన్నారు— "రసమీమాంస భారతీయ సాహిత్యముయొక్క ప్రథమలక్ష్యము. కవితా సాహిత్యముల యందున్న తక్కిన సర్వవిషయములు దీనిని పొందుటకొరకే. అందుకనియే నేను నా కల్పవృక్షావతారికలో—

"ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథాదృతిని మించి" అని వ్రాసినాను.

కథ క్రొత్తదగుట, కల్పితి మగుట, పాత్రపోషణమునకు ప్రాధాన్యము, వాతా వరణమును కల్పించుట మొదలైనవి ప్రధానముగా పాశ్చాత్యుల కావ్యదృష్టిగా కనిపించుచున్నది." ఈ మాటలలో ప్రాచ్యపాశ్చాత్య దృక్పథాల భేదాన్ని వివేచించారు.

పాశ్చాత్యులుకూడా సాహిత్యవిమర్శలో కావ్యసౌందర్య తత్త్వదర్శ నాన్ని చేసే ప్రస్థానాలు సాగించారు. వాటిల్లో Realism, Emotionalism, Expressionism, Transcendentalism ముఖ్యమైనవి. వీటిల్లో చివరి దైన Transcendentalism మీద భారతీయ తత్త్వదర్శన ప్రభావం బాగా కనిపిస్తుందని విమర్శకు లంగీకరించిందే. వాటి ప్రవృత్తుల స్వభావాన్ని హెరాల్డ్ ఆస్‌బర్న్స్ మాటల్లో మనం గమనింపవచ్చు. "Realism regards it as the function of the artist to make reproductions of the external appearances of things, because he and his critics are keenly interested in appearances. Emotionalism holds that it is his function to influence actively other men's emotions. Expressionism also holds that the primary function of the artist

is to influence the emotions of other people by reproducing his own emotions in them, although it could admit that he may influence them towards emotional experiences characteristic of the introverted type. But the concern with exercising a practical influence on the emotions of the other people is in itself a characteristic of the extravert and Expressionism therefore belongs to the extroverted type. Transcendentalism on the other hand belongs to the type of the introvert. It's primary concern is to achieve awareness of the true nature of reality underlying the superficial appearances of things and the influencing of other people, or the communication of that awareness to other people, is secondary."[58] విశ్వనాథ విమర్శ ఈ పాశ్చాత్యుల Transcendentalism ను భారతీయదృష్టితో సమగ్రం చేసి వ్యక్తీకరించింది. కాల్పనికోద్యమ యుగ విమర్శకులు Expressionismను బలపరచగా, విశ్వనాథ ఆ తరువాత యుగాలవారి Transcendentalism ను సాహిత్యరంగంలో స్థాపించారు. పాశ్చాత్య ప్రభావ పరిశీలనంలో ఈ చారిత్రక సత్యం మరువరానిది.

విశ్వనాథవారి విమర్శక వ్యక్తిత్వాన్ని గురించి ఆచార్య యస్వీ జోగారావు గారన్న మాట లిక్కడ సంస్మరణీయాలు— "Instinctively inquisitive he was and had an innate urge to think about, imagine, observe, understand and learn things more and more. In and out, in life and literature which happened to him quest and pursuit, he always used to be a poser of questions, seeker of answers and seer of truth which culminate in an aesthetic expression charmed with a philosophical repose. He was versatile and erudite in his scholarship of the oriental and occidental classics—not only of classics and classical treatises of literary criticism but also of the huppenny tuppenny chips of fiction"......"Viswanatha, who combined in himself the Solomon and Sampson in matters of quality and quantity in his literary output, was not only a creative artist of the first order but also a critic of the first magnitude."[59]

సాహిత్య ప్రమాణాలతో సాహిత్యాన్ని అనుశీలించే ప్రామాణిక ప్రయోగ విమర్శను శిల్పానుశీలన విమర్శగా తెలుగులో వెలయించారు

విశ్వనాధవారు. ఈ మార్గంలో సాగుతున్న నేటి సాహిత్యవిమర్శ అంతా విశ్వనాధలో గతార్థమౌతుంది ఆయన ద్రష్ట, ప్రయోక్త, మిగిలినవారందరూ ఆ దర్శనంవెంట సాగిన ప్రయోక్తలు, ప్రసారకులు.

## రెండు వర్తులాలు

వీరేశలింగం పంతులుగారి నుంచి విశ్వనాధ సత్యనారాయణగారిదాకా సాగిన సాహిత్యవిమర్శను ఆంగ ప్రభావ పరిశీలనం దృష్ట్యా గమనిస్తే క్రమంగా ఆకృతిమీదా, ఆలోచనమీదా, అనుభవంమీదా ప్రభావం పడిన జాడలు గోచరిస్తాయి. వీరేశలింగం పంతులుగారినుంచి కట్టమంచికి ముందుదాకా ఆంగ్లప్రభావం ఆంధ్రవిమర్శయొక్క ఆకృతిమీద పడింది; కట్టమంచినుంచి ఆలోచనమీద ప్రసరించింది; రాళ్ళపల్లి దువ్వూరులు దాన్ని అనుభవంవైపు మళ్ళించారు; విశ్వనాధ విమర్శలో అనుభవంమీది ప్రభావం ఒక పరిపూర్ణతను సాధించింది. ఆకృతిమీద పడిన ప్రభావం విమర్శచేత సాధన చేయిస్తుంది; అనుకరణాన్నిగానీ, అనుసరణాన్నిగానీ ఆచరింప చేయిస్తుంది. ఆలోచనపై పడిన ప్రభావం విమర్శచేత భావన చేయిస్తుంది; సమన్వయాన్నిగానీ, అనుశీలనాన్నిగానీ సాధింపచేయిస్తుంది; అనుభవంమీద పడిన ప్రభావం విమర్శచేత దర్శనం చేయిస్తుంది; తత్త్వాన్వేషణ ప్రవృత్తినీ, శిల్పసౌందర్యానుశీలనాన్నీ ప్రదర్శింప చేయిస్తుంది. ప్రథమావస్థలో ప్రక్రియకు ప్రాధాన్యం కలగడం, వస్తుదృష్టికి విలువపెరగటం, కావ్యలక్షణ కావ్య మీమాంసలకు గౌరవమేర్పడటం గోచరిస్తుంది. ద్వితీయావస్థలో స్వతంత్ర దృక్పథాలు తలయెత్తటం, భావదృష్టికి ప్రాముఖ్యం రావటం, కావ్యానుశీలనానికీ, అభిరుచివైఖరికీ విశేషప్రచారం రావటం స్పష్టమౌతుంది. తృతీయావస్థలో పాశ్చాత్యప్రభావాన్ని దేశీయదృక్పథంలో విలీనం చేసికొని అభేదప్రతిపత్తితో, ఔచిత్యదృష్టితో సౌందర్య తత్త్వానుశీలనాన్ని సాగించటం, రసదృష్టికి పట్టం కట్టటం, శిల్పవివేచననూ, పరమార్థ విచారాన్నీ సాహిత్యప్రమాణాలతో సాధించటం ప్రకటితమౌతుంది. అనుభవంమీద పడిన ప్రభావాన్ని వివేచించటం క్షీరంలో కలిసియున్న నీరాన్ని వేరుచేసి చూపించటం లాంటిది. అద్వైతస్థితిగా భాసించే ఆ ప్రభావం దేశీయంగానూ, విశ్వజనీనంగానూ ఉంటుంది. అది ప్రభావం చేరగలిగిన

చరమస్థితి. ఆపైన ప్రభావం లేకుండానైనా పోవాలి; లేదా, అభ్యాసంలోనైనా ఉపజీవించాలి. విమర్శ స్వీయదర్శనంతో సృజనాత్మకతను ప్రదర్శించి, ప్రగతిపథంలో సాగితే దానిమీద పరప్రభావం లేదనే చెప్పాలి. లేదా, అనుభవప్రభావంతో వెలసిన విమర్శనే ప్రమాణంగా తీసుకొని జీవితాన్ని కొనసాగిస్తే అభ్యాసరూపమైన విమర్శగా పేర్కొనాలి. తెలుగులో విశ్వనాథవెంట నడచినవారిలో చాలమందికి అభ్యాసమే కూసువిద్య ఆయిపోయింది. సృజనాత్మకతను సంతరించుకొనని అభ్యాసవిమర్శ క్రమంగా క్షీణదశను పొందే అవకాశం ఉంది. అందువలన అభినవదర్శనంకోసం అన్వేషించటం సాహిత్యప్రక్రియ లన్నింటికిలాగానే విమర్శకు కూడ సహజ లక్షణం.

ఆకృతితో ఆరంభమై అనుభవందాకా సాగి ప్రభావం ఒక వర్తులాన్ని (circle) పూర్తి చేస్తుంది. ఆ తరువాత విమర్శ ప్రభావానికి దూరమై స్వతంత్రంగా బ్రదుకగలిగితే సంతోషం. లేదా, మరల ఒక క్రొత్తదైన వర్తులం ప్రారంభమౌతుంది. తెలుగులో సాహిత్యవిమర్శ పాశ్చాత్యప్రభావంతో మరొక వర్తులాన్ని ఆరంభించింది. సమన్వయయుగంలో వెలసిన విమర్శ ప్రధానంగా ప్రక్రియా స్వరూప స్వభావాలను, శాస్త్రవిజ్ఞానంతో ముడిపడిన విమర్శధోరణులను ఆదరింప నారంభించింది. ఇందులోనే వివిధ సిద్ధాంతాలను భారతీయ దృక్పథంతో సమన్వయించుకొనే అనుభవ విమర్శవ్యాయలు కూడా కొన్ని కనపడతాయి. అయినా, అనుభవకేంద్రంనుంచి వైదొలగి ప్రక్రియవైపు పయనించే ప్రవృత్తి ప్రబలంకావటం ఈ యుగధర్మంలో కనపడే ప్రధానలక్షణం. ఈ శాఖకు చారిత్రక దృక్పథం ప్రధానం. దీనికి అనుబంధంగా సాగిన పరిశోధనయుగంలోకూడా ప్రక్రియానుశీలనం, చారిత్రకదృష్టి, కావ్యలక్షణ కావ్యమీమాంసా ప్రవృత్తులు ప్రధానంగా గోచరిస్తాయి. ఆపైన సమీక్షాయుగంలో వెలసిన విమర్శధోరణులలో మార్క్సిస్టు విమర్శ ఆంధ్రవిమర్శలో ఆలోచనపై పడిన పాశ్చాత్య ప్రభావాన్ని బలంగా ప్రదర్శిస్తుంది. దానికి వస్తుదృష్టి ప్రధానం. శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారి 'కవిసేన మేనిఫెస్టో' విమర్శలో అనుభవంమీద పడే పాశ్చాత్యప్రభావ స్వభావం కొట్టవచ్చినట్లు కనపడుతున్నది. వీరిది ప్రధానంగా భావదృష్టి. విశ్వనాథవిమర్శలో పాశ్చాత్యప్రభావం అనుభవంమీద పడినా, అది వారి

విమర్శలో అంతర్వాహినిగా నీరక్షీర న్యాయంగా నిలిచింది. శేషేంద్రశర్మ గారి రచనలో అది అంతర్మథనంగా ధ్వనిస్తున్నది; మధుక్షీరన్యాయంగా మిశ్ర స్థితిని పొందుతున్నది. విశ్వనాథవారు రసదృష్టిని విమర్శ కందించారు; శేషేంద్రశర్మ భావదృష్టిని పరిమళింపచేశారు. నేడు చాలమంది వ్రాస్తున్న పత్రికారచనలు, వ్యాసకోశాలు పై వానిలో ఏదో ఒక వర్గంలో చేరి యోగాభ్యాసం చేస్తున్నవే. ఈ అభినవవర్తులంలో ఉన్న విశేష మేమంటే— మూడువిధాలైన ప్రభావాలకు లోగిన విమర్శలలోనూ అభిరుచివిమర్శ ఉండ వలసినదానికంటె ఎక్కువమోతాదులో ఉండటం.

మొదటి వర్తులంలోని విమర్శకంటె, రెండవ దానిలోని విమర్శకు ఆవేశంకంటె ఆగ్రహం ఎక్కువ; సంవాదం కంటె వివాదం ఎక్కువ; వివేచనంకంటె విశ్లేషణం ఎక్కువ; దర్శనంకంటె తర్కం ఎక్కువ; అనుభవంకంటె ఆలోచన ఎక్కువ; అనుశీలనం కంటె సమీక్ష ఎక్కువ; సృజనాత్మకతకంటె సిద్ధాంతం ఎక్కువ; పరమార్థదృష్టికంటె ప్రయోజన దృష్టి ఎక్కువ; వాడిదనం కంటె వేడిదనం ఎక్కువ. ప్రవృత్తులు వేరైనా ప్రభావ పరిధులు రెండూ ప్రగతికి ప్రతీకలే.

ఆధునికాంధ్ర సాహిత్య విమర్శమీద పాశ్చాత్య ప్రభావమేకాక భారతీయ లాక్షణికుల సాహిత్య సిద్ధాంతాల ప్రభావం, రవీంద్రనాథ టాగూర్, అరవిందఘోష్, ఆనందకుమారస్వామి మొదలైన దార్శనిక తత్త్వవేత్తల ప్రభావం కూడా ఉంది. కాని, వాటినివివేచించటం ఈ గ్రంథ పరిధిలోనికి రాదు. అయినా, అటువంటి విమర్శ తెలుగులో వెలుగునింపుకోవటానికి పాశ్చాత్య విమర్శలోని ప్రక్రియా పరిజ్ఞానం, వివేకసంస్కారాలు, కళావిజ్ఞానం, శాస్త్రీయపద్ధతులు, పారిభాషిక పదజాలం, అనుశీలనవిధానం, పరిశోధన విధానం మొదలైనవి సంస్కార రూపంగా తోడుపడుతున్నాయి. నేటి సాహితీ వేత్త తనదృష్టిని ఒక్కభారతదేశానికే కాని, ఒకభాషకే కాని, ఒకప్రాంతానికే కాని పరిమితం చేసికోవటం లేదు. ప్రపంచవ్యాప్తంగా సాహిత్యకళాతత్త్వ రంగాలలో సాగుతున్న అభినవ ప్రయోగ విశేషాలను ఆకళించుకొంటున్నాడు. అఖిల ప్రపంచాన్ని ఆవరించుకోవటం, విశ్వవిజ్ఞానాన్ని సంపదించుకోవటం ఆధునికత లక్షణంగా నేడు భావింపబడుతున్నది. తులనాత్మక అధ్యయనం

ఈ లక్షణంనుంచి ఆవిర్భవించింది. ఆంధ్రవిమర్శ ఈ రంగంలో ఎదుగ వలసినంత ఎత్తు ఎదుగక పోయినా, పరిశోధన రంగంలో ప్రయోగస్థాయిలో ఇది తన అస్తిత్వాన్ని నిలుపబెట్టుకొంటున్నది.

ఆంధ్ర సాహిత్య విమర్శయుగాల కాల విభాగాన్ని స్పష్ట ప్రతిపత్తి కోసం ఇలా నిర్ణయించుకోవచ్చును—

1. వికాసయుగం-క్రీ. శ. 1874 నుండి 1913 వరకు. (40 సంవత్సరాలు)
2. కావ్యానుశీలన యుగం-క్రీ.శ. 1914 నుండి 1948 వరకు. (35 సం॥)
3. శిల్పానుశీలనయుగం - క్రీ. శ. 1948 నుండి 1963 వరకు. (దాదాపు 15 సం॥లు)
4. సమన్వయయుగం-క్రీ. శ. 1963-1970 వరకు. (సుమారు 8 సం॥)
5. సమీక్షాయుగం— క్రీ. శ. 1970 నుండి

పరిశోధనయుగం సాహిత్య విమర్శలో దాదాపు 1960 నుండి సమన్వయ యుగంలో శక్తిమంతమైన శాఖగా సాగింది— ఇప్పటికీ సాగుతోంది. కాని 1970 తరువాత తన ప్రత్యేక వ్యక్తిత్వాన్ని కోల్పోయింది.

## సమన్వయ యుగం

సమన్వయయుగంలో సృజనాత్మక విమర్శకంటె, సమన్వయాత్మక, విశ్లేషణాత్మక విమర్శ ఎక్కువ వచ్చింది. విశ్వనాధలాంటి వారు పాశ్చాత్య విమర్శోద్యమాలను, వాటిలోని మేలిమిని పుక్కిటపట్టి దేశీయంగా ప్రపంచించి, ప్రమాణాలనూ అనుశీలన విధానాలనూ అనుభవదఘ్నంగా ఆంధ్రులకు అరటిపండొలిచి చేతిలో పెట్టినట్లు ప్రయోగించారు. అయితే, సమన్వయయుగ విమర్శకులు పాశ్చాత్య విమర్శ పద్ధతులనూ, ప్రమాణాలనూ, ప్రక్రియలనూ, పారిభాషిక పదజాలాన్నీ తెలుగు వారికి స్పష్టంగా తెలియ బరుస్తూనే, వాటిని దేశీయమైన వాటితో సమన్వయిస్తూ సంవాదవిధానాన్ని వ్యక్తంచేశారు. భారతీయ సిద్ధాంతాలతో పాశ్చాత్య సిద్ధాంతాలను తులనాత్మకంగా చర్చించి, ఆంధ్ర సాహిత్యంలో అవి యేవిధంగా ప్రయోగాలలో

స్వతంత్ర ప్రతిపత్తిని సంపాదించుకొన్నాయో వివరించే విజ్ఞతను ప్రకటించారు. భారతీయదృక్పథానికి పాశ్చాత్య ప్రభావం పరిపోషణద్రవ్యంగా ప్రవర్తిల్లిన పద్ధతిని ప్రపంచించారు. ఇదే సమన్వయ యుగ ప్రధానధర్మంగా పరిగణింపబడుతున్నది.

## పింగళి లక్ష్మీకాంతం

ఈ యుగం ప్రారంభించటానికి ముందు కూడా సాహిత్యవిమర్శకు సమన్వయ పద్ధతిలో దారితెన్నులు చూపించినవా రున్నారు. వారిలో పింగళి లక్ష్మీకాంతం గారు (1894–1972) మొదట పరిగణింప దగినవారు. వారు వ్రాసిన దానికంటె ఆంధ్ర విశ్వకళాపరిషత్తులోని ఆంధ్రశాఖలో పనిచేస్తూ యువతరానికి చెప్పింది ఎక్కువ. ప్రాచ్య పాశ్చాత్య సిద్ధాంత సమన్వయం వారి విమర్శలక్షణం. సాహిత్యప్రమాణాలతో కావ్యానుశీలనంచేసే ఉద్యమాలలో పెక్కింటికి ఆయన రూపరేఖలు దిద్దారు. సాహిత్య చరిత్రాధ్యయనానికీ, నిర్మాణానికీ చక్కని బాటలు చూపించారు. తులనాత్మక విమర్శకు త్రోవలు మెరుగు పరిచారు. కావ్యంలోని విలువలకు విలువకట్టే విజ్ఞతను ప్రసారం చేశారు. విమర్శ విధానాలనూ, విమర్శ లక్షణాలనూ వివేచించి వివరించారు. అనువర్తిత విమర్శలో సాహిత్య ప్రమాణాల సద్వినియోగాన్ని సమ్యగ్దృష్టితో సాధించి చూపించారు; ప్రాచ్య పాశ్చాత్య దృక్పథాల సమన్వయ కౌశలానికి సోదాహరణంగా రచనలు సాగించారు. వారి గౌతమ వ్యాసాలు (1952) వారి సమన్వయ విమర్శ విధానానికి తొలి వెలుగుబాట. ఆ తరువాత వారు సాగించిన సాహిత్య విమర్శ సప్రమాణమైన సమన్వయ ధోరణిని స్పష్టంగా వెలార్చింది. పింగళివారు మాట్లాడినా, వ్రాసినా, అది సమరసమైన సాహిత్యపు తీర్పులా ఉంటుందని తెలుగువారు మెచ్చుకొనే వారు. పెక్కుమంది తెలుగుకవుల వ్యక్తిత్వాలకు విలువకట్టిందీ, ప్రబంధం లాంటి ప్రక్రియకు స్వతంత్ర ప్రతిపత్తిని కల్పించిందీ, సాహిత్య చరిత్రలో యుగవిభాగాల నిర్ణయాన్ని వ్యవస్థీకరించిందీ, విమర్శపద్ధతులను వివేచించిందీ ఆయనే. దానివెనుక పాశ్చాత్య ప్రభావ మెంతో ఉంది. అప్పటి రోజుల్లో ఆంగ్లాచార్యునికంటె, ఆంగ్లాధ్యాపకునికంటె, ఆంధ్ర సాహిత్యాచార్యుడుగాని, ఆంధ్రాధ్యాపకుడుగాని ఎందులోనూ తీసిపోడనేభావం

విద్యారంగంలో కల్పించటమే కాకుండా, ఆంధ్ర విమర్శకుడు ప్రాచ్య పాశ్చాత్య విమర్శ పరిజ్ఞానంతో ఆంగ్లైక విమర్శకులకంటె సమన్వయ విమర్శలో సమర్థుడని కూడ సాహిత్యరంగంలో నిరూపించి తెలుగువారి గౌరవాన్ని ఇనుమడింపచేసిన విజ్ఞులు పింగళి లక్ష్మీకాంతం గారు.

పింగళివారు రచించిన సాహిత్యశిల్ప సమీక్ష (1966) ఆంధ్ర సాహిత్య చరిత్ర (అసమగ్రం) (1974) అనే గ్రంథాలు నిజానికి 1960 ప్రాంతంలోనే వెలువడ వలసినవి. పింగళివారు ఉద్యోగం చేసినంతకాలం ప్రవచనంలో నిమగ్నులైనారు. రిటైరైన తరువాత చివరిరోజులలో తాము చెప్పిన అంశాలను చర్వణంచేసికొన్నట్లు గ్రంథస్థంచేశారు. అందువలన ఈ గ్రంథాలలో వారి ప్రవచనకాలంలోని అభిప్రాయాలే ప్రధానంగా కనపడ తాయి. వారి సాహిత్యశిల్ప సమీక్షమీద హడ్సన్ రచించిన 'An Introduction to the Study of Literature' ప్రభావం బలంగా కనబడుతుంది. ఆంగ్లసాహిత్య విమర్శలో హడ్సన్ గ్రంథం ప్రాథమికమైనదనే చెప్పాలి. వారి కాలానికి ఆ గ్రంథంలో చెప్పిన విషయాలను సమన్వయించుకోవటమే ఒక గొప్పగా ఉండేది. వా రాగ్రంథంలోని పాశ్చాత్య విమర్శలక్షణాలను భారతీయాలంకారిక విమర్శ లక్షణాలతో తులనాత్మకంగా చర్చించి సిద్ధాంత ప్రవచనం చేశారు. 'రచన సుందరమై, సార్వజనీన ప్రయోజనమును కలిగి, భావనాహ్లాదమైన ఆహ్లాదము నిచ్చును. కర్తయొక్క ఆత్మీయతను స్ఫురింప జేయు గ్రంథము కావ్యము. ఆ కావ్యజాలమే సాహిత్యము. ఆ సాహిత్య మొక కళ, (సా. శి. స. పు. 5) వంటి నిర్వచనాలు వారి సమన్వయ విమర్శ దృక్పథానికి దృష్టాంతాలు. ఆంధ్రవిమర్శలో పాశ్చాత్య పరిజ్ఞానంతో ప్రయోగించే పారిభాషిక పదాలను నిర్ధరించటం వారు చేసిన గొప్పసేవ. అంతరమూర్తి (Inner being), ఆత్మీయత (Personality), చిత్రకళలు (Arts of delineation), సరసకళలు (Aesthetic Arts), విలాస కళలు (Arts of pleasure), క్రియాలాలిత్యము (Graceful execution), వాహకద్రవ్యము (medium), ఆదర్శరూపము (Ideal archtype), సార్థక రూపము (Significant Form), ఆహ్లాదజనకమైన యర్థము (Idea), మనోధర్మ శాస్త్రము (Psychology), శ్రుతి

(Harmony), లయ (Rhythm), తటస్థ చిత్తవృత్తి (objective attitude), సత్యము (Truth), మానస విక్రియ (Reaction), కళా న్యాయము (Poetic justice), దివ్యదర్శనము (Vision Divine), వేదన (Feeling), భావావేశము, భావము (Emotion), భావన (Imagination), కావ్యగతములైన తత్త్వములు (Elements of Poetry), ఆలోచన (Thought), పదగుంఫనము (Form), బుద్ధిగమ్యము (Intellectual), భావస్ఫోరకము (Emotional), శ్రవణపేయము (Aesthetic), భావనాత్మక నిర్వృతి (Imaginative Pleasure), వైషయికమైన భావము (Sensuous emotion). రసభావము (Aesthetic emotion), ఉద్బోధకము (Stimulus), అసంలక్ష్య క్రమము (Imperceptibility), వాతావరణము (Atmosphere), ఆత్మాశ్రయమైన సత్యము (Subjective reality), పరాశ్రయమైన సత్యము (objective reality), అసత్యము (non-real), నైజములు (Instincts), అసహ్యత (Repugnance), కుతూహలము (Curiosity), కామము (Sex), ఆత్మాభినివేశము (Self—assertion), స్వాతిశయము (Superiority), సృజన (Creativeness), ఊష్మలత (Fervour), పరిగ్రహము (Possession), సంధి సామగ్రి (Unifying factors), ఆత్మవ్యక్తీకరణము (Self-expression), ఆత్మాశ్రయ కవిత్వము, అనుభవ కవిత్వము (Poetry of experience), భావకవిత్వము (Lyrical Poetry), ఆఖ్యాన రూపము (Narrative form), సంవాద రూపము (Dialogue form), నృత్త గీతము (Ballad-dance), పాత్రారోపణము (Assumption of character), నాటక కార్యము (Action of the Drama), జాలి భయము (Pity and fear), అభినవ ప్రాచీనులు (Neo-classicists), ప్రతియోగము (Contrast), భావనాహ్లాదము (Imaginative pleasure), ఆత్మ పరిమార్జనము (Self-obliteration)- మొదలైన పారిభాషిక పదాలను పాశ్చాత్య విమర్శ ధోరణులను భారతీయ విమర్శ పద్ధతులలో సమన్వయిస్తూ పింగళివారు పేర్కొనటం వారి విమర్శలో గమనింపవచ్చును.

పింగళి లక్ష్మీకాంతం గారు భారతీయ లాక్షణికుల అభిప్రాయాలపై ఎంత ప్రామాణిక భావం ప్రకటిస్తారో, పాశ్చాత్య విమర్శకుల అభిప్రాయాల

మీద కూడా అంతటి విలువైన ప్రామాణికబుద్ధిని ప్రసరిస్తారు—అట్టివారి సమన్వయదృష్టికి ఈ వాక్యాలు చక్కని తార్కాణాలు. "మన ఆలంకారికుల నిర్వచనానుసారముగా సాహిత్య మనిపించుకొనదగిన ఏ రచనయైనను కావ్యమే యగును. (Any particular piece of literature). పాశ్చాత్యులు చేసిన నిర్వచనము కవిత్వముగురించియే (Poetry). ఆ నిర్వచనములు చేసినవారు శాస్త్రకారులు కారు; అనుభవశాలురైన విమర్శకులు. వైదుష్య పరీక్షలయందు ప్రామాణికు లనిపించుకొన్న వేత్తలు, అందుచే వారి వాక్యములుకూడ శాస్త్రవాక్యములుగానే మన్నించబడినవి."[60]

శిల్పానుశీలనయుగప్రవృత్తిని పింగళివారు సమర్థించారు. "కావ్యము శిల్పసృష్టి. శిల్పమర్యాదల ననుసరించి అనవద్యముగా జరుగునేని అది నీతిబద్ధమైనట్లే. శిల్పనీతి వేరు; లోకనీతి వేరు. ఈ రెండింటిని జోడింపరాదు." ....ఇది యెల్లరికును శిరోధార్యమే "[61]

కావ్య వివేచనంలో ప్రాచ్యపాశ్చాత్య సమీక్ష సమన్వయాత్మకంగా సాగే వైఖరి కొక ఉదాహరణం- "రసానందముతోపాటు కావ్యమువలన మనను గ్రహింపదగిన విషయాంతరమేమైన నున్నదా? అని ప్రశ్నించినచో, ఆ విషయాంతరము కావ్యమువలన మనకు కల్గెడి చిత్తసంస్కార మని చెప్పుదురు మహాకవులందరును రసానందముతోపాటు ఉత్తమ చిత్త సంస్కారము కలిగించెడి కావ్యములే రచింతురు. ఆ సంస్కారమే వారి కవిత్వమునకు నికషోపలము. ఈ అర్థమునే 'ఎమర్సన్' (Emerson) ఇట్లనెను: "Great Poets are judged by the frame of mind they induce in us".[62]

పింగళి వారు ఎంతటి కవియో అంతటి విమర్శకుడు; ఎంతటి విమర్శకుడో అంతటి ఉపాధ్యాయుడు, పింగళివారి వ్యాసాలుకాని, గ్రంథాలు కానీ, పీఠికలుగానీ చదివినప్పుడు వారి దృష్టిలో విద్వాంసులేకారు; విద్యార్థులు కూడ ఉన్నారని అనిపిస్తుంది. సమన్వయ విమర్శకు పాఠాలు చెప్పిన ఉపాధ్యాయ విమర్శకులు పింగళి వారు. స్థూలంగా చూస్తే పింగళి వారి మీద అమెరికన్ అభినవ విమర్శ ప్రభావం కొంత ఉన్నా, దానికంటె రిచర్డ్స

ప్రయోగ విమర్శ ప్రభావమే బలంగా కనపడుతుంది. విశ్వనాథ విమర్శలో పాశ్చాత్యాంశం పాలలో నీరులాగా కలిసిపోయినట్లయి విడదీయలేని అద్వైత స్థితి పొందగా, పింగళి వారి విమర్శలో పాశ్చాత్యాంశం క్షీరం శర్కరా న్యాయాన్ని భజించి సాగింది. ఇది సమన్వయ విమర్శకు జీవన సూత్రమై సాగింది.

## జి. వి. కృష్ణరావు

పింగళి వారిది కావ్యార్థాల సమన్వయాన్ని ప్రకటించే ప్రాచ్యపాశ్చాత్య దృక్పథాల అనుశీలన విమర్శ అయితే, జి. వి. కృష్ణరావుగారిది భారతీయ పాశ్చాత్య సాహిత్యసిద్ధాంతాల సమ్యక్సమన్వయ దృక్పథంతో సాగిన సిద్ధాంత చర్చ. వారికంటె వీరిలో ప్రత్యేకత ఉంది. ఆధునిక విమర్శ యుగంలో వచ్చిన వివిధ వాదాల ఫణుతులను భారతీయ దృక్పథంతో తులనాత్మకంగా చర్చించి తరతమభేదాలను సప్రమాణంగా నిరూపించే యత్నం వీరు చేశారు. వీరి 'కావ్యజగత్తు'(1944)ఇటువంటి మీమాంస గ్రంథం. రచన చిన్నదైనా విలువైనది. కృష్ణరావు గారు 'ప్లేటో ఆదర్శవాదం' అనే గ్రంథాన్ని కూడా ఈ శాఖలో రచించారు. 'కావ్యజగత్తు'లో రచయిత తన సిద్ధాంత విధానాన్ని వివరిస్తూ ఇలా అన్నారు- "నా సిద్ధాంతం కొత్తదీ కాదు; పాతదీ కాదు. ఇలా అనటంవలన ప్రాతక్రొత్తల కలయిక అని చెప్పటానికి అంతకన్నా వీలు లేదు. ఎందుకంటే భరతాది లాక్షణికులు చెబుతూ వచ్చిన రసవాదాన్నే స్వీకరించి ఆధిభౌతిక సిద్ధాంతాన్ని అన్వయించాను. ఈ రెండు సిద్ధాంతాలూ ప్రాతవే. మొదటిది ప్రాచీన తమం; రెండోది పద్దెనిమిది, పందొమ్మిది శతాబ్దాలలో ప్రబలమై ఈ రోజుల్లో ప్రసరిస్తూ ఉంది."-[63] అని 1944 లో అన్నారు. ఇందులో మార్క్సిస్టు దృక్పథాన్ని పరామర్శిస్తున్నానని రావుగారు శీర్షికలోనే సూచించారు. కాని, కృష్ణరావు గారు భారతీయుడుగా పాశ్చాత్య విమర్శను చూచారు. దాని కది అభినవావతారమన్నారు. సమన్వయ దృక్పథముంటే తప్ప అలా అనే సాహసం ఎవరికీ ఉండదు. వారా గ్రంథంలో ఆధునిక వాదాల నన్నింటినీ పరామర్శించారు. 'కళ కళకోసమే' అనే కాల్పనిక వాదం, సింబాలిజం, ఇంప్రెషనిజం, పోస్ట్ ఇంప్రెషనిజం, ఎక్స్‌ప్రెషనిజం, సర్రియలిజం మొదలైన వాటిని గూర్చి వివేచించారు; విమర్శించారు. భారతీయ

వాదాలతో పోల్చి సమాలోచించారు. "కావ్యజగత్తు సామాజిక జగత్తు నుంచి ఉత్పన్నమయ్యేదే కాని అలౌకికమైనదికాదు కావ్యజగత్తులో ఆనందం ప్రధా ం; సామాజిక జగత్తులో కాదు. సమాజంలో ఎలా ఆనందం కలుగు తుందో. ఆ విధానాల ననుసరించే కవి తన అనుభూతిని మార్పు చెయ్యక చిత్రిస్తాడు. ఇలాంటి కావ్యజగత్తు సామాజిక జగత్తుతోటే మారుతూ వుంటుంది. సామాజిక జగత్తు నుండి కావ్య జగత్తును వేరు చేసి చూస్తే. అయోమయంగా అర్థరహితంగా, మంచీ చెడ్డా లేక, ఎందుకో, ఎందుకో, దేనికో, దేనికోగా ఉంటుంది. మొదటి కావ్యజగత్తును అర్థంచేసుకోవాలంటే సంప్రదాయాభిజ్ఞత ఉండాలి. ఇప్పటి కావ్య జగత్తును అర్థం చేసికొని ఆనందించాలంటే ఇప్పటి సమాజంలో మునిగితేలుతూ ఉండాలి. దీన్నిబట్టి ఏది కావ్యజగత్తో తేలింది. నేటి పాఠకునికి సంతోషభిన్నమైన ఆనంద మిచ్చేదే కావ్యం. అంటే నిర్లిప్త సంతోషమిచ్చినదాన్నే పాఠకుడు కావ్యంగా గ్రహించాలి"[64] అని నిర్ధరించారు. "కవి అనుభూతిని నిర్ణయించే సమాజం. సామాజిక జీవితం ఉత్పత్తి సాధనముల సంబంధముచేత నిర్ణ యింపబడుతాయి. అందువల్ల ఉత్పత్తి సాధనాల సంబంధాలనుబట్టి సమాజం మారుతుంది. సమాజంతో సాహిత్యం. ధర్మం, నీతి మొదలైనవి మారు తాయి"[65]-అని మార్క్సిస్టు దృక్పథాన్ని వివరించి నాటి తెలుగు సాహిత్య రంగంలోని సాహిత్య సిద్ధాంతావగాహన యొక్క దీనదశను వివరించారు. "విశ్వ సాహిత్యపు సిద్ధాంతాలు చౌక సరుకుగా దిగాయి. వీటిని కొంతమంది మందబుద్ధులు దేశకాల పరిస్థితులను గుర్తించకుండా యథాతథంగా తెలుగు దేశంలో కక్కారు. దీనికి భావకవిత్వం, సర్రియలిజం సరియైన ఉదాహరణ'[66] అని విమర్శించారు.

"కొంతమంది రాజకీయరంగంలోను, సాహిత్యరంగంలోను వెంటనే సోషలిస్టు విప్లవం రావాలంటారు. ఈ మధ్య మొదటి దాన్ని మానుకొని, ప్రజాస్వామిక విప్లవమే రావాలంటున్నారు. సాహిత్యరంగంలో సోషలిస్టు విప్లవం రావాలని వెర్రికేకలు వేస్తున్నారు సంధించినవారిలాగా"

"వర్గ సంబంధాలను మనదేశంలో పరిశీలించి చూస్తే, కార్మికుల బలం చాల తక్కువగా వుంది. 'మధ్య తరగతి' వారి బలం ఎక్కువగా

వుంది. అసలు ఏ విప్లవం రావాలన్నా రాజకీయచైతన్య ముండాలి. ఇలాంటి చైతన్యం 'మధ్యతరగతి'లోనే వుంది - వుండటానికి అవకాశముంది. పరిశ్రమలు బాగా అభివృద్ధి కాలేదు. ఉన్న కొద్ది మంది కార్మికులకు కూడా విద్యాగంధం లేదు. ఎవ రేమి చెప్పినా, అసలు సాహిత్యం చదువుకున్న వాళ్లకే. అక్షరజ్ఞానమైనా లేనివారికోసం సాహిత్యం వ్రాయబడదు."[67]

వీరి అభిప్రాయాలు స్వాతంత్ర్యం రాకపూర్వ మున్న మార్క్సిస్టు వ్యవస్థ స్థితిగతులకు సంబంధించినవిగా కనపడుతున్నాయి. నేటి మార్క్సిస్టులు వీరిని రాయిస్టులంటారు. ఏమైనా "సామాజిక జీవనంతో ఉత్పన్నమైన భాష సమాజంతోపాటే మారుతూ వుంటుంది. శబ్దం నశించదనే మీమాంసకుల స్ఫోటసిద్ధాంతాన్ని ఈ విషయంలో ఆదరించటానికి వీల్లేదు.... ఒకటి-కళను గాని, కవిత్వాన్నిగాని సంఘాన్నుంచి విడదీయటానికి వీల్లేదు. రెండు-మానవ సమాజం మారుతూ ఉంది. సమాజంతోపాటు భాష, అనుభూతి, కావ్యం మారుతూ వస్తున్నాయి. ఈ మార్పును అంగీకరిస్తేనే కాని అన్ని యుగాల కావ్యాలనూ అర్థంచేసికోటానికి వీలులేదు.... ఈ మార్పును వివరించగలిగింది చారిత్రక భౌతిక సిద్ధాంతమొక్కటే. కొంత మంది మార్క్స్ చెప్పిన యీ సిద్ధాంతం సాహిత్యానికి ఏ మాత్రమూ అన్వయించదంటారు. ఇది పొరపాటు. మూడో మార్క్సిస్టుల్లాగా భౌతిక సిద్ధాంతాలను అన్వయిస్తే ప్రయోజనంలే[68]"దని మార్క్సిస్టు విమర్శను సమన్వయించుకోవటానికి చక్కని భూమికను సిద్ధం చేశారు జి వి. కృష్ణరావుగారు.

శిల్పానుశీలనయుగంలోనే సమన్వయ విమర్శయుగానికి బీజావాపనం జరిగిందని కృష్ణరావు, లక్ష్మీకాంతం గారల రచనలు స్పష్టం చేస్తున్నాయి. దానికి కారణాలు కూడా ఉన్నాయి. భావకవిత్వయుగంలో ప్రయోగాలు వచ్చి నంత వేగంగా ప్రయోగ విజ్ఞానం వ్యాప్తికాలేదు. పాశ్చాత్యసాహిత్య సిద్ధాంతాలను భారతీయ దృక్పథంతో సమ్యగవగాహనతో ప్రవచించే విమర్శ వెలయ లేదు. అందువలన వైవిధ్యంతో కూడుకొన్న అభిప్రాయాలూ వెలువడ్డాయి. తర్జన భర్జనలూ జరిగాయి. మరొకవైపు పాశ్చాత్యైక దృక్పథంతో ప్రాచీన కావ్యాలను విమర్శించి దుయ్యబట్టే స్వభావం ప్రబలింది. ఈవిభిన్న ధోరణుల మధ్య సమన్వయం కుదిరించటానికీ, అవగాహన పెంపొందింప చేయటానికీ,

సాహిత్యపు విలువలను మారుతున్న పరిస్థితులలో విర్ణయించటానికీ సమన్వయ దృక్పథం కావలిసి వచ్చింది. విశ్వనాథలో లోనారసి చూస్తే తప్ప గోచరించని పాశ్చాత్య ప్రభావం శిల్పమార్గాన్ని ఘంటాపథం చేసినా, నీరక్షీరన్యాయంగా ఉన్న ఉభయ విధానాలను వివేచించి చూపించి, సాహితీలోకంలో ఆరెండింటిని తెలిసి ప్రయోగించే పరిజ్ఞానాన్ని వ్యాప్తం చేయవలసి వచ్చింది. నూత్నపద జాలాన్ని సృష్టించుకోవలసి వచ్చింది. దానితో, పాశ్చాత్య ప్రభావాన్ని అను భూతినుండి ప్రక్రియా పరిజ్ఞానం వైపు ప్రసరింపచేసి, సిద్ధాంత సమాలోచ నంలో వినియోగించి వివేచనతో కూడుకొన్న కొత్తపాతల మేలుకలయికను వివరింపవలసిన అవసరాన్ని గుర్తించి సమన్వయ విమర్శ తన పాత్రను ప్రముఖంగా నిర్వహించింది.

## డా॥ సి. నారాయణ రెడ్డి

సమన్వయ విమర్శయుగంలో నవ్యసాహిత్యాన్నీ, అభ్యుదయ సాహిత్యాన్నీ అనుశీలించటంలో సమన్వయధోరణిని ప్రకటించి, తరువాతి విమర్శకులకు వెలుగుబాటలను చూపించింది డా॥ సి. నారాయణరెడ్డి (1931-) గారి 'ఆధునికాంధ్రకవిత్వము—సంప్రదాయములు—ప్రయోగములు' (1967) అన్న పరిశోధనా గ్రంథం. దీన్ని నిజానికి పరిశోధనశాఖలో పరిగణింప వలసి ఉన్నా సాహిత్య విమర్శ మీద ఈ గ్రంథం వేసిన ప్రభావాన్ని దృష్టిలో ఉంచుకొని సమన్వయయుగవిమర్శ కరదీపికగా ఈ అధ్యాయంలోనే పేర్కొనటం జరుగుతున్నది.

ఆధునికాంధ్ర సాహిత్యంలో వీరేశలింగం పంతులుగారి దగ్గర నుండి ప్రఖ్యాతంగా వస్తున్న ప్రయోగబాహుళ్యాన్ని దృష్టిలో ఉంచుకొని, ఆంధ్ర కవులు పాశ్చాత్య ప్రభావంతో తెలుగులో వెలయించిన ప్రయోగాల్లో కాన వచ్చే దేశీయతను, పాశ్చాత్యాంశాన్నీ నిరూపించవలసిన అవసరాన్ని గుర్తించి రెడ్డిగారు ఈ గ్రంథాన్ని రచించారు. ప్రాచ్యపాశ్చాత్య దృక్పథాల సమన్వయంతో సంప్రదాయ ప్రయోగాల విచారంచేసి వాటి స్వరూప స్వభావాలను విశ్లేషించి వివరించారు. వాటిని నిర్ధరించటంలో గిల్‌బర్డ్ ముర్రే

రచించిన 'The classical Tradition in Poetry' అనే గ్రంథాన్ని, జె యల్. లోవెస్ రచించిన 'Convention and Revolt in Poetry' అనే గ్రంథాన్ని ప్రధానప్రమాణాలుగా గ్రహించారు. "The new comes and takes its place beside the old, and we welcome it. But it is not wise to give up too soon the old for dead. The ways of genius with supposedly, cast-off lifeless forms have to be reckoned with. For, the touch of genius is like the miracle of spring[69]" అన్న లోవెస్ అభిప్రాయాన్ని గౌరవిస్తూ రెడ్డిగారు ఇలా వివేచించారు. "క్షీణదశలో నున్న సంప్రదాయమును పునరుద్ధరించుటకు తోడ్పడు ఎట్టి విశృంఖల ప్రయోగమైనను ఆదరణీయమే. కేవలము ప్రయోగముకొరకు ప్రయోగము చేయుట అంతగా ఫలవంతమైన ప్రక్రియ కాదు. ఏక్షేత్రములో నైనను మొదట సంప్రదాయము ఎరువు వేసి, తదనంతరము ప్రయోగము లనెడు విత్తనములు చల్లినచో మరకతములును, మణులును గ్రేణిసేయు పంటలు పండింపవచ్చును. సంప్రదాయ ప్రయోగముల సమ్యక్మేళనమే మానవుని మహోన్నత దశకు గొనిపోవును."[70]

ప్రాచీనాంధ్రకపిత్వంలో. కనపడే నవీనరీతుల్ని పూర్వరంగంగా సమీక్షించి నవ్యకవితోద్యమంలోని నవ్యతను పాశ్చాత్యప్రభావానుశీలనంతో విపులంగా రెడ్డిగారు వివరించారు. నవ్యకవిత్వ యుగకర్తలుగా గురజాడను, రాయప్రోలును పేర్కొంటూ అట్టి సమన్వయ మార్గానికి ఘంటాపథాన్ని కల్పించారు. "రచనలోని నవ్యత, గ్రంథప్రచురణ, తరువాతి కవులపై వాని ప్రభావము అను మూడంశములను బట్టి పరిశీలింపగా నవ్యకవిత్వ మహోదయమునకు గురజాడరాయప్రోలులు ఏకకాలమున అరుణోదయ తపనోదయముల వంటి వారని తేలుచున్నది. డా॥ వీరభద్రరావుగారు సూచించినట్లుగా ఈ యిరువుర మార్గదేశి కవిత్వములకు భావకవిత్వయుగమున అనుయాయులు ఏర్పడినారు. అభ్యుదయ కవిత్వయుగములో మాత్రము శ్రీశ్రీ అవతరణతో గురజాడ ఆధిక్య మొకింత పెరిగినది. ఇంగ్లీషుభాషలో కాల్పనికోద్యమము Romanticismనకు ఎవరాచార్యులను ప్రశ్న వచ్చినప్పుడు తళుక్కున మెరిసెడువా రిర్వురు. ఒకరు: వర్డ్స్వర్త్; రెండవవారు: కోల్‌రిడ్జి. వీరి Lyrical Ballads అనుగేయసంపుటి ఇంగ్లీషు సార

స్వతములో కాల్పనికోద్యమమునకు క్రొత్తదారులు తీసినది. అట్లే రాయప్రోలు గురజాడల కావ్యములు నవ్యకవిత్వయుగమునకు నాంది పలికినవి. అందుకే ఇరువురిని యుగకర్తలుగా భావించి కైమోడ్పులు ఘటించుట యుక్తము."[71] అని రెడ్డిగారు సమన్వయదృష్టిని ప్రసరించి సోపపత్తికంగా సమర్థించారు

భావకవిత్వ శాఖలను విశ్లేషించి వివరించటంలోనూ, ఆ యుగంలో ప్రయోగాలు చేసిన వివిధకవుల పై గల పాశ్చాత్యప్రభావాన్నీ, భారతీయ సంప్రదాయాన్నీ పరిశీలించటంలోనూ, కవిత్వపు విలువలను నిగ్గుతేల్చటంలోనూ రెడ్డిగారు ప్రాక్పశ్చిమ విమర్శదృక్పథాల సమ్యక్పరీ పాకాన్ని ప్రదర్శించారు. ఉదాత్తమైన శైలి, ఉద్వేగంలేని అభివ్యక్తి, మాధుర్యంతో కూడిన సంవిధానం, నిష్పక్షపాతమైన తీర్పుచెప్పే నేర్పు నారాయణరెడ్డిగారి విమర్శకు సహజలక్షణాలు. ఈ వైఖరి తరువాతి విమర్శకుల్ని ఎంతో ఆకర్షించింది. వీరి గ్రంథం చారిత్రకాధ్యయనానికీ, కావ్యానుశీలనానికీ, ప్రభావ పరిశీలనానికీ, సమన్వయ విమర్శ విధానానికీ నికషోపలంగా తెలుగులో వాసికెక్కింది.

1950-60 దశాబ్దిలో వెలువడిన సాహిత్యంలోనే సమన్వయమార్గం కనపడుతున్నదని రెడ్డిగారు దర్శించారు. "ఏది ఎట్లున్నను ఎవరికి వారు అరలు కట్టుకొని ప్రయోగములు చేయు మనస్తత్వము ఈ దశాబ్దిలో చాలవర కంతరించి, ఈ కాలము కవిత్వము 'సమన్వయవాదము'నకు చెందినదేమో యనిపించును."[72] కవితలో సమన్వయముగ మవతరిస్తున్న ఉషస్సులను చూచిన రెడ్డిగారు విమర్శలో సమన్వయయుగానికి భాస్కరోదయాన్ని కల్పించారు. డా॥ తిరుమల శ్రీనివాసాచార్య మాటలలో "సంప్రదాయాన్నీ ప్రయోగ గుణాన్నీ మేళవించుకున్న ప్రతిభయే ప్రస్ఫుటంగా రాణింపగలుగుతుందనే సత్యాన్నీ, కవిత్వానికి క్రొత్తపాతల మేలు కలయికయే ఉపాదేయ మనే స్వీయసమన్వయ దృక్పథాన్ని సహృదయ హృదయావర్జకంగా ఈ పరిశోధనవ్యాసంలో నిరూపించటంలో కృతార్థుడైనాడు నారాయణరెడ్డి"[73] 'కప్పిచెప్పితే కవిత, విప్పి

చెప్పితే విమర్శ'అన్న రెడ్డిగారి కవితాసూక్తం రెండు రెక్కలతో ఎగిరిన సాహితీవిహంగరంగం వారి సమన్వయ విమర్శ ప్రయోగం. ఇరవయ్యో శతాబ్ది సమన్వయ దృక్పథం మానససరోవరంలా నిలచిన మనోజ్ఞ విమర్శ జీవితం రెడ్డిగారి రచన.

## ఆర్. ఎస్. సుదర్శనం

సమన్వయయుగ విమర్శకులలో శిఖరప్రాయులు శ్రీ ఆర్. ఎస్. సుదర్శనంగారు (1927-) ఆధునికయుగంలో ప్రసిద్ధులైన టి. యస్. ఇలియట్, ఐ.ఎ. రిచర్డ్స్‌లాంటి విమర్శకుల విమర్శవిజ్ఞానాన్ని ఆకళించుకొని తెలుగులో సాహిత్య విమర్శ-ప్రధానంగా నవలాసాహిత్య విమర్శ-సాగిస్తున్న వారు శ్రీ సుదర్శనం గారు. సాహిత్య విమర్శను గురించి వీరు వెలువరచిన అభిప్రాయాలు కొన్ని వారి విమర్శకే ప్రమాణాలుగా పనికి వస్తాయి. మచ్చుకు-

1) 'కాలంలో అభిరుచులూ, అభిప్రాయాలూ మారుతాయి. సాహిత్య రచనలో మార్పులూ క్రొత్త పోకడలూ వస్తాయి. సాహిత్యాన్ని విమర్శించి వ్యాఖ్యానించే మార్గాలూ భిన్నంగా రూపొందవచ్చు. కాని, రచయిత దృక్పథానికీ అతని రచనకీ గల సంబంధం ఒక నిశ్చిత ప్రమాణం రచన మనలో కలిగించే అనుభూతిద్వారా ఆ సంబంధాన్ని తెలుసుకొని వివరించటానికి చేసే ప్రయత్నమే సాహిత్య విమర్శ. సాహిత్య విమర్శ స్వభావము కావ్యార్థ ప్రకాశము: దాని స్వరూపము సత్యాన్వేషణము.'[74]

2) 'రచయిత దృక్పథమూ అతనికాలపు విశ్వాసాలూ వాచ్యంగా కాక కావ్యంలో వ్యంగ్యంగా, జీవితచిత్రణంగా నిక్షిప్తం కావటంతో ఆ కావ్యం విశ్వజనీనమైన కాలాతీతమైన ఒక సత్యాన్ని వ్యక్తం చెయ్యటం జరుగుతుంది. ఆ సత్యాన్నే ఆ కావ్యంయొక్క ఆత్మగా, ప్రాణంగా పేర్కొనవచ్చు. ఆ సత్యాన్ని కావ్యంలోని దృక్పథంగా, కావ్యం యొక్క విశేషార్థంగా, రస ధ్వనిగా ఏ యుగపు విమర్శకులు ఆ యుగంలో వ్యాఖ్యానించవచ్చు. కావ్యం

నాలుగు కాలాలపాటు నిత్య నూతనంగా ఉండటం యీ విధంగానే సాధ్యం". [75]

3) 'ఒక నిర్దిష్ట రచన విషయంలో సాహిత్య విమర్శ ఎలా జరుగుతుందో విచారించటంద్వారానే సాహిత్య విమర్శ స్వరూపం తేల్చుకోవాలిగాని, అది అలంకార శాస్త్రంద్వారా తేలే విషయం కాదు.' [76]

4) 'ఒక కావ్యం జీవిత చిత్రణ చేస్తున్నప్పుడు లేక, విశిష్టమైన కల్పనగా, ఇతిహాసంగా, పురాణంగా అది పదే పదే మనల్ని ఆకర్షిస్తున్నప్పుడు, రసవంతంగా ఉంటున్నప్పుడు (అంటే ఒక విశేషమనఃస్థితిని మనలో కలిగించే శక్తి కలిగిఉన్నప్పుడు) ఆ రససిద్ధిని గూర్చి విశ్లేషణాత్మకంగా వివరింపబూనుకోవటమే కాదు. దానికి జీవితానికీ గల సంబంధాన్ని గూర్చి వ్యాఖ్యానించటంకూడా విమర్శ చేపట్టవలసిన లక్ష్యమే.' [77]

5) 'రచన మొత్తంమీద వ్యక్తమయ్యే దృక్పథం ఏమిటో దాన్ని రూపొందింపజేయటం ఆధునిక పద్ధతి.' [78]

6) 'నా మటుకు నాకు 'రసము' అంటే 'Unity of mood' అని అన్వయించుకోవచ్చునేమో అని తోస్తుంది. ఒక విశిష్టమైన మనఃస్థితిని నాలో కలిగించగల రచనని, రచనాభాగాన్ని లేక వాక్యాన్ని రసవంతమైందిగా చెప్పవచ్చు. అక్కడ మనఃస్థితి అంటే ఒక హృదయానుభూతే కాదు దానికి అనుబంధమై మేధాగతమైన విశేషభావస్ఫురణ కూడా అని ఉద్దేశం.' [79]

శ్రీ సుదర్శనంగారి విమర్శలో కవి వ్యక్తిత్వానికీ, సంఘానికీ, కావ్యానికీ గల సంబంధాన్ని గుర్తించి,కవిదృక్పథాన్ని కావ్యంలోని ప్రమాణాలతో ఆవిష్కరించే పద్ధతి ప్రధానంగా కనపడుతుంది. కావ్యానుశీలనంలో కవి దృక్పథానికీ కావ్యానికీ గల సంబంధమే నిశ్చిత ప్రమాణమని వారు పేర్కొన్నారు. ఈ ప్రమాణంతో ఏ కాలంలోనైనా ఏ దృక్పథంతోనైనా రచింపబడిన రచనను అనుశీలించవచ్చునని పేర్కొన్నారు. 1968లో ప్రచురింపబడిన వారి సాహిత్య వ్యాసాలసంపుటి 'సాహిత్యంలో దృక్పథాలు' వారి విమర్శ విధానాన్ని స్పష్టంగా వ్యక్తంచేస్తున్నది. సుదర్శనం గారు విమర్శలో

తత్త్వదృష్టిని ప్రవేశపెట్టారు. పాత్రలను, సన్నివేశాలనూ, సంభాషణనూ, సంవిధానాన్నీ, శిల్పాన్నీ సమష్టిగానూ, వ్యష్టిగానూ పరిశీలించినా రచయిత దృక్పథం ప్రతీయమానం కావటానికి ప్రచ్ఛన్న, ప్రత్యక్ష వాహికలుగా పనికి వస్తాయన్న అనుపత్రిత విమర్శ మార్గాన్ని వీరు శక్తిమంతంగా అభివ్యక్తీకరించారు. ప్రాచీన కవులలో అల్లసాని పెద్దనను గురించి వీరు వ్రాస్తూ ఆ మహాకవి జీవితానికి సంబంధించిన తాత్త్విక దృక్పథాన్ని కావ్యం ద్వారా ఎలా వ్యక్తీకరించాడో వివరించారు. "ఇంద్రియ సుఖము, ధర్మము, దయ, ప్రేమ, వైరాగ్యము వీవి తాత్త్విక నిరూపణమూ సమన్వయమూ పెద్దన 'మనుచరిత్ర' కావ్యం. సమకాలీన జీవనధోరణికి, తాత్త్వికుడూ, ధర్మజ్ఞుడూ అయిన కవిగా, జీవితంమీద ఆసక్తి, గౌరవమూ కలిగిన మేధావంతుడుగా పెద్దన వ్యాఖ్యానం చేశాడు. అది ఆయనలోని 'అనాశ్వాసిత దుఃఖానికి' ఫలితం. ఆయన వలపునకూ, ప్రేమకూ, చూపిన విభేదం ప్రబంధ కవుల నుండి మనం సాధారణంగా ఆశించేదికాదు. ఉదాత్త శృంగారానికి శ్రీకారం చుట్టిన నవ్యకవులకు పితామహుడు పెద్దన. శృంగారతత్త్వ నిరూపణకూ, ప్రకృతిమీద ఆసక్తికీ నవ్యకవులలో మొదటివాడు. వారికంటె ఎంతో వ్యక్తిత్వపు నిండుదనమూ, గాంభీర్యమూ కలిగినవాడు పెద్దన'[80]— అన్నది వారి తీర్పు.

శ్రీ సుదర్శనం గారు విమర్శలో ప్రదర్శించిన సమన్వయశీలం ఒక విధంగా ఆధునికవిమర్శ కుండవలసిన సజీవలక్షణంగా కనపడుతుంది. కవి జీవిత కావ్యార్థ సమన్వయ విమర్శ కవి దృక్పథాన్ని ప్రపంచిస్తే సార్థకమౌతుంది. చారిత్రక విమర్శ సమకాలీన సాంఘిక సంఘర్షణలకు కవి స్పందించి తన దృక్పథాన్ని కళ ద్వారా వ్యక్తీకరించటానికి యత్నించే వైఖరిని చిత్రిస్తే సఫలమౌతుంది. సమకాలీన జీవిత విమర్శగా కావ్యం చిత్రింపబడిన విధానాన్ని అనుశీలించటంలో సాంఘిక, మనస్తత్వ విమర్శలు కృతార్థమౌతాయి. సాహిత్యంలో సాతత్యంగా భాసించే విలువలను కవి దృక్పథంతో సంపదించి వివేచించినప్పుడు కావ్య సౌందర్య మీమాంస కళాభివ్యక్తిని వెలారుస్తుంది. ఈలక్షణాల నన్నింటినీ సంపదించుకొని సుదర్శనం గారు ఆధునికాంధ్ర విమర్శకు అభినవ సమన్వయ దృక్పథాన్ని తమ విమర్శలద్వారా అలవరింపచేశారు. శ్రీ తిరుమల రామచంద్రగారన్నట్లు-

'శ్రీ సుదర్శనం గారు భారతీయ సంస్కృతిపై గాఢాభినివేశంగలవారూ, విదేశ సంస్కృతిలోని సమీచీనాంశాలను గ్రహించి సమన్వయించి భారతీయ సాహిత్యాన్నీ, దృక్పథాన్నీ సంపన్నం చేయాలనే సమ్యగాగ్రహం కలవారు.[81] ఇది సమన్వయ విమర్శ లక్షణం కూడా.

శ్రీ సుదర్శనంగారు తమ విమర్శ వ్యాసాలలో నిర్ధరించిన అనేకాంశాలు ఆధునికాంధ్ర సాహిత్య పునస్సమీక్షకు తాత్త్విక వాహికలుగా తోడుపడతాయి. మచ్చుకు కొన్ని.

1. "వీరేశలింగం గారు కార్యదీక్షలో రాజారామమోహనుని అపరావతారమంటే అతిశయోక్తి కాదు. ఆయనకు సంఘంమీదే దృష్టి. అప్పారావు గారి దృష్టి అంతర్దృష్టి. ఇతరులను విమర్శించేముందు తన్ను తాను విమర్శించుకొనే స్వభావం ఆయనది. జీవిత స్వరూపాన్ని తాత్వికుడుగా, స్థితప్రజ్ఞుడుగా దర్శించి మానవ ప్రేమలో, మంచితనంలో తుదివిశ్వాసం నిలుపుకొన్నవారు అప్పారావు గారు. వీరేశలింగంగారి రచనల్లో, అటువంటి మౌలికమైన తత్త్వాన్వేషణ కనిపించదు. క్రొత్త ప్రక్రియలు, సామాజిక ప్రయోజనం ఆయన సాహితీ రంగంలో అన్వేషించి, సాధించినవి" (సా. దృ., పు. 4)

2. "గడచిన అర్ధ శతాబ్దంలో తెలుగులో కవిత్వంకంటె నవల పొందిన పరిణామమే సాహిత్య భవితవ్యానికి ఫలప్రదంగా కనిపిస్తోంది" (సా. దృ., పు. 6)

3. 'దివ్యజ్ఞాన సమాజం, రామకృష్ణుడు, వివేకానందుడు, తిలక్, గాంధీల ప్రభావం హిందూ సాంప్రదాయముమీద ఆసక్తినీ భక్తినీ రేకెత్తింపజేయగా సాహిత్యంలో రూపొందినది 'ఆధ్యాత్మిక వాదం'. ఉన్నవ లక్ష్మీనారాయణగారి 'మాలపల్లి' గాంధీ మతానికి ఎత్తిన కరదీపిక. కాని, ఆధ్యాత్మిక వాదాన్ని బాగా మెలిద్రిప్పి దాన్ని సంప్రదాయానికి ప్రతినిధిగా, ఆధునిక సంస్కారానికి ప్రతిద్వంద్విగా, రూపొందించిన నవలా రచయిత విశ్వనాథ సత్యనారాయణ" (సా. దృ., పు. 6)

4. "త్రిపురనేని రామస్వామి చౌదరి హేతువాద ఉద్యమానికి మూల పురుషుడు....బెర్నార్డుషా ప్రభావం యీాయన మీద యెంతో కొంత వున్నది గాని, షాలో కనిపించే తార్కిక కౌశలంగాని, సృజనాత్మకశక్తిగాని, ఆ రకం హాస్యం గాని యీాయనలో లేకపోవటం గమనింపదగిన విషయం. దీన్ని 'హేతువాదం' అనటంకంటె 'భౌతికవాదం' అనటమే యెక్కువ సబబుగా ఉంటుందేమో" (పు. 7)

5. "బ్రహ్మ సమాజంతో తారసపడి దాని మీద తిరుగుబాటు చేసి, ఆధ్యాత్మిక వాదానికీ, హేతు వాదానికీ (భౌతిక వాదానికీ). సామ్య వాదానికీ దూరంగా తొలగి మొపాసా, డి. హెచ్. లారెన్సులవంటి రచయితలచేత ప్రభావితుడై, ఒక విశిష్ట దృక్పథాన్ని ఏర్పరచుకొని వివాహ వ్యవస్థల మీద, సంఘంలోని కుళ్లు మీదా దెబ్బ తీసిన చలం కాల్పనికవాదుల్లో అతివాది" (పు. 8).

6. "నవ్యాంధ్ర సాహిత్య కల్లోలినిలో అంతర్వాహినిగా హేతు (లేక భౌతిక) వాదానికీ, ఆధ్యాత్మిక వాదానికీ జరుగుతున్న నిరంతర సంవాదం ఒకటి గోచరిస్తుంది. ఈ సంవాదమే ఒక్కొక్కసారి వ్యక్తుల మధ్య వర్గాల మధ్య విద్వేషంగా కూడా దిగజారిపోతూ వుంటుంది. ఆ సంవాదమే భాష విషయంలో స్వేచ్ఛకూ, నియంత్రణకూ భావాల్లో ఆధునికత్వానికీ, సనాతనత్వానికీ, తత్వచింతనలో విచికిత్సకూ, విశ్వాసానికీ, కల్పనలో వాస్తవిక భావనకూ జరిగే సంఘర్షణగా వివిధ రూపాలలో ప్రత్యక్షమౌతుంది". (పు. 9)

7. "విశ్వనాథ ప్రతిభను ఆలోచన, భావన, దర్శనము అని మూడు విధాల భాగించినప్పుడు ఆలోచనే మిగతా రెండింటికంటె ఆయన స్వభావానికి ప్రధానమైనదిగా కనిపిస్తుంది....'ఏకవీర' 'వేయిపడగల'లో మినహా ఆయన దర్శన శక్తి గోచరంకానట్లే. చివరిదైన 'తెరచిరాజు' నవలలో భావానాశక్తి కూడా కేవలం ఊహాగానంగా తేలిపోయింది. ఆలోచన అంటే తర్కించే గుణం. ఈ గుణం విశ్వాసాన్ని నిలువనీదు. దాన్ని శిథిలంచేసి ముందుకు సాగిపోతుంది. ఒక ఆవర్తం పూర్తి అయితే కాని దాన్ని అధిగమించే స్థితి

రాదు. విశ్వనాథలో ఈ ఆవర్తం తత్త్వం నుండి వ్యవస్థకూ, వ్యవస్థ నుండి వ్యక్తికీ ప్రమాణంగా రూపొందినట్లు ఆయన సాహిత్య కృషి ద్వారా అవగాహన మవుతున్న విషయం" (పు. 191)

8. 'సాహిత్య వ్యవసాయమూ, సత్యాన్వేషణమూ జీవితంలో ఒకటైన రచయిత గోపీచంద్. ఆయన దృక్పథం "హేతువాదపు' గట్లు తెంచుకొని విస్తరిస్తూ 'అతీత మానసిక చైతన్య' సాగరంగా రూపొందింది. సమకాలీన భావసంచలనంతో హేతువాదానికీ అస్తిత్వవాదానికీ సాహిత్యంలో రూపురేఖలు దిద్దిన ఖ్యాతి గోపీచంద్‌ది" (పు. 144)

9. 'ఇరవయ్యో శతాబ్దిలో కాలాన్ని అధిగమించాలనే ఆకాంక్ష, హేతువాదాన్నీ, తర్కాన్నీ దాటిన మానవత్వపు విలువల్ని అందుకోవాలనే ఆశయం మేధావుల్లో, రచయితల్లో, కవుల్లో, దార్శనికుల్లో సర్వత్ర కనిపిస్తోంది." (పు. 177)

ఇటువంటి విమర్శ ఆధునిక సాహిత్య విమర్శకు లోతులను, తత్త్వదృష్టిని, ఆధునికతను, అంతర్జాతీయావగాహనను, తులనాత్మక ప్రవృత్తిని కల్పించింది. శ్రీ సుదర్శనం గారి 'సమాజము-సాహిత్యము' అనే వ్యాస సంపుటి 1972లో వచ్చింది. అయినా, దానిని వారి విమర్శ దృష్టికి దృష్టాంతంగా ఇక్కడే పేర్కొనటం జరుగుతున్నది. తెలుగు సాహిత్యంలో సామాజిక చైతన్యం, తెలుగు సమాజంపై కాల్పనికవాద ప్రభావము, విప్లవము-సాహిత్యము మానవత్వము-ఆధునికత, నవలా విమర్శనము, సాహిత్య విమర్శ స్వరూపము మొదలైన సమకాలీన సాహిత్యాంశాలపై సుదర్శనం గారు ప్రకటించిన అభిప్రాయాలు సాహితీపరుల్లో నూత్నమైన ఆలోచనలు రేకెత్తింప చేశాయి.

1. 'సమాజంలో నడిచే ఉద్యమాలకు సాహిత్యానికీ గల సంబంధం, మనిషిచేతనలో తెలిసిన భాగానికి (Conscious) తెలియవిభాగానికీ (unconscious) ఉన్నటువంటి సంబంధమే" (స. సా., పు. 32)

2. "నేటి విప్లవోద్యమ కవితలో 'కాల్పనికత' సరి కొత్త రూపం తప్ప మరేమీ కనిపించటంలేదు" (స. సా., పు 41)

3. 'వ్యక్తి స్వేచ్ఛకూ విప్లవగతికీ కలిగే సంఘర్షణలో ఎప్పటికప్పుడు సమన్వయాన్ని సాధిస్తూ పోవటమే సృజనాత్మకమైన మానవత్వ ప్రగతి అవుతుంది. అందులో విప్లవం పేరు పెట్టుకొన్న రాజ్యవ్యవస్థ వ్యక్తిని నలిపి వేస్తున్న పద్ధతికి స్వస్తి జరగాలి. అప్పుడే మార్క్సిజం నిజమైన మానవతా వాదంగా రూపొందింది. చరిత్రాంత స్వప్నంలో కాకుండా జీవిత యాథార్థ్యంలో మానవుణ్ణి సార్థకుణ్ణి చేస్తుంది, మానవునికి న్యాయం జరుగుతుంది" (స.సా.. పు 62)

మార్క్సిజంలో ఉన్న పరిమితులను గుర్తించి, దానికంటె అతీతంగా ఉన్న మానవతాదర్శనాన్ని చేసి, అది సమగ్ర మానవత్వ దర్శనంగా మార టానికి మార్గాలను వివేచించిన మేధావులలో ఒకరు శ్రీ సుదర్శనం గారు. "వీరి విమర్శనారీతిలో ఒక ఊర్ధ్వదృష్టి, సమున్నత ప్రమాణం, విస్తృతమైన అవగాహన, నిష్కర్షతో కూడిన పరమార్థ గ్రహణము కనిపిస్తాయి"[82] అన్న శ్రీ డి. రామలింగం గారి మాటలు సత్యాలు.

ఒక విధంగా సమన్వయ యుగానికి నారాయణరెడ్డి గారు, సుదర్శనం గారు ఉభయ పార్శ్వాలుగా కనపడతారు. ఆధునిక కవితను అనుశీలించే సాంస్కృత ఫణితిని రెడ్డిగారు ప్రసారం చేస్తే, ఆధునిక ప్రక్రియలలో నవలను తాత్త్విక దృక్పథంతో వివేచించే విజ్ఞతను సుదర్శనం గారు విమర్శకు కల్పించారు. వీరి మార్గాలు రెండూ ఈ యుగానికి అలవడిన రెండు నేత్రాలు. ఒక నేత్రం సౌందర్యం చూస్తుంది. మరొక నేత్రం తత్త్వాన్ని చూస్తుంది. ఈ రెండూ కావ్యశిల్పానుశీలనయుగంకంటె విశిష్టంగా సమాజాన్ని దృష్టిలో ఉంచుకొని సాహిత్యాన్ని సమాలోచించే సమ్యక్పరిశీలనాన్ని సాహిత్య విమర్శకు నేర్పాయి. శిల్పానుశీలనంలో కావ్యాన్ని అనుభవిస్తున్నట్లు సామా జికుడు భావిస్తాడు. సమన్వయ విమర్శలో కావ్యాన్ని గురించి తెలిసికొంటు న్నట్లు భావిస్తాడు. ఈ యుగంలోని విమర్శ సహృదయ తన్మయీభవన శక్తిని పెంచటానికి ఉద్దిష్టమైంది కాదు; తెలివిని కలిగించి సాహిత్యాన్ని తేట

పరచటానికి ఉద్యమించింది. ఆంగ్ల విమర్శ ప్రభావం ఈ యుగంలో ఆంధ్ర విమర్శను అనుభూతి నుండి ఆలోచనవైపు పయనించేటట్లు చేసింది. ఇది కొత్త మలుపు. వైవిధ్యంతో, వైరుధ్యంతో కూడుకొన్న జీవితంలాగానే సాహిత్యమూ సాగింది. భిన్నత్వంలో ఉన్న సమన్వయ సూత్రాన్ని అన్వేషించే జిజ్ఞాసువులాగానే సమన్వయ విమర్శ సాహిత్యాన్ని అనుశీలించింది

## సమీక్షా యుగం – మార్క్సిస్టు విమర్శ

ఆధునికాంధ్ర సాహిత్య విమర్శ ధోరణులలో మార్క్సిస్టు విమర్శ మొదట గణింపదగింది. వీరి దృష్టిలో ఈనాటి విమర్శ ధోరణులు ప్రధానంగా మూడు విధాలు. సంజీవమ్మగారి మాటలలో-"ఈనాటి విమర్శనా ధోరణుల్ని గురించి ఆలోచిస్తే మనకు ప్రధానంగా కనిపించేవి మూడు పద్ధతులున్నాయి. ఒకటి-సంప్రదాయ విమర్శనా పద్ధతి. దాన్నే ఆలంకారిక విమర్శనా ధోరణి అంటాము. ప్రాచీన సాహిత్యాన్ని విమర్శించటంలో అనుసరించిన ఈ ఆలంకారిక విమర్శనా పద్ధతి ఆధునిక సాహిత్యాన్ని - నూతనప్రక్రియల్ని విమర్శించటానికి యథాతథంగ అనువైన పద్ధతి కాదు. సమకాలీన సామాజిక జీవితాన్ని సమస్యల్ని వస్తువుగ గ్రహిస్తున్న ఆధునిక సాహిత్యం సామాజిక దృక్పథంతోనే ప్రధానంగా విమర్శింపబడాలి. ప్రాచీన సాహిత్యం కూడ ఈ దృక్పథంతో విమర్శింపబడవలసిన అవసరం వుంది. రెండవది - పాశ్చాత్యుల శిల్ప విమర్శనా ధోరణి. మన ఆధునిక సాహిత్యం పాశ్చాత్య సాహిత్యం చేత ప్రభావితమైనట్టిది. అందులోని వివిధ ప్రక్రియలు మన సాహిత్యంలోనూ ప్రవేశించి విస్తరిల్లాయి. శిల్పపరిణతి కూడ సాధించుకున్నాయి. కాని, వాటికి సంబంధించిన విమర్శ మాత్రం అంతగా అభివృద్ధి చెందలేదు. పాశ్చాత్య సాహిత్యం నుండి సంక్రమించిన ఆ ప్రక్రియల్ని విమర్శించటానికి పాశ్చాత్య విమర్శనా ధోరణి అనుసరించారు మన విమర్శకులు. ఇది సహజమే. రచనాశిల్పాన్ని ప్రధానంగా విమర్శించే ధోరణి పాశ్చాత్య విమర్శకులది. రచనకు ప్రాణభూతమైన వస్తువును గురించి, దాని తత్త్వాన్ని గురించి సామాజిక దృక్పథంతో ఆలోచించటం, పరిశీలించటం ఈ శిల్ప విమర్శనా పద్ధతిలో వుండదు. రచనను రచనా దృష్టితోనే (కళా ప్రమాణాల తోనే) పరిశీలించటం - అంటే కళాత్మకమైన విలువలకు ఎక్కువ ప్రాధాన్యం

యివ్వటం జరుగుతుంది శిల్పవిమర్శనా ధోరణిలో. [అయితే ఈ శతాబ్ది-ముఖ్యంగా ద్వితీయార్థంలో పాశ్చాత్య విమర్శ కూడ సామాజిక దృష్టితో వస్తువును గురించిన ఆలోచనతో సాగటం గమనించవచ్చు].

"ఇక మూడవది మార్క్సిస్టు విమర్శనా పద్ధతి. 'మార్క్సిస్టు విమర్శ' అన్నది పై రెండు పద్ధతుల్లాగ ఒక ప్రత్యేకమైన విమర్శనా పద్ధతి కాదు అన్నది ముందుగా గమనించాల్సిన విషయం. 'మార్క్సిస్టు విమర్శ' అన్న పదం మనం సృష్టించు (Coined) కున్నట్టిదే. కళలు, సాహిత్యంపట్ల మార్క్సిజమ్ దృష్టి ఏమిటి? ఒక మార్క్సిస్టు సాహిత్యాన్ని ఏ విధంగా, ఏ దృక్పథంతో పరిశీలించి విలువ కడతారు అన్న విషయం అధారంగ ఈ పదం, ఈ విమర్శనా పద్ధతి రూపొందినాయి అని చెప్పవచ్చు. కాబట్టి 'మార్క్సిస్టు విమర్శ' అన్నప్పుడు 'మార్క్సిస్టు దృక్పథంలో విమర్శ' అన్నది గుర్తుంచు కోవాలి."

"మార్క్సిస్టు దృక్పథంతో ఒక రచనను పరిశీలించేటప్పుడు ప్రధానంగా గమనింపవలసిన అంశాలు-ఆ రచనకు సామాజిక స్వభావం (గుణం) వున్నదా? వుంటే అది యాదృచ్ఛికమా? లేక ఒక దృక్పథం వున్నటు వంటిదా? వుంటే ఆ దృక్పథం సమాజాన్ని ముందుకు నడిపించేందుకు దోహదం చేసేదా కాదా? అన్నటువంటివి. తరువాత, రచనలో కళాత్మకత లేక శిల్పసౌందర్యం అన్న మౌలికమైన గుణం గురించి పరిశీలించాలి....... ఈ దృక్పథంతో సాహిత్య విమర్శ ఎక్కువ జరగలేదు .... సాహిత్యంలో సామాజిక చైతన్యం, వాస్తవికత అన్నవాటిని గూర్చి పరిశీలించటం ప్రధానంగా మార్క్సిస్టు విమర్శనా ధోరణినుండి నేర్చుకున్నారు మన విమర్శకులు. సాహిత్య విమర్శకు క్రొత్త దృక్పథం యిచ్చినట్టిది మార్క్సిస్టు ఆలోచనా విధానం. రచనలోని శిల్పసౌందర్యానికి తగిన ప్రాధాన్యం యిస్తూనే, రచనా తత్త్వాన్ని-రచనలోని వస్తుతత్వాన్ని గురించి పరిశీలించేది. విలువకట్టేది ఈ విమర్శనా ధోరణి".[88]

కావ్యాన్ని విమర్శించటానికి మూడు రకాల కొలబద్దలున్నాయని శ్రీశ్రీ పేర్కొన్నారు. అవి: 1. సాహిత్య విమర్శ 2. గతి తార్కిక భౌతిక

దృక్పథం 3. మన స్తత్వ పరిశీలన ఈ మూడింటివి గురించి శ్రీశ్రీ చేసిన వివరణం ఇలా ఉంది. "1. సాహిత్య విమర్శ-కాలనిర్ణయం, సమకాలికుల నిరూపణ, విషయ విమర్శ, ఛందో వివరణలు ఈ వర్గంలోనివి. 2. గతి తార్కిక భౌతిక దృక్పథం : దీనిని మార్క్సిస్టు దృక్పథ మంటారు. (Dialectical Materialistic Criticism). ఈ కోణంనుంచి చూచి నప్పుడు కావ్యవస్తువు-కవికీ వస్తువుకూ, ఆనాటి ఆర్థిక, రాజకీయ సామాజిక వ్యవస్థకూ వున్న సంబంధాలను గ్రహించి వాటివల్ల కవి విస్తృతం చేసిన విషయాలు సంఘ పురోగమనానికి ఎంతవరకు తోడ్పడగలవో, ఎంత సజీవ మైన శబ్ద చిత్రణం ద్వారా కావ్యనిర్మాణం చేశాడో విలువ కట్టడం. 3 మన స్తత్వ పరిశీలన- కావ్యంలో వివిధ సన్నివేశాలలో (Instances) పాత్రల (Objective) లేదా కవి యొక్క (Subjective) మనః పరివర్తనాలు యెట్లా వున్నాయో సిగ్మండ్ ఫ్రాయిడ్ లాగా పరిశీలించటం (Psycho-Analytical Outlook)"[84]

మార్క్సిస్టు దృక్పథంలో భౌతిక దృష్టి ముఖ్యం; సామాజిక వ్యూహ దానికి పోషకం. "Marxism is based on the Philosophy of materialism. This means that the question of the relation between mind and matter, between material being and Intellectual activity is decided by Marxism in favour of matter, which is considered to be primary, while consciousness is considered to be secondary. With reference to history, the interpretation of this general philosophical principle is that 'Social being is primary and social consciousness secondary.' This means that Social being, I, e., men's economic activity, material production and the relations formed by the people in the process of production are at the basis of men's spiritual activity. Social consciousness, i. e., the spiritual, ideological life of society, people's varied views and ideas, political, legal, moral, and other doctrines, reflect social being."[85]

పాశ్చాత్య దేశాలలో మార్క్సిస్టు దృక్పథంతో వెలువడుతున్న అను వర్తిత సాహిత్య విమర్శలో ప్రధానంగా మూడు రకాలైన ప్రయత్నాలు గోచరిస్తున్నాయని పేర్కొంటూ, వాటిలోనుంచి మార్క్సిస్టు విమర్శ ఎలా

నేడు రూపు కట్టుకొంటున్నదో వివరించాడు రేమండ్ విలియమ్స్. "When such application was eventually made, in the later Marxist tradition, it was of three main kinds: an attempted assimilation of 'literature' to 'ideology', which was in practice little more than banging one inadequate category against another; an effective and important inclusion of 'popular literature'-the 'literature of the people'-as a necessary but neglected part of the 'literary tradition'; and a sustained but uneven attempt to relate 'literature' to the social and economic history within which 'it' has been produced. Each of these last two attempts has been significant. In the former a 'traditionn has been genuinely extended. In the later there has beel an effective reconstitution, over wide areas, of historica, social practice, which makes the abstraction of 'literary values' much more problematical, and which, more positively, allows new kinds of readings and new kinds of questions about 'the works themselves.' This has been known, especially, as 'Marxist Criticism' (a radical variant of the established bourgeois practice) though other work has been done on quite different basis, from a wider social history and from wider conceptions of 'the people', 'the language,' and 'the nation'.[86]

పై మూడు ప్రయత్నాలలో మొదటిదానిని తెలుగులో అభ్యుదయ వాదులూ, మిగిలిన రెండింటిని విప్లవవాదులూ ప్రధానంగా బలపరిచారు. పాశ్చాత్యదేశ సాహిత్యాలతో పోల్చుకుంటే తెలుగులో మార్క్సిస్టు విమర్శ ఒక ఉద్యమంగా, ఇతర సాహిత్యప్రక్రియలలో వచ్చినట్లు – రాలేదని మార్క్సిస్టు విమర్శకులే భావిస్తున్నారు. "సాహిత్య విమర్శలో మూల సూత్రాల గురించిన చర్చే ఎక్కువ జరిగింది. సాహిత్యం ఫలానిది చెయ్యాలి, ఫలానిది చెయ్యగూడదు వంటి సూత్రీకరణలే ఎక్కువ జరిగినై ...... మార్క్సిస్టు విమర్శకు నమూనాగా గ్రహించదగిన గ్రంథవిమర్శగాని, ప్రక్రియా విమర్శగాని తెలుగులో ఇంకా రావలసి ఉంది".[87] అని చేకూరి రామారావుగారూ, "అభ్యుదయ సాహిత్యం మనకు దండిగానే వుంది. కాని, ఆ సాహిత్యం మీద విమర్శ పెద్దగా రానిది; ఏవో అప్పుడప్పుడు సమీక్షలూ, వ్యాసాల సంకలనాలూ తప్ప వివిధ ప్రక్రియలమీదా, ఒక్కొక్క రచనమీదా

రచయితమీదా సమగ్రమైన, స్థాయి కలిగిన విమర్శలు పరిశోధనలు వెలువడ లేదు. శ్రీశ్రీ సాహిత్యంమీదే ఈనాటికీ సమగ్రమైన విమర్శ లేదు. అభ్యుదయ సాహిత్య రంగంలో మేధావులైన విమర్శకులున్నారు. కాని, వారినుండి ఆశించినంత విమర్శ సాహిత్యాన్ని అందుకోలేకపోతున్నాం.[88] అని సంజీవమ్మగారు పేర్కొనటం ఇందుకు సాక్ష్యం.

సమన్వయ యుగ ప్రవృత్తితో మార్క్సిస్టు దృక్పథంతో విమర్శ వెలయించిన జి.వి. కృష్ణరావుగారి లాంటి వారిని నేటి మార్క్సిస్టు విమర్శకులు రాయిస్టులని పేర్కొంటూ వారి మార్గం నిర్దుష్టం కాదని త్రోసిరాజంటారు. "ఆంధ్ర సాహిత్యపునర్వికాసం" అన్న వ్యాససంకలన గ్రంథకర్త శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావు—జి. వి. కృష్ణరావు, గోపీచంద్ గార్ల అభిప్రాయాలను విమర్శించిన వైఖరి యీ విషయాన్ని తెలుపుతున్నది.[89] వారి మాటల్లో "రాయిస్టుల రచనలన్నీ మొత్తంగా తీసికుంటే వారు సాహిత్యంలో రావాలని కోరుతున్నమార్పు అభ్యుదయమూ కాదు, వారి దృక్పథం మార్క్సిస్టు దృక్పథమూ కాదు. సామ్రాజ్యవాద దౌనిసత్వానికి తలలొంచి 'ఉత్తర కుమార ప్రజ్ఞలు' కొట్టే కొందరి మధ్యతరగతి మేధావుల పదరుబోతుతనమే రాయిజము. స్వాతంత్ర్యోద్యమముతో సంబంధము లేని కొద్దిమంది మేధావుల రియాక్షనే రాయిజము. మార్క్సిజముతోగాని ప్రజలతోగాని దాని కెట్టి సంబంధమూ లేదు సరిగదా ప్రజల ప్రజాస్వామికానికీ, సర్వతో ముఖమైన జాతీయాభ్యుదయానికీ వ్యతిరేకము రాయిజం. ప్రజల సమస్యలను తీర్చి, ప్రజలకు నాయకత్వము వహించి నడుపజాలని కార్యక్రమము మార్క్సిస్టు కార్యక్రమం కాదు; కాజాలదు. అలాగే ప్రజలను ఉత్తేజపరచి కర్తవ్యపాలనా దక్షులను చేయజాలనిది ప్రజాసాహిత్యము కాజాలదు. ఈ సూత్రాలే రాయిస్టులు చేసే భావాలను పరీక్ష చేయటానికి పనికివస్తాయి."[90]

## అభ్యుదయవాద విమర్శ — శ్రీశ్రీ

తెలుగులో మార్క్సిస్టు విమర్శకు పాదు చేసి, నారు పోసినవాడు శ్రీశ్రీ. శ్రీశ్రీ ప్రధానంగా కవి; తరువాత విమర్శకుడు. ఆయనకు తిక్కన, వేమన, గురజాడలు అభిమాన కవులు. గురజాడ ప్రారంభించిన అభ్యుదయ

మార్గాన్ని మార్క్సిస్టు దృక్పథం వైపు మళ్ళించ ప్రయోగాలు చేసిన ప్రజ్ఞాశాలి. గురజాడకూ శ్రీశ్రీ కీ ఉన్న భేదాన్ని వివేచిస్తూ డా॥ మిరియాల రామకృష్ణ పేర్కొన్న అంశాలు విలువైనవి – "గురజాడది విశాలమైన మానవతా దృక్పథం. ఆయన నీతులు విషమ సమాజంలో చేదుమాత్రలే। మార్క్సిస్టు దృక్పథంతో చూస్తే గురజాడ ఆలోచనలు పాతబడిపోయాయి. చెట్టపట్టాల్ పట్టుకొని దేశస్థులంతా నడవటం కాక, మార్క్సిస్టులకు కావలసింది చెట్ట పట్టాల్‌పట్టుకుని కార్మికులంతా నడవడం। ఈ భావాలనే శ్రీశ్రీ తన కవిత్వంలో ప్రచారం చేసింది. పారిశ్రామిక విప్లవాన్నీ, జాతీయదృక్పథాన్నీ గురజాడ కోరితే, శ్రీశ్రీ మరో అడుగు ముందుకువేసి సామ్యవాద విప్లవాన్నీ, అంతర్జాతీయ దృక్పథాన్నీ కోరాడు....1915కు ముందరి దేశపరిస్థితుల ప్రభావంతో గురజాడ భావించిన అభ్యుదయం వేరు; 1930 తరువాతి ప్రపంచ పరిస్థితుల ప్రభావంతో శ్రీశ్రీ భావించిన అభ్యుదయం వేరు....అందుకే, గురజాడ సాత్త్విక ప్రవృత్తి సంస్కరణనే కోరితే, శ్రీశ్రీ ఆవేశప్రవృత్తి సమాజవిప్లవాన్ని కోరింది. ఈ శతాబ్ది రెండోదశలో గురజాడది ఒక ముందడుగైతే, నాల్గవదశలో శ్రీశ్రీది ఇంకోముందడుగు. కవితాసంవిధానాల లోనూ, వస్తువులోనూ కూడా శ్రీశ్రీది గురజాడను మించిన ముందడుగే. గురజాడ గొప్పగొప్ప ఆదర్శాలను గురించి ప్రబోధిస్తే, శ్రీశ్రీ వాస్తవాలను గుర్తుచేశాడు. శాస్త్రీయంగా ఏది సాధ్యమౌతుందో ఆ విప్లవాన్ని గురించి ఉత్సుకతను రేకెత్తించటమే శ్రీశ్రీ దృక్పథం."[91] ఇటువంటి దృక్పథమే శ్రీశ్రీ విమర్శలో కూడా వెలుగురేకల్లా కనపడుతుంది.

అయితే, నేటి మార్క్సిస్టు విమర్శకులు శ్రీశ్రీ విమర్శలో మార్క్సిస్టు పద్ధతి అంతగా లేదని భావిస్తున్నారు. 'శ్రీశ్రీ సాహిత్య విమర్శల్లో ఎక్కువ భాగం లక్ష్యప్రకటనలు. సాహిత్యంలో వర్గదృక్పథాన్ని, సోషలిస్టు రాజకీయాలతో సంబంధాన్ని, విప్లవచైతన్యోపదేశాన్నీ సమర్థిస్తూ ఉపన్యాసాలు చేశాడు; వ్యాసాలు రాశాడు....కాని, శ్రీశ్రీ విమర్శకుడుగా చేసిన గ్రంథ పరిశీలనలో మార్క్సిస్టు విశ్లేషణ అంతగా కనపడదు. ఆయన శ్రీశ్రీ గురజాడల మీద రేడియో ప్రసంగాలద్వారా చేసిన విమర్శల్లోగాని, ఇతర పరిశీలనల్లోగాని మంచి విమర్శకుడుగా కనిపించేమాట నిజమే అయినా అందులో మార్క్సిస్టు పద్ధతి ఎంతవరకు ఉన్నది? అనేమాట తెలిసినవాళ్ళు

చెప్పాలి"[92] అని తెలిసి తెలిసే డా॥ చేకూరి రామారావుగారన్నారు. ఆమాట నిజంకూడా. అయితే, శ్రీశ్రీ రచనలకాలం మార్క్సిస్టు సాహిత్య విమర్శ అనువర్తిత విమర్శగా అవతరించటానికి ప్రయోగం పురిటి నొప్పులు పడుతున్నకాలం. దానికి శ్రీశ్రీ విమర్శ సంకేతం. శ్రీశ్రీ వ్రాసిన విమర్శ అంతా సమీక్షాస్థాయిలో సాగింది. మెరుపులు మెరవటమే దాని స్వభావం. విద్యుత్తుగా ప్రవహించటం కాదు.

1969 నవంబురులో శ్రీశ్రీ 'సృజన' కిచ్చిన ఇంటర్వ్యూలో కన్యాశుల్కం బీభత్సరసప్రధానమైన విషాదాంత నాటకమని 'ఆయన ప్రకటించిన అభిప్రాయాన్ని వివరించుమని వరవరరావు, నవీన్‌గారలు అడిగినప్పుడు- 'నావని hints యివ్వటం వరకే'-అని శ్రీశ్రీ సమాధానం చెప్పాడు. అంతే కాక 'వాటి ఆధారంతోనే మీలాంటివాళ్ళు కన్యాశుల్కాన్ని బాగా స్టడీచేసి ఆ hintsను విశదీకరిస్తూ వ్యాసాలు రాయాలి'లని సలహా చెప్పాడు. నిజానికి శ్రీశ్రీ మాటలు ఆ ప్రశ్నకే కాదు, ఆయన సాహిత్య విమర్శకు కూడా వర్తిస్తాయి. సూచనలిచ్చే సూత్రప్రాయమైన సమీక్ష శ్రీశ్రీ సాహిత్యవిమర్శ.

శ్రీ శ్రీ విమర్శలో మెరుపులా కనపడే కొన్ని అభిప్రాయాలు మార్క్సిస్టు దృక్పథాన్ని అనువర్తిత విమర్శలో వెలయింపచేయటానికి తగిన అవగాహన కలిగించటానికి తోడ్పడ్డాయనటంలో అనుమానం లేదు.

1. 'నేటి సాహిత్యపరులలో మూడురకాలు నాకు కనపడతారు. వీరిలో మొదటి రకం, నిజంగా సాహిత్యం నాశనమైపోతున్నదని గట్టినమ్మకం ఉన్నవారు. పూర్వసంస్కారమంతటికీ తాము కావలాదారుల మనుకుంటారు.. ఇక రెండోరకం వారున్నారు. ఆ కాలానికి ఏవిధానం అమలులో ఉంటే దానికి నివాళు లెత్తుతారు. సులువుగా దేనినైనా అనుకరించగలిగినపాటి తెలివి తేటలుంటాయి వీరికి....ఇక మిగిలిన రకం రచయిత ప్రజలమధ్య, ప్రజలతో కలిసి జీవిస్తాడు. అనగా గ్రంథావలోకనం చెయ్యడని కాదు. వెనుకటి రచయితలనీ, సమకాలికులనీ, గ్రంథజాలాన్నీ క్షుణ్ణంగా మధిస్తాడు. ఇదంతా తన రచనానైపుణ్యాన్ని, టెక్నిక్‌ని పెంపొందించుకోవడానికి

మాత్రమే. అది యితరులను అనుకరించటంవల్ల లభ్యమయ్యేది కాదు. అన్నివిధానాలనూ ఆకళించుకోవడంవల్ల తనదైన ఒకానొకపద్ధతి అతని కలవడుతుంది. అదొక ఆయుధం. దానితో పరిజ్ఞాయత్తమైన పరియోజనాన్ని సాధిస్తాడు. ఈ మూడు రకాల రచయితలలో మొదటివారిపట్ల జాలి వహిస్తాను, రెండోరకం అంటే అసహ్యించుకుంటాను. మూడో తెగవారి మీద నా కాదరం, గౌరవం."[93]

2. కవిత్వాన్నీ, సంవిధానాన్నీ తీసుకొని కూర్పులు చేస్తే నాలుగు విధములైన జంటలు ఏర్పడుతవి. వీటిలో నాలుగో విధమే సర్వోత్కృష్ట మైనది. 1. — కవిత్వము — సంవిధానం. 2. —కవిత్వం, + సంవిధానం, 3. + కవిత్వం—సంవిధానం. 4. + కవిత్వం. + సంవిధానం. ఇందలి మూడో విధానాన్ని తీసికొని కొందరు రసవాదులు 'భావముంటే చాలును, ఎట్లు చెప్పినను సరే' అనవచ్చును. కాని, వారు సర్వసమగ్రతను కోరలేదని చెప్పాలి. ఏ విషయంలో కొరవడినా కవిత్వము ఉత్కృష్టము కానేరదు. కావున మహత్తర భావాలను మహత్తర విధంగా ప్రతిపాదించేదే ఉత్కృష్ట కవిత్వం."[94]

3. 'ఆధునిక కవిత్వం అర్థం కాలేదంటే ఇతనికి ఆధునిక జీవితమే అర్థంకాలేదన్నమాట. ఇతడు కళ్లు మూసుకొన్నాడు; అస లితని ప్రపంచమే శిథిలమైపోయింది. ఇతనిని ఉన్నచోటనే వదలిపెట్టి నూతన జీవితం హుటాహుటిగా తరుముకు వస్తున్నది. నవకవులు దీనినే ఆరాధిస్తున్నారు'[95]

4. 'జీవితంలోనూ కవిత్వంలోనూ సంప్రదాయ వాదానికీ, విప్లవ వాదానికీ మధ్య ఎడతెగని పోరాటం ఎప్పుడూ సాగిపోతూనే ఉంటుంది. నిన్నటి విప్లవవాది నేటి సంప్రదాయవాదిగా, ఘనీభవించటం కూడా మనం చూస్తూ ఉన్నదే"[96]

5. సంపూర్ణమైన స్వాతంత్ర్యం ఎలాగయితే ఒక ఆదర్శప్రాయం గానే ఉండి యెన్నటికీ అందుకో రానిదో అలాగే అచ్ఛకవిత్వం కూడా ఎంత వాడికీ అందుకోరానిదే. కవిత్వమూ, స్వాతంత్ర్యమూ ఎవ్వరికీ, ఎప్పటికీ అందని అందాలే అయినప్పటికీ వాటిని సాధించాలనే ప్రయత్నంలోని

ఆవేగంలోనే, ఆవేగంలోని అశాంతిలోనే, అశాంతిలోని ఆనందంలోనే ఉంది జీవితానికి సార్థక్యం'.[97]

6. 'కవిత్వం ఉంది. దీనిలో Pure Poetry శుద్ధ కవిత్వం, కేవల కవిత్వం, అకల్మష కవిత్వం, కవిత్వం తప్ప మరేదీ కాని, మరి దేనితో కలుషితం కాని కవిత్వం ఒకటి. Applied Poetry ఇంకొకటి-అనగా ఉపయోగ్య కవిత్వం, వ్యవహార కవిత్వం.'[98]

7. 'సామ్యవాద వ్యవస్థ మానవపురోగమనంలో ఒక మజిలీ మాత్రమే. దారిద్ర్యం, నిరుద్యోగం, సరుకు గిరాకీ అనే పునాదులమీద నిలబడే పెట్టుబడీదారీ విధానానికి బదులు సమృద్ధి, సమానావకాశాలూ గల సామ్యవాదసంఘం ఏర్పడినప్పుడు ఆ ప్రజల సాహిత్యావసారాలు ఏరూపం ధరిస్తాయో, ఆతర్వాత వాళ్లు వేసే ముందడుగు ఎట్టిదో ఊహించటం కష్టం. అయితే అప్పుడుకూడా తిక్కనసోమయాజిని చదవకుండా తిక్కన సోమయాజిని గురించి మాట్లాడేవాళ్ళూ, అందరాని దేనికోసమో అశాంతిపొందే వాళ్ళూ ఉంటారని మాత్రం చెప్పవచ్చును.[99]

8. "సాహిత్య విమర్శకీ, పులుసు విమర్శకీ తేడా ఉంది."[100]

9. 'భావం, భాష, సంఘం—వీటికి అవినాభావ సంబంధం వుంది- వీటిలో ఏది ముందా ఏది వెనకా అన్న తికమక అవసరం లేదు. ఆకారానికి తగిన అంతస్తు వుంటేనే సాహిత్యం రాణిస్తుంది. చెప్పే విధానానికీ, విషయానికీ, అమరిక వుండాలి. రచన శస్త్రం లాంటిది. దాని నుపయోగించే పద్ధతినిబట్టి ఫలితం ఉంటుంది. రచనవల్ల ఉపయోగమూ, ఉపదేశమూ ఉండాలని అభ్యుదయరచయితలు కోరుతున్నారు.'[101]

10. 'చారిత్రకదృష్టి అలవరచుకోకపోతే ఎన్నో అనర్థాలు వాటిల్లి తీరుతాయి. తప్పకుండా చరిత్రను శాస్త్రదృష్టితో పఠింపవలసిందే. కాని, వెనక్కి తిప్పటానికి వీలులేని కాలాన్ని పునస్థాపించగల్గుతా మనుకోవటం వెఱ్ఱితనం.'[102]

11. 'అభ్యుదయరచయితలు సాహిత్యంలో ఒక తిరుగుబాటు తెచ్చినమాట నిజం. ఈ విప్లవం దేనిమీద? దేనిమీద అయినప్పటికీ, ప్రాచీన సాహిత్యం మీద మాత్రం కాదు'[103]

12. 'తాను ఏ సాంఘిక దురన్యాయాలను నిర్మూలించాలని ఆవేదన పడుతున్నాడో, వాటి నిర్మూలనకే ఒక రాజకీయపక్షంకూడా ప్రచారంసాగిస్తే, కవి తన శిల్పాన్ని తప్పకుండా ఆ పక్షానికి అంకితంచేసి తీరుతాడు. అది లోపలినుంచి పుట్టుకవచ్చే ప్రేరణగాని, బలవంతంగా విధించిన నిర్బంధం కాదు.'[104]

13. 'ఇది ప్రచారం, ఇది శుద్ధశిల్పం అని ఏ రచనలనూ వేరుపరచ లేము. మనకు నచ్చని భావాలైతే ఏవగించుకుంటాము. నచ్చితే మరీ మరీ చదువుతాము. రెండువిధాలా రచన మనమీద తన ప్రభావం ప్రసరింప జేస్తూనే ఉంది. ఒకటి ప్రతికూల ప్రచారమూ, ఇంకొకటి అనుకూల ప్రచారమూ.'

14. 'కావ్యంలోని శిల్పాన్ని, వస్తువును. Technique, Form and Content విడమరచలేము. కావ్యం వివిధ దశలలో అవి ఒక దానితో మరొకటి సమానంగా పెంపొందుతూ వుంటై. ఈ సమానాభివద్ధి ఉంటేనే మంచికావ్యం తయారవుతుంది. కావ్యంలో చెప్పేది యేదైనా బాగా చెప్పబడి వుండటంవల్ల అది మంచిది కాదు. చెప్పినదానికి, చెప్పిన విధానానికీ సమాన మైన ప్రాధాన్యం ఉంటుంది.'[106]

15. 'కవిత్వం పాత, కొత్త రీతులమధ్య విద్వేషపూరితమైన వాదోప వాదాలు, అసభ్యకరమైన విమర్శలు ప్రతివిమర్శలు జరగడం సాహిత్యానికి గౌరవప్రదమైన విషయం కాదు. పాత, కొత్తలు రెండూ రెండు పద్ధతులు. వీటి రెంటికినీ మూలం, లక్ష్యం మాత్రం ఒక్కటే. తరచు ఇతివృత్తమే సాహిత్య స్వరూపాన్ని నిర్ణయిస్తుందని నా విశ్వాసం.'[107]

16. 'సమాజం మారుతున్నట్లే సాహిత్యం కూడా మారుతూ ఉంటుంది. పైగా సమాజంకంటె ముందుగానే సాహిత్యం మారుతూ

ఉంటుంది. ఏమంటే సాహిత్యవ్యాసంగమంతా భావనాలోకానికి సంబంధించింది. చిరకాలం పాతభావాలు పాతుకుపోయిన మనస్సులలో నూతన భావధోరణులు వ్యాపించాలంటే అది సాహిత్య విప్లవం ద్వారానే సాధ్యం. నిన్నటి విప్లవం నేటి సంప్రదాయమవుతుంది. ఈనాడు అసంగతంగానూ, అసాధ్యంగానూ తోపించే యెన్నో సాంఘిక పరిణామాలు రేపు సర్వసామాన్యమౌతాయి. కవిత్వం భవిష్యత్తుకు దర్పణం. ఇవేళ ఎవరికీ బోధపడని సత్యం రేపు అందరికీ అందుబాటులోకి వస్తుంది. కవిత్వం చేసే ప్రయోగాలన్నీ ఆ సత్యాన్ని అన్వేషించటం కోసమే. ఏ రూపు ధరించినా కవిత్వానికి పరమార్థం ఆ సత్యాన్ని చాటించటమే.'[108]

17. 'Marxism-Leninism మీద నమ్మకం లేనివాడు అభ్యుదయ రచయిత కాలేడు. నేను Marxistను. Marxism is an article of faith with me. మన దేశంలోని సమస్యలన్నింటిని Marxist సిద్ధాంతం ద్వారానే పరిష్కరించుకో గల్గుతామని నావిశ్వాసం.'[109]

18 'కమ్యూనిస్టు ఉద్యమంలో దురదృష్టవశాత్తు ఏర్పడిన చీలికలలో నాది ఏపక్షం అని నన్ను ప్రశ్నించటం జరుగుతోంది. మొత్తం కమ్యూనిస్టు ఉద్యమాన్నే నేను అభిమానిస్తున్నాను. నేను కలలు కన్న నూతన మానవ సమాజం కమ్యూనిజం ద్వారానే ఏర్పడగలదని నాదృఢ విశ్వాసం. అందుకు ఈ చీలికలవల్ల ఎంతయినా హానికలుగుతుంది.'[110]

శ్రీశ్రీ వెలువరించిన అభిప్రాయా లన్నింటింతో నేటి మార్క్సిస్టు విమర్శకు లంగీకరించటం కష్టం. దానికి మార్క్సిస్టు సిద్ధాంతాలలో వచ్చిన మార్పులే కారణం. ఒక విధంగా శ్రీశ్రీ మూడు తరాలకు వారధిగా ఉన్నాడు. ఒకనాడు భావకవిత్వ ప్రభావానికి వశుడై 'ప్రభవ'ను ప్రకటించాడు. దాని నుండి విడివిడి అభ్యుదయకవితా మార్గంలో మార్గదర్శిగా ముందుకు నడిచాడు. అభ్యుదయ కవితాయుగ చైతన్యాన్ని తన సాహిత్యంతో సముల్లసితం చేశాడు. ఆ తరువాత విప్లవకవితా ధోరణులను ప్రోత్సహించాడు. అందులో ఒక 'ఝంఝు'గా రూపొందాలని యత్నించాడు. కాని, చివరకు విప్లవరచయితల సంఘంనుండి బహిష్కరింపబడ్డాడు. అభ్యుదయవాదంనుండి విప్లవవాదం

వరకూ సాగిన శ్రీశ్రీలో స్థిరత్వం లేదని కొందరు విమర్శించారు. అయినా, జీవించటమంటే ప్రవహించటమని ఆయన పేర్కొన్నారు. "కాబట్టి శ్రీశ్రీకి స్థిరం లేదంటున్న వాళ్ళందరికీ నాకృతజ్ఞత. జీవించటం అంటే ప్రవహించటం కాబట్టి నేను జీవిస్తున్నానన్న నిజాన్ని వాళ్ళు గుర్తిస్తున్నారు కాబట్టి"—[111] అని శ్రీశ్రీ సమాధానం. అయితే మార్క్సిస్టు విమర్శలో శ్రీశ్రీ స్థానమేమిటి? అన్న ప్రశ్న మనకు మిగులుతుంది. ఒక్కమాటలో చెప్పాలంటే — తెలుగులో వచ్చిన మార్క్సిస్టు విమర్శలో మొదటిదశగా లెక్కింపదగిన అభ్యుదయవాద విమర్శకు శ్రీశ్రీ ప్రస్థానభేరి మ్రోగించిన మొదటి విమర్శకుడుగా తన ప్రత్యేకతను సాధించుకొన్నాడు.

## అభ్యుదయ—విప్లవ ధోరణులు

మార్క్సిస్టు ఉద్యమంలో వచ్చిన మార్పులు రాజకీయ సిద్ధాంతాలమీద ఆధారపడి ఉన్నాయి. వాటిని ఆశ్రయించుకొని సాహిత్యరంగంలో ఆయా కాలాలలో మార్పులు రావటం సంభవించింది. ఈ అంశాన్ని చారిత్రక దృష్టితో పరిశీలించి వివరించిన డా॥ చేకూరి రామారావుగారి మాటలు విశ్లేషణకు బాగా తోడుపడతాయి.

1. '1962—64 సంవత్సరాల కాలంలో కమ్యూనిస్టు ఉద్యమంలో చీలికలు మొదలయినై. ఇంకా సాగుతూనే ఉన్నై. ఈ చీలికలనుగురించి రష్యన్ మిత్రుడు నికితాగురోవ్ చెప్పిన ఒకజోక్ గుర్తొస్తున్నది. రష్యాలో పిల్లలు, 'Let us play the Indian game. Let us split' అంటారు.'[112]

2. రాజకీయంతో సంబంధం లేని సాహిత్య విప్లవవాదమంటూ ఏదీ లేదు. రాజకీయమనే మాటకు కమ్యూనిస్టుల్లోకూడా ఒకే అర్థం ఉన్నట్టు లేదు. సాయుధపోరాటమే విప్లవమని కొందరంటే,సోషలిజం దిక్కుగా జరిగే పరివర్తనమే విప్లవమని మరికొంద రంటారు. తెలుగుభాషక్కు సమగ్రమైన నిఘంటువు తయారుచేసేవాళ్లు 'విప్లవం' అనే మాట కున్న అర్థభేదాలు వివరించదల్చుకుంటే చాలా శ్రమపడాలి.'[113]

3. 'సాహిత్యంలో అభ్యుదయవాదం - విప్లవవాదం అని రెండు భేదాలున్నై. విప్లవవాదుల్లో అరుణోదయ-జననాట్యమండలి భేదా లొకవంకా, వి. ర. సం., జనసాహితి భేదా లొకవంకా ఉన్నాయి.'[114]

4. '1946 నుంచి 1948 వరకూ కమ్యూనిస్టు ఉద్యమం ఆంధ్ర దేశంలో బలంగా ఉంది. అభ్యుదయ రచయితల సంఘాని కది స్వర్ణ యుగం.'[115] (అ. ర. సం. 1943లో స్థాపించబడింది).

5. 'వి. ర. సం. (1970) ఏర్పడ్డ తొలిరోజులలో రాజకీయ పార్టీలతో దానికి ఉండాల్సిన సంబంధం విషయంలో చాలా తర్జన భర్జనలు జరిగినై. విరసం రాజకీయాలకు అతీతమూ కాదు ఆధీనమూకాదు అని రమణారెడ్డి గారన్నారు. విప్లవ రచయితల సంఘం ఒక రాజకీయపక్షాన్ని అనుసరించి వెళ్ళడానికి నాకు అభ్యంతరం ఉన్నదని కుటుంబరావుగా రన్నారు.'[116] (సృజన-16, ఆగస్టు 1970)

6. వి ర.సం. నాటికీ అభ్యుదయ రచయితల సంఘకాలానికీ ఉన్న ప్రధాన భేదం ఒకటి ఉంది. రచయితల సంఘానికి రాజకీయలక్ష్యాన్ని సూచించే పార్టీ ఒకటే ఉండేది తొలినాటి అ. ర. సం. రోజుల్లో. వి.ర.సం. ఏర్పడ్డప్పుడు విప్లవపార్టీలు-లేక-గ్రూపులు కనీసం మూడైనా ఉన్నాయి. "మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానాన్ని జనరల్‌గా ఆమోదించినా, దాన్ని భారతదేశ నిర్దిష్ట పరిస్థితులకు అన్వయించటంలో విప్లవకారులందరి మధ్యా ఏకాభిప్రాయం లేదు" (వి.మా.వ్య.ధో.(ప్ర.). వి. ర. సం. ఈ విప్లవ గ్రూపులన్నిటికీ వేదికగా ఉంది. ఈ విప్లవగ్రూపుల మధ్య పోటీ ఉండటం సహజం. ఉన్న సంఘాన్ని తమ కార్యక్రమానికి అనుకూలంగా మార్చుకోవటానికి ప్రయత్నించటమూ సహజమే. సరిగ్గా అదే జరిగింది.[117]

7. 'ఈ చీలికలు అన్నివేళలా సిద్ధాంతప్రాతిపదిక మీదనే జరుగుతాయని అనుకోను. ఒక్కొక్కసారి నాయకుల స్వభావాలు కూడా కారణం కావచ్చు. కాని, కాగితం మీద సిద్ధాంతాలే కనిపిస్తాయి....రచయితల సంఘం రాజకీయ పార్టీ కాని మాట నిజమే. కాని, ఈ రెంటికీ ఉన్న సంబంధం ప్రణాళికల్లో వ్యక్తమైనదానికన్నా అధికమైనది.'[118]

8. '1970-1980 సంవత్సరాల మధ్యకాలం తెలుగులో విప్లవవాద యుగంగా గుర్తించవచ్చు. తెలుగు సాహిత్యంలో అంతకు ముందున్న కేవల రూపవాద, అయోమయ వ్యక్తి వాద సాహిత్య రీతుల మీద విప్లవవాదం విజయం సాధించిందనే చెప్పవచ్చు. ఈ కృషి కవిత్వంలో జరిగినంత వచనంలో జరగలేదు.'[119]

9. 'ఇక సాహిత్య విమర్శలో మూల సూత్రాల గురించిన చర్చే ఎక్కువ జరిగింది. సాహిత్యం ఫలానిది చెయ్యాలి, ఫలానిది చెయ్యకూడదు వంటి సూత్రీకరణలే ఎక్కువ జరిగినై'[120]

పై పరిశీలనను దృష్టిలో ఉంచుకొని వివేచిస్తే- తెలుగులో మార్క్సిస్టు ఉద్యమం సాహిత్యపరంగా దాదాపు 1940 నుండి 1970 దాకా అభ్యుదయ వాద ధోరణిగా సాగిందనీ, 1970 నుండి 1980 దాకా విప్లవవాద ధోరణిగా రూపొందిందనీ నిర్ణయించటానికి వీలున్నది. ఇందులో శ్రీశ్రీ అభ్యుదయ వాద ధోరణికి సంబంధించినంతవరకు అగ్రగామి విమర్శకుడని నిరాఘాటంగా చెప్పవచ్చు. మరోవిశేషం-"ప్రగతి, పురోగమనం అన్న అర్థం వచ్చేటట్లుగా అభ్యుదయ పదాన్ని మొట్టమొదట వాడినవాడు శ్రీశ్రీ .... 1937లో ఆయన రాసిన 'అభ్యుదయం' అన్న ఖండికలో ఈ పదం వాడాడు. ఇంచుమించుగా మొదటిసారి 'అభ్యుదయం' అన్న పదాన్ని సాంప్రదాయిక అర్థంతో కాక నూతన అర్థంలో, నేటి అర్థంలో ప్రయోగించాడు శ్రీశ్రీ."[121]

## శ్రీశ్రీ - సోషలిస్టు మానవతావాదం

సాహిత్య విమర్శకుడుగా శ్రీశ్రీ వ్యక్తంచేసిన భావాలను క్రోడీకరించి చూస్తే మార్క్సిస్టు విమర్శ పద్ధతులలోని సోషలిస్టు మానవతావాద ధోరణి ప్రధానంగా ఆయన మీద ప్రభావం వేసినట్లు గోచరిస్తుంది. సోషలిస్టు మానవతా వాదాన్ని గురించి లూకాక్స్ ఇలా పేర్కొన్నాడు- 'Socialist humanism is the core of Marxist aesthetics and of the materialist conception of history. Contrary to bourgeois preconceptions reinforced by the gross, anti-dialectical conception of history of vulgar Marxism, this materialist conception, which probes universally to the roots, doesnot deny the aesthetic beauty of

blossoms. On the contrary, the materialist conception of history and Marxist aesthetics alone provide the key to an understanding of the unity and organic relationship of roots and blossoms"

"Social humanism accomplishes the unification of historical and purely artitistic knoweledge within Marxist aesthetics, the continuous convergence of historical and aesthetic evaluation. Thus Marxist aesthetics resolves the question with which men of stature have long been grappling (a question which eluded lesser men simply because they were lesser men): the integration of enduring aesthetic value of a work of art into the historical process, the process from which the work in its very perfection and aesthetic value is inseparable."[122]

శ్రీశ్రీ కళాలతకున్న మూలాలను చూడగలడు; పుష్పాలనూ ఆఘ్రాణించగలడు. ఆరెండింటికీ మధ్యఉన్న భావభౌతిక సమన్వయాన్ని సమీక్షింపగలడు. మార్క్సుదృక్పథంతో ఒక కావ్యంయొక్క చారిత్రకపరిణామ వాస్తవస్థితినీ నిర్ధరించగలడు; ఆ కావ్యకళలో ఉన్న రచనాసౌందర్యపు విలువలను వివేచించగలడు. శ్రీశ్రీ సహజంగా కవి, కవితాత్మగల విమర్శకుడు. అతని కవితలో మార్క్సిజం భావచైతన్యాన్ని, రూపవైభవాన్ని సంతరించుకొన్నది; అతని విమర్శలో విలువల వివేచనాన్ని వ్యక్తీకరించింది. బహుశః మార్క్సిస్టు విమర్శకులలో గతిభౌతికతార్కికవాదంతో సౌందర్యతత్త్వ దృక్పథాన్ని అన్వయించి అనుశీలనంలో అలవోకగా, ఆవిష్కరింపగలిగిన వారెవరని ప్రశ్నించుకుంటే– శ్రీశ్రీయే కనిష్ఠికాధిష్ఠితుడని తెలుగువాడి హృదయం మారుపలికితే ఆశ్చర్యపడవలసిన పనిలేదేమో! మార్క్సిజం + మానవతావాదం = శ్రీశ్రీ.

## కొడవటిగంటి కుటుంబరావు - సామ్యవాద వాస్తవికత

మార్క్సిస్టు విమర్శకులలో శ్రీశ్రీ తరువాత పేర్కొనదగినవాడు శ్రీకొడవటిగంటి కుటుంబరావు. ప్రసిద్ధకథారచయితగా పేరుపొందిన కుటుంబరావుగారు అభ్యుదయవాద ధోరణికి సంబంధించిన సమీక్షావ్యాసాలు కూడ

రచించారు. వాటిని విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్‌వారు 'సాహిత్య ప్రయోజనం' అనే పేర షష్టిపూర్తికానుకగా 1969లో ప్రకటించారు. కథ, చిన్నకథ, నవల మొదలైన ప్రక్రియలమీద వారు చేసిన సమీక్ష గణనీయం. సాహిత్యం, సాహిత్య విమర్శలను గురించి, అభ్యుదయవాద ధోరణులను గురించి వారు ప్రకటించిన అభిప్రాయాలపై మార్క్సిస్టు విమర్శ పద్ధతిలో సామ్యవాద వాస్తవికతాదృక్పథ ప్రభావం బలంగా కనబడుతుంది. శ్రీశ్రీ మార్క్సిస్టు మానవతావాద ధోరణినుంచి సామ్యవాద వాస్తవికతాదృక్పథంవైపు విమర్శను మరలించిన గౌరవం ఈయనకు దక్కుతుంది.

సామ్యవాద వాస్తవికతను గురించి అభ్యుదయవాదులకూ, విప్లవవాదులకూ ఉన్న అభిప్రాయాలను డా॥ కె.కె. రంగనాధాచార్యులు ఇలా పేర్కొన్నారు. "వాస్తవికతలో రెండు ప్రధానమైన అంశా లున్నాయి. సవిమర్శక వాస్తవికత (Critical Realism), సామ్యవాద వాస్తవికత (Socialist Realism), వాస్తవికతను ప్రతిబింబించటంతోపాటు సామాజిక జీవిత సమస్యలకి పరిష్కారాన్ని సూచించటం కూడా వాస్తవికతలో భాగమని వాస్తవికతావాదు లంటారు. సమాజాన్ని చారిత్రక దృష్టితో అవగాహన చేసికొని, ప్రయోగదృష్టితో చిత్రించడం కూడా వాస్తవికతలో భాగమే. సమాజంలోని అన్యాయాలను, అసమానతలను, ఆర్థికసామాజిక వ్యత్యాసాలను, సవిమర్శకంగా ఖండిస్తూ చేసిన రచనే సవిమర్శక వాస్తవిక రచన. "కమ్యూనిస్టు అస్విత్వకి విషయంలో అచంచలనిష్ఠ, ప్రజాసేవానిరతి, పాక్షికత, పారిశ్రామిక జన సమరాలతో సన్నిహితసంబంధం, సోషలిస్టు మానవత, అంతర్జాతీయత, చారిత్రక ఆశాభావం, రూపవాద, వ్యష్టివాద, సహజవాదాల తిరస్కృతి."[123]— ఈ లక్షణాలతో కూడిన వాస్తవికత సామ్యవాద వాస్తవికత. "సామ్యవాద వాస్తవికత అన్నది ఒక సిద్ధాంతదృక్పథం. దానిలో వాస్తవికతావాదం, సవిమర్శక వాస్తవికతావాదం అంతర్నిహితంగా ఉన్నాయి. సామాజిక చైతన్య ప్రేరితమైన భౌతిక పరిస్థితులలో తిరుగుబాటు ధోరణులన్నీ సోషలిస్టు వాస్తవికతలోని అంతర్భాగాలే. సోషలిజం వచ్చాకనే సామ్యవాద వాస్తవికతకు చోటుందనటం కూడా సత్యం కాదు. 1917 నాటి సామ్యవాద విప్లవానికి పూర్వమే గోర్కీ ఇత్యాదులు సామ్యవాద వాస్తవిక రచనలు చేశారు"— అని అభ్యుదయ వాదులు భావిస్తున్నారు. విప్లవకవులు సవిమర్శక వాస్తవికతకు

స్పష్టమైన భేదాన్ని సూచిస్తున్నారు. "సామాన్య ప్రజాస్వామ్య వైఖరిమీద విమర్శనాత్మక వాస్తవికత ఆధారపడి ఉంటుంది. శాస్త్రీయ ప్రజాస్వామ్యం మీద సామ్యవాద వాస్తవికత ఆధారపడి ఉంటుంది"– అని వీరంటారు. వర్గ సమాజంలో విమర్శను చేపట్టేదే సవిమర్శక వాస్తవికత అని, ఇది భవిష్యత్తును సూచించ దని, బహుముఖమైన వర్తమాన సమాజాన్ని వర్ణించటమే దీని ప్రయోజన మనీ, చారిత్రక పరిణామాలను విశ్లేషిస్తూ జనజీవితంలో చొచ్చుకొని పోయి స్పష్టమైన భావిని చిత్రించటమే సామ్యవాద వాస్తవికత అనీ, సమూహ అనుభవాలే సామ్యవాద వాస్తవికతకు వస్తువులని విప్లవవాదు లంటారు"[124] ఇందులో కొడవటిగంటి కుటుంబరావుగారు అభ్యుదయవాదుల దృక్పథంతో సామ్యవాద వాస్తవికతను తమ సమీక్షలలో ప్రతిబింబింపచేశారు. ఈ క్రింది అభిప్రాయాలు[125] వారి దృష్టిని వ్యక్తీకరిస్తాయి.-

1. "నేను రెండు నమ్మకాలకు కట్టుబడ్డాను. ఒకటి, సాహిత్యానికి సాంఘికప్రయోజం ఉండాలన్నది; రెండోది, జీవితచిత్రణ వాస్తవికంగా ఉండాలన్నది. (సాహిత్య ప్రయోజనం. పు. 222)

2. "కళలకు విస్పష్టమైన వర్గప్రయోజనం ఉండటం అసంభావ్యం కాదు. నిజమయిన అభ్యుదయకళలన్నీ ప్రత్యక్షంగానో, పరోక్షంగానో శ్రామికవర్గ ప్రయోజనానికి అనుకూలంగానే ఉంటాయి. కాని, వాటి స్వభావం సామూహికంగా ఉండాలి. అంటే, శ్రామికవర్గానికి చెందని వాళ్లు కూడా వాటి ప్రభావానికి బలంగా గురికావాలి." (పు. 199)

3. 'కమ్యూనిస్టు సాహిత్య మనేది కూడా ఉన్నది. ఇది రాజకీయాలకూ ఆర్థికాలకూ మార్క్సిస్టు లెనినిస్టు రచనలకూ సంబంధించి ఉంటుంది.' (పు. 177)

4. 'సాహిత్యం సాంఘిక చైతన్యంలో ఒకశాఖ. ప్రాణికి నాళ్లు ఆడటమూ, ఊపిరితిత్తులు పనిచెయ్యటమూ ఎంత తప్పనిసరో సజీవమైన సంఘానికి కూడా చైతన్యం అంత తప్పనిసరి. తప్పనిసరి అయిన చైతన్యం తప్పనిసరి అయిన మార్పుకు దారితీస్తుంది. మార్పులోకూడా రెండు రకాల మార్పులున్నై. ఒకటి, స్థలంలో మార్పు; రెండోది,

స్వరూపంలో మార్పు. ఈ రెండింటిలో స్వరూపంలో మార్పే చాలా ముఖ్యమైనది.' (పు. 40)

5. 'అభ్యుదయ సాహిత్యం ఒక ప్రబలమైన సామాజికశక్తి' (పు. 45)

6. 'అభ్యుదయ సాహిత్యం సాగాలంటే రచయితకీ, సంఘానికీ ఒక సజీవసంబంధం—ఒక Organic connection-ఉండాలి : రచయిత తాలూకు ప్రభావం సంఘంమీద ఉన్నంతమాత్రాన లాభం లేదు. సంఘం యొక్క ప్రభావం రచయితమీద కూడ ఉండాలి. ఇప్పటి కవులలోనూ అనేక మంది, ఈ విషయం గుర్తించినట్టయితే, ఉత్తమ అభ్యుదయ రచన చెయ్యగలరు. కాని, 'నేను సమాజంమీద నా ప్రభావం చూపుతాను; సమాజం మట్టుకు నన్నంటటానికి వీల్లేదు'—అనే వ్యక్తిత్వం—Individualism-అవలంబించే రచయిత అభ్యుదయ సాహిత్యం సృష్టించలేడు' (పు. 46)

7. 'అభ్యుదయ ఉద్యమంతోపాటు కళాసాధనకూడా సాగించటం అభ్యుదయ రచయితల విధి. కొందరు రచయితలు అభ్యుదయోద్యమాన్ని మాత్రమే పాటించి, కళానిర్వచనాలను ఉపేక్షిస్తున్నారు....కళలన్నీ అభ్యుదయకరమైనవి కాకపోవచ్చును. కాని, కళలను అభ్యుదయానికి వినియోగపరచటం మన అభ్యుదయ రచయితల ఆశయం. అందుచేత రెండు విషయాలు మన పాటిస్తాం. కళ కాని దానికి మనం కళార్హత ఇవ్వం. కళార్హత ఉన్నప్పటికీ సాంఘికాభ్యుదయానికి పాటుపడనట్లయితే దాన్ని మనం ఆదరించం.' (పు. 57, 58)

8. 'ఏవో సాంఘిక సిద్ధాంతాల ఆధారం లేకుండా మన కళలూ సాహిత్యమూ అభివృద్ధి అవుతాయన్నది కేవలమూ భ్రమ-' (పు. 126)

9. 'మన సంఘంలో 'గాలి సాము చేసే Pure artists ఉన్నారనీ కేవలమూ కళాసాధనతోటే వారు సమగ్రమైన ఆనందం తాము పొంది ఇతరుల కిస్తున్నారనీ అభ్యుదయవిరోధులు వాదిస్తారు. అటువంటి కళాసాధకులలో సాంఘికచైతన్యం రాలేదని మనం వారికి సమాధానం చెబుతాం

ప్రజలను ఉమ్మడిమీద తీసుకుంటే ఇటువంటి Pure artistsతో వారు ఒక్క నాటికీ ఉత్తేజపడరని కూడా మనం చెబుతాం' (పు. 60)

10. 'కళా కారుడికి.... స్వేచ్ఛ అతి ముఖ్యమైనది. అది లోపిస్తే వాడు కళాకారుడే కాడు. అదేమిటంటే తన కళను ఉత్తమ సాంఘిక ప్రయోజనానికి అంకితం చేసే స్వేచ్ఛ.' (పు. 157)

11. 'సంఘవిద్రోహశక్తులతో ఈనాడు శ్రామికులూ, శక్తిహీనులూ విజయవంతంగా పోరుతున్నారు. వారి శక్తులను ఇందుకుగాను అపూర్వంగా కేంద్రీకరిస్తున్నారు.... ఈ ప్రజాశక్తులను బలపరచటమూ, వీరి అసామాన్య పరాక్రమాలను గుర్తించి కీర్తించడమూ మనవిధి.' (పు 60—61)

12. 'మనకు విమర్శ తగుమాత్రం లేకపోవటం కూడా ప్రతిబంధకంగా ఉంది. ఆత్మవిమర్శ అభ్యుదయ రచయితయొక్క ఉత్తమోత్తమ సాధనం. దాని ద్వారానే మనం మన లోపాలు దిద్దుకోగలుగుతాం.'(పు. 62)

కొడవటి కుటుంబరావుగారు కవిత్వంకంటె ఇతర కళాప్రక్రియల మీద విమర్శ సమీక్షాత్మకంగా సాగించటం గమనింపదగింది. అభ్యుదయోద్యమం ఒక్క కవులే కాక, వివిధ కళాప్రక్రియల్లో కృషిచేస్తున్నవారంతా కలిసి కృషిచేసినప్పుడే ముందుకు సాగి సాంఘికప్రయోజనాలు సాధింపబడతాయని వారు భావించారు.

## కుందుర్తి - సామాజిక స్పృహ

మార్క్సిస్టు విమర్శకులలో కుందుర్తి అంజనేయులు (గారిది) విశిష్ట వ్యక్తిత్వం. ఆయన మార్క్సిస్టు దృక్పథాన్నీ, సోషలిష్టు వ్యవస్థనూ అంగీకరిస్తూనే రాజకీయ సిద్ధాంతాలలోని భేదాలజోలికి పోకుండా, వచన కవిత్వ ప్రక్రియా వికాసానికి విశేషంగా కృషిచేశారు. తమ కావ్యాలకేకాక, వచన కావ్యాల కెన్నింటికో పీఠికలు వ్రాయటం ద్వారా, వ్యాసాలు వ్రాయటం ద్వారా తమ అభిప్రాయాలను ప్రకటించారు. 'కుందుర్తి పీఠికలు'[126] వీరి సమీక్షా

ప్రవృత్తిని వ్యక్తంచేస్తుంది. కుందుర్తివారి సాహిత్య ధ్యేయాలను వారి మాటల్లోనే యిలా వివేచించవచ్చు :

1. కావ్య రచనా విధానంలో మార్క్సిస్టు దృక్పథాన్ని ప్రవేశపెట్టి ఏయే సత్ఫలితాల ద్వారా కవిత్వాన్ని సాధ్యమైనంత ఎక్కువగా ప్రజలదగ్గరికి తీసుకవెళ్లటానికి వీలున్నదో చూడటం.

2. కవిత్వం సారళ్యంతో తెలుగు నుడికారపు సొంపులతో వ్యావహారిక భాషాశక్తి సంపదలతో వర్ధిల్లేటట్లు చేయటం. ఆధునిక కవిత్వశైలి సామాన్యప్రజల సంభాషణస్థాయికి వచ్చేటట్లు చూటడం.

3. కావ్యవస్తువులు చైతన్యవంతమైన ప్రజోద్యమాలకు సంబంధించినవిగా ఉండటం.

4. రాజకీయనాయకుల సిద్ధాంత విభేదాలతో తనకు నిమిత్తం లేకుండా తన విశ్వాసాన్ని నిర్భయంగా చెప్పటం.

5. వచన కవిత్వం సామాన్య ప్రజల గాథలను, బాధలను ప్రతిబింబింప జేసుకోవటం.

6. స్థూలంగా మార్క్సిస్టు దృక్పథమూ, సోషలిస్టువ్యవస్థకు అనుకూలతా, ప్రస్తుతవ్యవస్థను తప్పక మార్చాలనే దీక్ష. వీటికి సంబంధించిన ఊహాపోహాలు సాహిత్యరంగంలో ఉండాలే కాని, సాహిత్యమంటే రాజకీయ సిద్ధాంతాల చర్చకు పెద్దపీట వేయరాదు. వ్యక్తిత్వాన్ని చంపేదిగా సంఘ నిర్మాణప్రియత్వాన్ని పెంచుకోరాదు.

కుందుర్తి వచన కవితోద్యమం నచ్చినంతగా నేటి విప్లవవాదులకు ఆయన ప్రతిపాదించే అంశాలలో రాజకీయాలతో సాహిత్యం గాఢమైన పొత్తును కుదిరించుకోరాదనే అభిప్రాయం నచ్చదు. బసవని భక్తికి పరవశుడైనా బ్రాహ్మణ్యాన్ని వదులుకోలేని వీరశైవుల్లోని పండితారాధ్యునిలాగా మార్క్సిస్టు విమర్శకులలో కుందుర్తి మార్క్సిజం కావాలంటూనే రాజకీయ విభేదాలతో, సిద్ధాంతాలతో పొత్తుపెట్టుకొనని మార్క్సిస్టుల దృష్టిలో,

conservative గా ఉండిపోయాడు. సామ్యవాద దృక్పథంతోనే కవితలో వస్తువుకు గౌరవాన్ని ప్రతిపాదించటం, కళాశిల్పానికి గౌణమైన స్థానమివ్వటం ఈయన ప్రత్యేకత. కుందుర్తిగారి దృక్పథంలో ప్రయోగం ప్రయోగం కోసం కాదు. ప్రజాప్రయోజనం కోసం. వచన కవిత్వం సరళంగా ప్రజలను చేరుకొనే శక్తిమంతమైన సాధనగా ఆయన భావించాడు. సామాజిక స్పృహ ఆధునిక యుగానికి ఊపిరిలాంటిది కాబట్టి దాన్ని ఆయన మన్నించారు. ఆ ఊపిరిని వచన కవితకు పోశారు. ఊపిరికి కూడా ఒక నియతి ఉన్నదన్నసత్యం వారు గుర్తించారు. వచన కవితలోని అంతర్లయను అధ్యయనం చేసి అవగాహనం చేసికోవటమే కాకుండా దాన్ని ఎన్ని పోయలలో, ఎన్ని విన్యాసాలలో వెలార్చటానికి వీలుందో శిల్పదృష్టితో అనుశీలించి కల్పించి చూపించాడు. విమర్శలలో వాటిని గురించి వివరించాడు.

కుందుర్తి సాహితీ వ్యక్తిత్వాన్ని గురించి చక్కని అధ్యయనం చేసి. వివరించినవారిలో శ్రీ అద్దేపల్లి రామమోహనరావుగారు ముఖ్యులు. వారు అనుశీలించిన అంశాలు కొన్ని ప్రత్యేకంగా గమనింప దగినవి—(నవోదయ లహరి[128])

1) 'వచన కవితారూపం అభ్యుదయ వస్తువుని చాలా శక్తిమంతంగా ప్రజలలోకి వెళ్ళేరీతిని చెప్పగల ఈ యుగవాహిక అనీ, ఆ రూపంలో ఎంత శిల్ప వైవిధ్యాన్ని తెచ్చే అవకాశాలున్నాయనీ, ఆ అవకాశాలన్నీ వినియోగించుకొంటే, ప్రజాకవితగా వచనకవిత యింకా సమగ్ర మౌతుందనీ కుందుర్తివాదం' (పు. 98)

2) 'కుందుర్తి సామాజిక స్పృహపరిధి చాలా విశాలమైంది........ ముఖ్యంగా తనచుట్టూ, తన అనుభవంలో ఉన్న సామాజిక రాజకీయవేదనకు అక్షరరూపాన్ని కల్పించినవాడు. తనకి అనుభవానికి రాని విషయాల్లో సిద్ధాంతాల్లో వ్యామోహంచేతగాని, ఇమేజికోసంగాని, వ్యతిరేకవిమర్శలకు లొంగి, మనసు చంపుకొని వర్ణించినవాడు కాదు. ఇక్కడే కుందుర్తి చిత్తశుద్ధి ఉంది'—(పు. 100)

3. ప్రజల్ని. సామాన్య ప్రజల్ని తమ సమస్యలకు మేల్కొని ఉండేటట్లు చెయ్యడమే కుందుర్తి సామాజిక స్పృహలోని ప్రధానాంశం. మొదట్లో మార్క్సిస్టులే, ఈ సామాజిక వాస్తవికతని ప్రచారం చేసి, గురజాడను నాయకుడుగా, శ్రీశ్రీని తత్ప్రివర్తకుడుగా గుర్తించి, అభ్యుదయ కవిత్వాన్ని, కేవలం పార్టీనినాదం గాకుండా వ్యాపింప చెయ్యటంవల్ల, కుందుర్తి, ఆ విశాలపరిధిలో మార్క్సిస్టుల అభ్యుదయ ధోరణిని పూర్తిగా జీర్ణింపజేసుకొని, పార్టీతో నిమిత్తం లేకుండా, ప్రజాచైతన్యాన్ని సర్వవిధాలా వెదజల్లిన తిరుగుబాటు కవి. ఇండో-ఆంగ్లియన్ సాహితీపరుల్లో ఇటీవల బాగా ప్రచారం సాధించిన "Poetry of Protest" అనే పదానికి కుందుర్తి చాలా సమగ్రమైన ఉదాహరణ కాగలడు' (పు. 102, 103)

4) 'అమెరికా ప్రజాస్వామ్య వచన గేయకవి వాల్ట్ విట్మన్ కీ, కుందుర్తికీ చాలా అభిప్రాయాల్లో దగ్గర పోలికలు కనిపిస్తై. Walt Whitman కు కూడా ధ్యేయం 'common man,'' (పు. 111)

కుందుర్తి 'ఫ్రీవర్స్ ఫ్రంట్' సాహిత్య చరిత్రలో ఆయన సాగించిన ఉద్యమానికి అక్షరోదాహరణం, ఆయన వచన కవిత సామాన్యుని అంకిత మైన భాషాకుటీరం.

## అభ్యుదయవాద విమర్శచైతన్యం

అభ్యుదయ వాద చైతన్యాన్ని ఆధునికాంధ్ర సాహిత్య విమర్శల్లో ప్రవర్తింపచేసిన వారిలో ప్రముఖులుగా ఆరుద్ర, రాంభట్ల కృష్ణమూర్తి, అద్దేపల్లి రామమోహనరావు, రాచమల్లు రామచంద్రారెడ్డి గారలను పేర్కొన వచ్చు. ఆరుద్ర విమర్శలో సమీక్షింపబడుతున్న ప్రక్రియలయొక్క చారిత్రక పరిణామ వికాసాలనుగురించి వివేచించటం, అందులో మైలురాళ్లగా కనబడే అంశాలను వ్యక్తీకరించటం, వాటి వెనుక ఉండే చారిత్రక, సాంఘిక పరిస్థితులను వివరించటం, సిద్ధాంత సాహిత్యాంశాలకు విలువకట్టటం అనే ప్రవృత్తులు విశేషంగా గోచరిస్తాయి. రాంభట్ల కృష్ణమూర్తిగారు నేటి అభ్యుదయవాద విమర్శకులలో మేధావివర్గానికి చెందిన వారని చెప్పాలి. ఇటు

భారతీయతత్త్వ విషయాలను, అటు మార్క్సిస్టు తత్త్వవిషయాలను తులనాత్మకంగా చర్చింపగల విమర్శశక్తి వారికి విశేషంగా ఉంది. సిద్ధాంతపరమైన విషయాలనుగాని, చారిత్రకంగా వాటి కేర్పడిన పరిణామదశలయొక్క ప.శీలనం గానీ, మార్క్సిస్టు సాహిత్యంలో జరుగుతున్న ప్రయోగాల విశ్లేషణంగానీ, ఒక పరిణామగతి నాశ్రయించి విస్తరించిన విధానాన్నీ, అందులో ఉండేగుణ దోషాలను పేర్కొని నిగ్గుదేల్చే నిష్ఠగానీ, తెలుగులో పారిభాషిక పదాల నిర్మాణంగానీ, వారి సమీక్షలన్నింటిలో ప్రస్ఫుటంగా గోచరిస్తాయి [128] అద్దేపల్లి రామమోహనరావు గారు అభ్యుదయవాద ధోరణుల నాశ్రయించి సాహిత్య వివేచనం చేస్తూనే, సాహిత్యంలోని కళాశిల్పరహస్యాలకు విశేష ప్రాముఖ్యాన్నిస్తూ, అభ్యుదయ విమర్శకు ఒక అకెడమిక్ స్వభావాన్ని కల్పించటానికీ, అనుశీలన విధానాలలో ప్రాక్పశ్చిమ సిద్ధాంతాల సమన్వయాన్ని సాధించటానికీ, సాహిత్యపు విలువలకు, ప్రమాణాలకు విమర్శలో సముచిత స్థానముండాల న్న స్పృహను వ్యక్తంచేయటానికీ తమ సమీక్షాత్మకమైన విమర్శను వినియోగిస్తున్నారు. వీరు శ్రీశ్రీ మహాప్రస్థానం గురించి వ్రాసిన గ్రంథం [129] అందుకు మంచి ఉదాహరణం. రాచమల్లు రామచంద్రారెడ్డి గారు అభ్యుదయ వాద దృక్పథంతో చేసే సమీక్షలకు ఒక ప్రామాణికమైన ప్రయోగప్రతిపత్తిని కల్పించిన విమర్శకుడు. ఇంద్రగంటి శ్రీకాంతశర్మగారన్నట్లు- 'మార్క్సీయ సిద్ధాంతంపట్ల ఖచ్చితమైన అవగాహన కలిగి, ముక్కుమీద గుద్దినట్లు స్పష్టంగా, సూటిగా సాహిత్య విమర్శ సాగించినవ్యక్తి శ్రీ రాచమల్లు రామచంద్రారెడ్డి'. [130] రా.రా. దృష్టిలో- 'సాహిత్యం జీవితంతో పెనవేసికొన్నా, అది ప్రత్యేకరంగం. దాని కొక స్వతంత్ర ప్రతిపత్తి ఉంది. రాజకీయాలనుండి గానీ, తత్త్వజ్ఞానంనుండి గానీ, మానవజీవితంలోని మరేరంగంనుండిగానీ, సాహిత్యం ప్రేరణా, ప్రోత్సాహమూ పొందవచ్చు. కానీ, రాజకీయాలే సాహిత్యం కాదు; తాత్వికచింతనే సాహిత్యం కాదు" [131]

అభ్యుదయవాదులు మార్క్సిజాన్ని ఒక సాంఘికదర్శనంగా గ్రహించారు; సాహిత్యం దాన్ని దోహదం చేస్తూనే సాహిత్యప్రమాణాలను పోషించుకోవాలని భావించారు.

## విప్లవవాదవిమర్శ : కె.వి. రమణారెడ్డి

అభ్యుదయవాద ధోరణుల తరువాత 1970 నుండి తెలుగులో విప్లవవాద ధోరణులు వచ్చాయి. ఇందులోనూ కవిత్వం వచ్చినంతగా సాహిత్య విమర్శ రాలేదు. వచ్చిన విమర్శకూడా సమీక్షాస్థాయిని దాటిపోలేదు. 'మార్క్సిస్టు విమర్శకు నమూనాగా గ్రహింపదగిన గ్రంథవిమర్శగాని, ప్రక్రియా విమర్శగాని, తెలుగులో ఇంకా రావలసి ఉంది. ఈ విషయంలో విప్లవవాద సాహిత్యం అభ్యుదయ సాహిత్యంకన్నా సాధించేదేమీలేదు'[132] అన్న చేకూరి రామారావుగారి తీర్పును మనం అంగీకరించక తప్పదు. దానికి కారణం ఏమిటి అని ప్రశ్నిస్తే సమాధానం చెప్పటం కష్టమే. కాని, చేకూరి రామారావుగారే అన్నమాటలు దీనికి పరోక్ష సమాధానంగా ఇప్పటికి గ్రహించవచ్చునేమో:— "సమాజంమీదగాని, సాహిత్యంమీదగాని విప్లవసాహిత్య ప్రభావం ఎట్లా ఉండబోతుంది? అనే ప్రశ్నకు సమాధానం చెప్పటం కష్టం. విప్లవవాద రాజకీయాల భవిష్యత్తుమీద విప్లవసాహిత్య భవిష్యత్తు ఆధారపడి ఉంది. అఖిలభారత స్థాయిలో పనిచేస్తున్న విప్లవరాజకీయ పక్షం దేశంలో లేదు. తమతమ ప్రభావాల్ని కొన్ని పరిమిత ప్రాంతాల్లో ప్రసరిస్తున్న విప్లవ రాజకీయాల గ్రూపులున్నై. ఈ గ్రూపులమధ్య పరిష్కారం కనుచూపు మేరలో లేని వైరుధ్యాలున్నై. ఇవి కొన్నిచోట్ల సాహిత్య సంఘాలను విడదీస్తున్నై. ఈ పరిస్థితుల్లో సాహిత్యంలో విప్లవవాద ధోరణుల భవిష్యత్తును ఊహించటం ఏమంత ఫలమంతమైన పనికాదు."[133] విప్లవరాజకీయా భవిష్యత్తుపై ఆధారపడిన విప్లవకవితకే భవిష్యత్తును నిర్దేశించుకోలేని పరిస్థితులలో విమర్శమాట వేరే చెప్పాలనా? అందువలననే అది సమీక్షా స్థాయి మించి సమున్నతిని సాధించలేక పోయిందేమో!

అయినా, అభ్యుదయధోరణికి, విప్లవధోరణికి భేదం స్పష్టం ఉన్నది. "అభ్యుదయవాదంలాగే విప్లవవాదానికి మార్క్సిస్టు దృక్పథ ప్రాతిపదిక, సామ్యవాద సమాజ నిర్మాణమే ధ్యేయం. అయితే, అభ్యుదయ వాదానికి, విప్లవవాదానికి ఉన్న ప్రధానమైన భేదం అవి రెండూ భిన్న చారిత్ర దశలకు సంబంధించినవి కావటమే. అభ్యుదయ ఉద్యమం స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా ఆరంభమైంది. భిన్నధోరణులకు సంబంధించిన వారి

విశాల ప్రాతిపదకపైన ఈ ఉద్యమం సాగింది. సామ్యవాద సమాజం అంతిమ లక్ష్యంగా ప్రకటించుకున్నా, ఆనాటి తక్షణలక్ష్యం స్వాతంత్ర్యసాధన. అభ్యుదయవాదానికి మార్క్సిజం ప్రధాన ప్రాతిపదిక అయినా మార్క్సిజంతో సంబంధం లేకుండా ఏమాత్రం పురోగామిభావాలున్నా, వారందరినీ ఉద్యమంలో చేర్చుకుంది. స్వాతంత్ర్యానికి పూర్వం అభ్యుదయవాదులకు సామ్రాజ్యవాదం ప్రథమశత్రువు. కాని, స్వాతంత్ర్యానంతరం లక్ష్యనిర్దేశం లేక అభ్యుదయోద్యమం స్తబ్ధతను పొందింది. విప్లవవాదం స్వాతంత్ర్యానంతరం 20 ఏళ్ళ స్వదేశీయుల పాలన తరువాత తల ఎత్తింది. అది విశాల ప్రాతిపదికలమీద ఏర్పడింది కాదు. విప్లవవాదులు భారతదేశాని కింకా నిజమైన స్వాతంత్ర్యం రాలేదని భావిస్తారు. మార్క్సిజానికి నిబద్ధమైందే విప్లవవాదం. మార్క్సిజంపైన విశ్వాసం లేనివారికి ఇందులో స్థానం లేదు. మార్క్సిజం వారి శాస్త్రం, శస్త్రం. 'తిరోగామి భావాల, సంస్కృతుల ఛాయలు రేఖామాత్రంగా కూడా లేకుండా నిర్మూలించటమే విప్లవసాహిత్యం ధ్యేయం'. సంస్కరణవాదానికి ఇందులో తావు లేదు. విప్లవవాదం ప్రధానశత్రువు ప్రస్తుత పాలకులు. సాయుధపోరాటం ద్వారానే సామ్యవాద వ్యవస్థ సాధ్యమని వారి విశ్వాసం. శ్రామికవర్గ విముక్తికోసం వారి పోరాటం. ప్రపంచ కమ్యూనిష్టు ఉద్యమాలలో వచ్చిన మార్పులు కూడా అభ్యుదయ విప్లవవాదాల మధ్య గల భేదానికి ప్రధాన కారణాలలో ఒకటి".[134]

తెలుగుదేశంలో విప్లవరచయితల సంఘంలో బాధ్యతాయుతమైన పదవిని నిర్వహిస్తున్నట్లు గానే, విప్లవవిమర్శలోకూడా వీరశంఖాన్ని కర్తవ్యంగా పూరిస్తున్న విమర్శకులు శ్రీ కె.వి. రమణారెడ్డి గారు. వీరు సంప్రదాయాన్ని నిరసిస్తూ రచన చేస్తున్నప్పుడు వారి విమర్శ విలయతాండనం చేస్తుంది. "సంప్రదాయం మొండిశిఖండి. తలప్రాణం తోకకి, తోకప్రాణం తలకీ వస్తూ పోతూ ఉంటుంది. వుంది. అది శిష్టం, పండితైక నిష్ఠం. క్రాపింగులో పిలక, డాక్టరేట్‌లో విరాట్ పురుషలీల, యూనివర్సిటీల అకడమిక్ డుబుడుక్ డమరుకాల్లో యమకగమకాల, ఉదాత్తానుదాత్త స్వరాల మేళలాంటి గోల- ఇవన్నీ 'అత్యాధునిక' అభాసలు"[135]- ఇలా సాగుతుంది వీరి విమర్శ. విప్లవవాదం మీద వచ్చే విమర్శలను ఎదుర్కొనటం వారికి నిబద్ధత యిచ్చిన బాధ్యత. "నినాదాలమయమనీ రాజకీయపరాయణమనీ విప్లవ సాహిత్యం గురించి

ఎన్నెన్నో విమర్శలు. అన్నీ కువిమర్శలే ననను గాని చాలభాగం నిరాధారం"[136]– అని విప్లవదృక్పథాన్ని వివరించే వివేచన చేస్తారు వారి సమీక్షలలో, విప్లవమంటే వారికి ఆవేశ మెక్కువ; సంప్రదాయ మంటే ఆగ్రహ మెక్కువ. అది ఆయన దోషం కాదు; వాదధోరణి. మార్క్సిస్టు విమర్శలో ప్రామాణికమైన అనువర్తిత విమర్శను వెలయింపగల సామర్థ్యం రమణారెడ్డిగారికి ఉంది. ఆవేశాన్నీ, అధిక్షేపాన్నీ, ఆగ్రహాన్నీ వదలి వారి విమర్శ సంయమనంతో కూడుకొన్న ఆలోచనతో సాహిత్యానుశీలనానికో, సమన్వయానికో పూనుకొంటే మార్క్సిస్టు విమర్శ తెలుగులో ఎంతో లాభిస్తుంది. వారు ఇదివరలో వ్రాసిన 'మహోదయం' 'కవికోకిల' వంటి విమర్శగ్రంథాలు చదివినవాడు ఆయన ఉత్తమ విమర్శకు డని అలవోకగా అనుకుంటాడు. డా॥ చేకూరి రామారావుగా రన్నట్లు-"కె. వి. రమణారెడ్డి గారు తమ గ్రంథాలకు రాసినా, ఇతరుల గ్రంథాలకు రాసినా, వారి పీఠికలు మామూలు పీఠికలు కావు. అవి సాహిత్య విమర్శలే. శ్రీశ్రీ సాహిత్యం మీద సమగ్ర పరిశీలనం చెయ్యగల అధికారం ఉన్న ఒకరిద్దరిలో ప్రథముడు రమణారెడ్డిగారు."[137]

విప్లవరచయితల సంఘ సభ్యులు కవితాప్రయోగాలే కాక సాహిత్య సమీక్షలు కూడ చేస్తున్నారు. వీరి సమీక్ష లింకా అనుశీలనాత్మక స్థాయి కందుకోలేదు.

మార్క్సిస్టు విమర్శకులలో డా॥ చేకూరి రామారావు గారిని ప్రత్యేకంగా పేర్కొనాలి. వీరిది ఆవేశ ప్రవృత్తి కాదు. ఆలోచనా ప్రవృత్తి. మార్క్సిస్టు ధోరణులను చారిత్రాత్మక దృష్టితో అధ్యయనం చేసి విశ్లేషణాత్మకమైన సమీక్షా వ్యాసాలతో ప్రజలు సులభంగా అర్థం చేసుకొనేటట్లు చెప్పటం వీరి ప్రత్యేకత. మార్క్సిస్టు సాహిత్యచరిత్రనిర్మాణానికితగిన ముడిసరుకును వీరు ప్రోగు చేసి పెడుతున్నారు. నిష్ఠురంగా కాకుండా నిర్మొగమాటంగా చెప్పటం వీరి విమర్శకు లక్షణం. చెప్పే మాటలో చిత్తశుద్ధి కూడా కనపడుతుంది. "వివాదాస్పదమైన' 'గతి తార్కిక సాహిత్య భౌతిక వాదం' అనే కొత్త పద్ధతి త్రిపురనేని మధుసూదనరావు ప్రవేశపెట్టాడు. మధుసూదనరావు– శేషేంద్ర శర్మ, ఆర్. యస్. సుదర్శనం వంటివారి విమర్శల మీద గట్టి ముట్టడే

చేశాడు. కాని, మధుసూదనరావు కత్తి ముక్కుకు సూటిగా పోతుంది. ఏది అడ్డం వస్తే దాన్ని నరికిపారేస్తానంటుంది. అడ్డమే రానక్కరలేదు; పక్కగా వచ్చినా చాలు. ఇందుకు ఆయన రా. రా 'సారస్వత వివేచన' మీద చేసిన విమర్శ ఒక ఉదాహరణ. ఇతర విమర్శలను ఖండించటానికే మధుసూదనరావు కాలం వ్యయమౌతున్నది. ఈయన చేసిన కోర్టు ప్రకటనలో కూడా సాహిత్య విమర్శ ఉంటుంది.[138] ఇలా వాస్తవాలను చెప్పే ధోరణి రామారావుగారిది. రామారావుగారే అన్నట్లు విప్లవాదధోరణిలో సాగిన విమర్శ సమీక్షస్థాయిలోనే ఉంది. దాని భవిష్యత్తు నిర్ణయించటం కష్టం.

నేటి మార్క్సిస్టు ధోరణులను ప్రపంచ వ్యాప్తంగా అందరూ ఆమోదిస్తున్నారనీ ఆ ప్రయోగాలు నిర్దుష్టాలనీ చెప్పలేము. ఈ క్రింది అభిప్రాయా లీవిషయాన్ని కొంతవరకైనా వ్యక్తీకరిస్తాయి. 1. 'Marxism never answers the question of the degree of dependence of literature on Society... There is great literature which has little or no social relevance; social literature is only one kind of literature and is not central in the theory of literature, unless one holds the view that literature is primarily an 'imitation' of life as it is and of social life in perticular. But literature is no substitute for sociology or politics. It has its own justification and end''[139]

— Rene Wellek and Austin warren.

"కొందరు మార్క్సిస్టు విమర్శకుల చేతుల్లో యీ పద్ధతి ఒక పిడివాదంగా మారిపోవటం విచారకరం. వీరు వస్తువునే కాని, రూపానికి విలువే లేదనే వరకూ పోతున్నారు. శిల్పము, ప్రయోగశీలత, aesthetic value మొదలైన అంశాలను దాదాపు తిరస్కరిస్తున్నారు. ఇవి మితంగా కనిపించినా వాటిని బూర్జువాలక్షణాలుగా వర్ణించి అవహేళన చేస్తున్నారు. తాను కేంద్రబిందువుగా వుంటూ, యితర విమర్శనా పద్ధతులలోని మంచిలక్షణాలను అవసరం వచ్చినప్పుడు స్వీకరించగల విశాలతత్త్వం మార్క్సిస్టు విమర్శకు వుందన్న విషయాన్ని వీరు విస్మరిస్తున్నారు. ఇది ఏ సాహిత్యంలోకానీ, ఏ యుగంలో కానీ, హర్షింప దగ్గ పరిణామం కాదని మనవి చేస్తున్నాను"[140]

—వల్లంపాటి వెంకట సుబ్బయ్య.

## కవిసేన మేనిఫెస్టో - విమర్శలో క్రొత్త మలుపు

సమకాలీన సాహిత్య విమర్శ వస్తుదృష్టినుండి భావదృష్టివైపు ప్రసరించాలనీ, కావ్యానుశీలనం సాహిత్యేతర ప్రమాణాలతో కాక సాహిత్య ప్రమాణాలనే ప్రధానంగా గ్రహించి సాగాలనీ, కవితోపాటు విమర్శకునికీ సాహిత్య దర్శనం ఉండాలనీ, ప్రాచ్యపాశ్చాత్య విమర్శ దృక్పథాల సమన్వయశీలంతో సాహిత్యవిమర్శ విశ్వజనీన ప్రవృత్తిని ప్రకటించాలనీ విమర్శలోకంలో ఒక నూత్న చైతన్యం ప్రభవించింది. పదేళ్ళకుపైగా భారతీయ విమర్శకులలో ఇటువంటి చైతన్యం ప్రస్ఫుటంగా కనపడుతూ వచ్చింది. దానినంతా తెలుగు సాహిత్యరంగంలో శక్తిమంతమైన విమర్శోద్యమంగా స్థాపించటానికి ఉద్యమస్ఫూర్తితో వెలువడింది శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారి 'కవిసేన మేనిఫెస్టో' (1977). ఇది నిజంగా విమర్శలో ఒక క్రొత్త మలుపును తెచ్చింది.

## విశ్వజనీన దృక్పథం - దర్శనం

1965లో మైసూరు విశ్వవిద్యాలయంవారు 'Literary criticism-European and Indian Traditions' అనే అంశంమీద ఒక చర్చాగోష్ఠి జరిపించి, అందులో పాల్గొన్న విమర్శకుల వ్యాసాలను ఒక సంపుటిగా ప్రచురించారు. ఆ గ్రంథం సమకాలీన భారతీయ సాహిత్య విమర్శలో ప్రవర్తిల్లుతున్న ధోరణులను గురించి కొన్ని విలువైన సమీక్షలను సారించింది. 'కవిసేన మేనిఫెస్టో' విమర్శోద్యమాన్ని అవగాహనం చేసికోవటానికి ఆ సమీక్షలు కొన్ని పూర్వరంగంగా పనికివస్తాయి.

శ్రీ నరేష్‌గుహ-సాహిత్య విమర్శకు తప్పకుండా సాహిత్య సిద్ధాంత దర్శనం మూలశక్తిగా ఉండాలని భావించారు. ఆ దృష్టితో ఆధునిక విమర్శ ధోరణులు కొన్ని సాహిత్యపు విలువలను నిర్ధరించటంలో ఎలా విఫలమయ్యాయో వివేచించారు. మచ్చుకు ఈ మాటలు చాలు- "Marxist criticism, for example, explores the social and ideological implications of a work of art, and though it swears by 'realism' and 'truth', never asks what really and truly is the

nature of literatue. Criticism without a theory of literature is not much rewarding. Psychological criticism also occupies itself with peripheral questions-with hunting for the subcous-cious or unconscious meaning, sex symbols, and things like these revealing a simple faith that the value of literature lies primarily in being a handy evidence of our sub-conscious life The Freudian theory of the Oedipus Complex can, for them, explain the complex character of Hamlet, thus reducing Hamlet to not much more than a mere type. Myth criticism, similarly, cannot do more than demonstrate literature as an unexpected conveyer of myths, primordial images, or 'archetypal patterns'. No body should question the importance in its own way of the discovery of the subconscious or un-conscious of man's mind as a store house of the inherited images of the divine father, rebirth, descent into hell or the sacrificial death of god, and of the discovery that these archetypes are the organizing principles of any meaningful work of literature. But, this must not be confused with a comprehensive critical method."[141]

2. The critical movements which accept the basic notion of poetry being an autonomous, self-sufficient, organized form are international movements, have 'transcended the boundaries of any one nation' (Rene Wellek), and what it more, show some remarkable similarity of approach analysis to the formal and linguistic criticism of our Sanskrit **Alankarasastra**"[142] (కవిసేన మేనిఫెస్టోలో శర్మగారు ఇటువంటి అభిప్రాయాలనే సోదాహరణంగా ప్రసంచించారు.)

David Johan Mc Cutchion-'whether critical appreciation is bound by considerations of religion, country, and tradition'- అన్న అంశంపై వ్రాస్తూ తన అభిప్రాయాన్ని ఇలా తీర్పుగా చెప్పాడు— "The creation and appreciation of literature are clearly condi-tioned in part by national, religious and traditional conside-rations, but this conditioning is so complex and elusive that no simple or final conclusion can be reached about its operations. In such a situation it is advisable that as many critical approaches as possible be used in order to develop

the widest range of appreciation. But, we must also bear in mind the problem of relevance : The best approach will be such as to bring out the richest qualities of a work, not to impoverish it, not to impose upon it aims remote from its intrinsic purposes. The task of the critic is first to elucidate these purposes within their own tradition (both before and after), then to relate them both to his own tradition, if different, and to universal human truth"[143]

శ్రీ శిశిరకుమార్ ఘోష్— సమకాలీలిన సాహిత్యంలో సౌందర్య దృష్టి రావాలనీ, అదే జీవితానికీ సాహిత్యానికీ అర్థవంతమైన దర్శనాన్నిచ్చే ఉత్తమమైన విలువ అనీ పేర్కొన్నారు..... "Beauty is both a principle of perception and a manner of operation, a way of seeing things and a way of making things. Thus to win our way back to beauty-"Keep back beauty, keep it, beauty, beauty, beauty...from vanishing away"–might be to bring meanning back to life, to cleanse the doors of perception and to lead integrated lives."[144]

కవికి విశ్వజనీనమైన దర్శనం ఉండాలనీ, విమర్శకుడికి దానిని ఆవిష్కరించే అభిరుచి, సమన్వయదృష్టి, సమగ్రదృక్పథం ఉండాలనీ పేర్కొంటూ శ్రీ ముల్క్‌రాజ్ ఆనంద్ అన్న మాటలు విలువైనవి.

1. "The creative artist can become significant, because he has the ability to see the world as a whole, in the sense in which he is possessed of an impassionate desire to achieve an integrated picture of man and the universe around him, with an active imagination which he concerned to see that his dreams are acted out. As the material from which literary works are constructed have their sources in the experience of the writer, and as those experiences are mostly immediate and local, the creative man has to have an INSIGHT into which part of the experience is significant for the whole world and can be raised from the local sense to tha sense of universality, that is to say, true to HUMAN situation in the immediate environment and become possed of the values which have meaning to mankind."[145]

2. "The critic is aware of the music in the soul of the artist...At any rate, the critic...is more prophet than the 'little critic' of the magazines who seldom allies himself with the integral world of the writer but carps at him from the point of view of his own pet political or social ideas or fashionable theories or individual prejudices. Infact, the application of universal standards of criticism would need a more complete equation between the comprehensive human awareness of the creative artist and that of the critic. If this equation can be attained to any extent then felt humanness will itself supply certain criteria for the critic. And there could be mutual aid between the visionary artist and the perfector of vision, the critic. The achievement of this correlation may lead to the adumbration of a new criticism."[146] కవిని గురించీ, విమర్శకుణ్ణి గురించీ శ్రీ ముల్క్‌రాజ్ ఆనంద్ చెప్పిన మాటలన్నీ కవిగా, విమర్శకుడుగా శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ గారికి ముమ్మూర్తులా వర్తిస్తాయి. పై విమర్శకుల అభిప్రాయాలకన్నింటికీ తెలుగులో ఉద్యమ స్ఫూర్తి నిచ్చిన లక్షణ విచార గ్రంథం 'కవిసేన మానిఫెస్టో.'

విప్లవ రచయితల సంఘం స్థాపింపబడి తెలుగు సాహిత్యం మీద, విమర్శ విధానం మీదా తన ప్రభావాన్ని ప్రసరించిన నాటినుండి కవిత్వ రంగంలోనూ, విమర్శ రంగంలోనూ పై విమర్శకులు ప్రతిపాదించిన సాహిత్యపు విలువలు కొన్ని అస్తినాస్తి విచికిత్సకు పాత్రమయ్యాయి. కవితకూ, విమర్శకూ మౌలికమైన సాహిత్య దర్శనం ఉండాలన్న స్పృహ కంటె, సాంఘిక రాజకీయ స్పృహ లుండాలనే ప్రవృత్తి వ్యాపించింది. విమర్శలో సమగ్ర జీవిత దృక్పథం, విశ్వజనీనమైన సాహిత్యతత్త్వ మీమాంస ప్రామాణిక సూత్రంగా నిలవాలన్న దృక్పథం తగ్గి, రాజకీయ దృక్పథం, పార్టీకి రచయిత కమిట్ అయి ఉండాలనే సిద్ధాంతం వ్యాప్తి చెందాయి. శిల్పదృష్టికంటె వస్తుదృష్టి ప్రాధాన్యం వహించింది. సామాన్య మానవుడు మాట్లాడే నిత్యవ్యవహారభాషే సాహిత్య భాషగా ఉండాలనే అభిప్రాయం ప్రబలింది. ఉదాత్త సాహిత్యాధ్యయనం మీద ఉదాసీనతతోపాటు, వ్యతిరేకభావం పెచ్చుపెరిగింది. సాహిత్యం ఆత్మ కళ నుండి పుడుతుందనే

భావం తృణీకరింపబడటం ప్రారంభమైంది. సౌందర్యోపాసనం వైయక్తిక మైన అనుభవంగా, భావాభివ్యక్తిగా భావింపబడి, రాజకీయదృక్పథంతో వ్యాఖ్యానింపబడేసామాజిక స్పృహను సంపదించుకొన్న కవితయే కవితగా చెలామణి కావటం మొదలైంది. సాహిత్యంలో పూర్వాపర సంప్రదాయ సమన్వయ దృక్పథం ఉంటుందన్న భావం విమర్శలో లోపించటం మొదలైంది. విశ్వమానవ సత్యాన్వేషణ దృష్టి కొరవడింది. ఆపరిస్థితుల్లో- సాహిత్యంలో విశ్వమానవ స్వభావం ప్రతిబింబిస్తుందనీ, కవితకు కాలావరణాతీతమైన అనుభవ శక్తి ఉందనీ, యుగయుగాల మానవానుభవ పరంపరా ప్రవాహ సంవహనశక్తియే కవితకు, విమర్శకు మూలబలమనీ, నిత్యనూతనత్వం వాటి ప్రయోగశీలమనీ, కవితకు దర్శనం జీవమనీ, విమర్శకు దర్శననిర్దేశం జీవితమనీ, ఆ రెండింటి సమన్వయం అభినవ విమర్శావిర్భావానికి దారి తీస్తుందనీ భావించి, విమర్శ రూపంలో ఆవిష్కరించి, తెలుగులో ఒక సృజనాత్మకమైన విమర్శ పద్ధతికి ప్రారంభాన్ని చేసిన గౌరవం శ్రీ గుంటూరు శేషేంద్రశర్మకు దక్కుతున్నది. 'కవిసేన మేనిఫెస్టో'లో ప్రతిపాదింపబడిన సాహిత్య విమర్శ దృక్పథం క్రొత్తగా ఏ పాశ్చాత్య ఉద్యమాన్నో తెలుగులో దింపటానికి యత్నం చేయ లేదు. సమకాలీన సాహిత్యావసరాలను గుర్తించి కాలం సాహిత్య దర్శనాన్ని పునరుజ్జీవింపచేసింది; కవిసేన దృక్పథం దానికి ప్రతినిధిగా నిలిచింది. దానికి భారతీయ దృక్పథం ప్రాతిపదిక; ప్రపంచ వ్యాప్తంగా వ్యాపించియున్న సాహిత్య దృక్పథాల్లో కవితాత్మకు సంబంధించిన సూత్రాలన్నీ, ఒకే విధమైన తత్త్వాన్ని భంగ్యంతరంగా ప్రతిపాదించే వనే సమన్వయదృక్పథం దాని అనుశీలన; అనుభవాన్ని అందించే ఆలోచన దాని ఆత్మ. శర్మ గారి దృష్టిలో మనిషిలో మార్పు తెచ్చే ప్రభావమే ప్రభావం. "ఏది గొప్ప ప్రభావమంటే ఏ ప్రభావం ఆలోచన చేత అభిరుచి చేత మనిషిలో మార్పు తెస్తుందో అదే అన్నింకంటే గొప్ప ప్రభావం"[147]-అన్న కవిసేన దృక్పథం గమనింప దగింది. కవిసేన మానిఫెస్టో శర్మగారి ప్రతిభాజన్యం; సమకాలీన సాహిత్య స్పృహకు, సృజనాత్మక చైతన్యానికీ వ్యక్తిముఖంగా ప్రతిస్పదించిన విశ్వ చైతన్యం. సాహిత్య తత్త్వాన్ని గురించి చేయదగిన ఆలోచనకూ అలవరచు కోదగిన అభిరుచికీ, అంతర్జాతీయ అవగాహనతోకూడిన జాతీయ దృక్పథానికీ అభినవలోచనం!

## ప్రతీకవాద ప్రభావం

శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ గారి రచనలలోని సాహిత్యవిమర్శను స్థూలంగా రెండు భాగాలుగా వివేచించవచ్చు. ఒకటి-షోడశి (1965), స్వర్ణ హంస (1967) సాహిత్య కౌముది (1968) మొదలైన గ్రంథాలలో వారు రామాయణ, నై. కావ్యాలను గురించీ, ప్రాచీనాంధ్ర కవుల సాహిత్య విశేషాలను గురించీ వ్రాసిన విమర్శ వ్యాస సముదాయం. ప్రాచీన సంస్కృతాంధ్ర కావ్యానుశీలనం ఈ విమర్శకు ప్రధాన లక్షణం. రెండు-సమకాలీన సాహిత్య విమర్శ. ఈ శాఖతో ప్రధానంగా పేర్కొనదగింది 'కవిసేన మేనిఫెస్టో' (1977). అయితే, ఈ ఉభయ శాఖల్లోనూ శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారి విమర్శ దృక్పథం మీద భారతీయాలంకారిక ప్రభావంతో పాటు, పాశ్చాత్యుల ప్రతీకవాద ప్రభావంకూడా బలంగా కనపడుతుంది. అయితే ఈ ప్రభావం ఆయన ఆలోచనలో అపూర్వమైన భావైక్యాన్ని ప్రదర్శిస్తుంది.'

'షోడసి', 'స్వర్ణహంస'లలో రామాయణ నైషధకావ్యాలలోని ప్రతీకాత్మక ప్రవృత్తులను ప్రౌఢంగా వివేచించి ప్రతీకాత్మక విమర్శకు తెలుగులో ఒక విశిష్టస్థానాన్ని కల్పించిన పండిత విమర్శకుడు శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ విశ్వనాధ వారు 'షోడసి'ని మెచ్చుకొనిన మాటలు శర్మగారికి ఆరంగంలో ఉన్న ఉత్తమాధికారాన్ని వ్యక్తం చేస్తున్నవి.

1. "వీరు చెప్పిన యుపపత్తులు బాగుగా నున్నవి. సమంజసముగా నున్నవి. అన్నిటికంటె ప్రధానమైన యుపపత్తి సుందరకాండ మంతయు కుండలినీయోగ మని నిరూపించుటయే- ఈ నిరూపించుటమాత్రి మాశ్చర్య జనకముగా నున్నది.[46]

2. "మొత్తముమీద నొక్కటిని నిస్సంశయముగా చెప్పవచ్చును. వీరి పాండిత్యము చాల లోతుగలది. వీరి శ్రీవిద్యారహస్యవేత్తృత సర్వంకషమని చెప్పుట కభ్యంతరముండదు. భారత రామాయణములను కలిపి వీరు చదివి నట్లు చదివినసంఖ్య లేదనియే చెప్పవలెను. మహామేధావులైన వారితో నిండి యుండిన యీ ప్రపంచములో లేరనుటకు వీలులేదు కాని యున్నచో భారత

దేశమున నొకరెద్ద రుందురు ...వా రీగ్రంథము వ్రాసినందుకు తెలుగువారే కాదు, భారతీయులందరు కృతజ్ఞులుగా నుండవలసిన విషయము."[149]

'స్వర్ణహంస'లోని శర్మగారి ప్రతీకాత్మక విమర్శను పండిత విమర్శకులు శ్లాఘిస్తూ చేసిన వ్యాఖ్యలు విలువైనవి—"వీరి విమర్శలో నలుడు జీవాత్మ; భీముడు పరమాత్మ - లేక-నిర్గుణబ్రహ్మము; దమయంతి శ్రీ మహా త్రిపురసుందరి; హంసనైషధమునందు మొదటి మూడు సర్గలలో క్రమముగా అజిపా మంత్రాధిదేవతగా, జీవాత్మగా, పరమాత్మగా వర్ణింపబడినది. శాస్త్రీయములగా నుపపత్తులతో నీవిషయమును సమర్థించి యున్నారు"[150] —సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారు.

"ఈ గ్రంథంలో ధ్వనివిశేషాన్ని వ్యాఖ్యానిస్తూ సంకేతాలను వివరిస్తూ శ్రీ శర్మగారు లలితా సహస్రనామావళి, సౌందర్యలహరి, కామకళా విలాసము మొదలైన అనేక తంత్రశాస్త్ర గ్రంథాలనుండి ఉదాహరణాలు ఇస్తూ ఉంటారు" -డా॥ సుప్రసన్నాచార్య.[151]

'సాహిత్యకౌముది' శ్రీ శేషేంద్రశర్మగారి ఆంధ్రసాహిత్యానుశీలన సామర్థ్యాన్ని ప్రకటిస్తుంది. విమర్శ భావాహ్లాదాన్ని కలిగిస్తూ తత్త్వాన్ని కరతలామలకం చేసే ప్రజ్ఞను ప్రకటించే అభివ్యక్తి శర్మగారి రచనలోని శక్తి. 'అద్భుతమైన ప్రతిభ, అనితర సాధ్యమైన వ్యుత్పత్తి, అచంచలమైన అభియోగము, అసాధారణమైన యాత్మప్రత్యయము శ్రీ శర్మగారి సాహిత్య వ్యక్తికి మూలాధారములు. శాస్త్రమునకు ఆయన దాస్యము చేయడు. దానిపై ప్రభుత్వము చేయజూచును. లోకుల అభిరుచిని ఆయన అనువర్తింపడు. తన రుచిని బట్టి దానిని నవరింపగోరును. సాహిత్య తత్త్వ వివేచనమున ఆయన శాస్త్రమును తిరస్కరింపడు. కాని, స్వీయానుభవమును ప్రమాణీకరించును. ఆ యనుభవమును శాస్త్రముగా తీర్చి లోకమునకు ప్రసాదింపవలెనని యుబలాటపడును. ఒక క్రొత్త విషయమును తాను కనిపెట్ట గలిగినప్పుడు ఆయన యానంద పరవశు డగును. ఆ యానందము నొక వ్యాసమున పూరించి సాటి రసికులకు అందించును. ఆ పారవశ్యమున వెలువడిన వాక్యములు కొన్ని ప్రసిద్ధ కవి పండితులను ధిక్కరించినట్లు భాసించును. యథార్థమునకు ఈ ధిక్కారాభాసములు ఆత్మ విశ్వాస వ్యంజకములే కాని

అహంకారాభివ్యక్తులు కావు"[152] — అన్న డా॥ పాటిబండ మాధవశర్మ గారి మాటలు అక్షర సత్యాలు. శ్రీనాథుని కవితలోని జగన్మోహన శక్తిని వ్యక్తీకరించటంలోనూ, రెండవ కవిత్రియాన్ని ప్రతిపాదించటంలోనూ, తిక్కన గారి విరాటపర్వం ఏకైక ధ్వని కావ్యంగా నిరూపించటంలోనూ, ఆంధ్ర కవుల పద్య రచనాశిల్పాన్ని సమీక్షించి, పద్యశిల్ప శాస్త్ర నిర్మాణావశ్యకతను నొక్కి వక్కాణించటంలోనూ శర్మగారు చూపిన కావ్యానుశీలన విధానం తత్త్వగంభీరం; కళాకుశలం.

పై విమర్శ గ్రంథాలలో శ్రీ శర్మగారు ప్రదర్శించిన ప్రతీకాత్మక వైఖరి ఆయన మౌలికతను వ్యక్తంచేస్తుంది. ప్రసిద్ధ పాశ్చాత్య ప్రతీకవాదుల మతాలను శర్మగారు తమ రక్తంలో ప్రవహింప చేసికొన్నారు. అందులోనూ Charles Baudelaire అంటే ఆయనకు అత్యంతం అభిమానం. బోద్లేర్ భావనలో- "The artist plays on the 'immense key-board of the Correspondences' or 'the entire visible universe appears as but a storehouse of images and signs to which the imagination will give a relative place and value, it is a sort of pasturage which the imagination must digest and transform"[153] శేషేంద్రశర్మగారూ ఇలాగే భావిస్తారు. అలాగే ఫ్రెంచి ప్రతీకవాద ప్రవక్త అయిన మలార్మే (Stephene Mallarme) అంటే కూడా శర్మగారు అభిమానిస్తారు. "Art alone survives in the universe, and not only art but poetry in particular. Man's main vocation is to be an artist, a poet, in order to save some thing from the wrekage of the time The work or, in Mallarme's term, the Book is suspended over the void, the silent Godess of Nothingness. Poetry is resoluitely cut off from the concrete reality, from its old concern with the imitation of nature, from the expression of the personality of the poet, from any rhetoric of emotion, and becomes only a sign, signifying nothing"–[154] అన్న మలార్మే ఆశయం శర్మగారి హృదయానికి సన్నిహితం. అయితే, ఇటువంటి ప్రతీకవాదుల కవితా దృక్పథాలను ప్రాచీన సాహిత్య సమీక్షలో శ్రీ శర్మగారు భారతీయ దృక్పథాలతో సంపదించుకొని అనుపమ విమర్శగా వెలార్చారు. 'కవిసేన మేనిఫెస్టో' రచనం నాటికి ఆ టి తత్త్వాలను దృష్టాంత సహితంగా విమర్శలో వ్యక్తీకరించవలసి రావటంచేత వాటిని యథావకాశంగా,

సోపపత్తికంగా విపులిస్తూ, ఆధునిక సాహిత్యానికీ, విశేషించి తమ కావ్యాలకూ అన్వయించి ఆవిష్కరించారు. గ్రంథ రచనా ప్రణాళిక ప్రవృత్తుల నాశ్రయించి శ్రీ శర్మగారి విమర్శలో ప్రతీకాత్మక ప్రవృత్తి మొదట సంస్కారవిశేషంగానూ. ఆ తరువాత సమన్వయశీలంగానూ ప్రవర్తించటం గమనింపదగిన విశేషం.

## విమర్శ-వివేచన-వక్తిత్వం

'కవిసేన మేనిఫెస్టో'లో శ్రీ శర్మగారు నిర్వహించిన విమర్శను ప్రధానంగా మూడంశాల క్రింద విభజించుకొని వివేచించవచ్చు, అవి: విమర్శ; వివేచన; వ్యక్తిత్వం. విమర్శ సమకాలీన సాహిత్య దృక్పథాల పై చేసిన ఖండన. వివేచన సాహిత్యంలో గౌరవింపదగిన విలువలను గూర్చి చేసిన ప్రతిపాదన. వక్తిత్వం కవికి, విమర్శకుడికీ ఉండవలసిన వక్తిత్వాలను గురించీ, ఉత్తమ సాహిత్య వ్యక్తిత్వాన్ని గురించీ, కవిత్వంలోని ఆత్మకళకు, అనుభూతికీ ఉండే ప్రాధాన్యాన్ని గురించీ చేసిన ప్రతిపాదన. ఈ మూడింటి యొక్క త్రివేణీ సంగమమే 'మేనిఫెస్టో' వ్యక్తిత్వం. సాహిత్య దృక్పథంతో వాటిని నిర్వహించిన సమ్యగనుశీలన విధానం చేత 'మేనిఫెస్టో' 'ఆధునిక కావ్యశాస్త్రంగా' పిలువబడుతోంది. తెలుగులో వెలసిన అభినవ కవితోద్యమాలకు వ్యాఖ్యానంగా నిలిచే లక్షణగ్రంథం రావటంలో రాయప్రోలువారి 'రమ్యాలోకం' 'మాధురీదర్శనం' తరువాత 'కవిసేన మానిఫెస్టో'నే చెప్పుకోవాలి ప్రక్రియకు ప్రామాణికత్వం కలగాలంటే ప్రక్రియతోపాటు 'మేనిఫెస్టో' కావ్యశాస్త్ర విచారగ్రంథం కూడా వెలువడాలి. అస్తవ్యస్తంగా ఉన్న ఆధునిక సాహిత్య విమర్శకు చుక్కాణి పట్టింది 'కవిసేన మేనిఫెస్టో' "I earnestly hope that this book would stand as a land mark in Poetics. Your synthesis of the Eastern and Western critiques on form, content and function is really commendable. Quotations from Lenin and other Russian critics must serve as eye-opener to our Marxist critics who extol content at the expense of form"[155] అన్న డా॥ అమరేంద్ర గారి ప్రశంస దేశంలోని సాహిత్యతత్త్వజ్ఞులందరి అభిప్రాయాలకు ప్రతినిధి.

శర్మగారి విమర్శ ప్రధానంగా మూడు వర్గాల మీద సాగింది. అందులో మొదటి వర్గం-వచనకవిత్వప్రక్రియను నిర్వహించే అతివాదులు; రెండవ వర్గం- రచయిత రాజకీయపార్టీకి బద్ధుడై ఉండాలనే విప్లవ కమిటెడ్ దృక్పథంగల విప్లవరచయితలు. మూడవ వర్గం--ప్రపంచ సాహిత్యపరిజ్ఞానం లేకుండా పడికట్టు మాటలతో కవిత్వచమత్కారాలనే సమీక్షిస్తూ సాహిత్య విమర్శలో సృజనాత్మకతను, దర్శనశక్తిని నశింపచేసిన సమీక్షావిమర్శకులు. ఈ మూడు వర్గాలవలన సమకాలీన సాహిత్యజగత్తులో ఉత్తమ సాహిత్య స్వరూపాన్ని దర్శించే శక్తి నశించి అకవిత్వానికి అగ్రతాంబూల మిచ్చే అవ్యవస్థ ఏర్పడిందనీ. సామాజిక స్పృహ అనే పేరుతో వస్తువుకు ప్రాధాన్య మిచ్చి, రూపగుణాలకూ, శిల్పానికీ విలువ నిచ్చే ప్రవృత్తి అణగారి పోయిందనీ, సామాజిక స్పృహను సాహితీ దర్శనం ద్వారా సాహిత్య స్పృహగా మలచుకొనే వ్యక్తిత్వం కవికి లేకుండా పోయిందనీ. రచయిత రాజకీయాలకే కాక మానవజాతికంతా బాధ్యుడనీ, సమగ్రమానవజీవిత దర్శనమే సాహిత్య ధ్యేయమనే విలువ క్రమంగా అంతరించి పోతున్నదనీ, ఆధునిక సాహిత్యం అనుభూతికి దూరమైపోతున్నదనీ శ్రీ శర్మగారు పేర్కొన్నారు. ఆయావర్గాలు ప్రతిపాదించే ఆయా దృక్పథాలనూ, ఆయా నినాదాలనూ, ఆయా విమర్శ విధానాలనూ నిర్దాక్షిణ్యంగా విమర్శించారు. విమర్శ చేస్తున్నప్పుడు-శ్రీ శర్మగారి భావాంబర వీధిలో సాహిత్య ప్రత్యర్థులు ప్రత్యక్షమైనట్లూ, వారివలన సాహిత్యానికి జరుగుతున్న అన్యాయానికి శర్మ గారికి ఆగ్రహం కలిగినట్లూ. వారిని ప్రత్యక్షంగా సంబోధిస్తూ ఉద్యమ ప్రవచనాన్ని సాగిస్తున్నట్లూ కనపడతారు. వారి మాటల్లో వేడీ కనపడుతుంది వెలుగూ కనపడుతుంది. అలవోకగా అధిక్షేపాలూ దొర్లుతాయి; తిట్లూ దీవనలూ తోరణాలు కడతాయి. ఇటువంటి ఆవేశవుపొంగు విప్లవకవులను ఎదుర్కోటానికి శర్మగారి వాక్కులో శస్త్రంగా నిలిచిందేమో ! అయినా, ఆవేశం, తిట్టూ కవిత్వంలో రాణించినంతగా, విమర్శలో వెలుగు నింపవు. దాన్ని అభిరుచిరేఖగా భావించి సహిస్తే ఈ గ్రంథంలో సమకాలీన సాహిత్య లోకం గ్రహింపదగింది ఎంతో ఉంది. ఒక విధంగా 'భావకవిత్వాన్ని' 'నేటి కాలపు కవిత్వం'లో దుయ్యబట్టిన అక్కిరాజు ఉమాకాంత విద్యా శేఖరునిలా, వచన కవిత్వంలోని అకవితాలక్షణాలను అధిక్షేపించే శేషేంద్ర

శర్మ గోచరిస్తాడు. అయితే, అక్కిరాజుకు అధిక్షేపం తెలిసినంతగా అభినవ యుగప్రసారం తెలియదు. శర్మగారికి కవితలో, విమర్శలో మరొక సృజనాత్మకయుగాన్ని సృష్టించే లక్ష్యం తెలుసు; తిట్టి చెప్పే తెగువ తెలుసు; తట్టి చెప్పే తెలివి తెలుసు.

## సామాజిక స్పృహ -సాహిత్య స్పృహ

ఆధునిక సాహిత్యానికి సామాజిక స్పృహ ముఖ్యమనీ, ఆ స్పృహ మార్క్సు దృక్పథంతో ఏర్పడుతుందనీ, సామాజిక స్పృహతో కూడిన వస్తువే కవితకు ముఖ్యమనీ, కవిత్వం సామాన్యులకు అర్థమయ్యేటట్లుండాలనీ భావించే అభ్యుదయ వచన కవుల దృక్పథాలను శర్మగారు ఎదుర్కొని, వాటిలోని దోషాలను ఖండించి సాహిత్యదృక్పథం ఎలా ఉండాలో నిర్దేశించారు. సాహిత్యస్పృహ నేటి సాహిత్యానికి కావాలని ప్రతిపాదించారు. ఈ క్రింది వాక్యాలు శర్మగారి దృక్పథాన్ని చాలవరకు వ్యక్తంచేయగలుగుతాయి.

1. "యావత్తు మానవజీవిత సామగ్రితోనూ కవికి తాదాత్మ్యం ఉంటుంది. అసలు కీలకస్థానంలో ఉన్న విషయం- ఈ సామగ్రినంతా సాహిత్యసామగ్రిగా మార్చుకోగలిగే కళాత్మక ప్రక్రియ ఏదైతే ఉందో అదే సాహిత్యస్పృహ". (పు. 16,17)

2. "సాహిత్యస్పృహ లేనివాడు సాహిత్యరంగంలో వట్టి న్యూస్ పేపర్ బాయ్". (పు. 16)

3. "ఈరోజు సాహిత్యరంగంలో సామాజిక చైతన్యం కాదు సమస్య. సామాజిక చైతన్యాన్ని సాహిత్యచైతన్యంగా మార్చుకునే శక్తి కావాలి కవికి. అదే అసలు సమస్య.... సాహిత్యచైతన్యమే కవికి నిజమైన గీటురాయి. ...హాకవి చార్ల్స్ బోదిలేర్ మాట చూడండి- "It is not given to ...ery one to take a bath in the multitude; to enjoy the crowd ... an art" (crowds). (పు. 21)

4. "ఆర్థిక సామాజిక శాస్త్ర సిద్ధాంతాలుగా ఈ శతాబ్దంలో మనకు ...దిన ఉపలబ్ధి ఏది ఉందో అది ఏదో ఒక రాజకీయపార్టీ గుత్తసొమ్ము

కాదు. అది యుగయుగాలుగా జరిగిన మానవీయ ఆలోచనా ప్రవాహానికి పరిణామ ఫలితంగా వచ్చింది ఆ ఉపలబ్ధి. కనుక అది ప్రపంచమానవులందరిదీ. విప్లవమూ, పరిణామమూ, శ్రామికనేతృత్వమూ ఇత్యాదిభావాలు రాజకీయ పార్టీల సొంత ఆస్తి కాదు. ప్రజలఆస్తి". (పు. 14)

## 'కవిత్వం అర్థం కావటంలేదు'

అందరికీ అర్థమయ్యేటట్లు కవిత్వం ఉండాలనే వచనకవితోద్యమం లోని కొందరి అతివాద ధోరణిని ఎదుర్కొంటూ శర్మగారు అర్థంకావటం భాషా విషయకమైన సమస్య మాత్రమేకాదనీ, కవితాశిల్పానికి సంబంధించింది కూడా అనీ వివరిస్తూ ఇలా అన్నారు- "అసలు కవిత్వమే ఒక విచిత్ర భాష. సామాన్యభాషకంటే భిన్నమైనది. కనక అందరికీ అర్థమయ్యేదే కవిత్వమని గానీ, కవిత్వం అందరికి అర్థం కావాలనిగానీ ఉత్తర్వు చెయ్యటం సాహిత్యంలో తుగ్లక్ పరిపాలనవంటిది. తాత్పర్యం- అర్థం అవటం, అవక పోవటం అనేది కవిత్వానికి సంబంధించిన విషయం కాదు. అర్థం అవటం భాషకు సంబంధించిన విషయం. కవి చేసిన ధ్వనో, వక్రోక్తో, సింబాలిజమో ఇత్యాది ఏదో ఒక చమత్కారాన్ని అర్థం చేసుకోవటం.... ఈ సబ్జక్టు మీద సోషలిస్టు సాహిత్య సిద్ధాంతవేత్తల అవగాహన ఏమిటో, వాళ్ళు అవలంబించిన దృక్పథమూ, పంథా ఏమిటో, అవికూడా.... విశదం చేశాము ఈ మానిఫెస్టోలో. ఈ గొడవంతా ఒక్క తెలుగుదేశంలోనే సుమా! ఈ పరిస్థితి మరెక్కడా కనిపించదు." (పు. 128,129) "అర్థంకాలేదంటే సిగ్గుపడవలసినవాడు అర్థంకానివాడే కాని, కవిత రాసినవాడు కాడు" (పు. 29).

## వస్తువు-శిల్పం

1. "వస్తువు బంగారంలాంటి ముడిసరుకు. దాన్ని ఆభరణంగా మార్చేకళ శిల్పం; కానీ ముడిసరకూ, ఆభరణమూ, శిల్పమూ ఈ మూడింటికీ తాత్పర్యార్థంగా ఉన్నపదార్థం ఒక్కటే- శిల్పంమాత్రం కీలకస్థానంలో ఉంది." (పు. 23)

2. "....చెప్పదలచుకున్న దేదో అది చెప్పమంటున్నాం; కానీ, దాన్ని ఎలా చెప్పాడు అనేది, వాడి రచన కవిత్వమా కాదా అని తేల్చటానికి, కీలక విషయ మంటున్నాం" (పు. 26)

3. "వస్తువుమీద చర్చ చాలించి అసలు కవిత్వంవైపు దృష్టి సారించాలి. ఏది చెప్పాలి అనే విషయం విసర్జించి, ఎలా చెప్పాలి అనే విషయాన్ని గురించి చర్చించండి. (పు. 46)

4. "వస్తువును శిల్పరహితంగా అందజేసినప్పుడు....అది కళ కాకుండా పోతుంది· మార్క్స్ ఈ విషయాన్ని గురించే ఇలా అంటాడు. "Truth is general, it does not belong to me alone, it owns me, I donot own it. My property is the form which is my spiritual individuality. (పు. 17)

## భావశిల్పం వైపు పిలుపు

"ఈనాడు కవిత్వమంటే అర్థ వైచిత్రిగానీ, శబ్ద వైచిత్రి కాదనీ, కవిత్వం అంటే అనుభూతి కళగానీ, అభూతకల్పన కాదనీ- అంటే ఒక జీవన విధానమే గానీ బ్రతుకు తెరువు కాదని ప్రచారం చేద్దాం. భావశిల్పం వైపు పిలుద్దాం. అదే నాగరక ప్రపంచంలో యోగ్యమైన మార్గమనీ వాల్మీకి వైపు, గాలిబ్ వైపు, బోదిలేర వైపు రమ్మని ప్రబోధిద్దాం. భావచమత్కారం ఉన్న కవిత్వం అభ్యాసం చెయ్యాలి గానీ, స్విచ్ వేసిన దగ్గర్నించీ పిండి మిల్లుసౌండ్ చేసే కవిత్వం నేర్చుకుంటే ఎట్లా అని మేల్కొల్పుదాం. ఈ దేశంలో పుట్టి మన భావసంస్కృతికి జన్మస్థానమైన సంస్కృత కవితా సంప్రదాయమూ, మనదేశపు కవిత్వ తత్త్వమీమాంస, పరిసర భాషల కవితా విన్యాసాలు, బహిఃప్రపంచభావపవనాలు, తెలిసి వ్యవహరించక పోవడం ఒక గొప్ప బుద్ధిహీనత అని ఘోషిద్దాం" (పు. 34)

## రాజకీయాలు – కవి

"సమగ్రమానవ జీవితంలో రాజకీయం ఒక భాగం మాత్రమే. రాజకీయ సామాజిక ఆర్థిక సమస్యల్ని పరిష్కరించటానికి ఒక సాధనం మాత్రమే. కానీ, కవి సంపూర్ణ మానవజీవితంతో సంబంధం వున్నవాడు.

కనుక కవి బాధ్యత రాజకీయ భాగానికే పరిమితం కాదు. ప్రస్తుత సామాజిక సందర్భాన్ని అనుసరించి కవి దృష్టిలో రాజకీయం హెచ్చుభాగం తీసికో వచ్చు కానీ, కవి సంపూర్ణ మానవజీవితం మీద తనకున్న బాధ్యతల్ని విస్మరించి ఒక పరిమిత ప్రయోజనానికి మాత్రమే బద్ధుడై పోగూడదు. కవి సరాసరి మానవజాతికి బాధ్యుడు. ఒక రాజకీయపార్టీకి కాదు." "మానవసమాజ క్షేమంకోసం కవినాయకత్వం అన్నింటికంటే అగ్రగణ్యం కావాలి" (పు. 12)

## కవిత్వంలో కమిట్ మెంట్

"ఒకడు కవిత్వం విషయంలో నేను ప్రతిబద్ధుడ్ని అని ఆర్భాటంగా ప్రకటించుకున్నంత మాత్రాన లాభం లేదు. కాని, దాని కోసం జ్వలించే దశ చేరుకోవాలి.... కవి యొక్క ప్రతిబద్ధతా విషయంలో అనుభూతీ, కావ్య ప్రయోజనమూ, ప్రతిబద్ధతా మూడు కలిసి ఐక్యం అయిపోవాలి; అప్పుడే ఆ ప్రతిబద్ధతకు అర్థం ఉంటుంది.... కమిట్మెంట్ అంటే లోకంకోసం శోకం: అంటే అధర్మవ్యతిరేకత". (పు. 199)

## కవిత్వం - విమర్శ

"కవిత్వం అంటే కవిత్వం; కానీ కవిత్వం ఏమిటి అంటే శాస్త్రం. కనక కవిత్వమంటే ఏమిటి అనే చర్చ శాస్త్రీయ పద్ధతుల మీద జరగాలి. కవిత్వానికి ఇంద్రియవాదమూ, కవిత్వ తత్త్వ విచారానికి హేతువాదమూ కావాలి. ఇదే సోషలిస్టు సాహిత్య సిద్ధాంతసారం". (పు. 147)

## చింతనా చతుష్టయం

"ఈ మేనిఫెస్టో చేసిన కొత్త పని ఒక్కటే-వర్తమాన ప్రపంచానికి ఉపలభ్యమైన ప్రాచీన ప్రాక్పశ్చిమ కావ్యతత్త్వచింతన, ఆధునిక కావ్య తత్త్వ చింతన, సోషలిస్టు కావ్యతత్త్వ చింతన అనే చింతనాత్రితయ -లేక- చతుష్టయ శాఖల్ని సమైక్యం చేసి పరిశీలించటమూ, ఆ నాల్గింటిలోనూ ఉన్న ఆశ్చర్యకరమైన భావైక్యాన్నీ, అభిన్నతనూ ప్రతిపాదించి, ఆధునిక మానవుడు ఈ విజ్ఞానమంతటికీ వారసుడనీ, ఈ వారసత్వ భారాన్ని మోయడం చేతనే వర్తమాన మానవుడి విజ్ఞానానికి పరిపూర్ణత వస్తుందనీ ప్రదర్శిస్తుంది. ఇంతే" (పు. 161)

## సౌందర్య శాస్త్రం మార్క్సిస్టు దృక్పథం

1. "మార్క్సిస్టు దృక్పథం ప్రకారం కవితగానీ మరే సృజనాత్మక రచనగానీ 'ఆత్మకళ'-(పు. 317)

2. 'సమాజాన్ని మార్చటానికి కళని ఒక అద్వితీయ ఉపాధిగా పరిగణిస్తున్న మార్క్సిస్టు సాహిత్య దృక్పథం సౌందర్య శాస్త్రాన్ని (Science of Aesthetics) కళాసాహిత్యాల్ని సమాజంతో అవినాభావ సంబంధబద్ధమైనవిగానే భావిస్తూ వాటిని సంపూర్ణ స్వతంత్ర ప్రక్రియలుగా పరిగణిస్తుంది" (పు. 319)

## అనుభూతి వాదం - శాస్త్రీయ సమర్థనం

తెలుగు సాహిత్యంలో క్రొత్తగా వచ్చిన అనుభూతి వాదానికి కవిసేన మానిఫెస్టో శాస్త్రీయమైన భిత్తికను, సమగ్రమైన అభివ్యక్తిని ఇచ్చిందని చెప్పాలి. కవిత్వం ఆత్మకళ అనీ, అనుభూతి కళాభ్యాసంలో నుంచే కవిత్వం పుడుతుందనీ ప్రాచ్యపాశ్చాత్య దృక్పథాలను సమన్వయిస్తూ పేర్కొన్నారు శర్మగారు. ఈ మాటలు గమనించండి—

1) 'అనుభూతి ఇంద్రియ సముపార్జిత జ్ఞానం; అంటే అనుభూతి జ్ఞానానికి ఒక విధమైన రూపాంతరం, తర్కోపార్జిత జ్ఞానం కూడా జ్ఞానమే కానీ ఇంద్రియ సముపార్జిత జ్ఞానమే కవిత్వానికి ఆధారం" (పు.51)

2) "చైతన్యసాగర రహస్యానికి తాళపు చెవి అనుభూతి" (పు.58)

3) "అనుభూతి కళాభ్యాసంలో నుంచి పుట్టేదే కవిత్వం. అదే సాహిత్య చైతన్యం. అదే 'Perfected Sensibility' (పు 22)

4) "అనుభూతి కళాభ్యాసంలో ఆత్మ, జగత్తు (Subject and Object) ఏకమౌతాయి."(పు. 60)

5) 'కవి మొదట అనుభూతిని కళగా అభ్యాసం చెయ్యాలి. ఆత్మీకరణని కళగా అభ్యాసం చెయ్యాలి. తర్వాత అభివ్యక్తిని కళగా అభ్యాసం చెయ్యాలి. ఈ అవిచ్ఛిన్న అభ్యాసతంత్రంలో పడి జీవితమంతా ఒక తపస్సయి కావ్యతంత్రంగా మారిపోతుంది" (పు. 71)

6. 'కవికి కావలిసింది ఇంద్రియవాదం; హేతువాదం కాదు;" (పు. 54).

7. 'కవిలో అనుభూతి మూలంగా ఫీలింగు కలుగుతుంది, ఫీలింగు స్థాయిభావపు సుడిగుండ మవుతుంది. కవి రసపరవశు డవుతాడు. కానీ, కవి రాయడానికి కూర్చున్నప్పుడు మాత్రం రసాన్ని వాగ్రూపం చెయ్యడంలేదు. సమాహితస్థితికి వచ్చి తన రసీభవనకు హేతువయిన స్థాయిభావాన్ని ఆశ్రయిస్తాడు. దాన్ని వాగ్రూపం చేస్తాడు. (పు. 149)

8. "విలక్షణ అనుభూతే విలక్షణ వ్యుత్పత్తి........పాండిత్య సముజ్జ్వలిత అనుభూతీ, అనుభూతి ప్రజ్వలిత పాండిత్యమూ అనే మిధునానికి జన్మించిన శిశువే కవి" (పు. 154)

9. 'కవి ఉత్తమ ప్రయోజనంకోసం ఉత్తమ అనుభూతి ఆర్జించాలి. ఆ ఉత్తమ అనుభూతి సత్త్వగుణైకసాధ్యం. సత్త్వగుణం లోకంలో తాదాత్మ్యం కలిగించే గుణం. దాని ప్రభావం చేతనే లోకపుశోకంతో కవి ఏకమయ్యేదశ చేరగలడు. అంటే శోకించేదశ చేరగలడు. కనక కవికి 'శోకం' ప్రధానం' (పు. 213).

10. 'కవితానుభూతిని అన్యఅనుభూతుల్నించి విడదీసే ప్రయత్నం అవాస్తవికం అశాస్త్రీయం అనేది రిచర్డ్సులో ప్రధాన ప్రతిపాదన. ఇదే తత్పూర్వం శాంటాయనాలో కనిపిస్తుంది; తత్పూర్వం టాల్‌స్టాయిలో కనిపిస్తుంది. ఈ సారూప్యం పరస్పర సంబంధంచేత, విషయఏకత్వబంధం చేత ఏర్పడిందే" (పు. 303)

## ఉత్తమ సాహిత్యం

"ఉత్తమసాహిత్యం ఎప్పుడూ మనిషికి ఆశాజ్యోతి చేతికిస్తుంది. లోకంలో దారి కనిపించని నిస్సహాయ దీన మానవుడికి ఆకాశంలో సూర్యుడు ఏం చేయగలడు?—సాహిత్యజ్యోతే ఓదార్చి దారి చూపిస్తుంది. కనకనే అంటాడు దండి-"ఇద మంధతమః కృత్స్నం జాయేత భువనత్రయం, యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారం న దీప్యతే." (పు. 221).

కవిసేన మేనిఫెస్టో తెలుగుకవుల కళ్ళు తెరిపించింది; విశ్వమానవ తత్త్వచింతనను కవితకు నేర్పింది; వస్తు వేదైనా గ్రహించి కావ్యకళా

శిల్పంతో వెలార్చే స్వేచ్ఛను ప్రసాదించింది; కవిని విజ్ఞాననాయకుడిగా ప్రతిష్ఠించింది; విమర్శకు ప్రాచ్య పాశ్చాత్య సమన్వయ దర్శనాన్ని అందించింది, చింతనాచతుష్టయాన్ని చింతామణి మంత్రంగా బోధించింది; అనుభూతి కళాభ్యాసంతో సాధించే 'ఆత్మకళ' కవితకు జీవలక్షణంగా చెప్పింది; కవితను భావకళవైపు తిప్పింది; క్రొత్తచూపును కలిగించింది; అశాస్త్రీయదృక్పథాన్ని ఖండించింది; రాజకీయాలకంటె మించిన సమగ్ర జీవితప్రవృత్తిని సందర్శింపచేసింది; ఆశాజ్యోతిగా నిలిచే ఉత్తమ సాహిత్య సృష్టికోసం క్రొత్తపిలుపు నిచ్చింది. ఒక సృజనాత్మక విమర్శ లక్షణగ్రంథం కలిగించే సాహిత్య చైతన్యాన్ని కలిగించింది. డా॥ కేతవరపు రామకోటి శాస్త్రిగారు ఈ గ్రంథాన్ని 'సోషలిస్ట్ రొమాంటిక్ క్రిటిసిజాన్ని' వివరించే 'సమన్వయాభ్యుదయ దృక్పథం గల కావ్యశాస్త్రం'మని ప్రశంసించారు.[156]

## విశ్వనాథ—శేషేంద్ర

ఆధునికాంధ్ర సాహిత్య విమర్శకులలో విశ్వనాథ సత్యనారాయణగారొక అంచున, గుంటూరు శేషేంద్ర శర్మగారు మరొక అంచున కావ్య రచనా శిల్ప ధ్వజాలను ఎగురవేశారు. అయితే విశ్వనాథ వారు రసభావ దృక్పథాన్నీ (Emotional assumption), అతీంద్రియ తత్త్వ దర్శన దృక్పథాన్నీ (Transcendentalism) కావ్యానుశీలనంలో ప్రసరింపచేసి విమర్శను అనుభవదశదాకా తీసికొని పోతే, శేషేంద్రశర్మగారు అభివ్యక్తి దృక్పథాన్నీ (Expressionistic assumption), నిర్మాణ సమగ్రైక్యతా భావ దృక్పథాన్నీ (Configurational assumption) కవితాతత్త్వ విచారంలో ప్రవేశపెట్టి విమర్శను సమన్వయ భావదర్శనందాకా తీసికొని వెళ్లారు. వీరిద్దరి విమర్శలకూ భారతీయాలంకారిక దృక్పథమే మూలాధారం; అభినవలోచనం మణిపూరం, ప్రతీకవాదం అనాహతం; తత్త్వానుశీలనం విశుద్ధం; సమన్వయ శిల్పవివేచనం ఆజ్ఞాచక్రం; రసానుభవం సహస్రారం. వీరిరువురికీ కవిత్వ ఒక యోగ విశేషం; విమర్శ ఒక దర్శనశాస్త్రం. విశ్వనాథవారి విమర్శలో పాశ్చాత్య ప్రభావం అద్వైతంగానూ, శేషేంద్రశర్మగారి విమర్శలో విశిష్టాద్వైత్యంగానూ భాసిస్తుంది.

## ప్రభావాలు - పరిధులు

ప్రభావ పరిశీలనానికీ పరిధు లున్నాయి. ప్రభావవీచికలు సాహిత్య జీవన రంగం మీద వర్తులాకారంగా తమ వ్యాప్తిని, ప్రగతిని సాగించి ప్రయోగ స్వభావాల చైతన్యదీప్తికి తోడుపడుతుంటాయి. మొదట ప్రభావం పాశ్చాత్యం కావచ్చును; అది కొన్నాళ్ళకు దేశీయచైతన్యంలో అంతర్భాగమైన పోతుంది: అది పునశ్చైతన్యాన్ని పొందటానికి మరలా పాశ్చాత్య ప్రభావాన్ని పొంద వచ్చు; అదీ మరల దేశీయధారలో లీనమై పోకతప్పదు. ఈ వర్తులాల పరంపరల పరిశీలనమే ప్రభావానుశీలనం. J. T. Shaw అన్నమాటలు ఇక్కడ స్మరింపదగినవి. "An author may introduce the influence of a forein author into a literary tradition, and then, as in the case of the Byronic tradition, in Russia, it may proceed largely from the influence of the native author (i. e. Pushkin). But, as the tradition continues, it may be enriched by another native author (who goes) back to the forein author for materials or tonalities or images or effects which are not adopted by the first author."[157] ఈ మాటలు కవిత్వాని కెంత వర్తి స్తాయో, విమర్శకు కూడా అంత వర్తిస్తాయి. ఈ దృక్పథంతోనే ఆంధ్ర సాహిత్య విమర్శలో ఆంగ్ల ప్రభావాలవలన కలిగిన చైతన్య పరిధులను స్థూలంగా సమీక్షించటం జరిగింది.

ఆంగ్ల ప్రభావ పరిశీలనంలో ఆంధ్ర సాహిత్య విమర్శకుల సమగ్ర సాహిత్య వ్యక్తిత్వాలకు విలువకట్టి వ్యక్తీకరించటం సాధ్యంకాకపోవచ్చును. కాని, అలా చేయకపోతే ఆ పరిశీలనం అసమగ్రమే అవుతుంది కూడా. 'Influence and Literary Fortune' అనే గ్రంథంలో Anna Balakian ప్రభావ పరిశీలన పరమార్థాన్ని యిలా పేర్కొన్నాడు—"One is sometimes led to wonder whether any study of influence is truly justified unless it succeeds in elucidating the particular qualities of the borrower, in revealing along with the influence, and almost in spite of it, what is infinitely more important : the turning-point at which the writer frees himself of the influence and finds his originality."[158] పాశ్చాత్య ప్రభావాన్ని దేశీయంగా మలచుకొని సమకాలీన

సాహిత్యంలో అభినవోద్యమ ప్రస్థానానికి పాంచజన్యాన్ని పూరించే ప్రజ్ఞయే విమర్శకుని ప్రతిభావ్యక్తిత్వం (Originality). ప్రభావితుడు కావటం మొదటి దశ; ప్రభావాన్ని ఆలోచనలో అంతర్భావింపచేసికొని సమకాలీన సృజనాత్మక చైతన్యానికి క్రొత్తవెలుగు చూపించటం రెండవదశ; ప్రభావాన్ని అగస్త్యునిలా ఆపోశనపట్టి దేశీయమైన అనుభవాన్ని వ్యక్తీకరించి విశ్వజనీనమైన సమన్వయ వ్యక్తిత్వాన్ని విమర్శకుడు ప్రకటించటం మూడోదశ. మూడో దశలో ప్రభావంనుండి విముక్తమైన అవస్థ భాసిస్తుంది. ఇది ఒక విమర్శకుని జీవితానికి వర్తించే సూత్రంగా భావిస్తే ఒక సాహితీతపస్వి సమగ్రాధ్యయనం అవుతుంది; దానినే ఒక భాషలో వెలువడిన విమర్శ చరిత్రకే అన్వయిస్తే ప్రక్రియాపరమైన ప్రభావ పరిశీలన మౌతుంది. ఆంధ్రసాహిత్య విమర్శపై ఆంగ్లప్రభావమే కాదు; సంస్కృత ద్రావిడ భాషాది బహుసాహిత్యాల ప్రభావంకూడా ఎంతో ఉంది. వాటి సమగ్ర ప్రభావ పరిశీలనం జరిగితే-వాటికి మించి తెలుగువారు సాధించిన ప్రత్యేకతను, వ్యక్తిత్వాన్ని కూడా అనుశీలించటానికి వీలౌతుంది. ఆంగ్లభాషా ప్రభావానికే పరిమితమైన ఈ పరిశీలనం కొంతవరకు సీమితం కాక తప్పదు.

అందులోనూ యుగకర్తలు తెచ్చిన చైతన్యాన్ని మాత్రం ఈ అధ్యాయంలో సమీక్షించటం జరిగింది. ప్రధానంగా ఆంగ్ల ప్రభావం ఆలోచన, అనుభవాల మీద పడినపైఖరిని వివేచించే పద్ధతి యిందులో పాటింపబడింది. మొత్తానికి ప్రభావవైఖరులు వైవిధ్యంతో కూడి ఉండటం గమనింపదగిన అంశం. కట్టమంచివారి మీద ప్రభావం వరదలా వచ్చింది; విశ్వనాథ మీద ప్రభావం అతర్వాహినిగా సాగింది; సమన్వయ యుగంపై ప్రభావం కొత్త రక్తం పట్టినట్లు చేరింది; మార్క్సిస్టు విమర్శమీది ప్రభావం అచ్చుపోసినట్లు నిలిచింది; కవిసేన విమర్శమీది ప్రభావం పోషకద్రవ్యంగా బలమిచ్చింది. వైవిధ్యంతో కూడిన ఈ ప్రభావాలకు ఆయాకాలాలలో నవ్యతను సంతరించుకొనే పరిధులు పరివేషాలుగా అమరటం సహజం!

"Writers and critics alike must rediscover and regain for themselves the loftiest ideal in the tradition of their vocations in order to re-establish normal, fruitful, complementary relations."[159]

— Georg Lukacs

# 6

# వెలుగులు - వీచికలు

"What the theory attempts to provide is a system of measurement by which we can compare not only different experiences belonging to the sam personality but differenr personalities"[1].

—I.A. Richard:

ఆంధ్ర సాహిత్య విమర్శ చరిత్రలో యుగప్రవర్తకులైన విమర్శకులనూ, **తత్పోషకులైన** వారినీ, వారిపై పాశ్చాత్య విమర్శ ప్రభావాలనూ ఉద్యమ దృష్టితో అయిదవ అధ్యాయంలో అనుశీలించటం జరిగింది. అయితే, తెలుగు సాహిత్య చరిత్రలో నూత్నమైన యుగాలను నిర్మించిన ప్రయోక్తలైన కవులు, పండితులు, రచయితలు ఎందరో ఉన్నారు. వారందరు విమర్శకులని చెప్పటానికి వీలులేదు. వారిలోని విమర్శ సృజన వ్యాపారాన్ని ఆశ్రయించి వివిధ ప్రయోగాలు చేసింది. అయినా, వారిలో కొందరు సాహిత్య విమర్శ పరిణామాన్ని పొందటానికి, మలుపులు తిరగటానికి, క్రొత్త పుంతలు త్రొక్కటానికి తమ దృక్పథాలను సాహిత్యంలో ప్రసరించి పరోక్షంగా తోడ్పడ్డారు. వారిపై కూడ పాశ్చాత్య ప్రభాపం, విశేషించి ఆంగ్ల ప్రభావం బలంగా పనిచేసింది. విమర్శకు వారు బాటలు చూపకపోయినా, ఆలోచనపై వెలుగులు ప్రసరించారు; ఆ వెలుగుల వీచికలు ఆంగ్ల ప్రభావముద్రితాలై ఉండటంచేత ఈ ప్రభావ పరిశీలనంలో చోటు చేసికొంటున్నాయి.

## గురజాడ అప్పారావు

వీరేశలింగం పంతులుగారి నుండి ప్రారంభమైన ప్రయోగ యుగంలో ఆధునికత (Modernism)ను ఆంధ్ర సాహిత్యరంగంలో సుప్రతిష్ఠితం చేసిన గౌరవం గురజాడ అప్పారావు (1862-1915) గారికి దక్కుతుంది. ఆధునికత అన్న భావం ఆంగ్ల ప్రభావం వలన తెలుగు రచయితలు నేర్చుకొన్నదే. Peter Faulkner మాటల్లో ఆధునికత అంటే — "Modernism is a part of the historical process by which the arts have disassociated themselves from the nineteenth century assumptions, which had come in the course of time to seem like dead conventions. These assumptions about literary forms were closely related to a particular relationship between the writer and his readers on the whole a stable relationship in which could assume a community of attitudes, a shared sense of reality."[2] పందొమ్మిదవ శతాబ్దపు సాహిత్య సిద్ధాంతాలకు స్వస్తిచెప్పి, సామాజిక వాస్తవాల వైపు దృష్టి మళ్లించి, సామాజిక సమస్యలతో సన్నిహిత సంబంధాన్ని పెంచుకొని, సాహిత్య ప్రక్రియల్లో వాటికి సజీవ కళారూపాలను కల్పించి, సమాజచైతన్యాన్ని సమున్మేషింప చేసే వివిధ దృక్పథాలను సాహితీరంగంలో ప్రయోగాత్మకంగా ప్రతిష్ఠించే ప్రయత్నమే ఆధునికత.

అయితే, సామాజిక వాస్తవికత సంశ్లిష్టమైనది. దాన్ని సాహిత్యంలో ప్రతిబింబింపజేయ దలచుకొన్న రచయితకు దాని సంశ్లిష్ట స్వభావం ఒక సమస్యగా నిలుస్తుంది. దాన్ని సాహిత్యంలో ప్రతిఫలింప చేసే యత్నంలోనే ప్రక్రియా రూపం, అభివ్యక్తి ఆకృతి తాలుస్తాయి. స్టీఫెన్ స్పెన్డర్ (Stephen Spender) 'The struggle of the Modern' అనే రచనలో ఆధునికతను కోరే రచయితల యొక్క సాహిత్య ప్రవృత్తులను రెండు విధాలుగా వివేచించాడు: "First, 'Modern art is that is which the artist reflects awarenes of an usnprecedented modern situation in form and idiom' and second

that 'the principle of reality in our time is peculiarly difficult to grasp, and that 'realism' is not an adequate approach to it''[3]. గురజాడ తన రచనలలో ఆధునికతను సమకాలీన సామాజిక సమస్యలను నవ్య సాహిత్య ప్రక్రియల ద్వారా, వ్యావహారిక భాషా ప్రయోగం ద్వారా అభివ్యక్తీకరించటానికి యత్నించాడు. దానికి వాస్తవవాదాన్ని ఉపజలకంగా గ్రహించాడు. గురజాడవారి వాస్తవవాదం 'సవిమర్శక వాస్తవ వాద'మని విమర్శకులు వివేచిస్తున్నారు. ఈ దృక్పథాన్ని వివరిస్తూ శ్రీ రాంభట్ల కృష్ణమూర్తి చేసిన సమీక్ష గమనింప దగింది- ''సవిమర్శక వాస్తవికతను కూడా మనం పైనుంచే దిగుమతి చేసుకున్నాం. పరిపణ సమాజం వికసించిన వాస్తవికత యిది. ప్రజాస్వామ్యం పేరుతో ఈ సమాజం ఆవిర్భవించింది. స్వాతంత్ర్యం, సౌభ్రాత్వం, సమానత్వం అన్నది దీని నినాదాలు. ఈ సమాజావిర్భావానికి పూర్వం ఫ్యూడల్ శక్తులతో సకల రంగాల్లోనూ యుద్ధం చేయవలసి ఉంటుంది. మన దేశంలో మత ఫ్యూడలిజంతో కందుకూరి వీరేశలింగం, భాషా ఫ్యూడలిజంతో గిడుగు వెంకట రామ్మూర్తి, సాహిత్య ఫ్యూడలిజంతో గురజాడ అప్పారావూ యుద్ధాలు చేశారు.[4]''

''The sense of complexity was to be the modernist writer's fundemental recognition''[5] అన్న అంశాన్ని గమనిస్తే ఆధునిక రచయితగా అప్పారావుగారిని అవగాహనం చేసికోవటం కూడా సంశ్లిష్టమైన విషయమని స్పష్టమౌతుంది. ఆధునికులలో అప్పారావుగారిని గురించి వచ్చినంత విమర్శ ఏకొద్దిమందికి మాత్రమే వచ్చిందని చెప్పవచ్చు. గురజాడ సాహితీ వ్యక్తిత్వంలో ఉన్న సంశ్లిష్ట స్వభావమే అది. విమర్శకులా అంశాలను నేటికీ విశ్లేషిస్తూ విమర్శలు వ్రాస్తూనే ఉన్నారు. మచ్చుకు కొన్ని :

1. గురజాడ ఆధిక్యానికి నాలుగు కారణాలు చెప్పాడు అతని మార్గాన్ని ముందుకు తీసికొనిపోయిన శ్రీశ్రీ. అవి - 1. సామాజిక పరిణామానికి విప్లవ పంథాలో వేగం సాధించిన మహాకవి కావటం. 2. భవిష్యత్తుమీద గురజాడకు విశ్వాసం ఉండటం. 3. జీవద్భాషకు రచనలో స్థానం కలిగించటం 4. సర్వజనీనత. [6]

2. కావ్యభాషను గురించి అప్పారావుగారి కున్న ఆధునికభావాలను కె.వి. రమణారెడ్డిగా రిలా అన్నారు-'‘కావ్యభాష విషయంలో అప్పారావు చేసిన పని ఇంగ్లీషులో ఛాసరు (Chaucer) చేసిన పని లాంటిది. కావ్యభాషకు గ్రంథ ప్రమాణం గాక జాతి సాంఘిక ప్రమాణమే ముఖ్యమని ఎంచి, ప్రజలకు సుబోధక మయ్యేందుకు నిత్య సంభాషణనుంచి ప్రాణవంతంగా గ్రహించి స్పష్ట మైన, సుపరితమైన భాషను చేపట్టటంలో ఇద్దరి కిద్దరే ... కావ్యభాష బాగా కృతకమై అర్థావబోధ దుష్కరమై పోయిన రోజులలో, మళ్ళీ మామూలు మాటల సత్తాను కావ్యానికి పట్టించిన వర్డ్సువర్తు, తన జాతి జనుల గ్రామ్యాన్ని కావ్యాని కెక్కించి దాని చేవను లోకాని కెరిగించిన రాబర్టు బర్న్సు అప్పారావుకు అభి మానులు కావటం గమనింప దగింది.'' 7

3. ''తెలుగులో మొట్టమొదటి ఆధునిక కవి గురజాడ. ఆయన ప్రారం భించిన నవ్య కవితారీతి ఆధునికతకి ఆరంభం''8-డా॥ వేల్చేరు నారాయణరావు.

4. ''తెలుగు సాహిత్యానికి 20 వ శతాబ్దపు ద్వారాన్ని తెరచిన మహా ద్రష్ట గురజాడ... ఈయనతో తెలుగు సాహిత్యంలో హేతువాద యుగం ప్రవే శించింది. స్థూలంగా 1920 నుంచి 1930 దాకా రాజ్యం చేసిన భావకవిత్వానికి ముందే, సామాజిక హేతువాద సాహిత్యాన్ని వ్రాసిన వా డాయన. అంటే, ఆయన తర్వాత కవిత్వం మళ్ళీ పదేళ్ళపాటు వెనుక చూపే చూచింది. మళ్ళీ శ్రీశ్రీ వచ్చి, గురజాడ వేసిన అడుగుజాడలో ముందుకు పోవాల్సి వచ్చింది. దీన్నిబట్టి తన తర్వాత వచ్చే యుగాన్ని దాటి, ఆ తర్వాతి యుగంలో పుట్ట వలసినంతటి ఆధునికుడు గురజాడ... ఈ విధంగా గురజాడ, తన కాలంలో ప్రచారానికి వచ్చిన ఆధునిక భావవ్యాప్తికీ, సామాజిక స్పృహకీ, సర్వ విధాలా అంకితమై కవిత్వం రాసిన మొట్టమొదటి ఆధునిక కవి. మొట్ట మొదటి ప్రజా కవి. మన సాహిత్య యుగాలన్నిటినీ, నన్నయ నుండి నేటిదాకా రెండే భాగాలు చేస్తే, రెండో భాగం మొదట నిలబడ్డవాడు గురజాడ. ఆయన ఆధునిక యుగా నికి ఆదికవి'' 9-శ్రీ అద్దేపల్లి రామమోహనరావు.

కవిత్వం, నాటకం, కథానిక మొదలైన ప్రక్రియల ద్వారా తెలుగు సాహిత్యంలో ఆధునితాస్పృహను, హేతువాద, వాస్తవిక వాదాలను, వ్యావహారిక

భాషా ప్రయోగోద్యమ స్పృహను వ్యాప్తి చేసిన గురజాడ వ్రాసిన వ్యాసాలు కాని, తదితర సమీక్షలుగాని సాహిత్య విమర్శస్థాయికి అందుకున్నట్లు కన పడవు. ఆయన ఉద్యమం సాహిత్య విమర్శవైపు మొగ్గలేదు. కాని, ఆధునిక సామాజికస్పృహకు కావలసిన బీజావాపనం భావకవిత్వ యుగారంభ దశలోనే చేసిన గురజాడ భావ విప్లవ కాంతులు మాత్రం సాహితీపరుల కళ్ళు జిగేలు మనిపిస్తూ ఉన్నాయి.

## రాయప్రోలు సుబ్బారావు

నవ్య కవిత్వయుగ ప్రవర్తకులలో ఒకరైన శ్రీ రాయప్రోలు సుబ్బారావు గారు (1892-) కవిగా, ద్రష్టగా ఆంధ్ర సాహిత్యరంగంలో అఖండకీర్తి నార్జిం చారు. ఆయన ప్రతిపాదించిన రమ్యాలోకం, అమలిన శృంగార సిద్ధాంతం, మాధురీ దర్శనం వారిని సాహితీతత్త్వ ద్రష్టగా కాల్పనిక యుగంలో ప్రతిష్ఠిస్తు న్నాయి. కవికి స్వీయ సాహితీదర్శనం ఒకటి తప్పక ఉండాలన్న స్పృహను ఆయన ఆధునిక యుగానికి కల్పించారు. ఆయన రచించిన కావ్యాల వెనుక అపార జీవిత విమర్శ ఉంది. ఆ విమర్శను సాహిత్యసిద్ధాంతంగా రూపొందించే భావనాశక్తి ఉంది. సౌందర్యతత్త్వ దర్శనంతో సంవదించే సమన్వయశక్తి ఉంది. వారి రమ్యాలోకం, మాధురీదర్శనం ఛందోమయంగా వెలువడిన సాహిత్య సిద్ధాంత గ్రంథాలు. ఆ సిద్ధాంతాన్ని కళాఖండాలలో రమణీయంగా ఆవిష్క రించి కవి అయినారు. 'రూపనవనీతం' లో ప్రతీకాత్మక పాత్రల ముఖంగా చర్చించి వ్యాఖ్యాత అయినారు. ఆ సిద్ధాంతాలనే విమర్శగా వెలయించినట్లయితే, అభినవ విమర్శకాచార్యులుగా అఖండకీర్తి నార్జించేవారు అంతర్జాతీయంగా. అయినా వారు ప్రసరించిన వెలుగు విమర్శ కొక వినూత్నదృక్పథాన్ని ప్రసాదించిం దనటంలో విప్రతిపత్తి లేదు. వారి సిద్ధాంతాలమీద భారతీయ సౌందర్యతత్త్వ ప్రభావం బలీయంగా కనబడుతున్నా, సజాతీయ పాశ్చాత్య సిద్ధాంతాల వినిమయం వివేచనామధురంగా గోచరిస్తుంది.

రాయప్రోలువారు శృంగార రసతత్త్వాన్ని అభినవంగా దర్శించారు. ఇది విశుద్ధ సాహితీదర్శనం. ఈ అంశాన్ని ఆయన మొదట స్పష్టం చేశారు. లోకంలో ఆధ్యాత్మికదర్శన మనీ, సాహిత్య దర్శన మనీ రెండువిధా లున్నాయని

పేర్కొని, ఆధ్యాత్మిక దృష్టితో సాహితీతత్త్వాన్ని విమర్శించే విధానాన్ని వేరు చేశారు. ఆధ్యాత్మిక దర్శనం చేసేవారు వేదాంతులు. వారు బుద్ధివాదులు. సాహితీ దర్శనం చేసేవారు సహృదయులు. వారు హృదయవాదులు. శృంగారానికి స్థాయి అయిన రతిని సంభోగ విషయేచ్ఛా విశేషంగా భావించడం సర్వదర్శనాల్లోనూ సామాన్యమైపోయింది. దాన్ని రాయప్రోలువారు కాదని శృంగార నిజతత్త్వాన్ని స్వోపజ్ఞంగా స్థాపించారు. దంపతులమధ్య చిరస్థాయిగా నిలిచే స్నేహం స్థాయిగా వర్తిస్తుంది. దీన్ని లాక్షణిక భాషలో 'రతి' అనే అంటారు; తదనుభూతిని 'శృంగార'మనే అంటారు. కాని, దాని నిజమైన అర్థం అదే అయినా, రతి, శృంగారం అనగానే సంభోగ విషయేచ్ఛ, తదనుభవ విశేషం అనే అర్థంలోనే లోకంలో విపరీతంగా వ్యాపించి ఉంది. ఈ అపార్థాన్ని తొలగించి నిజార్థాన్ని ఆధునికులకు అవగతం అయ్యేటట్లు చెప్పటానికే 'అమలిన శృంగారం' అనే పేరును కల్పించారు. అమలినమైన రతి అంటే ప్రేమ లేదా స్నేహం అని వారి భావం; తనూత్సంగసంగతమైన రతి స్నేహ ధౌతం కావటంతో అమలినంగా భాసిస్తుందని వారి దర్శనం. బుద్ధిజీవియైన మానవునికి ఇది సిద్ధమైన సాధన. ప్రకృతిసిద్ధమైన సాధననుంచి పతనమైన మానవ ప్రకృతి రతిని కామవికృతిగా భావించి జీవితమాధుర్యాన్ని కోల్పోయిందని రాయప్రోలు వారి వేదన ! ఆ ఆవేదనలోనుంచి సత్యదర్శనంకోసం చేసిన సాధనయే వారి దర్శనసారం. వారి సిద్ధాంతం ప్రకారం అమలిన శృంగారమే రతి స్థాయియైన నిజమైన శృంగారం. ఇప్పుడు కావ్యజగత్తులో పరిగణింపబడుతున్న శృంగార స్థాయి రతిగా భ్రమింపబడుతున్న కామం. ఈ విపర్యయాన్ని గుర్తింపజేసి, సవరింపచేసేదే రాయప్రోలువారి అమలిన శృంగార సిద్ధాంతం.

'రసోవైసః' అని ప్రాచీనులంటే, 'ప్రీతిరేవ రసః' అని రాయప్రోలు వారన్నారు. 'ప్రకృతి ఫలంలాంటిది. అది అందించే అనుభవం రసం. మన మాస్వాదించేది రసాన్ని. దాని రుచి సంస్కారంగా నిలిచిపోతుంది, రమ్యమైన వస్తువులను చూచినపుడు ఆ సంస్కారం మరల జాగృతమై రసీభవిస్తుంది. కాళిదాసు 'రమ్యాణివీక్ష్య...' అనే శ్లోకంలో చెప్పిన తాత్పర్య మిదే. తృణం జలకణాలను ఆస్వాదించి పచ్చబడుతుంది. నీరు లేకపోతే ఎండిపోతుంది. మరలా జలసేచనంవల్ల పులకితమౌతుంది. రసచర్వణస్థితికి తృణం సజీవోదాహరణం.

నిరంతర ప్రేమభావ సేచనంతో స్థాయిత్వాన్ని భజించే స్నేహరుచియే రసనామకమైన ప్రీతి. దానికి ప్రతీక తృణకంకణం''[10] అన్నారు రాయప్రోలువారు.

అమలిన శృంగార సిద్ధాంతంమీద ప్లేటో ప్రేమతత్త్వప్రభావ మున్నదని కొందరు భావించారు. డా॥ సి. నారాయణ రెడ్డిగారు రెండు సిద్ధాంతాల తారతమ్య పరిశీలనం చేసి ''ప్లేటోకు వీరికి పోలికలేదు. ఉన్న సామ్య మొక్కటే. శారీరక సౌందర్యముకన్న ఆత్మ సౌందర్యము గొప్పది. ఆంగిక సంయోగముకన్న ఆత్మ సంయోగము గొప్పది. ఈ తత్త్వమును ఇంచుమించుగా ఇద్దరొకే విధముగా ప్రతిపాదించిరి. అంతమాత్రముచేత వీరి అమలిన శృంగారము Platonic love ఒక్కటే అనుట సమంజసము కాదు. పైగా మూల తత్త్వములోనే ఈ రెంటికి ఎంతో తారతమ్య మున్నది.''[11] అని నిరూపించారు. ''వీరి మాధురీ దర్శనమునకు రాబర్టు బ్రిడ్జెస్ (Robert Bridges) వ్రాసిన 'Testament of Beauty' అను గ్రంథమునకు ఆనంద సౌందర్య మూల ద్వారా పరబ్రహ్మమును నందుకోవచ్చునను అభిప్రాయముతో మాత్రము పోలికలున్న' వని గమనించారు. 'సృష్టి ప్రేమమయమన్న రవీంద్రభావము వీరిపై ప్రభావము వేసినది. సుఖ దుఃఖములు ప్రాణికి సహజములైనను, మానవుడు దుఃఖమునకు లొంగిపోక ఆనందధామమువంక ప్రస్థానించవలెనన్న రవీంద్రతత్త్వమునే రాయప్రోలువారు తృణకంకణములో, లక్షణగ్రంథములలో ప్రతిపాదించి' రని వివేచించారు. మాధురీ దర్శనంలో రతిభావాని కిచ్చిన వ్యాఖ్యానం వైష్ణవమతంలోని, 'మహామాధురీ భావాన్ని' దృష్టిలో పెట్టుకుని చేశారని సంభావించారు.[12] రాయప్రోలువారే స్వయంగా రూపనవనీత నివేదనలో ఆనందవర్ధనుని పంక్తులను తమ ప్రవచనానికి ప్రాతిపదికలుగా పేర్కొన్నారు. 1. 'శృంగార రసో హి సంసారిణాం నియమేన అనుభవ విషయత్వాత్, సర్వ రసేభ్యః కమనీయతా ప్రధాన భూతః'. 2. 'విప్రలంభ శృంగారే కరుణే మాధుర్యం ప్రకర్షయత్'. 3. 'విప్రలంభే సౌకుమార్యాతియోస్తు'. 4. 'విరోధం అవిరోధం సర్వేషు రసేషు నిరూపయేత్ సహృదయః' 5. 'విశేషస్తు శృంగారే తస్య రసపరిపోషకాత్మకత్వాత్, రతేశ్చ స్వల్పేనాఽపి నిమిత్తేన భంగ సంభవాత్, శృంగారః సుకుమారతరః సమనాగపి విరోధి సమావేశం నసహతే'. జగన్నాథ పండితరాయల రస గంగాధరంలోని వాక్యాలను కొన్నింటిని ఆయన రమ్యాలోకంలో అనువదించుకోవటం ప్రసిద్ధం. ఇలా ప్రాచ్యపాశ్చాత్య దృక్ప

థాలు ఆయన సిద్ధాంతానికి ప్రేరకాలైనా ఆయన దర్శనాని కొక ప్రత్యేక ప్రతిపత్తి ఉన్నదనటంలో ఎలాంటి విప్రతిపత్తి ఉండబోదు.

రాయప్రోలువారు తమ సిద్ధాంత దృక్పథంతో ప్రాచీన గాథలైన అహల్యానసూయల వృత్తాంతాలను వ్యాఖ్యానించే వినూత్న పద్ధతిని చూపించారు. ఇది ఒక విధంగా టి. యస్. ఇలియట్ సాహిత్య విమర్శకుండవలసిన లక్షణాన్ని స్మరింప చేస్తున్నది. 'Criticism must always profess an end in view, which, roughly speaking, appears to be the elucidation of works of art and the correction of taste'. ఈ లక్షణం రాయప్రోలుకు వర్తింపజేస్తే ఆయన విమర్శ కొక దృక్పథం ఉంది; ప్రాచీన శృంగార గాథలను క్రొత్తవెలుగుతో చూచే అభినవ దర్శన ముంది; నిజంగా శృంగార మంటే ఏమిటో నిజతత్త్వాన్ని తెలిసికొని అనుశీలించటంలో సక్రమమైన అభిరుచిని నిర్దేశించే సవరణ పద్ధతి ఉంది. అమలిన శృంగార తత్త్వంతో దర్శిస్తే ప్రకృతిలో మాతృతత్త్వం పరిమళిస్తుంది; సాహితిలో రమ్యాలోకం సాక్షాత్కరిస్తుంది; శబ్దార్థ వృత్తులలో ప్రతీయమానమయ్యే వ్యంజన, స్నేహ శక్తిగా వ్యక్తమౌతుంది; కాంతాసమ్మితమైన కావ్యపరమార్థం మాధురీదర్శనంగా మనసుకు స్ఫురిస్తుంది. ఇవి ప్రాచీన సాహిత్యోపాసకులకు అభినవదర్శన శక్తిని ప్రసాదించాయి. ఈ ప్రక్రియను గమనిస్తే ఇలియట్ పేర్కొన్నట్లు— 'The new impressions modify the impressions received from the objects already known. An impression need to be constantly refreshen by new impressions in order that it may persist at all; it needs to take its place in a system of impressions. And this system tends to become articulate in a generalized statement of literary beauty'' —అన్న సాహితీ స్వభావాన్ని ఆవిష్కరిస్తున్నట్లు గమనించదం సులభం.

''Poetry may effect revolutions in sensibility such as are periodically needed; may help to break up

the conventional modes of perception and valuation which are perpetually forming and make people see the world afresh or some new part of it. It may make us from time to time a little more aware of the deeper, unnamed feelings which from the substratum of our being, to which we rarely penetrate; for, our lives are mostly a constant evasion of ourselves, and an evasion of the visible and sensible world. But to say all this is only to say what you know already, if you have felt poetry and thought about your feelings" —అన్న ఇలియట్ వివేచనం రాయప్రోలు కవిత్వానికీ వర్తిస్తుంది. వారి సిద్ధాంతం వలన పరంపరాగతంగా వస్తున్న శృంగార రసభావనం అభినవతత్త్వ గౌరవాన్ని పొందింది. నరనారీ ప్రణయ జీవితాలలో స్థాయిగా ఉండే స్నేహం తెలియవచ్చింది; దానికి అమలిన శృంగారమనే పేరు క్రొత్తగా పెట్టబడింది; అమలిన శృంగారం అనుభవసిద్ధమైనా తరతరాలనుండి విస్మృతమై విపరీత వ్యాఖ్యకు గురియైపోయింది; ఆ అనుభవసత్యాన్నే రాయప్రోలు వెలికి తీసి వెలుగు నిచ్చి ప్రతిపాదించారు. మనకు తెలిసిన సత్యాన్నే ఆలోచనాలోచనాల కందించారు. కవితాకృతిలో రమణీయంగా ఆవిష్కరించారు. కవితాతత్త్వాన్ని గురించి ఆధునిక యుగప్రవర్తకులైన ఆంగ్ల విమర్శకుల అభిప్రాయాలను రాయప్రోలు సంవదించుకోవటం అపూర్వం. అనువర్తిత విమర్శలో ఈ సిద్ధాంతం అన్వయింప బడితే ఇలియట్ భావాలు రాయప్రోలు విమర్శలో వెలుగు చూచి ఉండేది.

రాయప్రోలుమీద సౌందర్యతత్త్వశాస్త్ర ప్రభావంకూడా బలంగా ఉంది. సౌందర్యతత్త్వ వివేచకులలో ప్రధానంగా మూడువిధాల వారుంటారని పాశ్చాత్యులు పరిగణిస్తారు. వారు: ఫార్మలిస్టులు, ఐడియలిస్టులు, ఎక్స్ప్రెషనిస్టులు. వీరి దృక్పథాల్లో గల భేదాన్ని ఇలా భావించవచ్చును- 'ఫార్మలిస్టులు అనబడువారు సౌందర్యము రూపమందు నివసించుననియు, ఐడియలిస్టు లనువారు సౌందర్యము వస్తుతత్వమం దుండుననియు, ఎక్స్ప్రెషనిస్టు లనువారు జీవకళయందు సౌందర్యమున్నదనియు నభిప్రాయపడుచున్నారు. అనగా ఫార్మ

లిస్టులు (రూపాభిమానులు) ప్రకృతియొక్క బాహ్యాంగము లందును, అన్నమయ కోశమందును, సౌందర్య మనుభవించుచున్నారు. ఎక్స్ప్రెషనిస్టులు (అభినయాభిమానులు) రూపమును జీవమయముగ నొనర్చి బహుభంగుల చలింపచేసెడి ప్రాణమయ కోశమును సౌందర్య నిలయముగ నెంచుచున్నారు. ఆత్మాభిమానులైన ఐడియలిస్టులు విజ్ఞానకోశ ప్రచారమున సౌందర్యస్ఫురణ మేర్పడుచున్న దని భావించుచున్నారు."[13] రాయప్రోలువారు సౌందర్యతత్త్వదర్శనంతో ఐడియలిస్టులని నిర్ద్వంద్వంగా చెప్పవచ్చును. చిరస్నేహ ప్రవృత్తి ఆత్మచిత్కళ యైన ప్రేమభావంతో ఉపజీవించి రతిగా జీవనియతినీ, కావ్యజీవితాన్నీ లాలించి స్థాయిగా చర్వ్యమాణమై రసానంద సంసిద్ధిని ప్రసాదిస్తున్నదని ప్రతిపాదిస్తారు రాయప్రోలువారు. వారి దృష్టిలో రమ్యములైనవి - 'సాత్త్విక ప్రేమకోశ పేశలములైన వత్సలామృత రుచులు' (రమ్యాలోకమ్. పు. 87). రాయప్రోలు రమ్యాలోకం మాధురీదర్శనమూలం. మాధురీ దర్శనం ఆత్మచిత్కళారూపమైన ఆనంద బిందువు ప్రసరించే రమ్యాలోకం.

"రమ్య విషయము లన్నిటిలో మూడు గుణములు మాత్ర మగపడుచున్నవి. 1. రూపసౌందర్యము 2. ప్రేక్షకుల యింద్రియములను బుజ్జగించెడి విషయాత్మక సౌందర్యము (సెన్సుయస్ బ్యూటీ) 3. భావార్థములవలనను జీవ సంచలనము వలనను స్ఫురించెడి సౌందర్యము. ఈ మూటిని ఒక్క సూత్రమున ప్రతిపాదించనేరము. ఇవి మూడును చేరి వస్తువుల ఉత్కృష్టతను సర్వాంగ పరిణతిని యేర్పరచుచున్నవి. అనగా అంతరార్థమునకు బాహ్యరూపమునకును సామంజస్య మేర్పడినపట్ల, బాహ్యాంశములు ప్రయోజనకారులై యుపచరించుట పట్ల నౌత్కృష్ట్యము, సౌందర్యము సిద్ధింపబడిన ట్లూహింపబడుచున్న'[14] దను సౌందర్యతత్త్వ జిజ్ఞాసువుల దృక్పథానికి రాయప్రోలు రమ్యాలోకము దృష్టాంతం. రాయప్రోలువారి దర్శనం విమర్శమూలం. దాని జన్మస్థానం భారతీయుల ధ్వనిదర్శనం; దాని పరిమళం పాశ్చాత్య సౌందర్యతత్త్వ సమన్వయం.

## త్రిపురనేని రామస్వామి చౌదరి

హేతువాదాన్ని తెలుగులో ఒక ఉద్యమంలా సాగించిన మనీషి శ్రీ త్రిపురనేని రామస్వామి చౌదరి (1886-1948). "Rationalism may

be defined as the mental attitude which unreservedly accepts the supremacy of reason and aims at establishing system of philosophy and ethics verifiable by experience and independent of all arbitary assumptions or anthority."[15] చౌదరిగారు హేతువాద దృక్పథాన్ని సూత పురాణము, భగవద్గీత మొదలైన కృతులద్వారా, శంబుక వధ, ఖూనీ మొదలైన నాటకాలద్వారా వ్యాపింపజేశారు. వీరి కృతులకు వీరే వ్రాసిన పీఠికలు చాల విలువైనవి. హేతువాదానికి తార్కిక పటిమను అందింపగలిగిన వాఙ్మయం వీరి పీఠికలు. ఆంధ్రదేశంలో వీరి హేతువాదం ఝంఝగా వీచింది, వాదోప వాదాలకు గురి అయింది, సాంఘికంగా చైతన్యాన్ని కల్పించింది భౌతికవాదం, నాస్తికవాదం, అజ్ఞేయవాదం, మానవతావాదం మొదలైనవాటి విస్తృతికి తోడ్పడింది.

"తెలుగు సాహిత్యంలో హేతువాదానికి మూలపురుషుడుగా 'త్రిపురనేని రామస్వామి' గారిని పేర్కొంటారు. కొత్త సమాజాన్ని నిర్మించుకోవాలంటే ముందుగా భావదాస్యం పోగొట్టి, కొత్త ఫిలాసఫీని రూపొందించుకోవాలి అనే విశ్వాసంతో హేతువాద ప్రచారార్థమే ఆయన సాహిత్యాన్ని సృష్టించారు. ప్రజలలో భావవిప్లవం రావాలంటే, ముందుగా మతం పేరిట వారిలో పేరుకొని పోయిన మూఢ విశ్వాసాలు పోవాలి. ప్రజలలో మౌఢ్యాన్ని పెంచుతున్న మతాన్ని ప్రచారంచేసే పురాణాలను, కృత్రిమ అసమానతలు సృష్టించిన స్మృతులను హేతువాద దృక్పథంతో విమర్శించాలి. అదే ఆయన రచనలలో ప్రధాన వస్తువు"[16] అన్న శ్రీమతి ఆవుల మంజులతగారి మాటలు 'కవిరాజు' సాహిత్య స్వభావాన్ని, వారి హేతువాద దృక్పథాన్ని స్పష్టం చేస్తున్నాయి.

త్రిపురనేని వారి హేతువాదోద్యమం తెలుగులో ఆ వాదానికి సంబంధించిన వాఙ్మయాన్ని విరివిగా రచయితలచేత వ్రాయించింది. తెలుగుదేశంలో ఆ వాదాన్ని గాఢంగా నమ్మి రచనలు చేసే రచయితలను సృష్టించింది. త్రిపురనేని ప్రభావం బలంగా ఉన్న రచయితలలో శ్రీయుతులు నార్ల వెంకటేశ్వరరావు, జి.వి. కృష్ణరావు, చలం, ముద్దుక్రిష్ణ, తాపీ ధర్మరావు, ఆచార్య గంధం అప్పారావు, త్రిపురనేని వెంకటేశ్వరరావు, బోయి భీమన్న, మొదలైన వారిని ప్రధా

నంగా పేర్కొనవచ్చును. గోపీచంద్ పై త్రిపురనేని వారి ప్రభావం ఉన్నా ఆయన హేతువాద పరిధిలో నుండి ముందుకు సాగిపోయిన సత్యాన్వేషి. అందువలన గోపీచంద్‌ను ప్రత్యేకంగా పరిగణించాలి. 'కవిరాజు' మీద బెర్నార్డ్‌షా ప్రభావం ఉందని విమర్శకులు భావిస్తున్నారు.

## దేవులపల్లి కృష్ణశాస్త్రి

దేవులపల్లి కృష్ణశాస్త్రి (1897-1980) గారి పేరు వినగానే భావ కవిత్వం, ఆత్మాశ్రయ ధోరణి, కాల్పనిక యుగ చైతన్యం తెలుగువారికి గుప్పున జ్ఞాపకం వస్తాయి. కృష్ణపక్షం, ఊర్వశి మొదలైన కృతులు హృదయ మందిరాల్లో సువాసనలు గుబాళిస్తాయి. కృష్ణశాస్త్రిగారు కవితయే కాదు, గేయ నాటికలు, కథలు, వాఙ్మయ రేఖా చిత్రాలు, స్మృతులు, భక్తి గీతాలే కాదు, వ్యాసాలు, పీఠికలు కూడా రచించారు. అయితే ఆయన విమర్శక వ్యక్తిత్వం కవితా వ్యక్తిత్వంలో అంతర్హితమై పోయినట్లు కనపడుతుంది. ఆయన వ్యాసం వ్రాస్తే ఆత్మాశ్రయ ధోరణితో కూర్చే అనుభవాల మాలగా, వివేచనాత్మకమైన హరివిల్లులా భాసిస్తుంది. కృష్ణశాస్త్రి కృతులపై పరిశోధన చేసిన డా॥ యస్. నిర్మలాదేవిగారు కృష్ణశాస్త్రి వ్యాస వాఙ్మయంమీద చక్కని సమీక్ష చేశారు. వారి మాటల్లో- ''మిత్రగోష్ఠులలోనే గాకుండ, రచనలోనూ మనల్ని నిండుగా నవ్వించగల హాస్యముంది. సమాజములోని వికారాలని చురుక్కు మనేటట్లు పరిహాసం చేసే గుణమూ ఉంది. ప్రాచీనత మీద మక్కువతో పాటు కృష్ణశాస్త్రి సర్వ సాహిత్యమునకు జీవలక్షణము సూటిగ, హృదయాలకు హత్తుకుపోయేలా చెప్పే గుణముంది. అంతేకాదు, తెలుగు వచనం ఎంత అందంగా వుంటుందో నిరూపించదానికా అన్నట్లు పర్‌ఫెక్షన్ (పరిణత శిల్పం), విషయ వైవిధ్యంతో పాటు, తదనుగుణంగా భాషావైవిధ్యము ఉంది. అనంతమైన లోకజ్ఞతతో పాటు, ప్రాచీన సాహిత్యాల్లో మాత్రమే కాకుండ ఆంగ్ల సాహిత్యంతోనూ, సూఫీ సాహిత్యంతోనూ ప్రగాఢ పరిచయముంది. సంస్కృత సాహిత్యం, రవీంద్ర సాహిత్యం కరతలామలకాలు. ఇవన్నీ కృష్ణశాస్త్రి వచన రచనల్లో మూర్తీభవించి గోచరిస్తాయి.''[17]

'కృష్ణశాస్త్రి జీవితం-సాహిత్యం' అనే గ్రంథం వ్రాసిన శ్రీయుతులు జి. చెన్నయ్య, భాస్కరరెడ్డి గారలు కృష్ణశాస్త్రిగారి వ్యాసాలను సారస్వత

వ్యాసాలనీ, వివేచనాత్మక వ్యాసాలనీ, భావనాత్మక వ్యాసాలనీ, సాంఘిక వ్యాసాలనీ విభజించి సమీక్షించారు.[18] ఆయా వ్యాస ప్రక్రియలకు కృష్ణశాస్త్రి గారు మంచి ఒరవడి పెట్టారని పేర్కొన్నారు, వీటిలో 'పాతిక సంవత్సరాల తెలుగుకవిత్వం' అన్న వ్యాసం నవ్యాంధ్ర సాహిత్య స్వభావాన్నీ, దాన్ని ప్రస్తరించిన సాహితీమూర్తుల వైలక్షణ్యాన్నీ, సామాజిక స్థితిగతులను వర్ణించే వర్ణనాత్మక సాహిత్య సమీక్ష. సమకాలీనుల సాహిత్య వ్యక్తిత్వాలను చిత్రించటంలో కృష్ణశాస్త్రిగారు సౌజన్య సింధువులుగా, సాహిత్య విమర్శకులుగా కనపడతారు. 'బసవరాజు అప్పారావు మధురస్మృతి' అనే వ్యాసం వచనంలో జాలువారిన స్మృతిగీతంలా భాసిస్తుంది. వేంకటపార్వతీశ్వరకవుల 'ఏకాంతసేవ'కు వ్రాసిన పీఠిక నవ్యకవుల 'Literary testament'గా ప్రఖ్యాతి గాంచింది.

కృష్ణశాస్త్రిగారి రచనలమీద వర్డ్స్‌వర్త్, కోల్‌రిడ్జ్, షెల్లీ, కీట్స్, మలార్మే, క్రోచే మొదలైన పాశ్చాత్యుల ప్రభావం ఉంది. విమర్శకుడుగా కృష్ణశాస్త్రి కాల్పనికోద్యమ ప్రవృత్తిని తనలో నింపుకొన్నవాడు. కావ్య సౌందర్యతత్త్వాన్ని కమనీయంగా ఆవిష్కరింపగలిగినవాడు. కృష్ణశాస్త్రి విమర్శలో ప్రత్యేకత ఏమిటంటే- సాహిత్య విమర్శలో కళాత్మక దృష్టిని ప్రసరించటం, అనుభవం నుండి చేదుకొనే సాహిత్య ప్రమాణాలను సమీక్షలో వెలయించటం, ప్రాచ్య పాశ్చాత్య దృక్పథాలను సౌందర్యతత్త్వ ప్రదర్శకంగా సమన్వయించటం, విమర్శ కూడా కళగా అనుభవాన్ని అందించగలదనే భావాన్ని అభివ్యక్తి ద్వారా సాధించటం, సౌందర్య మీమాంసలో అభిరుచి విమర్శకు చోటివ్వకుండా, ఆత్మాశ్రమ ధోరణులను అపూర్వంగా సంవదించటం. వీరి విమర్శలో కవితాత్మ ప్రత్యక్షమౌతుంది. అది విమర్శను 'లిరిక్'గా భాసింపచేస్తుంది. కవితలో లాగానే విమర్శలో కూడా కృష్ణశాస్త్రి శిల్పి.

## గుడిపాటి వెంకటచలం

ఒక సాహిత్యంలో రవ్వల్లాంటి రచయితలు కోకొల్లలుగా వెలుగుతుండవచ్చు; కాని, రత్నంలాంటి అన్వేషకుడు నూటికీ కోటికీ ఏ ఒక్కడో ప్రకాశిస్తుంటాడు. అన్వేషకులు రెండు విధాలు-ఆలోచిస్తూ అన్వేషించేవాళ్లు; జీవిస్తూ అన్వేషించే వాళ్లు. ఆలోచిస్తూ అన్వేషించే వాళ్లు బుద్ధికి దర్శనాన్నిస్తారు; జీవిస్తూ

అన్వేషించే వాళ్ల మనస్సుకు స్పర్శనా న్నందిస్తారు. ఒకటి విద్వత్తులా వెలుగును ప్రకాశింప చేస్తే, మరొకటి విద్యుత్తులా చైతన్యాన్ని ప్రవహింపజేస్తుంది. చలం విద్యుత్తులాంటివాడు. ఆయన నవలలు, కథలు, నాటకాలు, వ్యాసాలు, లేఖలు, మ్యూజింగ్స్ వ్రాశాడు. అన్నిట్లోనూ ఆయన అన్వేషకుడే. అన్వేషకుడు నిజాన్ని నిర్మొగమాటంగా చెపుతాడు; నచ్చనిదాన్ని నిష్ఠురంగా నిందిస్తాడు, అనుభవాన్ని ఆర్ద్రంగా పలుకుతాడు; అందుకోలేని దానికై అర్రులు సాచి ఆక్రందిస్తాడు. అన్వేషకుని రచనకు ఆకృతిశిల్పం ఔపచారికం. అందులో ఆయన అన్వయించే ఆలోచనే దానికి జీవం. ఆ జీవం అతడు సృష్టించే సాహిత్యాన్ని ఒక ఉద్యమంగా రూపొందింపజేస్తుంది. అందుకే శ్రీ గోరెపాటి వెంకటసుబ్బయ్యగా రన్నారు- "కొందరి దృష్టిలో ఆయన గొప్ప కథకుడు; మరికొందరి దృష్టిలో గొప్ప నాటికా రచయిత; మరి కొందరి దృష్టిలో మహాకవి. కొందరు ఆయన్ని తాత్వికుడుగా భావిస్తారు. మరికొందరు సెక్సు రచయితగా. ఇది సమగ్రమైన సత్యం కాదు. చల మంటే ఒక ఉద్యమం. అప్పుడు కాని అర్థంకాదు."

చలం అన్వేషణ సమాజంలో స్త్రీ పొందే అతిదీనస్థితి నుంచి అధ్యాత్మికౌన్నత్యం వరకూ సాగింది. పురూరవ నాటకంలో శిఖరాన్ని అందుకొన్నాడు చలం. ఆయన వ్రాసిన కథలూ, నాటకాలూ, లేఖలూ అన్నీ సత్యాన్ని అన్వేషిస్తున్న ఆయన మనోనేత్రాల ఉన్మేషాలే. మ్యూజింగ్సు, ఆయన భావ విహంగాలకు మ్యూజికల్ వింగ్స్; ఆయన కవితా దృక్పథాలకు కరదీపికలు!

తెలుగు సాహిత్యంలో ప్రేమలేఖలు, మ్యూజింగ్స్-అనే ప్రక్రియలకు రూపకల్పన చేసిన ప్రత్యేక గౌరవం చలంగారికి దక్కుతుంది. ఆత్మాశ్రయనవలా ప్రక్రియలా ప్రేమలేఖల రచన విశిష్టశిల్పమార్గంగా విమర్శకుల మన్ననల నందుకొన్నది. ఇక మ్యూజింగ్స్- వచనంలో సాగే ముక్తక సంపుటలాంటిది. 'మ్యూజ్' అంటే కళాసరస్వతి; మ్యూజింగ్స్ అంటే- 'నిశ్శబ్ద సమాధిలో నిరంతర చింతనం'. చలం మానసిక సమాధిలో నుంచి సముద్ర వీచికల్లా పొంగిన ఆలోచనా తరంగాలు మ్యూజింగ్స్. ఇవి ఆయన అంతరాత్మ ఆలపించిన డివైన్ సాంగ్స్; ఛందస్సుల కతీతమైన మ్యూజికల్ రైమ్స్! ఇవి ముక్తి నిచ్చే భక్తి వచనాలు కావు; జీవితాన్వేషణలో దొరికిన సుఖదుఃఖాల అనుభవసూక్తి మౌక్తికాలు. ఈ మౌక్తిక హారంలో అంతస్సూత్రం చలం. మ్యూజింగ్స్ చదివితే

చలాన్ని చదివినట్లే. మిల్టన్‌మాటల్లో చెపితే మ్యూజింగ్స్ "the precious life- blood of a master spirit."

గుడిపాటి వెంకటచలంగారి భావాలు కొన్ని మ్యూజింగ్స్ నుండి గమనిద్దాం. (చూడు: యువభారతి వారి 'చలం ఆలోచనలు')

1. 'గొప్ప కావ్యం వ్రాయాలంటే పదాలు కాదు, సమాసాలు కాదు, వ్యాకరణం కాదు కావలసింది. ఆత్మ ఔన్నత్యం, struggle, rebellion- ఈ పండితులకి నవీన ప్రపంచ వాఙ్మయంలో ఓనమాలు రావు పుస్తకాలన్నీ కఠిన పదాలతో నింపి కళ్లు చెదరగొట్టాలని చూస్తారు. పాత తెలుగు వాఙ్మయము మల్లేనే పుస్తకమంతా కలిపితే నాలుగు కొత్త అభిప్రాయాలు ఉపకరించేవి Thought provoking ideas కనపడవు. ఊరికే భాషామార్దవంతో భారంతో మూలుగుతాయి గ్రంథాలు-బ్రతకవు, చలించవు, వుద్రేకించవు.'

6. 'కళ వెనుక ఉండే శక్తి సౌందర్యం. అది మానవుల ఏర్పాటుకు లొంగనిశక్తి. గొప్ప artist ఎంత సౌందర్యాన్ని తాను స్వాధీనం చేసుకుంటున్నాననుకుంటున్నాడో అంతకన్న గొప్పగా సౌందర్యం అతణ్ణి వశ్యుణ్ణి చేసుకుంటోంది. అందుకనే యితర అధికారాలకి దాస్యం చెయ్యవలసివచ్చినపుడు అతనిలో ఆ బాధ, ఆ తిరుగుబాటు. దాసుడైనాడా అతనిలో పతనం.'

3. 'అన్నిట్లోనూ గొప్పదాహం కళాదాహం. ఏ వుద్దేశ్యమూ లేని గొప్ప కల యిచ్చే విశాలత్వం, జ్ఞానం, ఏ సందేశమూ, ఏ ప్రచారమూ చెయ్యలేవు.'

4. 'కమ్యూనిజంలో వుండే గొప్ప శక్తి ఏమిటంటే, ఏ విషయాన్నైనా సరే- ఆరోగ్యము, విద్య, ఆర్థిక విధానము, దేవుడు, నీతి, దేనినైనాసరే- పాత బూజుల్ని దులిపి, ఈనాటి ప్రజాక్షేమపు దృష్టితో చూడగలగడం. పెద్ద బలహీనతేమిటంటే-కమ్యూనిజం సిద్ధాంతంలోంచి తప్ప, దేనినీ చూడలేకపోవటం.'

5. "శ్రీశ్రీ పేరు ఎక్కడ కనపడ్డా చదువుతాను. పత్రికలు తెరవను గనక కనపడడమే అరుదు. మొన్న హఠాత్తుగా టాగూరుగారి గీతాంజలి కన్న ఏదో డిటెక్టివ్ నవల గొప్పదన్నారు శ్రీశ్రీ. శ్రీశ్రీ నిజమైన కవి. ఆయనకి గొప్ప

కవిత్వదృష్టి మెలోడీకి చెవిలేకపోతే, ఆ కవిత్వం ఆయనలోంచి రాదు. మిస్టిక్ కవిత్వం ఆయనకి నచ్చకపోవచ్చు. కాని, గీతాంజలిలో స్ఫురించే కవిత్వం, అందం, ఆ కలల విశాలత్వం, మూలిగే నలిగే ఆత్మలకు శాంతీ, ఆశ, జీవితానికి ఓ అర్థ మివ్వాలనే ప్రయత్నం, యీ చిరాకుల్లోంచి, అల్పత్వాల్లోంచి గొప్పతనం చూడగల దృష్టి, ఇవన్నీ ఎట్లా మిస్ కాగలిగారు శ్రీశ్రీ? ఒక పద్ధతిని మనం అంగీకరించకపోవచ్చు; దాన్ని ధ్వంసం చేయాలనికూడా ప్రయత్నించవచ్చు; కాని, అందం తెలిసినవాళ్లు, ఆ పద్ధతిలో ఉండే గొప్పతనాన్ని గాని, అందాన్ని గాని చూడలేకపోవడం చాలా చిత్రం.''

మహా ప్రస్థానాన్నీ, మార్క్సిజాన్నీ మెచ్చుకొన్న మనస్వి చలం. అయినా, అందాన్నీ అనుభూతినీ ఆరాధించే తపస్వి. వాస్తవాన్ని గుర్తించి తిరుగుబాటును ప్రకటించే విద్యుత్తు చలం; అయినా మానవత్వపు విలువలను మన్నించే మనీషి. కీట్స్, షెల్లీ, బైరన్, వర్డ్స్‌వర్తు, బ్రౌనింగ్, లారెన్స్ దృక్పథాలపై అభిమానంగల సహృదయుడు, అభ్యుదయాన్ని వరించే కాల్పనిక వాది చలం, సమన్వయ విమర్శ కీయన దృక్పథం ఒక కంచు కాగడా!

## గోపీచంద్

త్రిపురనేని గోపీచంద్ (1910-1962) ఎంత సృజనాత్మక రచయితో అంతటి తత్త్వచింతనాపరుడు. ఆయన రచించిన కథానికల్లోనూ, నవలల్లోనూ ఆయన హేతువాదంనుండి అధ్యాత్మికవాదందాకా పయనిస్తూ సాగించిన ఆత్మ సత్యాన్వేషణ ప్రవృత్తి పాత్రల ద్వారా, కథాసంవిధానం ద్వారా, సంభాషణల ద్వారా వ్యక్తమౌతూంటుంది. శ్రీ ఆర్.ఎస్. సుదర్శనం గారన్నట్లు– ''ప్రతి మానవునిలోని వ్యక్తిత్వాన్ని గుర్తించి గౌరవిస్తూ, వ్యక్తి తనలోని మానవత్వపు సమ్యక్ స్వరూపాన్ని దర్శించేందుకు ప్రయత్నం చెయ్యటమే మార్గంగా, జీవిత పరమార్థంగా గోచరించటంతో, దీన్ని అరవిందులు వర్ణిస్తున్న 'అతీత మానసిక చైతన్య స్థితి' పొందటంగా అన్వయించుకున్నాడు గోపీచంద్. భౌతికవాదానికి అధ్యాత్మికవాదానికి సమన్వయం చెయ్యక తప్పదని భావించిన గోపీచంద్‌కు అరవిందుల 'అతీత మానసిక చైతన్యం' అటువంటి సమన్వయంలో తుది మెట్టుగా తోచింది. భౌతికవాదంలో అంతర్దృష్టి లేకపోవటం, అధ్యాత్మికవాదంలో

బాహ్యదృష్టి లేకపోవటం...యీ రెండింటి సమన్వయంకోసం తను అన్వేషించేందుకు కారణంగా గోపీచంద్ చెప్పుకున్నాడు. భౌతిక వాదానికి ప్రధానమైనది పదార్థం (Matter), ఆధ్యాత్మిక వాదానికి ప్రధానమైనది మనస్సు (Consciousness) ఈ రెండింటికీ మధ్య మానవుని మనస్సు, పరిణామంలో (Evolution) కీలకంగా కనిపిస్తూ ఉండటంవల్లా, అరవిందులు మనస్సు పొందగలిగిన చివరి అవస్థను గూర్చి చెబుతూ ఉండటంవల్లా తన అన్వేషణకు అన్నివిధాలా గమ్యంగా అతీత మానసిక చైతన్యాన్ని స్వీకరించాడు గోపీచంద్''.[19]

గోపీచంద్ వ్యక్తిత్వాన్ని శ్రీ త్రిపురనేని సుబ్బారావు చక్కగా చిత్రించారు 'గోపీచంద్ సాహిత్యం' అనే గ్రంథంలో. 'గోపీచంద్ తండ్రిని మించిన కుమారుడు. తండ్రి రామస్వామి చౌదరి ఒక్క తెలుగు నేలలో కలవరపెట్టే కులభేదాలను తూర్పార బట్టటానికి ప్రయత్నిస్తే, కుమారుడు సమస్త మానవజాతినీ కలవరపెట్టే సర్వభేదదృష్టుల్ని నిర్మూలించటానికి ప్రయత్నించాడు.. తండ్రి ఒక కోణం నుండే జీవితాన్ని పరికిస్తే, అన్ని కోణాలనుండీ జీవితాన్ని దర్శించాడు కుమారుడు. కాకపోతే ఒక్కటేదా- తెలుగుభాషమీద తండ్రికి వున్నంత అధికారం కుమారునికి లేదు. కాని, చిత్రమేమంటే, ఆ వున్న కొద్ది అధికారంతోనే, సౌజన్యం మేళవించి తెలుగు పాఠకులమీద చెరగని ముద్ర వేశాడు కుమారుడు.''[20]

కథారచయితగా, నవలారచయితగా గోపీచంద్ సాగించిన దర్శనయాత్ర విమర్శమీద పరోక్ష ప్రభావం వేసింది. ఆంధ్రసాహిత్య విమర్శ చరిత్ర కూడ గురజాడ దగ్గర హేతువాదంతో మొదలై నేడు అరవింద దర్శనందాకా పయనించింది. వ్యక్తిగా గోపీచంద్ ప్రస్థానానికీ తెలుగు సాహిత్య విమర్శ ప్రస్థానానికీ ఈ పోలిక కాకతాళీయం కాదు. నిజంగా గోపీచంద్ చేసింది దర్శన ప్రస్థానమని ఈ పోలిక ఋజువు చేస్తున్నది.

## బుచ్చిబాబు

గోపీచంద్ తత్త్వశాస్త్ర విద్యార్థిలా, బుచ్చిబాబు మానసిక శాస్త్ర విద్యార్థిలా సాహిత్యరంగంలో గోచరిస్తారు. చుట్టూ ఉన్న సమాజంలో కనపడే

వస్తువుల తత్త్వమేమిటని గోపీచంద్ యోచిస్తే, బుచ్చిబాబు వాటి సంబంధం, అవసరం ఏమిటని యోచిస్తాడు. బుచ్చిబాబు పాశ్చాత్య సాహిత్యాన్ని విస్తృతంగా పఠించాడు. షేక్స్పియర్ సాహిత్యంమీద ప్రామాణికంగా వ్రాయగలిగిన తెలుగు విమర్శకులలో బుచ్చిబాబు ఒకరు. సైకోఅనాలిసిస్ సిద్ధాంతాన్ని కూలంకషంగా అధ్యయనం చేసి, ఆ సిద్ధాంత సారాన్నంతా ప్రతీకాత్మకంగా, ప్రతిభావంతంగా "చివరకు మిగిలేది" అనే నవల రూపంలో కళాకృతిని కల్పించారు. బుచ్చిబాబుగారికి టి.యస్. ఇలియట్ అంటే ఎంతో గౌరవం; ఐ. ఏ. రిచర్డ్ అంటే అభిమానం. మానసిక శాస్త్రానికీ తత్త్వ శాస్త్రానికీ సన్నిహిత సంబంధ‹ ఉంది. తత్వశాస్త్రం మనిషిని పయనింపచేస్తుంది. మానసికశాస్త్రం మనిషి: పరిశీలింపచేస్తుంది. బుచ్చిబాబు రచనల్లో పరమార్థాన్వేషణకంటె పరిశీల: దృక్పథం అధికం.

బుచ్చిబాబు వ్రాసిన వ్యాసాలు 'నన్ను మార్చిన పుస్తకం' అనే సం: టిగా 1965లో ప్రచురితమయ్యాయి. ఆ వ్యాసాల్లో ఆయన ప్రస్తావనం చే౯ గ్రంథాలనూ, రచయితలనూ గమనిస్తే ఆయనకు బహువిధ సారస్వతశా‹ శాఖల్లో గాఢమైన పరిచయముందని స్పష్టమౌతుంది. విజ్ఞాన సర్వస్వంలాం విజ్ఞతను ప్రకటిస్తారు రచనల్లో. బహువిషయజ్ఞానం లోతైన విద్వత్తుతో కలి ఉండటం కష్టం. బుచ్చిబాబులో ఆ సమైక్యత కనపడుతుంది. షేక్స్పియ రచనలమీద ఆయన వ్రాసిన గ్రంథంకూడా దీనికి తార్కాణం.

ఆలోచిస్తున్నట్లు వ్యాసం వ్రాయటం, అలవోకగా సాహిత్యాంశాల స్వరూ స్వభావాలను సరళ సూత్రాలుగా రచిస్తూ ఉండటం, సాధ్యమైనంతవరకు అ: వర్తిత విమర్శకంటె, మీమాంస ఎక్కువగా చేస్తూ ఉండటం బుచ్చిబాబుగా విమర్శ స్వభావం. ఐ.ఎ. రిచర్డ్స్ మన సత్య విమర్శ తెలుగులో సరళం: సాహిత్య విహారం చేస్తున్నట్లుంటుంది వీరి రచన. 'అత్తాకోడళ్ళ కలహాలు' - ‹ శీర్షిక ఒక వ్యాసానిది. చూస్తే కథేమో ననిపిస్తుంది. కాని, అత్తాకోడళ్ళ కలహా వెనుక ఉండే మానసిక విశ్లేషణ అందులో ప్రసన్నంగా ప్రత్యక్షమౌతుం 'కథా-కమామీషూ' అని మొదలుబెట్టి - 'బాహ్యజగత్తులో వాస్తవు ఎంత అద్భు మైనదైనా, అది కథకుడి అంతరంగ జగత్తులో ఆవిర్భవించే వొక కళాదృష్టి: సమన్వయం కుదరా' లనీ, 'ఇతివృత్తం ఊహలో కొంతకాలం తిప్పుకుంటేగా కథకి స్వరూపం ఏర్పడ' దనీ, 'మళ్ళామళ్ళా చదివించే ఖండకావ్యంలాగా కథా:

కొనసాగా' లనీ, 'జీవితాన్ని మరింత తీక్షణంగా సందర్శించాలి కథ ద్వారా, బాహ్యజగత్తు, అంతరంగజగత్తు- వీటిల్లో ఒక క్రొత్త వెలుగు కనపడాలి' - ఇలాంటి లక్షణ సూక్తుల్ని అలవోకగా చెప్పివేస్తారు. సోమర్ సెట్ మాంమ్ ప్రభావం వీరి కథాశిల్పంమీదా కథావిమర్శమీదా బలంగా కనపడుతుంది.

నన్ను మార్చిన పుస్తకమనే వ్యాసంలో బుచ్చిబాబు పేర్కొన్న గ్రంథాలు వైవిధ్యంతో కూడుకొని విస్తృత రంగానికి వ్యాపించి ఉన్నాయి. డికెన్స్ వ్రాసిన పిక్‌విక్ పేపర్స్, టాగూర్‌గారి 'ది రెక్', హార్డీ రచించిన 'టెస్', 'అనామకుడు జూడ్', భమిడిపాటివారి రచనలు, కాంతం కథలు, కృష్ణశాస్త్రి గేయాలు, ఎంకి పాటలు, షెల్లీ, కీట్స్, టెన్నిసన్ ఖండకావ్యాలు, చలంగారి కథలు, టాల్‌స్టాయ్ కథలు, పి. జి. వుడ్‌హౌస్ రచనలు, బెర్నాడ్‌షా నాటకాలూ, బెర్ట్రెండ్ రసెల్ వ్రాసిన 'A Freeman's worship', సర్వేపల్లివారి 'An Idealist view of life', రసెల్ గ్రంథాలూ మొదలైనవి బుచ్చిబాబును ప్రభావితం చేసిన గ్రంథాలు. విమర్శలో కూడా కళాహృదయాన్ని, కళాసౌందర్యాన్ని చూడగల, ప్రదర్శింపగల ప్రజ్ఞ ఆ రచనల ప్రభావం వలన అలవడింది. టి.యస్. ఇలియట్ గెథేని గురించి అన్న మాటలు- 'గొప్ప కవికున్న జ్ఞానం, అతని రచనలలో ఇమిడి ఉంటుంది. దానిని గ్రహించడంతో మనంకూడా జ్ఞానులం అవుతాము'- ఇలియట్‌కు కూడా వర్తిస్తాయని బుచ్చిబాబు గారన్నారు. మనం వారికి కూడా వర్తిస్తాయని అనవచ్చు.

బుచ్చిబాబు వ్యాసాలు తెలుగులో Analytical and psychological criticism శాఖలను పరిపోషిస్తాయి. విశేషమేమంటే, బుచ్చిబాబుగారు రిచర్డ్స్‌ను చదవక పూర్వమే ఆయన సిద్ధాంతంలోని కొన్ని భావాలు తామే స్వయంగా ఏర్పరచుకున్న భావుకుడు. ఈ మాటలు అందుకు సాక్ష్యాలు - ''ఆ రోజుల్లో కవిత్వాన్ని ఆస్వాదించాలంటే, ఒక రకం మానసిక స్థితి అలవరచుకోవాలనుకునేవాణ్ణి. మానవుడు ఏకాంతజీవి, ఒంటిగా వొస్తాడు, ఒంటిగా పోతాడు; చావు పుట్టుకలే పరమ సత్యాలు- అనంత విశ్వంలో మానవుడు అల్పుడు- ఈ భావాలని జీర్ణించుకున్నాక తటస్థపడే మానసిక స్థితిలో, వొక దైన్యం ఉంటుంది. కవిత్వాన్ని ఆనందించటానికి ఈ దైన్యం అవసరం-అనుకునేవాణ్ణి. నేను అవసరమనుకున్న మానసిక స్థితిని గూర్చి, ఇదివరకే ఐ.ఎ. రిచర్డ్స్ అనే విమర్శకుడు

ప్రాశాడట. నాలో ఊహించుకున్న వొకస్థితిని గూర్చి ఎవరో అంతకుముందే ప్రాశారని తెలుసుకొని ఆశ్చర్యపడ్డాను.''21

'Training in reading with care and sensitivity is insisted on by I. A Richards and again this has had a great influence on modern criticism''22 - అని ఇలియట్‌ను గురించి విమర్శలకున్న వాక్యాలు బుచ్చిబాబుకు కూడా తెలుగులో వర్తిస్తాయి.

ఇలా ఆధునికాంధ్ర సాహిత్యరంగంలో కవులుగా, రచయితలుగా తమ ప్రభావాన్ని ఆయా రంగాలలో వేసిన విజ్ఞులు ఆంధ్రసాహిత్య విమర్శ వికాసానికి పరోక్షంగా తోడ్పడినవారు మరెందరో ఉన్నారు. కాని, వారిలోకూడా పాశ్చాత్య ప్రభావం బలంగా ఉండి, ఆలోచనలో దానిని తెలుగు రంగంలో దింపిన ప్రముఖ రచయితలను మాత్రమే యీ అధ్యాయంలో పేర్కొనటం జరిగింది.

గురజాడ అభ్యుదయ రచయితలకు, వారిరచనా విధానానికీ, ఆదర్శాలకూ, చివరకు విమర్శన స్పృహకు ఆచార్య స్థానంగా గుర్తింపబడ్డాడు. రాయప్రోలు వారి సిద్ధాంత దృక్పథం ప్రాచీనాలంకారిక సిద్ధాంతాలను సంప్రదాయ దాస్యంతో యథాతథంగా గ్రహించకుండా నవ్యాలోకంతో వ్యాఖ్యానాలు చేసి క్రొత్త సాహిత్య సిద్ధాంతాలు చేసే స్వాతంత్ర్యం విమర్శకులకు కల్పించింది. సాహిత్యం సాహిత్య దర్శన మూలమన్న దృక్పథాన్ని తెలుగువారికి నేర్పింది. త్రిపురనేని వారి హేతువాదం తెలుగువారి ఆధునిక ప్రక్రియలలో అంతస్సూత్రంగా నిలిచే ఆలోచనధారగా, శాస్త్రీయ పద్ధతికి సాధనగా వెలుగుబాట చూపింది. దేవులపల్లి వారి విమర్శ ఆలోచన ప్రధానమైన సాహిత్య విమర్శకూడ కళాత్మకమైన అభివ్యక్తితో కవితా రామణీయకత్వాన్నీ, భావ శబలతనూ సంతరించుకొని అనుభవ స్ఫోరకంగా ఆత్మాశ్రయంగా సాగగలదని నిరూపించింది. చలం మ్యూజింగ్స్ వాస్తవ దృక్పథంతోపాటు సౌందర్యస్పృహకూడా సాహిత్య సమాలోచనంలో సంపదింపబడాలని సూచించింది. గోపీచంద్ తత్త్వచింతనం హేతువాదం నుండి ఆధ్యాత్మిక దర్శనం వరకు సాహిత్యంతోపాటు, విమర్శకూడా అన్వేషణ చేయాలని ప్రగతిపథాన్ని సూచించింది. బుచ్చిబాబు విమర్శ ప్రాక్పశ్చిమ చింతనాధ్య

యనాన్ని, సాహిత్యంలో మానసిక విమర్శలోని మెళకువలనూ, జీవిత సమస్యల సదవగాహన ప్రవృత్తినీ, సమాజపరిధి వ్యక్తిపరిధిలో ప్రసరించే వీచికలనూ ప్రసారం చేసింది. విమర్శను విమర్శగా వెలయించకపోయినా, కళాకృతులలో విమర్శ ఎలా ప్రతిఫలిస్తుందో వీరి రచనలు వ్యక్తం చేస్తాయి. కళకు విమర్శ మూలం అన్న సత్యాన్ని చాటిన సాహితీమూర్తులు ఈ వెలుగులు. వారి దృక్పథాలు వీచికలు.

"It cannot be doubted that practitioners of all arts are influenced by criticism, in their own practice as well as in their appreciation, often very narrow, of schools and periods different from their own"[23].

E. F. Carrit.

# 7

# ప్రక్రియలు–ప్రయోగాలు

"Every generation is privileged to stand on the shoulders of its predecessors, and it is taller by what accomplished."1

-Brander Mattews.

పాశ్చాత్య ప్రపంచంలో పుట్టి ఆధునికాంధ్ర విమర్శ రంగంలో మెట్టిన సజీవ రూపశిల్పాలు ప్రక్రియలు. ప్రక్రియాకల్పనాన్ని గాని, పునర్నిర్మాణాన్ని గాని ప్రయోగం అంటాం. ప్రయోగం ప్రక్రియా జీవితం. నిర్మాణ వైభవం ఆకృతి. అనుభూతి ఆత్మ. ప్రక్రియ అత్తవారింటికి వచ్చే నవవధువులాంటిది. తన తండ్రి గోత్రాన్నీ, తన కన్యాత్వాన్నీ త్యాగం చేసి పతి గోత్రాన్ని స్వీకరించి అతని వంశాన్ని అభివృద్ధి చేసే వధువులాగానే, పాశ్చాత్య జగత్తులో పుట్టినా, తెలుగు విమర్శకు అంకితమై తెలుగుదనాన్ని వెలార్చి తెలుగు సాహిత్య విమర్శకు వెలుగు నింపాయి పాశ్చాత్య ప్రక్రియలు. ప్రధాన రూపమైన ప్రభావం ప్రక్రియలలో కనపడుతుంది.

సాహిత్య విమర్శకు దోహదాన్ని కల్పించినవి కవుల చరిత్రలు, సాహిత్య చరిత్రలు. ఇవి సాహిత్యాన్ని చారిత్రక దృష్టితో అధ్యయనం చేయటానికీ, ప్రక్రియాపరమైన పరిణామ వికాసాలను వివేచించటానికీ తోడ్పడతాయి. సాహిత్య చరిత్ర స్వభావాన్ని వివేచిస్తూ Wimsatt and Brooks చెప్పిన మాటలు గమనింపదగినవి- "The history is bound to be an

interpretation, in part even a translation. In part it will even be built on reasonable guesses. The least it can do is make sense."[2] సమన్వయం సాహిత్య చరిత్రకు స్వభావం; సాక్ష్యాధారాల నాశ్రయించుకొని చేసే కొన్ని ఊహలు కూడా చరిత్రలో భాగంగా ఉంటాయి. ఏమైనా ఆ చరిత్ర పఠిత కొక సాహిత్య వ్యక్తిత్వానికి సంబంధించిన ఒక అవగాహనను, ఒక సమన్వయ స్ఫూర్తిని అందించాలి. అయితే, సాహిత్య చరిత్ర నిర్మింపబడటానికి ముందు కవుల చరిత్ర, కవుల జీవిత చరిత్ర, సాంఘిక సాంస్కృతిక చరిత్ర, రాజకీయ చరిత్ర మొదలైనవి వెలువడటం అవసరం. అట్లని అవన్నీ వెలువడిందాకా సాహిత్య చరిత్ర రచనం ప్రారంభం కాకుండా ఉండటం కూడా జరగదు సామాన్యంగా. ఆయా కాలాల్లో ఆయా రచయితలు తమకు దొరికిన సామగ్రితో చరిత్ర నిర్మాణానికి పునాదులు వేస్తూనే ఉంటారు. తెలుగులో సాహిత్య చరిత్ర నిర్మాణ కృషికి ప్రేరణ కల్పించింది పాశ్చాత్య ప్రభావమే. అందులోనూ ఆంగ్ల సాహిత్య ప్రభావం ప్రబలం. తెలుగులో వెలసిన కవుల జీవిత చరిత్రలమీద కాని, సాహిత్య చరిత్రలమీద గాని పాశ్చాత్య ప్రభావం ఎలా పనిందని ప్రశ్నించుకుంటే- మొదట గమనింపవలసిన అంశం ఆ ప్రభావం ప్రత్యక్షం కాదనీ పరోక్షమైనదనీ స్పష్టమౌతుంది. ప్రక్రియా పరిజ్ఞానమే తెలుగువారు గ్రహించారు కాని ప్రక్రియా నిర్వహణ శిల్పాన్ని అంతగా స్వాయత్తం చేసికోలేదని స్పష్టమౌతుంది.

## కవుల చరిత్రలు - సాహిత్య చరిత్రలు

ఆంగ్ల సాహిత్యంలో డా॥ శామ్యూల్ జాన్సన్ ఆంగ్ల కవుల జీవితాలను రచించే మార్గాన్ని చూపాడు. ఆంధ్ర రచయితలకు ఆ గ్రంథం మొదట ప్రేరణ కలిగించింది. మనకు తెలిసినంతవరకు కల్నల్ కాలిన్ మెకంజీ (1753-1821)తో కలిసి పనిచేసిన కావలి సోదరులు ముగ్గురిలో చివరివాడైన కావలి వెంకట రామస్వామి రచించిన దక్కను కవుల చరిత్ర (Biographical Sketchs of Deccan Poets) ఈ శాఖలో మొదటి ప్రయత్నంలా కనపడుతుంది.

అయితే, ఇందులో ఆంధ్ర కవుల చరిత్ర వ్రాయాలన్న ప్రయత్నంకంటె దక్షిణ భారతఖండంలోని కొందరు కవులను పరిచయం చేయాలన్న ప్రయత్నమే ముఖ్యంగా గోచరమౌతుంది. ఇది ఇంగ్లీషులో రచింపబడటంచేత భారతీయులనూ, పాశ్చాత్యులనూ కూడా ఆకర్షించింది. "1829 నాటికి ఆంగ్లములో ఇంత చక్కగా వ్రాసిన వారిలో దక్షిణ దేశీయు లెవ్వరును లేరనవచ్చును. వంగ దేశములో మాత్రముండిరి"[3]—అన్న డా॥ కొత్తపల్లి వీరభద్రరావుగారి మాటలు ఆ గ్రంథ రచనయొక్క విలువను వెలువరిస్తున్నాయి. "కవిత్వమును గూర్చి వ్రాయునప్పుడు 'అరిస్టోటిలు'ను, సౌందర్యమును గూర్చి వ్రాయునప్పుడు 'హెర్మొజెనస్'ను ఉదాహరింపగలిగియుండుట, నాటికి సామాన్య విషయము కాదు. ఉదాత్తము (sublime), సుందరము (Beautiful) అను విశేషములను, కవిత్వపరముగా వాడగలిగినంత విజ్ఞానము కలవాడు రచయిత అన్నప్పుడాతనిపై పాశ్చాత్య విజ్ఞాన సంస్కృతుల ప్రభావమెంత కలదో తెలియును"[4] అన్న వీరభద్రరావుగారి సమీక్ష రచయితపైగల పాశ్చాత్య ప్రభావాన్ని స్పష్టపరుస్తున్నది.

జయంతి రామయ్య పంతులుగారి 'కవి జీవితములు' 1893లో గ్రంథ రూపం తాల్చినా, 1875 ప్రాంతంలోనే సకల విద్యాభివర్థిని మొదలైన పత్రికల్లో ప్రకటింపబడింది. "తొలిసారిగా కవిచరిత్ర రచనకు ఒక ప్రణాళిక నేర్పఱచిన గురజాడ రామమూర్తిగారి 'కవి జీవితములు' ప్రథమాంధ్ర కవి జీవితచరిత్రగా పేర్కొనదగినది".[5] ఈ గ్రంథంలోని విభాగం కావ్య ప్రక్రియల నాశ్రయించి-భారతాంధ్ర కవులు, రామాయణాంధ్ర కవులు, పంచకావ్య కవులు, ద్వ్యర్థికావ్య కవులు, ప్రౌఢ ప్రబంధ కవులు, పురాణ కవులు—ఇలా సాగటం ప్రశంసింపదగిన అంశం. ఈ రచనకు ప్రేరణ కలిగించింది రామమూర్తిగారు విద్యార్థి దశలో చదివిన 'Critical and Biographical Essays of Poets' అనే మెకాలే గ్రంథం.

ఈ గ్రంథంమీద డా॥ ఎస్. వి. రామారావుగారి సమీక్ష దాని వైశిష్ట్యాన్ని తెలుపుతుంది — "కవి జీవితము - అతని రచనలు, కృతిపతి-లేదా-ఆశ్రయదాత చరిత్ర, లోక ప్రచారమునందున్న కథలు, కవిత్వశైలి-ఈ క్రమములో గ్రంథ రచనా ప్రణాళిక కొనసాగినది. ప్రబంధ కావ్యములను గురించిన చర్చ ఇందు

విపులముగా కలదు. ప్రబంధముల యందు కథా చమత్కారముకన్న వర్ణనా పాండిత్యమే ప్రధానమని పేర్కొనిన రామమూర్తిగారు వర్ణనలయందు మిక్కిలి ప్రజ్ఞ కనబఱచిన వసు చరిత్ర కారుని ఉచ్చ స్థానమునందు నిలబెట్టిరి. ఈ దృష్టితోనే మను చరిత్ర కన్న కవికర్ణ రసాయనము మిన్నయని, రాఘవ పాండవీయముకన్న హరిశ్చంద్ర నలోపాఖ్యానము ప్రశస్తమైనదని భావించిరి. పింగళి సూరన కవిత్వ పరామర్శ ఇందు ప్రముఖ స్థానము నాక్రమించినది. ఆకాలముననే వెలువడిన దక్షిణామూర్తి 'పింగళి సూరన' (1898) ఇందు ఆమూలాగ్రముగా ఖండింపబడినది. కళాపూర్ణోదయమునకు కాదంబరి మార్గ దర్శకమనియు, రామకృష్ణుని కవిత్వము పదగుంభనమునకు ప్రసిద్ధమనియు రామమూర్తిగారు తలంచిరి...కవుల శైలి గుఱించిన రామమూర్తిగారి అభి ప్రాయములు అంతగా పరిగణనీయములు కాకపోయినను ఈ అభిప్రాయముల ప్రకటనలో కవులు తమ అవతారికలయందు పేర్కొనిన కవిత్వ లక్షణములను వారు దృష్టి యందిడుకొనిరి. 'కవి జీవితములు' శైలి గ్రాంథికమైనను సుబోధక ముగా, సుందరముగా నున్నది.''[6] రామమూర్తిగారి 'కవి జీవితములు' జీవిత విశేషాలను తెలిపేదైనా, కవి జీవిత కావ్యార్థ సమన్వయ విమర్శకు, దాని ద్వారా సాహిత్య విమర్శ స్పృహకు తొలి నాళ్లలో వెలుగులు వెదజల్లిందని నిస్సంశయంగా చెప్పవచ్చును.

కందుకూరి వీరేశలింగం పంతులుగారు 'ఆంధ్ర కవుల చరిత్రము'ను రచించారు. ఇది మొదట 1886 లో వివేకవర్ధని, చింతామణి పత్రికలలో భాగభాగాలుగా ప్రచురితమై అదే సంవత్సరంలో గ్రంథంగా వెలువడింది. ఆ తరువాత 1887 లో, 1890 లో, 1895 లో, 1899 లో మూడు భాగాలు కలిపి ఒకే గ్రంథంగా ప్రచురితమైంది. 1917 లో కొంత విపులీకరింపబడింది. కాలక్రమ పద్ధతిలో సాహిత్య చరిత్రను యుగ విభాగం చేసికొని, ఆయా యుగాల్లో వెలసిన కవుల చరిత్రను, సాహిత్య వివేచనను పరిశోధనాత్మకంగా రచించిన గౌరవం పంతులుగారికే దక్కుతుంది. దాని ప్రాశస్త్యాన్ని వివరిస్తూ డా॥ అక్కిరాజు రమాపతిరావుగారు చేసిన సమీక్ష విలువైనది. "వీరేశలింగం పంతులుగారి కవుల చరిత్రము తక్కిన కవుల చరిత్రముల కన్న విశిష్టమై యలరారుటకు, దానియందున్న మహాగుణములు రెండు. అందొకటి కవికాలాదుల నిర్ణయించిన పద్ధతి. రెండు, కావ్యతత్త్వ విమర్శ. పంతులుగారు పండితులును ,

కవులను నగుటచే, కవుల గ్రంథములు పరిశీలించి విమర్శించి కావ్యతత్వ వివేచన గావించి యుండిరి. కనుక, వారి కవుల చరిత్రము కేవలము కవి కాలాదులను నిర్ణయించు చారిత్రక గ్రంథమే గాక, కొంతలో కొంత సాహిత్య విమర్శయునై యున్నది. పంతులుగారి కవుల చరిత్రము వాఙ్మయ చరిత్ర రచనమునకు పూర్వరంగ మయ్యెను. వారు తమ గ్రంథమునందు సారస్వత విమర్శ సాకల్యముగ, సమగ్రముగ నొనరించియుండక పోయినను, కావ్య విమర్శయందు కొన్ని యుత్తమములైన సంప్రదాయములను నెలకొల్పియుండిరి''[7] కవుల చరిత్ర నిర్మాణంలో పరిశోధన ప్రవృత్తిని, సాహిత్యచరిత్ర నిర్మాణంలో ప్రయోగ వ్యుత్పత్తినీ, చారిత్రక రచనా విధానంలో శాస్త్రీయమైన, వైఖరినీ, కవి జీవిత కావ్యార్థ సమన్వయ విమర్శ పద్ధతిలో ప్రమాణ ప్రతిపత్తినీ,సాహిత్య విమర్శ వైఖరులకు సౌజన్యవ్యక్తినీ కల్పించింది కందుకూరివారి కవుల చరిత్రం. తెలుగునాట శామ్యూల్ జాన్సన్‌ను మరిపించిన మనీషి కందుకూరి.

'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర' మనే పేరుతో వంగూరు సుబ్బారావుగారు సాహిత్య చరిత్ర నిర్మాణానికి ఒక క్రొత్తపుంత చూపించారు. 1920 లో మొదట ఈ గ్రంథం ప్రచురింపబడి 1957 లో పరిష్కరింపబడింది. వాఙ్మయ పరిణామ పరిశీలనంతోపాటు ఆ పరిణాను వికాసానికి దేశ కాల భాషా మత రాజకీయాది పరిస్థితులు ఎలా దోహదం చేశాయో వివరించే ప్రయత్నాన్ని సుబ్బారావుగారు చేసి, ఆ రంగంలో ఒక అడుగు ముందుకు వేశారు. ప్రక్రియాపరంగా పరిణామ వికాసాన్ని రచించే పద్ధతినికూడా ప్రదర్శించారు. వీరి రచనమీద పాశ్చాత్య చరిత్ర నిర్మాణంలో పాటింపబడే సామాజిక సాహిత్య పరిస్థితుల పరస్పర సంబంధ వివేచనం విశేషంగా ప్రతిఫలిస్తున్నది. అయితే ఇందులో సాహిత్య విమర్శ భాగం గౌణంగా కనబడుతుంది.

20 వ శతాబ్ది పూర్వార్ధంలో ప్రచురింపబడిన సాహిత్య చరిత్రలలోనేకాక నేటికిని కొన్ని విషయాలలో ఉత్తమమైనదని భావింపబడుతున్న గ్రంథం 'కవిత్వవేది' (కల్లూరి వేంకటనారాయణరావు) రచించిన వాఙ్మయచరిత్ర సంగ్రహము (1928). వీరి గ్రంథ రచనలో పాటించిన విభాగం సమన్వయాత్మంగా ఉంది. ప్రాచీన కవిత్వం (క్రీ.పూ. 28-క్రీ.వె. 1000), పురాణకవిత (1000-1380), కావ్యప్రబంధకవిత్వము (1380-1650), అర్వాచీన కవిత (1650 -

1875), నవ్యకవిత (1900-) అనే స్థూలమైన విభాగం కవిత్వ స్వభావాన్ని పట్టి చేసింది. నారాయణరావుగారు వాటిని ఖండాలని పేర్కొన్నారు. అంతర్వి భాగాలలో సంఘ చరిత్ర, వాఙ్మయ చరిత్ర, కావ్యవిమర్శ, యుగలక్షణ సమ న్వయం-అనే అంశాలను తీసికొని సారవంతంగా, ప్రామాణికంగా రచన చేశారు. ఆంధ్రకవుల కావ్యరచనా వైఖరులను, కవితా వైలక్షణ్యాన్ని నిర్ణయించే టప్పుడు ప్రాచ్య పాశ్చాత్య లక్షణ సమన్వయ దృక్పథాన్ని ప్రదర్శించటం కవిత్వవేది రచనలోని పరుసవేది. ఇట్టి ప్రవృత్తికి దోహదం చేసినవి లాంగ్, శైన్ట్స్‌బరీ మొదలైనవారు రచించిన ఆంగ్ల సాహిత్య చరిత్ర రచనలు. కవి, కావ్యము, వాఙ్మయ విమర్శ అనే అంశాన్ని ప్రథమ ఖండంలో ఉపోద్ఘాతంగా రచించి చరిత్ర రచనలో ప్రాచ్య పాశ్చాత్య సమన్వయ వివేకాన్ని ప్రదర్శించారు. ఉదాహరణకు ఈ వ్యాక్యాలు చూడండి - 1. 'ఆద్యులు మహాకవులునగు వాల్మీకియు, నమరుడును, హోమర్ మనకు నాదర్శప్రాయులు.' 2. 'వాల్మీకి రామాయణమువోలె హోమరుని 'ఇలియడు,' 'ఓడిస్సీ' యను కావ్యద్వయి పాశ్చాత్య హృదయాంతరాళములఁ బొంగి తజ్జాతినిఁ బునీతము సేయుచున్నవి.' 3. 'హెచ్చుతగ్గుగా క్రీ. వె. 500-1000 సం॥ కాలము తెలుగాంధ్ర సంధి కాలముగా నుండనగుననియు, కాననే తత్కాల మింగ్లీషులో మిడిలింగ్లీషు (Middle English) యుగమునందువలె భాష ప్రస్తుత రూపమందు ఉండె ననియు నూహించి, కార్యకారణ సంబంధముచే నిర్ణయించుకొంటిమి.' 4. 'పురాణ, విపులకావ్య, కావ్యప్రబంధములు వరుసగా Myth, Epic, Romance లను బోలియుండును. తెనుగులో లక్షణమిశ్రమము ఘటిల్లినందున నవియే ఇవి యనుటకు వలనుపడదు, కాని. తత్తద్భావములు ప్రాధాన్యమును వహించియుండును. జాతులు భిన్నములు, వాఙ్మయములు నటులే'. (పు. 68).

5. 'ప్రతి భాషకు నేదో యొక కాలమున నత్యధిక రాజాదరణము, లేక గ్రంథరచనము తటస్థించుచున్నది. అట్టి మహాయుగముతోనే యుత్తమోత్తమ సారస్వత యుగము ఒకానొకప్పుడు ఏకీభవించుట గలదు. రోము సామ్రాజ్యము నకుఁ జెందిన లాటినుభాషలో Augustus చక్రవర్తి కాలమున నట్టి సమన్వయ యుగము గుదిరి సుప్రసిద్ధమైనది. సంస్కృతములో కాళిదాసుని విక్రమాదిత్య యుగ మట్టిది. కాని, ఇంగ్లీషులో Augustan Age అనున దొకటి. ఉత్త మోత్తమ సారస్వత యుగమగు షేక్స్పియరు కాల మింకొకటి యైనది. తెలుగున నట్లే యైనది, ఉత్తమోత్తమ యుగము తిక్కన దైనది. మహా

యుగము శ్రీకృష్ణదేవరాయలదైనది. కాల సామీప్యము ప్రభుత్వ లక్షణైక్యమును బట్టి రెడ్లయుగము కాకతీయములోఁ జేర్చిన (షేక్సుపియర్, మిల్టనులవలె) తిక్కన పోతన లొక్కచోఁ గూడుదురు...ఉభయ భాషావేదుల కట్టి జిజ్ఞాసలకు వీలున్నది గాన మన తిక్కన, పోతన్న లింగ్లీషువారి షేక్స్పియరు, మిల్టన్లవలెనని మనవి చేసికొనుచున్నాడ.'' (పు. 108-109).

6. 'పాశ్చాత్యకళలో జీవితము కేవలము సుఖహేతువు. శకవీరుని (Shakespeare) క్లియోపాత్రా (Cleopatra)తో కాళిదాసుని శకుంతలను బోల్చి చూడుడు... ఆత్మ శరీరముల బోలునవి ప్రాచ్య పాశ్చాత్య శిల్పములు' (పు. 285).

7. [ధర్మవరం కృష్ణమాచార్యులు, చిలకమర్తి లక్ష్మీ నరసింహం, కోలాచలం శ్రీనివాసరావు, వేదం వేంకటరాయశాస్త్రి] 'పై వారు వరుసగా కవిత్వ ప్రాధాన్యమున Shakespeare, Marlow, BenJohnson, Webster లను బోలుదురేమో.' (పు. 269)

అర్వాచీన యుగాన్ని సమీక్షిస్తూ 'కవిత్వవేది' - 'పాశ్చాత్య వాఙ్మయ శక్తి యాంధ్ర సారస్వతము నాక్రమించినది' అని తీర్పు చెప్పారు (పు. 270). అంతేకాదు, కవిత్వవేది కలంలో పాశ్చాత్య ప్రభావశక్తి ఆవేశించింది. అయినా, ఆయన దృక్పథం భారతీయం; తులనాత్మక పరిశీలనతో పాశ్చాత్య సాహిత్యాన్ని అధ్యయనం చేసి, సాహిత్య చరిత్రకు సంబంధించిన విలువైన నిర్ణయాలను తీసికొనేటప్పుడు ఆ సంస్కారాన్ని వాడుకొన్నారు. వీరి యుగలక్షణ సమన్వయం నేటికీ సాహిత్యయుగ లక్షణ వివేచనకు 'బ్లూప్రింట్'గా పనికివస్తోంది. ఇంతవరకు వచ్చిన సాహిత్య చరిత్ర కర్తలలో పాశ్చాత్య ప్రభావం రక్తగతంగా కవిత్వవేదిలో ప్రతిఫలించినట్లు మరెవ్వరిలో కానరాదంటే అతిశయోక్తి కాదేమో. కాలం తెచ్చిన విజ్ఞానం తరువాతి వారి కలాల్లో కనపడవచ్చును. కాని, ఆధునిక సాహిత్య చరిత్ర రచనకు కావలసిన తులనాత్మకాధ్యయన ప్రవృత్తి కవిత్వవేది రచనలో కళగా నిలిచింది.

తెలుగులో వెలసిన సాహిత్య చరిత్రల నన్నింటిని సమీక్షించటం ఈ గ్రంథరచనోద్దేశం కాదు. ఆ పని యిదివరకే ఎందరో చేశారు. ప్రభావ-పరిశీలన

పరిధిలోకి వచ్చే వాటినే స్పృశించటం జరుగుతుంది. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు కూడా వాఙ్మయ చరిత్ర రచన సంగ్రహంగా చేశారు. ఖండవల్లి లక్ష్మీరంజనంగారూ, దివాకర్ల వేంకటావధానిగారూ సాహిత్యచరిత్ర సంగ్రహాలు వ్రాశారు. ఖండవల్లి వారిది మధుర వచన రచనలోనూ, దివాకర్ల వారిది సార సంగ్రహరచనగానూ వెలువడ్డాయి. మదరాసు విశ్వవిద్యాలయంవారు వాఙ్మయ చరిత్రల నిర్మాణం చేయించారు. నిడదవోలు వెంకటరావు, శిష్టా రామకృష్ణశాస్త్రి గారలా కృషిలో పాల్గొన్నారు. నిడదవోలువారి రచన విశ్లేషణాత్మకం; విషయ సేకరణ అందులో ముఖ్యం. శిష్టావారు ప్రాచ్య పాశ్చాత్య సాహిత్య లక్షణాలను సమన్వయించుకుంటూ రచన చేశారు. ప్రత్యేకంగా చరిత్ర వ్రాయకపోయినా వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మొదలైన పరిశోధకులు పాశ్చాత్యుల పరిశోధన ప్రవృత్తితో కవుల చరిత్రకు ఆకరాలు సేకరించారు. ఆ తరం పరిశోధకులకు ప్రేరణ కల్పించింది సి.పి. బ్రౌన్.ఆయన ప్రభావం సాహిత్యచరిత్ర నిర్మాణం వెనుకనున్న పరిశోధన కృషిమీద బలంగా ఉంది. సాహిత్య రచనా ప్రక్రియలో వేదం వెంకట కృష్ణశర్మ, టేకుమళ్ల అచ్యుతరావు, నేలటూరి వెంకటరమణయ్య మొదలైనవారి మీద పాశ్చాత్యమైన అనుశీలన ప్రవృత్తి ప్రభావం కనపడుతుంది. మధునాపంతులవారి ఆంధ్ర రచయితలు చక్కని వాఙ్మయ చిత్రాలు. కురుగంటి వారి 'నవ్యాంధ్రసాహిత్య వీధులు' అనేక అభిప్రాయాల, ఉదంతాల కదంబంలా సాగినా, నవ్యాంధ్ర సాహిత్యచరిత్ర నిర్మాణానికి సామగ్రిని కూర్చిన సరళమైన రచన. ఇక విస్తృత ప్రణాళికతో సాహిత్యచరిత్రను నిర్మించిన వారిలో చాగంటి శేషయ్యగారిని పేర్కొనాలి.వారి ''ఆంధ్రకవి తరంగిణి'' పన్నెండు సంపుటాలు కవి కాల గోత్ర కర్తృత్వ చర్చలతోనూ, గ్రంథ పౌర్వాపర్య చర్చలతోనూ, వివిధ వాదాల కోలాహలంతోనూ సాగింది. చారిత్రక విమర్శను సాహిత్యచరిత్రలో ప్రవేశపెట్టినా, సాహిత్య విమర్శను తగినంతగా అందించలేక పోయారు చాంగటివారు. ఆధునికంగా వెలువడిన సాహిత్య చరిత్రలలో ఆరుద్రగారి 'సమగ్రాంధ్ర సాహిత్యం' (12 సంపుటాలు) విస్తృతమైంది. యుగ విభాగంలో రాజకీయ చరిత్ర దృక్పథానికి ప్రాధాన్యం ఇవ్వటం, ఒక్కొక్క యుగంలో సాహిత్య పరిణామానికి భిత్తికగా అమరిన రాజకీయ, సాంఘిక, మత, వాఙ్మయ పరిస్థితులను సమన్వయాత్మకంగా చిత్రించటం, తెలుగులో ఇంతవరకు కవులను గురించి జరిగిన పరిశోధననూ, విమర్శనూ సమగ్రంగా అధ్యయనం చేసి, సమ

న్వయవృక్పథంతో నూత్నాంశాలను ప్రతిపాదించటం, చరిత్రను కథామాధుర్యంతో నింపి సామాన్యపతితకు కూడా చవులూరించేటట్లు ఆవిష్కరించటం, పరిశోధన ఫలితాంశాలను పట్టికలుగా సమర్పించటం, అనుశీలనాత్మక విమర్శను, తులనాత్మక విమర్శను కవి కావ్య పర్యాలోచనంలో మేళవించి సాహిత్య విమర్శను సాగించటం మొదలైన విశేషాలు ఆరుద్ర రచనను సర్వజనామోదంగా తీర్చి దిద్దాయి. 'కవిత్వ వేది' వేసిన బాటలో కళాపూర్ణుడుగా నడిచాడు ఆరుద్ర. పింగళి లక్ష్మీకాంతంగారి 'ఆంధ్ర సాహిత్య చరిత్ర', ఎందరికో భావభిక్ష పెట్టి, ఆలస్యంగా వెలువడినా సాహిత్య దృక్పథంతో, విలువలను నిర్ధరించే నైపుణ్యంతో వ్రాయబడిన ప్రామాణిక గ్రంథం. అయినా అసమగ్రం. వారు చేసిన యుగ విభజనం యుగ కర్తలైన కవులను, మారుతున్న సాహిత్య ప్రవృత్తులను దృష్టిలో ఉంచుకొని చేసింది. సాహిత్య చరిత్ర నిర్మాణంలో వీరు చేసిన విభాగమే సాహితీపరులలో ప్రామాణికంగా చెలామణి అవుతున్నది. ప్రాక్పశ్చిమ దృక్పథాల సంగమ తీర్థం వీరి సాహిత్య సమీక్ష. ఆంధ్ర సాహిత్య చరిత్రను ఆంగ్ల భాషలో రచించే ఉద్యమంలో గిడుగు సీతాపతిగారి 'History of Telugu Literature' ను ప్రత్యేకంగా పేర్కొనాలి.

తెలుగులో యుగ చరిత్రలు, ప్రక్రియా చరిత్రలు మొదలైనవి బహుళంగా వచ్చాయి. అయితే, వాటిలోని పరిశీలన విధానంపై పాశ్చాత్య ప్రభావం అంతో యింతో కనపడుతూనే ఉంటుంది. అవి సమగ్ర సాహిత్య చరిత్రకు తోడుపడే ఆకర గ్రంథాలుగా ఉపకరిస్తున్నాయి. పరిశోధన దృష్టితో చూస్తే వీటి విలువ గణింపదగింది.

తెలుగులో ఎన్ని సాహిత్య చరిత్రలు వచ్చినా ఆంగ్లంలో లాగా ప్రక్రియా వికాస చరిత్రను చెప్పే ప్రామాణిక గ్రంథాలు ఇంకా రాలేదు. ప్రక్రియా పరంగా సమగ్ర సాహిత్య చరిత్ర నిర్మాణం జరగాలనీ, సాహిత్య దర్శన, సిద్ధాంత వికాస చరిత్రలు రావాలనీ, తులనాత్మక సాహిత్య చరిత్రలు కావాలనీ విమర్శకులు భావిస్తున్నారు. అయితే, పురాణ, కావ్య, ప్రబంధ, యక్షగాన, శతక, ఉదాహరణ, నాటక, నాటికా, నవలా, కథానికా, హరికథా, వ్యాస, వచన, ద్విపదాది ప్రక్రియలను చారిత్రక దృష్టితో సమీక్షిస్తూ, ఉత్పత్తి వికాసాలను వివరిస్తూ గ్రంథాలు, సిద్ధాంత వ్యాసాలూ వచ్చాయి. వాటిలోని

పరిశోధనాంశాలను నిగ్గుతేల్చి, సమన్వయించి, పాశ్చాత్య పరిజ్ఞానాన్ని వినియోగించుకుంటూ శాస్త్రీయంగా, అధికారికంగా సాహిత్య చరిత్ర రచనం జరుగవలసిన అవసరం ఎంతైనా ఉంది. దానికి ప్రభావ పరిశీలనం ప్రయోజనాత్మకంగా ఉపయోగపడుతుంది.

## కవిత్వ చరిత్రం

సాహిత్య చరిత్రలో కవిత్వ చరిత్రకు ఒక ప్రత్యేకత ఉంది. తరతరాల తెలుగు సాహిత్య చరిత్రలో కవిత్వం పరిణామం చెందిన తీరుతెన్నులను పరిశీలించే ప్రవృత్తి యిటువంటి ప్రక్రియల్లో ప్రధానంగా కనపడుతుంది. 'ఆంధ్ర కవిత్వ చరిత్ర' మనే పేరుతో భోగరాజు నారాయణమూర్తిగారు 1926 లోనూ, బసవరాజు వేంకట అప్పారావుగారు 1932 లోనూ రెండు గ్రంథాలు ప్రచురించారు. నారాయణమూర్తిగారి రచన కవిత్వతత్త్వ విచారానికే అంకితమై పోయింది. దానికంటె బసవరాజు రచన బలమైనది. ప్రాచ్య పాశ్చాత్య లాక్షణికుల విమర్శకుల సాహిత్య సిద్ధాంతాలనూ, కవితా దృక్పథాలనూ, తదనుబంధ సాహిత్యశాస్త్ర విశేషాలనుతులనాత్మకంగా, సమన్వయ దృక్పథంతో వివరించిన గ్రంథం అప్పారావుగారి 'ఆంధ్రకవిత్వ చరిత్రము.' తులనాత్మక సాహిత్య సౌందర్యశాస్త్ర పరిజ్ఞానం విద్యార్థులలో వ్యాపించాలంటే ఆ గ్రంథం పునర్ముద్రితం కావటం ఎంతైనా అవసరం.

ఆధునిక కవితా చరిత్రలలో 'తెలుగులో కవితా విప్లవాలు' (1978) ప్రత్యేకంగా పేర్కొనదగిన విలువైన రచన. రచయిత డా॥ వేల్చేరు నారాయణ రావుగారు. మార్క్సిస్టు దృక్పథంతో నన్నయ నుంచి నేటిదాకా వచ్చిన విప్లవాలను సమీక్షించి, కవితలో వాటి ప్రభావం ఎలా బలంగా ప్రతిఫలిస్తుందో వివరించే విమర్శ గ్రంథం ఇది. విప్లవ శబ్దం కవితాపరంగా కూడా వాడేవారు మార్క్సిస్టులు. వారి దృక్పథంలో విప్లవమంటే యిలా చెప్పుకోవచ్చు - ''ప్రపంచం మిథ్యకాదు; వాస్తవికమైనది; ప్రపంచంలో వున్న వస్తువులు దేనికది సంబంధం లేని తునకలు కావు. పరస్పరం సంబంధం కలిగి వున్నాయి. ఏదీ స్థిరమైనది కాదు. ప్రతిదీ మార్పు చెందుతూంది; వృద్ధి చెందుతూంది; నశించుతూంది. ఈ అభివృద్ధి ఒక దశ పరకు క్రమంగా జరుగుతుంది. చివరకు తీవ్ర

మైన ఘర్షణ జరిగి నూతన స్వభావం ఏర్పడుతుంది. ఆంతరంగిక పోరాటం ఫలితంగానే అభివృద్ధి జరుగుతోంది; నశించి పోతున్న లక్షణంపైన వృద్ధి పొందుతున్న లక్ష్యం యొక్క విజయమే చివరకు వచ్చే ఘర్షణ. అదే విప్లవం.''8

నారాయణరావుగారు ఇటువంటి విప్లవాలు తెలుగు కవితలో ఎలావచ్చాయో పరిశీలిస్తూ - ''సాంఘిక అస్తిత్వమే చైతన్యాన్ని నిర్ణయిస్తుందన్న మార్క్సు ప్రతిపాదన ప్రాతిపదికగా తీసికొని తెలుగు కవిత్వంలో వచ్చిన మార్పుల స్వరూపం పరిశీలించటం'' తమ రచనకు లక్ష్యమన్నారు. ''కవితా విప్లవాలు కేవలం కవులవల్ల రావు. కవులు విప్లవానికి వైయక్తిక కారణం (Subjective factor) గా ఉపకరిస్తారు. వస్తుకారణం (Objective Factor) గా సందర్భంలోనూ, శ్రోతల్లోనూ వుంది. కవితా విప్లవాలు ఈ రెండు కారణాల పరస్పర చర్యవల్ల వస్తాయి. సాహిత్య చరిత్ర సాహిత్యరంగంలోని ఒక ఆంతరగతి తర్కంవల్ల నడుస్తుంది. ఈ సంగతి గుర్తించకుండా రాసిన సాహిత్య చరిత్రలు యాదృచ్ఛిక కారణాల కట్టుకథలుగానూ, కవుల చరిత్రల సంపుటులుగానూ ఆయా చరిత్రకారుల సొంత సాహిత్యాభిరుచుల ప్రకటనలుగానూ రూపొందుతాయి.''9 ఈ వాక్యాలు నారాయణరావుగారు ఏ దృక్పథంతో కవితావిప్లవాలను సమీక్షించారో స్పష్టం చేస్తున్నాయి.

నారాయణరావుగారు ఈ గ్రంథంలో ఏర్పరచుకొన్న పారిభాషిక పదాలూ, చేసిన సమన్వయాలూ గమనిస్తే వారి సిద్ధాంతపద్ధతి తెలుస్తుంది. గమనించండి- మచ్చుకు కొన్ని:

1. ''నన్నయ కాలం నుంచీ ప్రాచుర్యానికి వచ్చి, అక్షరాస్యులైనవారు రచిస్తున్న సాహిత్యాన్ని లిఖిత సాహిత్య మనీ, అంతకు ముందు నుంచీ వుండి, నేటికీ కొనసాగుతున్న అలిఖిత సాహిత్యాన్ని ఆశు సాహిత్య మనీ ఈ వ్యాసంలో పేర్కొంటున్నాను.'' (పు. 5)

2. ''ఈ వ్యాసంలో నేను ఆల్బర్ట్ సి. లార్డ్ సూచించిన పద్ధతులు కొన్ని అనుసరించాను. అయితే, లార్డ్ పరిశోధన అంతా యుగోస్లావియాలో జరిగింది. తెలుగు దేశపు పరిస్థితులకి ఆయన నిర్ణయాలు అన్నీ వర్తించవు.'' (పు.5)

3. ''తన కవిత్వానికి ప్రతిఘటన వచ్చినప్పుడూ, తన కవిత్వం కొత్త తరహాది అయి, అందుకు అనుకూలమైన అభిరుచి శ్రోతల్లో తానే కల్పించుకో వలసిన అవసరం కలిగినప్పుడూ ప్రతి కవీ కవిత్వం గురించి కవిత్వం రాశాడు. ఈ పని నన్నయగారు చేశారు; పాల్కురికి సోమనాథుడు చేశాడు; పెద్దన్న గారు చేశారు; భావ కవులు చేశారు; అభ్యుదయ కవులు చేశారు: ఈ రకమైన కవిత్వాన్ని అధికవిత్వం (meta-poetry) అనొచ్చు''. (పు. 49).

4. ''రాజులు కవుల్ని ఏనుగు లెక్కించారు. కనకాభిషేకాలు చేశారు. నిజమే. కాని, వారు ఉంపుడు కత్తెల్ని ఉంచుకున్నట్లే కవుల్ని ఉంచుకున్నారు. కొండొకచో వారి కిచ్చే గౌరవం వీరి కివ్వలేదు''. (పు. 65)

5. ''ఒక కొత్త సాహిత్య మార్గం రావడం అంటే కేవలం వస్తువు మారడమో, భాష మారడమో, ఛందస్సులు మారడమో మాత్రం కాదు; రచనా సూత్రాలు మారతాయి. ఆ కారణంచేత, అంతకు ముందున్న సాహిత్యానికి వర్తించిన విమర్శ మార్గాలేవీ ఈ క్రొత్త సాహిత్యానికి వర్తించవు. వర్డ్స్‌వర్త్ చెప్పినట్టు ఒక కొత్త సాహిత్య మార్గాన్ని ఏర్పరిచిన ప్రతి గొప్ప కవీ, ఆ సాహిత్యాన్ని ఆనందించడానికి కావలిసిన అభిరుచిని. పాఠకులను తానే కలిగించుకోవాలి, లేదా అది ఒక ఉద్యమంగా తీసుకొని విమర్శకులు చెయ్యాలి. గురజాడ కవిత్వానికి ఈ విధమైన విమర్శ తోడ్పాటు లేకపోయింది... గురజాడ ప్రారంభించిన కవితా విప్లవం అసంపూర్ణంగా మిగిలిపోయింది. ఒక వ్యక్తి ఎంత గొప్ప కవి అయినా, కవితా విప్లవం తీసుకురాలేడన్న విషయానికి ఈ అంశం గుర్తు''. (పు. 105, 104)

6. 'కథను వొదిలేసి వర్ణనలతో ప్రబంధం ఎక్కువకాలం నిలువలేనట్టే, కథని వొదిలేసి అనుభూతితో భావకవిత్వం ఎక్కువకాలం నిలవలేదు.' (పు. 159)

7. 'రమణీయవేషం వేసుకొని అకవిత్వం కవిత్వంగా చలామణి అవుతున్నప్పుడు అకవిత్వ వికృతాకృతిలో వచ్చిన కవిత్వం దిగంబర కవిత్వం.' (పు. 194).

8. 'సాహిత్య విమర్శలో ప్రజాసాహిత్యానికి చోటుదొరకలేదు'. (పు.212)

9. 'రచయిత తన రచనద్వారా అంతవరకూ బయటపెట్టబడని వాస్తవాన్ని బయటపెడతాడు. ఆ పని చెయ్యడంలో, ఆ వాస్తవాన్ని మార్చాలనే లక్ష్యం గర్భితమై వుందని గుర్తించినవాడు బద్ధ రచయిత'. (పు. 227)

88)

10. 'ప్రస్తుతకాలంలో నిబద్ధత రాజకీయం కాకతప్పదు. నిబద్ధతావాదం సాహిత్యాన్ని రాజకీయమయం చేస్తున్నదనే విమర్శకు నిబద్ధుల సమాధానం ఇది. మన తరంలోని సమస్యలన్నిటికీ రాజకీయ సమస్య ఒక్కటే మూలభూతమైన రూపం. అందుచేత రాజకీయాల్ని తప్పించుకోవటం వాస్తవికతని తప్పించుకోవటమే'. (పు. 231)

రచయిత దృక్పథం మార్క్సు దృక్పథం. కవితా విప్లవాలను గూర్చి చేసిన అనువర్తిత విమర్శపద్ధతి రచయిత సొంతం. రచయిత చేసిన నిర్ణయాలన్నీ నిర్దుష్టాలనీ, శాస్త్ర సమ్మతాలనీ, వారివాదంలో వైరుధ్యాలు లేవనీ విమర్శకు లంగీకరింపకపోవచ్చును. కాని, మార్క్సిస్టు దృక్పథంతో కవితారంగంలో వచ్చిన విప్లవాలను సమీక్షించే పరిశోధన గ్రంథం ఇది.

సాహిత్య చరిత్ర రచనను గురించి వివేచిస్తూ రెనె వెలక్, ఆస్టిన్ వేరెన్ తమ "Theory of Literature" గ్రంథంలో చేసిన సమీక్ష ఈ సందర్భంలో గమనింపదగింది– "The problem of writing the history of a period will be first a problem of description: We need to discern the decay of one convention and the rise of a new one. Why this change of convention has come about at a particular moment is a historical problem insoluble in general terms. One type of solution proposed assumes that within the literary development a stage of exhaustion is reached requiring the rise of a new code. The Russian formalists describe this process as a process of 'automatization', i-e. devices of poetic craft effective in their time become so common and hackneyed that new readers become inured against them and crave something different, something, it is assumed, antithetic to what has gone before. A see-saw alternation is the scheme of development, a series of revolts ever leading to new 'actualizations' of diction, themes, and all

other devices. But, this theory does not make clear why development has to move in the particular direction it has taken : mere see-saw schemes are obviously inadequate to describe the whole complexity of process." 10

వెల్చేరు నారాయణరావుగారి ఈ గ్రంథాన్ని నిశితంగా విమర్శించి ఖండించినవారు శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ. కవిసేనవారు ఈ గ్రంథ సమీక్షను ఇంగ్లీషులో టైపుచేసిన ప్రతులను దేశంలోని కొందరు విమర్శకులకు, రచయితలకు పంపారు. నాకు పంపింది 25-5-1980 తేదీనాడు. ఆ సమీక్షలో శర్మగారు గ్రంథకర్తకు మార్క్సిస్టు దృక్పథం యొక్క అవగాహన గాఢంగా లేదనీ, ఆశుసాహిత్య లిఖితసాహిత్య సంప్రదాయాల వివేచనం శాస్త్రీయంగా లేదనీ, పెక్కు విషయాలలో ఆయన చేసిన అన్వయాలు, నిర్ణయాలు పఠితలను పెడత్రోవన పట్టించేటట్లున్నాయనీ విమర్శించారు. రస, చైతన్య శబ్దాలు ఆయా శాస్త్ర మర్యాదలను పాటించి రచయిత వాడలేదనీ, వాదవైఖరిలో ఏకవాక్యత లేదనీ పేర్కొన్నారు. వారు చేసిన విమర్శలో కొన్ని వాక్యాలు గమనించండి.

1. "This book is over-populated with such fake theories and misconceptions based on half-baked knowledge of the principles of literature either modern or ancient. A more relevant point would be to show that the author is not at all in touch with any works related to Marxist theory of literature as there is no evidence to this effect in any part of the book." (Typed review. పు. 16)

2. "The author has awefully failed to represent in this work the Marxist point of view on commitment in literature and concludes the discussion on the Existentialistic note of Sartre which definitely militates against Marxist principles on the subject. By taking Existentialistic stand the author has given

an anti-Marxist tone to the vital issue of commitment." (పు. 22.)

శేషేంద్రశర్మ గారి విమర్శపై త్రిపురనేని మధుసూదనరావుగారు ప్రతి విమర్శ చేశారు.[11] అందులోని ప్రధానాంశాలు కొన్ని-

1. ''యుగ విభజనని, ఆ యుగాల్ని విప్లవం అనే పేరుతో నిర్దేశించ టాన్ని నేనుకూడా అంగీకరించటం లేదు. కాని, అంతమాత్రమే చూసి ఇక ఆయన చెప్పిందంతా తప్పే అనే అభిప్రాయానికి రాగూడదు.'' (పు. 4.)

2. ''విప్లవమంటే వర్గయుద్ధం. అనివార్యంగా అది రాజకీయ రూపంలో ఉంటుంది.'' (పు. 4.)

3. ''నా. రా. లో మౌలికంగా వర్గ దృక్పథం ఉంది. దాన్ని చరిత్రతో అన్వయించటంలో విఫలుడయ్యాడు. వర్గ దృక్పథాన్ని చరిత్రతో అన్వయించకుండా మార్కిస్టు దృక్పథంతో సాహిత్య చరిత్రను రాయటం సాధ్యంకాదు. మొత్తం సమాజ చరిత్ర తెలిస్తే తప్ప ఈ అన్వయం సాధ్యం కాదు.'' (పు. 6)

4. 'నా. రా. భారతీయ మౌఖిక ఆశు సంప్రదాయాన్ని అధ్యయనం చేయలేదని నేను సంవత్సరం క్రితమే రాశాను. మీరు అదే రాశారు. (మీరు కాపీ కొట్టలేదు లెండి.') (పు. 7)

5. ''వస్తువులో, రూప నిర్మాణంలో, అభివ్యక్తిలో భావ కవిత్వం విప్లవం తెచ్చింది అంటూనే మీరు భావకవిత్వాన్ని విప్లవం కాదంటున్నారు.' (పు. 10.)

6. ''పరసం తన దృక్పథంనుంచి మొత్తం మానవ జీవిత రంగం కోసమే పోరాటం చేస్తున్నది. మొత్తం అంటే జీవితంలో అన్ని రంగాలలోనూ వర్గ పోరాటం అని అర్థం.'' (పు. 15.)

7. ''మౌఖిక కవిత్వాన్ని ఆశు కవిత్వం అనకూడదు అనే మీ అభి ప్రాయంతో నేను ఏకీభవిస్తున్నాను. దానికి మీరు చెప్పిన కారణాలతో నేను ఏకీభవించటం లేదు''. (పు. 18)

8. ''చైతన్యం ప్రధానం, పదార్థం తద్భవం అనే వాళ్లు భావవాదులు, పదార్థం ప్రధానం, చైతన్యం తద్భవం అనేవాళ్లు భౌతికవాదులు. గతితార్కిక భౌతికవాదం పదార్థం ప్రధానం, చైతన్యం తద్భవం అని ... నిరూపిం చింది'' (పు. 19)

ఈ వాదాలవలన తేలే విషయం ఒకటి. నారాయణరావుగారి గ్రంథం మార్క్సిస్టు దృక్పథంతో వ్రాయబడటం చేత అది భౌతికవాద ప్రాతిపదికను మన్నిస్తుంది. అన్వయాలలో కొన్ని అభిప్రాయభేదా లున్నా త్రిపురనేని మధుసూదనరావుగారు భౌతికవాదులే. గుంటూరు శేషేంద్రశర్మగారు మౌలికంగా భావవాది. వీరి అభిప్రాయ భేదాలలో అభిరుచి విమర్శ భాగం వదలిపెట్టితే ముఖ్యంగా కనపడేది దృక్పథ భేదం. ఈ భేదం ఈ యుగంలోని విమర్శకులలో బలీయంగా ఉంది.

కవిత్వాన్ని దృష్టిలో పెట్టుకొని సాహిత్య చరిత్రను యుగాలుగా విభజించాలని గుంటూరు శేషేంద్రశర్మగారి ప్రతిపాదనం ఒకటి ఉంది. వారి దృష్టిలో సాహిత్యయుగాల విభజనం ఇలా ఉండాలి-

1. వాచ్యార్థ ప్రధానయుగం(నన్నయ నుంచి తిరుపతి వేంకట కవులవరకు)
2. లక్షణార్థ ప్రధానయుగం (రాయప్రోలు నుంచి కరుణశ్రీ వరకు)
3. ద్వితీయ వాచ్యార్థ ప్రధానయుగం (శ్రీశ్రీ నుంచి కుందుర్తి వరకు)
4. ద్వితీయ లక్షణార్థ ప్రధానయుగం (శేషేంద్రతో ప్రారంభించి ఇప్పుడు నడుస్తున్న కవిసేనయుగం)

కానీ స్థూలంగా రాయప్రోలు నుంచి యీనాటివరకు ఆధునిక యుగమనే అనుకోవాలి[12]. (చూ. కవిసేన మేనిఫెస్టో. పు. 282)

గుంటూరు శేషేంద్రశర్మగారు ప్రకటించే అన్ని అభిప్రాయాలూ శాస్త్రీయంగా, ప్రామాణికంగా ఉంటాయని చెప్పలేము. సాహిత్య కౌముది నాటి అభిప్రాయాలు కవిసేన మేనిఫెస్టోనాటికి కొన్ని మారిపోయాయి. ఆ మారిపోయిన వాటిల్లో ఇది ఒకటి. వారి యుగాన్ని సమర్థించుకోటానికి పూర్వయుగాలను, సమకాలీన సాహిత్యోద్యమాలను తక్కువ చూపు చూడవలసిన అవసరం లేదు. నన్నయ నుండి తిరుపతి వేంకట కవుల వరకు వాచ్యార్థ ప్రధాన యుగమంటే సాహితీవేత్త లెవ్వరూ అంగీకరించరని నా అభిప్రాయం.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి 'సారస్వతవ్యాసములు' మొదటి సంపుటికి ద్వితీయ ముద్రణ పీఠికలో జి. వి. సుబ్రహ్మణ్యం (ఈ గ్రంథ రచయిత) తెలుగు కవిత్వపు తీరుతెన్నులను వివేచిస్తూ నన్నయ నుండి ప్రబంధ యుగకవుల దాకా ఆయా యుగాల కవుల సాహిత్య దృక్పథాలను బట్టి కవితలో

వచ్చిన పరిణామాన్ని పరిశీలించి ఒక సమన్వయ సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు వివరాల జోలికి పోకుండా తాత్పర్యాన్ని పఠితల సౌకర్యార్థం ఇక్కడ పొందు పరుస్తాను.

కవిత్రయంవారు ప్రధానంగా ధ్వనిప్రస్థానాన్ని ఆదరించినవారు. ఇతిహాసాన్ని కావ్యస్వరూపంగా తీర్చిదిద్దినవారు. అయితే, నన్నయ రచనలో వస్తు ధ్వని, తిక్కన రచనలో రసధ్వని, ఎఱ్ఱయ రచనలో అలంకార ధ్వని అధికంగా కనపడతాయి. నన్నయ కవితలోని ఆస్వాదనీయమైన సౌందర్యం శబ్దగుణ సంయోజనం వలన ఏర్పడింది. తిక్కన శబ్దగుణాలకంటె అర్థగుణాల సంయోజనం వలన కవితకు రుచి కల్పించాడు. ఎఱ్ఱయ వాక్కుకు గుణాలను అలంకారాలతో అతిశయింపచేయాలన్న ప్రవృత్తి సహజాలంకారంలా సమకూరింది. నన్నెచోడుడు వస్తుతః అలంకార ప్రస్థానానికి సంబంధించినవాడు. అలంకార వాదియై ఎప్పుడూ రసానికి మూడు మెట్లు దిగువన నున్నవాడే పదాలతో ప్రజ్వలనశీలాన్ని కల్పించే భావవాహిని పాల్కురికి సోమనాథుని కవితలోని రుచికున్న గుణమైతే, శబ్ద పునరావృత్తితో రచనా సౌందర్యాన్ని సృష్టించి, భక్తి పారవశ్యాన్ని కల్పించే శిల్పం పోతన కవితా గుణం. నాచన సోముడు చమత్కార ప్రస్థానాన్ని ఆంధ్ర సాహిత్య రంగంలో ప్రవేశపెట్టి, తాను నవీన గుణసనాథు డయ్యాడు. శ్రీనాధుడు తెలుగు కవితను చమత్కార మార్గంనుండి రీతి ప్రస్థానానికి మళ్ళించాడు. సాహిత్య ప్రస్థానాల్లో ప్రబంధ కవులకు అలంకార మార్గమే శరణ్యమైపోయింది. కాలపురుషుడు వారి కందించిన కల్పకం అలంకార ప్రస్థానం. ప్రబంధ కవులలో అల్లసాని పెద్దన శబ్దార్థగుణశ్లేషకు తన కవితలో పట్టం కట్టితే-రామరాజభూషణుడు శబ్దార్థాలంకారశ్లేషకు తన కవితలో సువర్ణాభిషేకం చేశాడు. ఇద్దరికీ అలంకార ప్రస్థానాన్ని రసోన్ముఖంగా నడిపించటం తెలుసు. పెద్దన తిమ్మనలు అలంకారాలు ఉపమామూలాలన్న సిద్ధాంతానికీ, రాయలు అలంకారాలు స్వభావోక్తి, అతిశయోక్తి మూలాలన్న మతానికీ, సూరన రామరాజభూషణుడు, చేమకూర వేంకటకవి అలంకారాలు శ్లేషోక్తిమూలాలన్న భావానికీ, రామకృష్ణుడు అలంకారాలు వక్రోక్తి మూలాలనే అభిప్రాయానికి ప్రాతినిధ్యం వహిస్తూ తమ తమ కవితలను ప్రయోగవైచిత్రితో వెలయించారు. తెలుగు కవిత్వంలోని రుచి భేదాలను సమీక్షించి, తెలుగు కవుల సాహిత్య దర్శనాల ప్రభావం వలన వారి వారి కవితల కేర్పడిన స్వరూప స్వభావాలను వివేచించే యీ ప్రయత్నం క్రొత్తది. సహృదయులు దీని నెలా స్వీకరిస్తారన్నది ఇంకా గమనింపవలసి ఉంది.

"Honest criticism and sensitive appreciation is directed not upon the poet but upon the poetry"[13] అన్న ఇలియట్ మాటలు ఆధునికాంధ్ర విమర్శ రంగంలో అందరం గుర్తుంచుకొనవలసిన అంశం.

## సాహిత్య విమర్శ వ్యాసం

సాహిత్య విమర్శలను వెలయించటానికి తెలుగులో శక్తిమంతమైన ప్రక్రియ వ్యాసం. తెలుగు వ్యాస పరిణామాన్ని గురించి విస్తృత పరిశోధన గ్రంథం వ్రాసిన డా॥ కొలకలూరి ఇనాక్ తెలుగులోని వ్యాసం ఆంగ్ల లక్షణ లక్షితమని నిశ్చయించి చెప్పారు. వారి మాటలలో "ఆంధ్రంలో ఎవరు ఎలా చెప్పినా ఆంగ్ల ప్రభావ ఫలితంగానే వ్యాస విషయం స్పష్టమవుతుంది. కాబట్టి వ్యాస లక్షణాలు కూడా తద్భాషా సంబంధులుగానే వున్నాయి. 'ఒక విషయమును గురించి విస్తరించి వ్రాయుట వ్యాస లేఖన మనబడును. ఇట్లు విస్తరించి వ్రాయబడిన గ్రంథము వ్యాసము. వ్యాసమున నాద్యంతమొక విషయమే వివరించబడును.'[14] ఆంగ్ల వ్యాసధర్మమే ఆ గ్రంథంలో తెలుప బడినట్లు స్పష్టమవుతుంది. 'వ్యాసము నాతి దీర్ఘముగ నుండు వచన రచన. కావ్యమునకు వలె గాక వ్యాసమునకు విషయ నిర్వహణమునందలి జాగరూకతయు, వర్ణనౌచిత్యమును, ఉపక్రమోపసంహార సామ్యమును ప్రధానాంగములు. వ్యాసకర్త సూక్ష్మమున మోక్షము జూపవలయును. విషయ సంగ్రహ రచనా రహస్యము నాత దెరింగి యుండవలెను. సంగ్రహముగ నున్నదని రచన నిస్సారముగా నుండజనదు. సంక్షేప కథనంబును, విషయవిస్తృతియునను లక్షణద్వయోపేతమై, వ్యాస మొప్పారు చుండవలెను, కడు విస్తృతంబయినచో నది వ్యాసం బననొప్పదు. దానిని వ్యాఖ్యాన మనియు, కావ్య మనియు పేర్కొనదగును. పరిపూర్ణ స్ఫూర్తియు, నిశ్శేషాంశచర్చయు వ్యాసమున నుండజనదు.'[15] ఈ విధంగా సాగిన ఈ లక్షణయత్నం చాలవరకు ఆంగ్లలక్షణ సంబంధిగానే వుంది."[16]

కందుకూరి వీరేశలింగం పంతులుగారి నుండి నేటి వరకు ప్రసిద్ధ విమర్శకు లందరూ వ్యాసప్రక్రియను చేపట్టి నిర్వహించినవారే. విమర్శ గ్రంథాలు వ్రాసిన వారుకూడా ఎడనెడ వ్యాసాలు వ్రాశారు. వ్యాసప్రక్రియ మీద ఆకృతి మీద పడే ప్రభావం సర్వసామాన్యంగా ఉంది. దానిని వివరించటం సముద్రానికి ఏతం పట్టటం లాంటిది. అయితే, సాహిత్య చరిత్రలో పాశ్చాత్య

ప్రభావంతో విశిష్ట వ్యాసప్రక్రియలను నడిపి, తెలుగువారి మీద కూడా అమితంగా ప్రభావం వేసిన వ్యాస రచయితలనే యీ సమీక్షలో గ్రహించటం సమంజసం. అటువంటి వారిలో మొట్టమొదట తెలుగు వారికి స్ఫురించేది - పానుగంటి లక్ష్మీ నరసింహారావుగారు. వారి సాక్షి వ్యాసాలు తెలుగునాట ఇప్పటికీ ఆసక్తినీ, అనురక్తినీ కలిగిస్తూనే ఉన్నాయి.

## సాక్షి వ్యాసాలు

పానుగంటి లక్ష్మీనరసింహారావు (1865-1940) సాక్షి వ్యాసాలు అధిక్షేప వ్యాసాలుగా, ఉపన్యాసాలుగా, విమర్శకులచేత పరిగణింపబడుతూ ఉన్నాయి. ఈ వ్యాసాలమీద ఇంగ్లీషులో ఎడిసన్, స్టీల్ సంపాదకత్వంలో వెలువడిన స్పెక్టేటర్ పత్రిక ప్రచురించిన స్పెక్టేటర్ వ్యాసాల ప్రభావం ఆకృతిలో, అభివ్యక్తిలో, నిర్వహణలో స్పష్టంగా గోచరిస్తుంది. 'పానుగంటి సాహిత్య సృష్టి' అనే పరిశీలన గ్రంథం వ్రాసిన డా॥ ముదిగొండ వీరభద్ర శాస్త్రిగారు స్పెక్టేటర్ వ్యాసాలకూ, సాక్షి వ్యాసాలకూ ఉన్న భేద సాదృశ్యాలను యిలా అనుశీలించారు:

"1. స్పెక్టేటరు వలెనే సాక్షియు ఒక కల్పిత వ్యక్తి. స్పెక్టేటర్, సాక్షి ఇరువురు సంఘ సంస్కరణము నిమిత్తమై కృషి చేయుటకై చిన్న చిన్న సంఘములను స్థాపించిరి. 2. సాక్షి వ్యాసములందును, స్పెక్టేటర్ వ్యాసావళి యందును గల విషయ వైవిధ్యము దాదాపుగా ఒక రీతిదే. ప్రజలకు సత్ప్రవర్తన కలుపుటకు, సదసద్వివేకము కలిగించుటకు తద్రచయితలు ఇరువురును హాస్య ధోరణినే అవలంబించిరి. 3. తత్త్వ జ్ఞానమును (Philosophy) గూర్చి లోకములో నున్న అపోహలను తొలగించి, సంస్కృతి, సభ్యతల విశిష్ట సారాంశమే వేదాంత జ్ఞానము అను సూక్ష్మ సత్యమును పానుగంటివారు, ఎడిసన్ నిరూపించిరి. 4. పానుగంటివారి సాక్షి రచనకు ఎడిసన్ రచన ప్రేరకమైనది అనుటలో సందియము లేదు. కాని, కాలక్రమమును అనుసరించి పానుగంటివారు తరువాతి వారగుటచే ఎడిసన్ రచనా శిల్పమునకు, ప్రణాళికకు మెరుగులు దిద్దుకొనుటకు అవకాశము కలిగినది. 5. ఆశయములు ఇరువురకును ఒక్కటే యైనను, దేశకాల పరిస్థితులు భిన్నములగుటచేత ఇరువురి కృషి పద్ధతులయందును భేదము ఉండక తప్పదు."[17]

'పానుగంటి వారి సాక్షి—సాంఘిక దర్శనము' అను అంశంపై ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎం.ఫిల్,, పరిశోధన వ్యాసం వ్రాసిన శ్రీమతి

కళాంబి హరిప్రియ సాక్షి వ్యాసాలను వ్యాసోపన్యాసాలనే ప్రక్రియకు చెందుతా యని, ఆ ప్రక్రియలో ఆయన అద్వితీయుడనీ పేర్కొన్నారు. "వ్యాసమును ఉపన్యాసముగా నడిపించి, ఉత్సాహమును కల్పించుటలోను, ప్రహసనముగా పలికించి ప్రరోచనము కల్పించుటలోను, శబ్దాలంకార శైలీ విన్యాసముతో శ్రవణానందము కల్గించుచు, వక్ర వ్యంగ్యోక్తులతో ఉపదేశమును నిబంధించుచు, సాక్షి వ్యాసోపన్యాస ప్రక్రియకు విశ్వరూపమును చూపించినవారు పానుగంటివారు. తెలుగులో వ్యాసోపన్యాస ప్రక్రియకు మారుపేరు 'సాక్షి' తరువాత అనుకరణములు వచ్చినవేకాని, ఈ ప్రక్రియను మించిన ప్రతిభ మాత్రము సాహితీ లోకమున ప్రదర్శింప బడలేదు." 18

సాక్షి వ్యాసాలలో సాంఘిక విమర్శకు మాత్రమే కాక సాహిత్య విమర్శకు సంబంధించినవి కూడ ఉన్నాయి. కవిత్వ స్వరూప స్వభావాలను గురించీ, నాటక పద్య రచనను గురించీ, నాటకాలలో కొన్నింటిలో కనపడే సందర్భ శూన్యత గురించీ, నాటక విమర్శ రీతులను గురించీ, స్వీయ చరిత్రలకున్న ప్రత్యేకతను గురించీ, సద్విమర్శ స్వరూప స్వభావాలను గురించీ పానుగంటి వారు చర్చించారు. సమకాలీన సాహిత్య, సాంఘిక సమస్యలను వ్యాసోపన్యాస ప్రక్రియ ద్వారా ప్రజలలో చైతన్యం కలిగేటట్లు చేయటంలోనూ, పాశ్చాత్య ప్రభావాన్ని ప్రక్రియాపరంగా ప్రతిభావంతంగా నిర్వహించటంలోనూ పానుగంటి వారు ఎనలేని గౌరవాదరాలను పొందారు. తెలుగులో మరే రచయిత వ్యాస రచనం వీరి 'సాక్షి' వ్యాసాలవలె విస్తృత ప్రచారాన్ని పొందలేదంటే అతిశయోక్తి కాదు. తెలుగు వ్యాసానికి గర్వ కారణం 'సాక్షి'. 'వదరుబోతు' వ్యాసాలూ, 'బారిస్టరు గారి బాతాఖానీ' మొదలైనవి సాక్షి అనుకరణలు. కాని 'సాక్షి' వ్యాసోపన్యాసాల కున్న జిగికాని, బిగికాని వీటికి లేదు.

తెలుగులో వ్యాస ప్రక్రియను నిర్వహించిన వారు శతాధిక సంఖ్యలో ఉన్నారు. వర్తమాన సాహిత్య విమర్శ విశేషంగా వ్యాసప్రక్రియ నాశ్రయించే సాగుతున్నది. వ్యాస కర్తలలో పాశ్చాత్యైక ప్రభావంతో వ్రాసేవారు దాదాపు లేరనే చెప్పాలి. సమన్వయ ప్రవృత్తితో రచన చేసేవారు కొందరున్నారు. అయినా, వారి మీద పాశ్చాత్య యుగాలలోని ప్రవృత్తులు ప్రకృష్టంగా, నిర్దిష్టంగా నిర్ణయించటం సాధ్యం కాదు. అయితే, వ్యాసరచనా నిర్వహణలో పాశ్చాత్య ప్రభావముద్ర ఉన్నదని మాత్రం నిశ్చయంగా చెప్పవచ్చును.

అయితే, తెలుగు విమర్శకులలో ఇప్పటికీ ఆంగ్ల ప్రభావం లేకుండా, సంస్కృత లాక్షణిక దృష్టితో విమర్శించే సంస్కృతాంధ్ర పండితులు కొందరు ఉన్నారు. వీరికి పాశ్చాత్య విమర్శ జ్ఞానం విజాతీయమనే అభిప్రాయం బలంగా ఉండటం గమనింపదగింది. వీరు లక్షణశాస్త్ర విమర్శను, ఖండన మండనాదులను చేసి వ్యాసాలనూ, గ్రంథాలనూ రచిస్తున్నారు. క్రమంగా ఈ సంఖ్య తగ్గుతున్నది. సమకాలీనులలో అట్టి విమర్శమీద ఆదరం సన్నగిల్లుతున్నది.

పాశ్చాత్య విమర్శన ప్రవృత్తినీ, పరిశోధన విధానాన్నీ ఆకళించుకొని వ్యాసరచనలో ప్రపంచించిన ప్రసిద్ధ విమర్శకులను ఈ రంగంలో స్మరించవలసి ఉంటుంది. స్వామినేని ముద్దునారసింహనాయుడుగారు రచించిన 'హితసూచని'లో ప్రమేయమని పిలువబడిన వ్యాసప్రక్రియమీద (1862) ఆంగ్ల పదప్రయోగం, వ్యాస ప్రక్రియా లక్షణాలు కొన్ని కనపడుతూ ఆంగ్లప్రభావ ఉషస్సును సూచిస్తున్నాయి. పరవస్తు వేంకటరంగాచార్యులుగారి 'సంగ్రహము'ల (1872-74) మీద ఆంగ్లప్రభావం అరుణరేఖల్లా కనపడుతుంది. జియ్యరుసూరిగారి 'శ్రీ కళాకల్లోలిని' (1876) లోని వ్యాసాలు గ్రంథాలని పేర్కొనబడినా వాటిమీద ఆంగ్లవ్యాస ప్రభావం ఉదయకాంతులతో వెలుగొందుతున్నది. వ్యాసప్రక్రియలో ఉపన్యాస విధానానికి రూపం కల్పించి బలాన్ని ప్రచారాన్నీ కల్పించిన రచయిత కందుకూరి వీరేశలింగం పంతులుగారు. ఆంగ్లంలోని 'కర్టెన్ లెక్చర్స్' లాగా తెలుగులో అంతఃపురోపన్యాసాలను (1891) రచించినవారు ఆచంట సుందర రామయ్యగారు. సాహిత్యవ్యాసానికి రూపురేకలు దిద్దినవారు గురజాడ అప్పారావుగారు. భాషా విషయకమైన విమర్శవ్యాసానికి శక్తిని, సాధననూ కల్పించిన వారు గిడుగు రామమూర్తి పంతులుగారు. వివాదవ్యాసరచనకు విద్యనేర్పినవారు కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు. పత్రిక సంపాదకీయ వ్యాసానికీ, తాత్త్విక వ్యాసానికీ తీరుతెన్నులు నేర్పినవారు ముట్నూరి కృష్ణారావుగారు. నాట్యసంబంధి విమర్శకు నారు పోసినవారు పురాణం సూరిశాస్త్రిగారు. చారిత్రిక వ్యాస నిర్వహణానికి చక్కనిబాటలు చూపించినవారు చిలుకూరి వీరభద్రరావుగారు, మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, నేలటూరి వెంకటరమణయ్యగారు, సురవరం ప్రతాప రెడ్డిగారు, మారేమండ రామారావుగారలు. పరిశోధన వ్యాసప్రవృత్తికి ప్రాచార్యుడు కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు, సాహిత్య విమర్శలో అభిరుచి విమర్శను మేళవించినవారు జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు. సమ

న్వయ దృష్టితో వ్యాసాన్ని కళాఖండంగా తీర్చిదిద్దినవారు ఖండవల్లి లక్ష్మీరంజనంగారు. విశ్లేషణ వ్యాసరచనకు వివేకాన్ని నేర్పినవారు దివాకర్ల వేంకటావధానిగారు. వ్యాసానికి హాస్యకళను నేర్పినవారు భమిడిపాటి కామేశ్వరరావుగారు, మునిమాణిక్యం నరసింహారావుగారు. హేతువాద వైఖరి నేర్పినవారు తాపీ ధర్మారావుగారు, నార్ల వేంకటేశ్వర రావుగారు. చిత్రకళకూ, సాహిత్యానికీ ఉన్న సంబంధాన్ని వివేచిస్తూ కళావిమర్శకు కాంతుల నిచ్చినవారు శ్రీ సంజీవదేవ్. వ్యాసానికి ఆత్మీయతాగుణాన్ని సంపదించినవారు కాటూరి వెంకటేశ్వర రావుగారు. వ్యాసాన్ని సాంఘిక విమర్శకు, ప్రణయతత్వానికీ అంకితం చేసినవారు డా॥ బోయి భీమన్నగారు. అమరేంద్రగారి వ్యాసాలలో కాల్పనిక మార్మిక వాదాల ఛ్ఛాయలు బలంగా కనపడతాయి. తెలుగు కథా రచయితలను గూర్చి ఒక వినూత్న రీతిలో వ్యాసాలను వ్రాసినవారు డి. రామలింగంగారు

సాహిత్య విమర్శకు సంబంధించిన వ్యాసాలను పాశ్చాత్య ప్రభావ ముద్రితంగా తీర్చిదిద్దినవారిలో కోరాడ రామకృష్ణయ్యగారిని మొదట పేర్కొనాలి. వీరి భాషావ్యాసాలుకూడా ప్రామాణిక ప్రతిపత్తిని సంపాదించుకొన్నాయి. పిల్లలమర్రి హనుమంతరావు, విన్నకోట మాధవరావు, శిష్టా రామకృష్ణశాస్త్రి, చేకుమళ్ళ అచ్యుతరావు, పుట్టపర్తి నారాయణాచార్యులు, పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి, వావిలాల సోమయాజులు, వడలి మందేశ్వరరావు మొదలైనవారు కావ్యతత్వ విచారాన్ని వ్యాసప్రక్రియలో వెలయించారు. కావ్యాత్మ చర్చలను సాహిత్యశాస్త్రాంశ విశేష విమర్శను చేసినవారిలో వేదము వేంకటరాయశాస్త్రి, పెన్నేటి రామచంద్రరావు, మానవల్లి రామకృష్ణకవి, వేటూరి ప్రభాకరశాస్త్రి, నడకుదుటి వీరరాజు పంతులు, కొండూరు వీరరాఘవాచార్యులు, యస్వీ. జోగారావు, జి.యన్.రెడ్డి, తూమాటి దొణప్ప, సర్దేశాయి తిరుమలరావు, కేతవరపు రామకోటిశాస్త్రి, తుమ్మపూడి కోటీశ్వరరావు, జి. వి. సుబ్రహ్మణ్యం, కాశూరి హనుమంతరావు, కె. సుప్రసన్నాచార్య, సోమసుందర్, దేవులపల్లి రామానుజరావు రూపగుడి నారాయణరావు మొదలైనవారిని పేర్కొనాలి.

పత్రికావ్యాస రచనలో ప్రసిద్ధులైన సాహితీవేత్తలు పాల్గొన్నారు. సంపాదకులుగా ఉండి తమ రచనలతో దేశాన్ని ఉర్రూత లూగించినవారు- ముట్నూరి కృష్ణరావుగారు, గాడిచర్ల హరిసర్వోత్తమ రావుగారు, నార్ల వెంకటేశ్వరరావు గారు, గోరాశాస్త్రి మొదలైనవారు. నేటి ఎన్ని మాణిక్యవీణలైనా వారి రచనలకు సరిరావు. లాంబ్ లాగా సరళ వ్యాసాలు వ్రాసే విధానంతో తెలుగులో విశే

షించి నార్లవారిని, గుంటూరు శేషేంద్రశర్మ గారినీ, రాపూరు వెంకట సత్య నారాయణరావు గారినీ పేర్కొనాలి. వాక్చిత్రాలను రచించటంలో ముఖ్యంగా ఆరుద్ర, తిరుమల రామచంద్ర, మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి గార్లను ప్రశంసించాలి. జీవితచరిత్ర రచనలలో కృషి చేసిన వారెందరో ఉన్నారు. వారందరిలో శ్రీ గొట్రెపాటి వెంకట సుబ్బయ్యగారిదే అగ్ర తాంబూలం. ఇలా పేరు పేరునా ప్రక్రియలనూ, రచయితలను చెప్పటం సాధ్యంకాదు. ఆధునిక విమర్శ రచనలో వారందరిమీద పాశ్చాత్యప్రభావం ఉన్న దనడంలో అనుమానంలేదు. ప్రేరణగా కొందరిలో, ఆదర్శంగా కొందరిలో, అనుసరణంగా కొందరిలో, అన్వయప్రవృత్తిగా కొందరిలో, ఆలోచనరీతిగా కొందరిలో, దృక్పథ పీఠికగా కొందరిలో, లక్షణవృత్తిగా కొందరిలో, లక్ష్యశుద్ధిగా కొందరిలో ఆంగ్ల సాహిత్య విమర్శ ప్రభావం పని చేసిందని నిస్సంశయంగా పేర్కొనవచ్చును.

తెలుగులో వ్యాస పరిణామాన్ని గూర్చి పరిశోధనంచేసిన డా॥ కొలకలూరి ఇనాక్ గారి ఈ క్రింది అనుశీనాంశాలు గమనింపదగినవి-

1. ''వర్తమాన వ్యాస వాఙ్మయంలో విషయవిశాలత గమనార్హంగా ఉంది. అదిప్పుడు అధికంగా సారస్వత సంబంధిగా ఉందికాని, ఆరంభంలోలేదు. మొదటి ముగ్గురు వ్యాసకర్తలు సాంఘిక మత విషయాలతో వ్యాససృష్టి చేశారు. కందుకూరి కాలంలో ఉపన్యాసాలలో ప్రారంభమయి, గురజాడకాలంలో వ్యాసాలలో పెరిగి, పానుగంటి కాలంలో విస్తృతమయి, కట్టమంచి కాలంలో సారస్వత విషయం సంపూర్ణంగా విమర్శనంగా రూపొందింది. అయితే యిక్కణ్ణుంచి వ్యాస సాహిత్యం రెండు పూర్తి భిన్న శాఖలుగా విస్తరిల్లింది. ఒక శాఖ సారస్వత ప్రముఖంగా విమర్శన వ్యాసమయింది. ఇంకొకశాఖ సర్వవిషయసమర్థంగా సృజనవ్యాస మయింది. వ్యాసం విస్పష్టంగా విమర్శన రీతిగా వేరుకాకపూర్వం సృజనంగానే వుంది. అందువల్ల వ్యాసం సృజనంగా రూపొందటం ఆద్యమైనదే. విమర్శనంగా ఏర్పడటం అనంతర పరిణామం.'' 19

2. ''ఆంగ్లాంధ్ర వ్యాసలక్షణాల పరిణామం స్థూలంగా తుల్యం. అయితే ఆంగ్లంలో లేని ఉపన్యాసం, 'లెక్చర్సు'కంటె భిన్న రచనారీతి తెలుగులో ఏర్పడింది. ప్రసంగ వ్యాసం ఆకాశవాణి కారణంగా తెలుగులో సృజనశాఖగా విస్తరిల్లింది. ఆంగ్లంలో విమర్శనం విమర్శనవ్యాసం కలిగిఉన్న దూరం తెలుగులో తగ్గిపోయింది. ఈ సాహిత్యంలో అసలు వ్యాసంలోకి విమర్శనం ప్రవేశించింది. అసలు

విమర్శనం వ్యాసంగా రూపొందింది. అందువల్ల ఆంధ్ర సారస్వతంలో విమర్శనం, విమర్శనవ్యాసం విడదీయటం కష్టసాధ్యమయింది.'' 20

3. ''తెలుగులో సృజనాత్మక వ్యాసం పొందినంత గుణ, రచన, విషయ, నిర్మాణ వైవిధ్యం విమర్శనవ్యాసం పొందలేదు. విమర్శనవ్యాసం వ్యాపించినంత విస్తృతంగా అధికంగా సృజన వ్యాసం వ్యాపించలేదు. సాహితీ విమర్శన వ్యాసంతో సమానంగా అన్య విషయ విమర్శ వ్యాసం రూపొందలేదు. స్థూలంగా తెలుగు వ్యాసం సర్వవిషయ సమర్థంగా, సర్వలక్షణ సమన్వితంగా, సర్వసద్గుణ సంపూర్ణంగా అవతరించలేదు. కాని, ఈ వ్యాసస్థానం ఈ సాహిత్యంలో అనేతేతర ప్రక్రియలకన్నా ఉన్నతంగా, ఏ ఇతర ఉదాత్త భారత సారస్వత ప్రక్రియకు తీసికట్టుకాకుండా ఉంది.''21

## పరిశిష్టం

సాహిత్య విమర్శలో ఆంధ్ర విమర్శకులు పాశ్చాత్య విమర్శ ప్రభావంతో వినూత్న సిద్ధాంతాలను, సమన్వయాలనూ ప్రదర్శించిన వారు కూడా కొందరున్నారు. అందరినీ పేర్కొనటం సాధ్యం కాకపోయినా కొందరి కృషిని మాత్రం పేర్కొనటం సమంజసం.

ఛందశ్శాస్త్రంలో డా॥ గిడుగు సీతాపతిగారు ఊనికకు ప్రాధాన్యమిచ్చి ఛందోగతుల ప్రవృత్తిని పరిశీలించిన విధం నవీనం.22 ఆ తరువాత డా॥ పాటిబండ మాధవశర్మగారు ఛందోవృత్తిని, ఛందోరీతిని క్రొత్తగా ప్రతిపాదించి రసానుగుణంగా ఛందశ్శిల్పాన్ని అనువర్తిత విమర్శలో వివేచించే విధానాన్ని ప్రతిపాదించిన వైఖరి ఆంధ్ర విమర్శకే ఒక క్రొత్తబాటను చూపింది.23 అలంకార శాస్త్ర విచారంలో శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారు హాస్యం రసం కాదనీ, భావమేననీ ప్రతిపాదించి, పాశ్చాత్య విశ్లేషణ దృక్పథంతో హాస్య భేదాలను నిరూపించిన వైఖరి అపూర్వం.24 డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం మహాభారత రామాయణాదులలోని అంగిరసం ధర్మవీరమని ప్రతిపాదించటమే కాకుండా ధర్మవీరమే 'రసానాం రసః' అని ప్రతిపాదించి అనుశీలించి వ్యాఖ్యానించటం, రస సమీకరణ వాదాల చర్చ, అలంకార సిద్ధాంత విచారంలో వినూత్న ధోరణికి తార్కాణం.25 డా॥ తుమ్మపూడి కోటీశ్వరరావుగారు భారతీయాత్మను వెలార్చటానికి పాశ్చాత్యాంశాలను, సిద్ధాంతాలనూ కళాసూత్రాలనూ సమన్వయించే వైఖరి నేటి తెలుగు విమర్శలో వెలుగుబాట.26 డా॥కాకర్ల వెంకటరామనరసింహంగారి పాశ్చాత్య ప్రాచ్య సాహిత్య దృక్పథాల సమన్వయానుశీలనం విశేషం.27

కోడూరి శ్రీరామమూర్తిగారి 'తెలుగు నవలా సాహిత్యంలో మనస్తత్వ విశ్లేషణ' అనే గ్రంథం (1978) మనస్తత్వ విమర్శకు చక్కని ఉదాహరణం. నాటక విమర్శలో డా॥ పోణంగి శ్రీరామ అప్పారావుగారి 'తెలుగు నాటక వికాసం' (1967) ఒక మైలురాయి. డా॥ దివాకర్ల వెంకటావధానిగారి 'ఆంధ్ర నాటక పితామహుడు' విషాదాంత రూపక లక్షణ లక్ష్యగ్రంథంగా బాగా ఉపకరిస్తుంది. జానపద వాఙ్మయ వివేచనలో ఆన్త్రోపాలజీ, బయాలజీ, స్టాటిస్టిక్స్, ప్రోగ్రూప శాస్త్ర విమర్శ విధానాలను ప్రవేశపెట్టి క్రొత్తదనాన్ని సాధించిన డా॥ నాయని కృష్ణకుమారిగారి ప్రయోగాలూ,[28] ఆర్. వి. యస్. సుందరం, టి. వి. సుబ్బారావుగారల రచనలూ ప్రత్యేకంగా పేర్కొనాలి. వ్యంజన సూత్రం మీద తులనాత్మక అధ్యయనం చేసిన డా॥ హెచ్. ఎస్. బ్రహ్మానందను ప్రత్యేకంగా పేర్కొనాలి.[29] సర్ దేశాయి తిరుమలరావుగారు కావ్యనాటక విమర్శను పాశ్చాత్య భారతీయ సమన్వయాత్మక దృక్పథంతో చేస్తూ గిరీశం పాత్రకల్పనకూ, నిగమ శర్మ కథాకల్పనకూ ఇచ్చిన ప్రతీకాత్మక వ్యాఖ్యానాలు ప్రశంసింపదగినవి. ఆంధ్ర సారస్వత పరిషత్తువారు ఇటీవల ప్రచురించిన తెలుగు సాహిత్య వికాసం, (1979), తెలుగు సాహిత్యంలో మరో చూపు (1981), ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు (1982) అనే గ్రంథాలు ఆధునికాంధ్ర విమర్శను క్రొత్త చూపుతో అనుశీలించటానికి తోడుపడే మంచి రచనలు. ఇలా ఆధునిక విమర్శ రంగం పాశ్చాత్య ప్రభావంతో వినూత్న దృక్పథాలనూ, సిద్ధాంతాలనూ సృష్టించుకొంటూ అభ్యుదయ పథంలో సాగుతున్నది. ఉజ్జ్వల భవిష్యత్తుమీద విశ్వాసాన్ని పెంచుతున్నది.

ఈ ప్రభావ పరిశీలనం వలన తేలిందేమిటంటే - సిద్ధాంత దర్శనం చేయగలిగిన విమర్శకులపైబడిన పాశ్చాత్య ప్రభావం ఒక అభినవ మార్గాన్ని చూపటానికి తోడుపడుతుంది. అనుశీలనకుశలురైన విమర్శకుల రచనలలో పాశ్చాత్య ప్రభావం పాలలో నీరులాగా కలిసిపోతుంది. ప్రక్రియ మీదపడే ప్రభావం పోల్చుకుంటేనేగాని బోధపడదు. సిద్ధాంతం మీదపడిన ప్రభావం ప్రకటంగానో, అంతర్వాహినిగానో ప్రసన్నమౌతుంది. దర్శనంమీద పడిన ప్రభావం తనువెల్లా పులకించినట్లు భాసిస్తుంది,

"The ability to read is a great thing to have; especially in these times when such quantity of print is expended on such a variety of purposes"[30]

—H. Coombs.

# 8

# ముగింపు కాదు, మొదలు

"In our era, criticism is not merely a literary or secondary aids to undestanding and appreciation of literary texts, but also a rapidly increasing body of knowledge in its own right, and a primary vehicle for the values and ideas of the literary imagination."[1]

—David Lodge.

ఈ గ్రంథ రచన ఆంధ్ర సాహిత్య విమర్శపై పాశ్చాత్య ప్రభావ పరిశీలనంలో సమగ్రమైనదీ, అధికారికమైనదీ కాకపోవచ్చును. కానీ, ఆ మార్గంలో వేసిన ఒక ముందడుగు. అందువలననే ఈ గ్రంథానికి ముగింపు లేదు. ఇంకా ప్రస్థానం ఎంతదూరమో సాగాలి. ఆ పరిశీలన ప్రగతికి ఇది మొదలు; ప్రస్తావన.

ప్రభావ పరిశీలనంలో పరిశోధన రంగం, భాషా విమర్శ రంగం, వివిధ శాస్త్రాల ప్రభావానుశీలనం, Theory of Modes, Theory of Myths, Theory of Genres మొదలైన సిద్ధాంతాలమీద ఆధారపడిన Historical Criticism, Ethical Criticism, Archetypal Criticism, Rhetoricol Criticism విమర్శ రీతులలో విమర్శ శాఖలలో విమర్శ వెలయటం దానిమీద ప్రభావాన్ని పరిశీలించటం, జానపద-లోక-దేశీ సాహిత్య విమర్శపై పాశ్చాత్య ప్రభావం మొదలైన అంశాలలో ప్రత్యేక గ్రంథాలే రావలసిన అవసరం ఉంది. సాహిత్య చరిత్రలో ప్రక్రియా వికాస వివేచనం చేసే గ్రంథాలు రావలసి ఉంది. గ్రంథ పరిష్కారం, నిఘంటు నిర్మాణం, పారిభాషిక పదకోశ నిర్మాణం, తులనాత్మక సాహిత్య సౌందర్య

శాస్త్రాధ్యయనం, సాహిత్య సిద్ధాంత పరిశీలనం తెలుగులో ఇంకా వెలువడవలసి ఉంది. తులనాత్మక సాహిత్య అధ్యయన సంస్థ (Institute of Comparative Aesthetics) ఒకటి మన రాష్ట్రంలో స్థాపింపబడి, ప్రత్యేకంగా ఆ రంగంలో కృషిని ముందుకు తీసికొని పోవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఏమైనా, భవిష్యత్తులో ప్రభావ పరిశీలనానికి మంచిరోజులు వస్తాయని ఆశిద్దాం.

తెలుగువారు పాశ్చాత్య విమర్శ పితామహుడైన అరిస్టాటిల్‌ను ఆరాధించి శరణు వేడలేదు; తమకో శతాబ్దం ముందున్న పాశ్చాత్య సాహిత్య విమర్శ పద్ధతికి స్పందించి ప్రభావితులైనారు. అయితే, కొద్దికాలంలోనే శతాబ్ది కాలాంతరాన్ని దశాబ్ది కాలవ్యవధానంగా మార్చుకోగలిగారు. ఇప్పుడు ప్రపంచంలో ఏ స్పందన 'కో' అని ఏ మూల వినపడ్డా తెలుగువాడు 'ఓ' అని మారు పలుకుతున్నాడు. కాని, కవితలోనే ముందు పలకాలనుకొంటాడు. ఆ తరువాత వెనకా ముందూ ఆలోచించుకుంటూ విమర్శలో కదుపుతాడు. కవితలో ముందంజ వేసినంత వేగంగా విమర్శలో తెలుగువాడు ముందుచూపు సారించే ప్రవృత్తి ఇకనైనా మొదలు కావాలి. అప్పుడే సాహిత్యోద్యమాలకు సమాజంలో సముచిత ప్రచార ప్రాభవాలు లభిస్తాయి, సాహిత్యానికి భవిష్యద్దర్శనం లభిస్తుంది.

ఆంధ్ర సాహిత్య విమర్శపై ఆంగ్ల సాహిత్య విమర్శ వేసిన ప్రభావాన్ని పరిశీలించే తొలి ప్రయత్నం ఈ గ్రంథం. ఇందులోని వినూత్న సమన్వయాలను సాహితీమర్మజ్ఞులు సహృదయంతో గ్రహిస్తే ఈ ప్రయత్నం కొంతవరకైనా సఫలమైనట్లే.

"The influence of a critic capable of undertaking this periodical task of revaluation may not be impressive at first, for canons of literary taste are not altered suddenly by revolutionary methods. Their alteration can only be effected gradually and in accordance with that evolutionary process by which habits of mind of educated men and women are changed from time to time". [2]

—John Hayward.



# సంకేతాక్షర సూచి

(Abbreviations)

| | |
|---|---|
| AC | Aesthetics and Criticism—Harold Osborne. |
| AHMC | A history of Modern Criticism—Rene Wellek. |
| AIEC | An introduction to English Criticism—Birjadish Prasad. |
| CA | Critical Assumptions—K.K. Ruthven. |
| CAE | Comparative Aesthetics (Vol. II)—K.C. Pande. |
| DOWL | A Dictionary of World Literature—J.T. Shipley. |
| ECCP | Essays in Criticism and Comparative Poetics —K. Viswanatham. |
| HLAA | A History of Literary Aesthetics in America —Max I. Baym. |
| IMN | Imagination—Mary Warnock. |
| IR | Illusion and Reality—Christopher Caudwell. |
| ISEL | Introduction to the Study of English Literature —K.R. Srinivasa Iyengar and Prema Nanda Kumar. |
| ISLT | In Search of Literary Theory—Morton W. Bloom Field |
| ITSEL | An introduction to the study of English Literature —W.H. Hudson. |
| LC | Literature and Criticism—H. Coombs. |
| LCIA | Literary Criticism in America —Albert D. Van. Nostrand. |
| LCSH | Literary Criticism—A Short History —William K. Wimsatt Jr. and Cleanth Brooks. |
| ML | Marxists on Literature—David Craig. |
| MOE | Metaesthetics and other essays—Sasir Kumar Ghose. |
| NAFP | The New Apologists for Poetry—Murray Krieger, |
| PHLC | Principles and History of Literary Criticism S.C. Mundra and S.C. Agarwal. |

| | |
|---|---|
| PLC | Principles of Literary Criticism—I.A. Richards. |
| SC | The Scholar—Critic—F.W. Bateson. |
| SOB | The Sense of Beauty—George Santayana |
| SPE | Selected Prose of T.S. Eliot—T.S. Eliot. |
| TCC | Twentieth Century Criticism—William J. Handy and Max West Brook. |
| TCTC | To Criticize the Critic and other Writings—T.S. Eliot |
| TOL | Theory of Literature—Rene Wellek and Austin Warren. |
| WC | Writer and Critic and other essays—Georg Lukacs. |

———

# సూచికలు

## విమర్శ వివేకం

1. The critic richer than Poet (Essay)—K. Viswanatham ECCP., p. 492-493.
2. "Literary criticism is a distinctive activity of the civilized mind".—T.S. Eliot., SPE., p. 7.
3. 'Criticism is atonce a science and an art. As a science, it involves examination of particular works, observation of their faults and excellences and (in so far as may be) the induction of general principles. As an art it engages in the production of stimulating works.'—T.T. Shipley (Ed.,) DOWL.
4. 'Modernity is a question not of date but of outlook' —Sir Richard Livingston., cf. ECCP., p. 570.
5. 'Modernity changes with time and it is not clear that it is ever a virtue'—Mell Wraith , cf. ECCP., p. 571.
6. 'If all truths are period products, then our own standards offer no secure basis for passing judgement on those former ages ; if any truths have claims on universality, than every claim, old or new, requires to be examined on its merits'. —D.L. Sayers., Introduction to Purgatory : Pinguin classics —p, 46., cf, ECCP., p. 581.
7. 'No literary criticism can for a future generation excite more than curiosity, unless it continues to be of use in itself to further generation to have intrinsic value out of its historical context'.—T.S. Eliot., TCTC., p. 17.
8. 'The two pillars upon whtch a theory of criticism must rest are an account of value and an account of Communication' —I.A. Richards., PLC., Chapter IV., p. 17.
9. 'From time to time, every hundred years or so, it is desirable that some critic shall appear to review the past of our literature and set the poets and the poems in a new order.

This task is not one of revolution but of readjustment'.
—T.S. Eliot., SPE., p. 86.

10. 'A critic is one whose watch is set five minutes in advance of others'—Sainte-Bueve.

11. 'Criticism may be regarded as having two different functions that of interpretation and that of judgement'
—W. H. Hudson, ITSEL p. 267.

12. 'It is pointless to criticize unless the criticsm produces some good, some kind of Progress'— లూనా షార్స్కీ, cf. కవిసేన మేనిఫెస్టో., పు. 27.

13. 'The critic is as closely occupied with the health of the mind as the doctor with the health of the body'.
—I.A. Richards., PLC., p. 25.

14. 'The Summing up'—Section ; 60.

## ప్రభావ స్వభావం

1. Critical Assuptions., p. 121.

2. 'The poetry is, at the bottom, a criticism of life. The greatness of poet lies in his powerful application of ideas to life to the question—how to live. There exist generally reoognised laws of poetic beauty and poetic truth. The relative greatness of a poet depends upon the soundness of his criticism and his competence of his surrender to the laws of poetic beauty and truth. Poetry is simply the most delightful and perfect form of utterance that human words can reach'.—Matthew Arnold.

3. 'Criticism,as I understood it, is the endeavour to discriminate between experiences and to evaluate them'.
—I.A. Richards., PLC.

4. 'Writers choose influences in the way that they choose friends, and experience what Goethe called 'elective affinities'—CA., p. 120.

5. 'Many authors catch fire from the inspiration of others'.
—Longinus., On the Sublime, XIII 2.

6. 'However one interprets the treacherous term 'Influence', Laforgne's poetry undoubtedly influence the young Eliot,

most probably in the form he was later to recollect as a kind of inundation, of invasion of the underdeveloped personality by the stronger personality'. CA., p. 119. ఇలియట్ మాటలు అతని 'Religion and Literature' అనే వ్యాసంలోవి చూడు: SPE. p. 102

7. 'Mutual borrowing and commerce, makes the common riches of learning, as it does of the civil government,—A discourse concerning the original and progress of Satire (1693)—Essays of John Dryden. Ed., Ker. Vol. 2., p. 25-26
8. 'Influence. n. orig. a term in astrology, the power virtue supposed to flow from planets upon men and things'. —Chambers' Etymological Dictionary of the English language.
9. 'Writers flow into each other like waves, gently rather than tidally'—Richard Ellman—Eminent domain (New York 196) p. 3.
10. 'One of the surest of tests is the way in which a poet borrows. Immature poets imitate; mature poets steal; bad poets deface what they take, and good poets make it into something better, on atleast something different. A good poet will usually borrow from authors remote in time, or alien in language or diverse in interest'—T.S. Eliot—SPE. p. 153.
11. 'Influence as inundation, influence as whetstone : the two metaphors mark opposite poles of response to the same phenomenon, ranging from a seemingly helpless passivity in the presence of a stronger personality, to the abrasive situation of good company'—CA, p. 120.
12. రాయలనాటి రసికత [వ్యాసం] - సారస్వతాలోకము
13. రాయలనాటి రసికతాజీవనము - పుట్టపర్తి నారాయణాచార్యులు.
14. ఒకరు నాచన సోమన్న - విశ్వనాథ సత్యనారాయణ.
15. నవ్యాలోకము (సాహిత్య వ్యాస సంపుటి) - హంసడిభకోపాఖ్యానము - సంవిధాన శిల్పము (వ్యా.) - పుటలు-61-66.
16. 'There must be a resemblance which does not depend upon their own will, between all the writers of any perticular age. They cannot escape from subjection to a common

influence which arises art of the infinite combination of circumstances belonging to times in which they live, though each is in a degree the author of the very influence by which his being thus pervaded" Shelly-Preface (1817) to 'Loan and Cythna'-Ed., Glover., p. 145.

17. 'He to whom the present is the only thing that is present, knows nothing of the age in which he lives. To realise the nineteenth century one must realise every century that has preceded it, and that has contributed to its making-Oscar Wilde.-Mr. Pater's last volume (1890)-Literary criticism of Oscar Wilde: Ed. Weintrarb., p. 62.

18. "The surrealist's misunderstanding of Freud was no more mistake, for it contributed to the formation of a new kind of art, and is thereforc discribed more accurately as a 'creative misunderstanding' "-K.K. Ruthven.; CA., p. 133.

19. చూడు : ఆధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు, ప్రయోగములు - (అధ్యా.) ఇద్దరు యుగకర్తలు - పు : 295.

20. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము - భూమిక - పు : xvi.

21. Ibid. - భూమిక - పు : xvi.

22. Ibid. - పు : 219.

23. Ibid. - పు : 258.

24. Ibid. - పు : 582.

25. విశ్వనాధ సత్యనారాయణ-ఆంధ్ర మహాభారతోపన్యాసములు-పు.4

26. "చాలమంది పండితులు కూడ చదివాము అందే చదివాము అనుపించు కొనుటకు చదువుతారు. శబ్దార్థ పరిజ్ఞానము ఉంటుంది. కొన్ని భావాలు, కొన్ని అలంకారాలు వారికి నచ్చినవి పట్టుకుంటారు. అంతేకాని లోతులకు పోరు"- విశ్వనాధ-విశ్వనాధ సాహిత్యోపన్యాసములు-పు. 8.

27. తెలుగులో సాహిత్య విమర్శ-అవతరణ వికాసములు- డా. ఎస్. వి. రామారావు-పుటలు : 294-295.

28. చూడు : C. A. పు.137.

## యుగాలు-యోగాలు

1. Literary criticism–A short history., Introduction, p. x.
2. "Theory of geners is a principle of order: It classifies literature and leterary history not by time or place (period or national language) but by specifically literary types of organization or structure"—Rene Wellek and Austin Warren—T O L., p. 226.
3. "The subject of the genre, it is clear, raises central questions for literary history and literary criticism and for their interrelation. It puts, in a specifically literary context, the philosophical questions concerning the relation of the class and the individuals composing it, the one and the many, the nature of universals"—Rene Wellek and Austin Warren—T O L., p. 237.
4. "Literary historians who deny the importance of crlticism are themselves unconscions crities, usually derivative critics, who have merely taken our traditional standards and reputation".—Rene Wellek and Austin Warren., TOL., p. 43.
5. ''తెలుగులో సాహిత్య విమర్శ - అవతరణ వికాసములు-'' (సిద్ధాంత గ్రంథం)- డా॥ ఎస్. వి. రామారావు. (1974)
3. ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ : సాంప్రదాయికరీతి - (సిద్ధాంత గ్రంథం) -డా॥ కోవెల సంపత్కుమారాచార్య. (1981)
7. "Descriptive criticism is always about some particular text whether of the critic's own or of another and the eritic, instead of laying down general rules or theorising in general terms, analyses the work in hand, traces the influences that have given rise to it, and then discusses it critically item by item"—George Watson.
8. చూడు: సారస్వత వ్యాసములు- ప్రథమ సంపుటము- సం॥ డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం. ఆం. ప్ర. సా. అకాడమీ ప్రచురణ - పీఠి, పు. viii-xvi.

''నేడీ దేశీయులయొక్క సాంఘిక చైతన్యమునకు, సారస్వత వైవిధ్యమునకు పంతులుగారు తమ కాలమునందు గావించిన గొప్ప కృషియే

మూలాధారము. వారితో ఆధునిక యుగము ప్రారంభమయ్యెనని చెప్ప వచ్చును. వారికి పూర్వమే ఆయా సాహిత్య ప్రక్రియలు తెలుగున వెల యుటకు శ్రీకారము చుట్టిన మహనీయులు కొందరున్నను, తెలుగువారి సాంఘికాభ్యుదయమునకై పాటుబడిన పుణ్యపురుషులు కొందరున్నను, ఉద్యమమువలె, ఆయా రంగములందు కృషి చేసిన మేధావి వీరేశలింగం పంతులుగారే. నవ్య సాహిత్య ప్రక్రియల కన్నిటికిని స్థితిని, ప్రాచుర్య మును, కల్పించినవారు పంతులుగారు''-డా॥ అక్కిరాజు రమాపతిరావు, వీరేశలింగం పంతులు-సమగ్ర పరిశీలన, పు. 367.

10 డా॥ యస్. వి. రామారావు వారి విశ్లేషణ విధానాన్ని అనుసరించి 'అవతరణయుగ' మన్నారు. (చూడు: తె. సా. వి. పు. 98) సాహిత్య విమర్శలో వెలసిన ప్రయోగ బాహుళ్యాన్ని బట్టి 'వికాసయుగ'మని నేను పిలుస్తున్నాను.

11. ''సాహిత్యరంగములో వారు చేసిన కృషి నవ్యయుగావతరణమునకు నాందీ వాక్యమైనది. ఇట్టి బహుముఖ కృషికి, పంతులుగారికి భావ సంపత్తిని కూర్చినది, బలము నిచ్చినది, సహజ ప్రతిభావంతులైనవారిపై పాశ్చాత్య సాహిత్య విజ్ఞానములు - ఇంగ్లీషుభాషద్వారమున - నెరపిన ప్రగాఢ ప్రభావము''— డా॥ కొత్తపల్లి వీరభద్రరావు., తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము. పు 489.

12. ''తెలుగు దేశములో పరిశోధనలకు పునాదులు వేసినవాడు మెకంజీ తరువాత బ్రౌను దొరయే. వీరిరువురి కృషియే లేకున్న తెలుగుదేశమున పరిశోధనయే లేదన్నచో, తరువాతి వారి కృషిపై వీరి ప్రభావ మెంత గాఢమో స్పష్టమగును '— డా॥ కొత్తపల్లి వీరభద్రరావు; తె. సా. ఇం. ప్ర. పు. 141.

13. "Literary criticism is an art about art"—Walter Pater.

14. "What is important is not that the critic should poseess a correct abstract definition of beauty for the intellect, but certain kind of temperment, the power of being deeply moved by the presence of beautiful objects–Walter Pater.

15. "The impressionistic critic brings home to us the fact of his own existance and you must not ask of him any other aim than perfecting of himself"
Oscar Wilde. cf. PHLC. p. 17.

16. చూడు : AHMC., Vol. iv., P. 24.

17. చూడు : Ibid. పు. 24.

18. సారస్వత మహాసభ- విశ్వనాథ సత్యనారాయణగారి అధ్యక్షోపన్యాసం. -ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక- సం. 45.

19. చూడు : బ్రాహ్మీమయమూర్తి - పు. 89.

20. 'తస్మాత్ సతా మత్ర నదూషితాని-మతాని తాన్యేవ తు శోధితాని పూర్వ ప్రతిష్ఠాపిత యోజనాసు-మూలప్రతిష్ఠాఫల మామనంతి'; 'తదుచ్యతాం పరిశుద్ధ తత్త్వం' - అభినవగుప్తుడు.

21. చూడు : వ్యాసము- 'Psittacism or the Time on the Ph. D.,' - K. Viswanatham - ECCP., పు. 627-644

22&23. ECCP., పు. 683

24. చూడు : అధ్యాయం : పదమూడు.

(a) మాదిరాజు రంగారావుగారి 'మానవతావాదం- చివరకు మిగిలేది' (విమర్శిని-౩), టి. యల్. కాంతారావుగారి 'తెలుగు నవలలో చైతన్య స్రవంతి, అస్తిత్వవాద ధోరణులు' (అభ్యుదయ. జన. 1980) వంటి వ్యాసములు గమనింపదగినవి.

(b) 'పురాణ వైర గ్రంథములలో ప్రాగ్రూప దృక్పథము' అను విషయముపై కోవెల సుప్రసన్నా చార్యులుగారి పర్యవేక్షణలో చామర్తి శివరావు గారు ఎం. ఫిల్., పట్టమునకై (కాకతీయ విశ్వవిద్యాలయము-వరంగల్) సిద్ధాంత వ్యాసము రచించి పట్టము పొందినారు. గ్రంథ మింకను అముద్రితము.

(c) శ్రీశ్రీ : 'ఏది విప్లవ పంథా?'-శ్రీశ్రీ సా. వ. వి. 3. పు. 207.

(d) తెలుగు సాహిత్య వికాసం : (వ్యాస సంకలనం) పుట. 164.

(e) 'రాయిస్టులు తాము మార్క్సిస్టు దృక్పథంతో ఆంధ్ర సాహిత్యాన్ని సమీక్ష చేస్తున్నట్లు చెప్పుకుంటారు. అసలు రాయిస్టుల వ్రాతలు మార్క్సిస్టు (శాస్త్రీయ) దృక్పథాన్ని తెలియజేస్తున్నాయో లేదో చర్చించు

తాను.'—అని మద్దూరి చంద్రశేఖరరావుగారు గోపీచంద్, జి. వి. కృష్ణ రావు గారల వ్యాసాలను (ప్రజామిత్ర 1938 జులై 10, సెప్టెంబరు 4) విమర్శించినారు. చూడు : సాహిత్యం-రాయిస్టులు (1944 ఆసెం. తెలుగుతల్లి) చంద్రం వ్యాసావళి - విశాలాంధ్ర ప్రచురణ 1974.

25. చూడు: వ్యాసం: 'సాహిత్య భవితవ్యం' - జి వి. కృష్ణరావు - సారస్వత వ్యాసములు - ప్రథమ సంపుటము - ద్వి. ము. 1981. సం. జి. వి. సుబ్రహ్మణ్యం - ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ.

26. "The good critic—and we should all try to be critics, and not leave criticism to the fellows who write reviews in the papers—is the man who, to a keen and abiding sensibility, joins wide and increasingly discriminating reading"—T. S. Eliot., Selected prose of T. S. Eliot., p. 102.

27. Selected prose of T. S. Eliot., p. 106.

## ఉద్యమాలు-ఉపశ్రుతులు

1. Literary criticism—A short history., p. 753.
2. తెలుగులో సాహిత్య విమర్శ-అవతరణ-వికాసములు- పు. 31.
3. చూడు : Principles and History of Literary Criticism by S. C. Mundra and S. C. Agarwal., p. 524.
4. ప్లేటో బల్లల ఉదాహరణం ప్రసిద్ధం-
"There are many tables in the world, but there is one idea or form (Platonic Idea) of a table. When a carpenter makes a table he produces a mere semblance of this idea which is the one 'real table lying beyond all the tables which have been or can be made; so that the Idea, for our present very general purpose, is out side the world altogether. And when the artist sits down in front of the carpenter's table to paint a picture of it, the picture that results is a copy of some thing which is itself a kind of shadow of the real object. Thus the artifact is removed at two stages from reality". The Republic., Book X.
5. "Poetry fed and watered the passions instead of drying them up and let them rule instead of ruling them as they

aught to be ruled, with a view to the happiness and virtue of mankind"—The Republic., Book X.

6. Principles and history of Literary Criticism., p. 205.

7. "The Poctics is Aristotle's counter blast to plato's celebrated condemnation of poetry on the persuit unworthy of main's intellectual dignity and radically vicious in its effect"—Prof. Abercrombie: Ibid. 206.

8. "Aristotle's way of interpreting poetic imitation is possibly the most valuable of all contributions to aesthetic theory. At any rate, it puts the theory on perfectly secure and solid foundations"—Prof. Abercrombie. Abid., p. 210.

9. Literary criticism of Antiquity., Vol. I. Ibid: p. 235.

10. George Saintsbury: A short history of English Criticism

11. "For Longinus, the sublime in literature was essentially the echo of a great soul, of a lofty mind. It is the product of a great and noble mind. 'Sublimity is always an eminence and excellence in langnage.' 'Sublimity is the note that rings from a great'. 'Sublimity lies in intensity.' 'Sublimity consists in a certain distinction and consummate execllence in expression and it is from this and no other source, that the greatest poets and prose writers have gained their eminence and immortal fame"—Principles and history of Literary criticism., p. 258.

12. ఆంధ్ర కవిత్వ చరిత్రము- పుట. 20-21

13. Mundra and Agarwal. PHLC., p. 268.

14. Ibid. P. 264.

15. A short history of English criticsm.

16. "Tudor critics concentrated on the problem of style and they tried to emphasize the claims of the vernacular to be recognized as a fit literary medium and also made attempts to improve its power of expression." PHLC., p. 279.

17. "Gosson calls poets 'pipers and jesters' denouncing poetry music, and the drama all alike as 'caterpillars of the

commonwealth,. Mainly his arguments are—that a man can use his time in a better way than his poetry, that poetry is the mother of lies and the nurse of abuse, and that Plato therefore had banished poets from his ideal common wealth — Ibid. p. 210-281.

18. "Poetry, according to Sidney, "in the noblest nations and languages that are known, hath been the first light-giver to ignorance, and first nurse, whose milk by little and little enabled them to feed afterwards of tougher knowledge'—Ibid. p. 281.
19. Ibid. p. 283.
20. Ibid. p. 287.
21. Ibid. p. 291.
22. Ibid. p. 295-296.
23. Critical Approaches to Literature.
24. English Literary Criticism.
25. PHLC., p. 349.
26. A history of English Criticism.
27. Spectator No. 62.
28. Spectator No. 409
29. 'It is this sense (Sense of sight) which furnishes the imagination with its ideals, so that by the pleasure of the imagination or fancy (which I shall use promiscuously) I here mean such as arise from visible objects, either when we have them actually in our view, or when we call up their ideas into our minds by paintings statues, descriptions or any the like occasion"—Spectator, 411.
30. "The pleasure of the imagination therefore are of two kinds: Primary or those 'which entirely proceed from such objects as arc before our eyes', and secondary or those 'which flow from the ideas of visible objects are not actually before the eye, but are called up into our memories, or formed into agreeable visions of things that are either absent or fictitus"—Spectator 411. AIEC., p. 129-130.

31. "His recognition of it, however, pointed the way to an aesthetic approach to literature to its enjoyment by its appeal to the imagination rather than by its promotion of a moral or social and, or observance of formal rules—both considered important then"—B. Prasad-AIEC. p. 130-131.
32. Spectator. No. 409.
33. Spectator. No. 592.
34. Spectator. No. 592.
35. A Short history of English criticism.
36. Preface to Shakespeare—Alexander Pope.
37. Rambler, 92.
38. Rambler, 156.
39. The Literary Critics. p. 83.
40. Life of Milton.
41. Preface to Shakespeare.
42. Rambler 36
43. PHLC., p. 406.
44. Muncker, 17, 290-1. AHMC, Vol. I., p. 164.
45. Review of Manzonis conte di carmagnola; Wreke, 37, 180 AHMC., Vol I., p. 223-224.
46. Jonas, 6, 262; to Goethe, March 27, 1801. AHMC I., p. 254-255.
47. A history of Modern Criticism-Vol I, The Later Eighteenth century—Introduction p. 6.
48. Biographia Literaria, Ed., by Shawcross Vol I., p. 22, footnote.
49. PHLC., p. 414-415.
50. The literary criticism of William Wordsworth is usually considered the manifesto of the English Romantic movement, the signal for the break with the age of neo-classicism. AHMC. II. the Romantic Age—p. 130.
51. Use of Poetry and Use of Criticism. (Essay)
52. Mundra and Agarwal—PHLC., p. 461.

